1987లో నాగార్జున విశ్వవిద్యాలయంవారి
పి హెచ్. డి., పట్టం పొందిన సిద్ధాంతవ్యాసం

ప్రథమ ముద్రణ : **1989**

ప్రతులు : 1000

వెల : 50/- రూపాయలు

ప్రతులకు :

1. డా॥ మరకా సత్యనారాయణ
డోర్ నెంబరు : 11-13-70
రామిరెడ్డిపేట,
నరసరావుపేట - 522 601.

2. న్యూ స్టూడెంట్ బుక్ హౌస్
అరండల్‌పేట,
గుంటూరు - 2

ముద్రణ : సంవత్ ఆర్ట్ ప్రింటర్స్
శ్రీరాంపురం,
నరసరావుపేట - 522 601.

# విషయ సూచిక



## ఒకటో భాగం (కథా కావ్యాలు)



## రెండో భాగం (గేయ ఖండికలు)

డా॥ ఆమరాతి పున్నారావు,
రీడరు, తెలుగుశాఖ, నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జుననగరం,
గుంటూరు.

# శుభాశంసనం

స్వభావతః చరిత్ర, కావ్యం - రెండూ విరుద్ధాలు. మొదటిది దేశ కాలాలకు లోబడి యథార్థఘటనల కూర్పుతో రూపుదిద్దుకుంటే, రెండోది భావనాబలంతో ఊహా సౌందర్యంతో ఆకృతిని ధరిస్తుంది. అయితే ఇది, కేవలం ఆ రెండిటి తాత్త్వికాంశాల అవబోధనకు ఉపకరించే విభాజక రేఖ మాత్రమే. కర్తల కృతుల స్వభావాలనుబట్టి కొండొకచో కొన్ని అతిదేశాలు తప్పవు.

ఆంధ్రసాహిత్యం ప్రాచీన కాలాన సంస్కృత సాహిత్యం చాటున ఒదిగి పెరిగినది కావడంవలన అంతగా స్వకీయమైన విస్తృతిని వైవిధ్యాన్ని సంతరించుకోలేదేమోననిపిస్తుంది.

ఆధునిక కాలాన అలాకాకుండ, దానిలో ఎంతో విస్తృతి మరెంతో వైవిధ్యం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. దీనికి ఆంగ్లసాహిత్యం కారణం. ఈనాడు మానవమేధ సాధించిన వైజ్ఞానిక ప్రగతి "ఇపుడిక జాతుల, సాహిత్యాల ఏకాంతవాసాలు చెల్లవు" - అనే స్థితిని కల్పించినట్లు మనం గమనిస్తున్నాం.

సువిశాలమైన ఆధునికాంధ్ర సాహిత్యంలో మాత్రాఛందస్సులతో నిర్మితాలయిన గేయకావ్యాలు పదుల సంఖ్యలో ఉన్నాయి. ఆ అన్నిం టిని పరిశోధించి నిగ్గుతేల్చడమంటే, ఏండ్లూ పూండ్లూ పట్టవచ్చు. పైగా ఈనాటి పరిశోధనకు విస్తృతికంటే గంభీరత అభిలషణీయమై కనిపిస్తుంది. కాగా సమయజ్ఞుడైన ప్రస్తుత పరిశోధకుడు, ఆ గేయకావ్య - ప్రపంచంలో చారిత్రక నేపథ్యం కల్గిన వాటిని మాత్రం ఎన్నుకొని పరిశోధించి కృత కృత్యుడైనాడు. ఇది మెచ్చదగిన కార్యం.

ఇక ఆధునిక పరిశోధన గురించి "ఒకకొంత" ప్రసంగించుకోమటి సముచితమనిపిస్తుంది. మానవ జీవితంలో నిర్బంధం అపుడపుడు అనివార్యం అవుతూ ఉంటుంది. బాల్యంలో బడికివెళ్లడం, వార్ధకంలో గుడికి వెళ్లడం బహుశః అటువంటివే కావచ్చు. ఈనాడు కళాశాలలో ఉపన్యాసాలు చేయవలసిన వారికి పరిశోధన అపరిహార్యం అవుతూఉంది. ఎక్కడెక్కడ ఉపన్యాసకత్వం ఉందో అక్కడక్కడ పరిశోధకత్వం ఉండక తప్పనిస్థితి వచ్చిపడి నట్లుంది. కాగా ఈ నిర్బంధ పరిశోధన వలన పరిశోధన వాఙ్మయానికి వైశాల్యం ఏర్పడడం నిజమేగాని పరిశోధన ప్రక్రియకు లాఘవం తప్పదుమరి. అక్కడక్కడా వినిపించే విసుర్లు - పరిశోధన గురించి, అలా ఉత్పాదితమైనవే. అయితే ఈ కృతిమాత్రం నిర్బంధ పరిశోధనకాదు, నిసర్గ పరిశోధన.

ఇక పరిశోధకుని గురించి, డా॥ మడకా సత్యనారాయణ సాహితీ జీవనంలో గూడ వైయక్తిక జీవనంలో లాగ, కొన్ని సామాజికాలయిన విలువలు పాటించే స్వభావం గలవాడు. వ్యక్తిజీవనం సమాజ జీవనానికి ఆధారభూమి అని నమ్మేవాడు. ఈనాడు సమాజ జీవనంలో ఉత్తప్రాయమైన నీతి - నిజాయితీలతోపాటు శ్రమశీలం గూడ పుష్కలంగా గలవాడు. అతని వృత్తి - ప్రవృత్తులు - రెండూ అవిరుద్ధాలుగావడం వలన, వృత్తిధర్మ నిర్వహణం ఎపుడూ ఉజ్జ్వలంగా ఉంటుంది ఆ ఔజ్జ్వల్యమే అతని భావి జీవనానికి పథప్రదర్శకం కాగలదని ఆశిస్తున్నాను.

**Prof. C. Narayana Reddy**
M A Ph D , D Litt
Vice-Chancellor
**A.P. Open University.**

6-3-645, Somajiguda,
HYDERABAD-500 482
Andhra Pradesh.

# ఆశీరభినందన

మాటతోపాటు పాట పుట్టినా ; మానవుని ఆదిమదశలో పాటే గజ్జె కట్టినా రానురాను పాటపీట మీద వృత్తం కూచుంది. అది గమనించిన పాట గుండెతోపాటు కండనుకూడా పెంచుకుని వృత్తంతో సయ్యాడే చిత్త ధృతిని పెంచుకుంది. అదిగో ఆ దశలోనే గేయం కావ్యరూపమెత్తింది.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో గేయం రగడల రూపంలో కావ్య ప్రబంధాల్లో అప్పుడప్పుడు మెరిసినా, దానికి కావ్యతా గరిమ కలిగింది ఆదునిక కాలంలోనే. ఆధునికాంధ్ర సాహిత్యంలో వెలువడిన గేయ కావ్యాలెన్నో వున్నా, వాటిలో చారిత్రక భిత్తిక ఉన్నవాటిని ఎన్నుకుని సమ దృష్టితో సమీక్షించి, సంతులనాత్మకంగా విశ్లేషించి ఈ సిద్ధాంతగ్రంథం రూపొందించారు, డా॥ మడకా సత్యనారాయణగారు. సత్యనారాయణ గారిది నిష్పాక్షిక మూల్యాంకన విధానం. విశ్లేషణలో ఇతనిలో సానుభూతి పాలు అధికం. అయినా పరిశోధకుని కుండవలసిన నిశిత నిర్ణయ శక్తి కూడా సముచితంగా ప్రదర్శించాడితడు.

ఈ గ్రంథంలో చాలావరకు నా కావ్యాల పరిశీలనమే వుండడంవల్ల ఇంతకుమించిన ప్రశంస ఆత్మస్తుతిగా పరిణమించే ప్రమాదముంది. పరిశోధకుని ఉత్తమ కృషికి నా ఆశీరభినందన.

సి.నా.రె.

# మౌఖిక ప్రమాణం సత్యమా

డా॥ పరుచూరి రాజారామ్
BSc M B B S,

చారిత్రక గేయ కావ్యాలు అంటే గేయ కావ్యాలలో చరిత్ర కాదు. అది చరిత్ర పరిశోధకులకు అంశం అవుతుందనుకుంటాను. చారిత్రక గేయ కావ్యాలంటే తెలుగు పరిశోధకులకు అంశం అవుతుంది. దేని పరిధి దానిదే. పరిశోధనాంశాల పరిధి ఎప్పుడూ విస్తృతంగానే వుంటుంది. క్రొత్త విషయాన్ని వెలికి తీసినా పరిశోధకుడు పరిధుల్ని దాటి విశ్రమించినా చాలా ఆసక్తిదాయకంగా వుంటుంది.

HISTORY IS HIS STORYఅన్నాడొక మేధావి. దీనిని హాస్యమే అనుకున్నా, నిజమైన విదూషకుడి తలక్రింది దిండు ఎపుడు కన్నీటితో తడిసే వుంటుదని చార్లీచాప్లిన్ అన్నట్లు, ఈ హాస్యం వెనుక సత్యం మరుగుపడిందనే తపన కనిపిస్తుంది.

నిశితమైన మేధస్సుతో పరిశోధించిన అంశాలు, అవి వైజ్ఞానికమైనా వాటిలో 'హ్యూమన్ ఎర్రర్' ఆ పరిశోధనని విలువ లేనిదిగా చేయవచ్చు. ఇవికాక యాంత్రికలోపాలు. ఇప్పుడు కంప్యూటర్ల కంగారు తోడైంది. ఇటీవల కాలంలోనే కంప్యూటర్ల కంగారువలన యూరప్ భస్మీపటలం కావలసిన ప్రమాదం తృటిలో తప్పిన వైనం పత్రికలలో చూచే వుంటారు. ఇలాంటి అనేక లోపాలు పరిశోధకుణ్ని అపహాస్యం చేస్తాయి. పరిశోధన నిత్యజీవితానికి సంబంధించినదైతే సమాజమే పరాభవించబడుతుంది. పరిశోధనలలో Between cup and lip there are a thousand slips అనే సామెత వేలసార్లు రుజువైంది. ముమ్ముందుకూడా అవుతుంది. అలా విజ్ఞాన శాస్త్రల్లోనే అయితే, ఇంక చరిత్ర కళలూ సాహిత్య పరిశోధనలలో సత్యశోధన ఎంత క్లిష్టమైన విషయమో ఆలోచించాలి.

వ్యక్తిగతమైన నమ్మకాల్ని ఆమోదింప చేయటంకొసం, బుద్ధిపూర్వకంగా చరిత్రనూ సిద్ధాంతాలనూ వక్రీకరించటం హెచ్చుతగ్గుల తేడాతో న్ని దేశాలలోనూ జరిగింది. ఈకోవకుచెందిన మేధావులు ప్రాతఃఅకాలాన్నే

గోబెల్స్‌ని స్మరించి కార్యోన్ముఖులవుతారు. ముఖ్యంగా రాజకీయులు!
ఇదొక పద్ధతి.

ఎందుకూ పనికిరాదనుకొన్న మందులకు వందలపేజీల రుజువులూ అందమైన బొమ్మలతో లిటరేచర్ లభిస్తున్నాయి. వాటిని వుపయోగించే వైద్యుడికి లభించిన శిక్షణ ఆయా రుజువుల్ని అనుమానించనివ్వదు. ఫలితం రోగినికోల్పోవటం! అంతే!

అదే పరిస్థితి అన్నిరంగాల్లోనూ వుంది. అన్నిటినీ ఏకరువు పెట్టనవసరంలేదు. విజ్ఞులు అన్వయించుకోవచ్చు.

రెండవ పద్ధతిలో పరిశోధించి తెలుసుకొన్న సత్యాల్ని నలుగురికీ యధాతథంగా తెలియజేయటం. వీటినుంచీ ఎవరికి అవసరమైందివారు గ్రహిస్తారు. వైయక్తికమైన అభిమానంవున్నా వారిలోపాల్ని కప్పిపుచ్చటం జరుగదు. అలాగే పోయెటిక్ ట్రూత్‌ని ఆలంబనం చేసుకొని ఇష్టంలేని కవినో రచయితనో నిందించటమూ జరగదు. అవిసిద్ధాంత గ్రంథాలైనా ఇతరమైనా పూర్తి వివరాల నందించే అటువంటి గ్రంథాలే కావలసినవి. అలాంటి గ్రంథాన్ని డాక్టర్ స త్య నా రా య ణ గారందించారని నా నమ్మకం.

కావ్యంలో సత్యాసత్య వివేచన ఎందుకు? చదివి ఆనందించి వూరుకోరాదా అంటే అనేక చారిత్రకమైన విషయాలు కాలగర్భంలో కలసిపోతాయి, పోతున్నాయి. వాటికి రికార్డులు లేవు. వీటిని గద్యపద్య రచనల్లోంచే వెలుగులోకి తేవాలి.

పరిశోధనల మాట అల్లావుంచండి. ఆరామాలు పాటిమట్టిదిబ్బలుగా పుపయోగ పడుతున్నాయి. "దీన్నెలా అరికట్టాలి?" అని ఉత్తర ప్రత్యుత్తరాల కార్యక్రమం, ఉత్తరోత్తరా శాశ్వతంగా జరిగే కార్యక్రమం, కాగితాల కరువుకి దారితీసే కార్యక్రమం అమలుజరుపుతున్నారు సంబంధిత అధికారులు! పవిత్ర భారతభూమిలో నిష్కళంకమైన చరిత్ర కలిగిన అనేకమంది అధికారులు అలాగే అవలీలగా అరవైయేళ్ళను మ్రింగేయగలరు. చివరకు మట్టిదిబ్బ వుండేదని రికార్డుఫైలు మూతపడతాయి.

ఇలాంటి పరిస్థితులలో కావ్యాలలో చరిత్ర కాంశాలకోసం వెతుక్కోక తప్పదుకదా! సత్యాన్వేషణ తప్పదు. అవిగ్రంథస్థం కాకనూతప్పరు.

అక్షరజ్ఞానం లేనివాడు గద్దెమీది నుంచి డాములెలాకట్టాలో, కేన్సర్ ఎలాబాగుచేయాలో చెపుతున్న కాలం! ఇలాంటి అమాంబాపతులంతా జాతినీ చరిత్రనూ దేశాన్నీ ఏడునిలువులగోతిలో పాతిపెడతారని వూహిస్తే ఆనాటి యోధులు త్యాగాలు చేయసాహసించేవారా! ఐశ్వర్యాన్నేకాక మేధస్సును కూడా కొల్లగొట్టగల మేధావులు పుట్టుకొస్తారని వూహిస్తే బానిసత్వపు సంకెళ్ళే మేలనుకునేవారేమో!

"తనచరిత్ర తనె పఠించి ఫక్కున నవ్వింది ధరణి, తన గాధనె తనె స్మరించి బోరున ఏడ్చింది ధరణి" అంటాడు వజ్రాయుధుడు సోమసుందర్.

ఏదో సూవనీర్‌లో చదివాను. 1930-40ల మధ్యనేమో ప్రశాంతంగా వుండే గుంటూరులో రైల్వే స్టేషన్‌లో మీటర్‌గేజ్ వేపు వుండే హిగ్గిన్ బాథమ్స్ విద్యాతురులకు ఒకప్రత్యేక ఆకర్షణ! సాయంత్రాలు వ్యాహ్యాళికి గాంధీ పార్కు లాగా కూడా వుపయోగపడేది !! సాయంత్రాలు మల్లాది రామకృష్ణశాస్త్రిగారు మిత్రులతో అక్కడికి వచ్చేవారట. ఒకనాడు మిత్రులు వారిని "మా చరిత్ర జ్ఞానం చాలా తక్కువ. మాకు కొంచెం ప్రపంచ చరిత్ర చెప్పండి" అని అడిగారట.

సమాధానంగా వారు చిరునవ్వునవ్వి ఒక్కమారు "దాస్ కేపిటల్' పరిశీలించండి" అన్నారట.

వివరణ అనవసరం!

ఉద్గ్రంథాలలోనూ రోజుల తరబడి ఉపన్యాసాలలోనూ చెప్పలేని విషయ సారాంశాన్ని ఒక్కముక్కలో చెప్పారు రామకృష్ణ శాస్త్రిగారు.

విన్నా, చదివినా తేదీలూ పేర్లూ బిరుదులూ తెలుస్తాయి. వాటి చోదక శక్తులు తెలియవు. అవికూడా తెలియాలి గనుకే ఆ మాటన్నారా ప్రాతః స్మరణీయులు.

ఏ చరిత్రకైనా సోమసుందర్ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారల ఇంటర్ ప్రెటేషన్ చాలు!

కవిత్వమేకాదు! సహృదయునికి జ్ఞానార్జన కూడా తీరనిదాహమే! సత్యాన్వేషణా తీరనిదాహమే!

పిపాసి జిజ్ఞాసువు ఐన డా॥ సత్యనారాయణ ఆ దాహం తీర్చుకోవ టానికి చేసిన ప్రయత్నమే ఈ గ్రంథం.

చారిత్రక గేయకావ్యాల స్రష్టలూ విమర్శకులూ గుర్తుంచుకోవలసిన విషయాలు చాలావున్నాయి. నాకు ముఖ్యమైనదనిపించిన విషయం ఉదహరిస్తున్నాను.

After indipencence it has become more or less a fashion to demigrate the revolutionaries by sheer process of ignoring them. Historians and text book writers often taking are from the ruling eheque bypass the epic role of these patriots in India's freedom fight, so much so all that we have before the younger generation is a made to order version which is partial gerbled and meagre... ...

This almost universal conspiracy of silence as the role of Indian revolutionaries is amazing its studiedness.

ఒకపథకం ప్రకారం కాగితాలమీద వ్రాయని ఒక ఒప్పందం ఏర్పడి నట్లు అంతర్జాతీయంగా విప్లవకారుల్ని నస్మరంతి చేయాలనుకున్న చరిత్ర కారుల సంఖ్యనూ వారికి సహకారం అందచేస్తున్న ప్రభుత్వాలనూ దృష్టిలో పెట్టుకోవాలి.

భగత్సింగ్‌పై చాలాగేయాలూ పాటలూ వచ్చాయి. ప్రభుత్వాలు విస్మ రింపచేదామని ఎంత ప్రయత్నించినా చిటగాంగ్ విప్లవ వీరులను గానీ చంద్రశేఖర ఆజాద్, భగత్సింగ్ మొదలైన వీరులను గానీ ప్రజలు విస్మరించరు. అందుకే బోసు బొమ్మలూ భగత్సింగ్ చాక్‌లూ వద్దన్నా వెలిశాయి.

ప్రజలెలాగో వారిని మరచి పోవాలని, సమాధుల మీద రాజకీయం నెరపే పెద్దలు గొప్ప ఎత్తుఎత్తారు. భగత్సింగ్‌కూ అతనితో ఉరితీయబడ్డ వీరులకు ఢిల్లీలో సమాధికి స్థలం కేటాయించారు. స్వాతంత్ర్య పోరాట యోధులు జైళ్ళపాలైనపుడు వారిన్యాయవాదిగా బ్రిటిష్‌వారిని గడగడ లాడించిన గోవింద వల్లభపంత్ మంత్రిగా మారేక ఇదుగో అదుగో అంటూ సమాధి నిర్మాణాన్ని జాప్యంచేశారు. చివరకు ఢిల్లీలో కాకుండా ఫిరోజ్‌పూర్ హుస్సేనీవాలాలో కట్టించారు. ఇండోపాక్ యుద్ధాలలో తొలిబాంబులు అక్కడే పడ్డాయి. అక్కడే ముందు పడతాయికూడా. సమాధేగదా!! పున ర్నిర్మించారు.

ఎందుకిదంతా?

భగత్సింగు సమాధి ఢిల్లీలో వుంటే రాజఘాట్‌కి ఎవరూ వెళ్ళరని అనుమానం.

అది చరిత్ర! ఈ వంకర ఆలోచనలను బయట పెడుతూ ఎంత హృద్యంగానైనా రాయవచ్చు. అవి నిజమైన చారిత్రక గేయ కావ్యా లవుతాయి. అయితే ఆ చరిత్ర తెలియనిస్తేగదా కావ్యాలు వచ్చేది. అలాంటి చారిత్రక గేయకావ్యాలు కొరవైనపుడు పాఠకులూ పరిశోధకులూ చరిత్రను విస్మరించి సౌందర్యాన్ని మాత్రమే చెప్పుకోవలసి వస్తుంది.

భగత్సింగును ఉరిదీస్తే కంటనీరు పెట్టనన్న శాంతివాది మాటలు గేయాల్లోకి మలచబడలేదు.

భగత్సింగు రాజగురు సుఖదేవ్‌లను ఉరితీయవద్దని మహాత్మా గాంధీ వైస్రాయిపై వత్తిడి తేలేదు. ఈ విషయం సుభాష్ చంద్రబోస్ వ్రాశారు.

ఉరిశిక్షలు ఉదయం అమలు జరుపుతారు. అలాంటిది సాయంత్రం తెలియకుండా ఉరి తీశారు. పైగా క్షమాపణలు చెప్పుకొని దైవ ప్రార్థనలు చెయ్యమన్నారట. దానికంగీకరించకపోతే వేటకుక్కల్లాగా మీదపడి హింసించి హింసించి తరువాత ఉరితీశారు. తరువాత సట్లెజ్ ఒడ్డున మృతదేహాన్ని సగం తగలేసి, మిగతా భాగాన్ని నదిపైవున్న రైలు బ్రిడ్జి 208 పోస్టుమీద నుంచి నదిలోకి విసిరారు.

కోపోద్రిక్తులైన సామాన్యులు అప్పుడు తెలుసుకొని మిగిలిన మృత దేహపు భాగాల్ని శాస్త్రోక్తంగా దహనం చేశారు.

నాయకులూ మనుషులే! తప్పులు చేస్తారు! కానీ అదికాదు జరిగింది జాతీయ నాయకులు ఘోరాలే చేశారు. అవన్నీ మరుగువరచబడ్డాయి. సత్యాగ్రహుల్ని కొట్టం, కాల్చం అని ఆనాడు ఎదురు తిరిగిన పోలీసులు ఏమైనారు? కొందర్ని కోర్టు మార్షల్ చేసి చంపారు. కొందర్ని ద్వీపాంతర వాసానికి పంపారు.

వాళ్ళ ప్రాణాలకోసం, శిక్షల రద్దుకోసం ఈ జాతీయ నాయకులెందుకు పోరాడలేదు? పోరాడితే పైస్రాయిచల్లనిదృష్టి తమపై ప్రసరించదనే భయం. నీచమైన లౌక్యం.

ప్రాణాలను పణంగా పెట్టిన ఆ ఉద్యోగులేరి చరిత్రలో! గేయాల్లో!! కావ్యాల్లో?

చారిత్రక గేయకావ్యాలుగా ప్రసిద్ధికెక్కిన వాటిలో ఎక్కువ భాగం కవులు తమ ఆశుకవితా చాతుర్యాని ప్రదర్శించటానికి అనువుగా వున్నవి. నాయకులు వారి ప్రియురాండ్రూ ఆ అవకాశం కల్పిస్తారు. కర్పూర వసంతరాయలనే బిరుదు ఎంతమందికి ఉన్నదో పరిశీలిస్తే భోగలాలసత పాలు ఎంత ఎక్కువ వుందీ అర్థమవుతుంది. దాన్నిబట్టి చారిత్రకత పాలు తగ్గుతూ వస్తుంది. భావుకతలో సౌందర్యారాధనలో మునిగిన రాజులందర్ని కర్పూర వసంతరాయలనేవారు.

లకుమాదేవి నిజమో కల్పనో తెలియదు. లకుమాదేవి కల్పిత ప్రాత కాదు అని రుజువు చేయటానికి ప్రయత్నించారు డాక్టర్ సత్యనారాయణ గారు. కొన్ని శ్లోకాలుదహరించారు. కానీ ఆ ఆధారాలు చాలవనుకుంటా.

ఛందస్సులూ, పదబంధాలూ, చిత్రకవితలూ మొదలయిన వాటి పైన వున్న వ్యామోహం చారిత్రక సత్యంపై వుండే అవకాశం లేదు. ఎందుకని అంటే రాసేవాడు కవి కనుక! అందుచేతనే ఈ రాణీ ప్రేమ పురాణం కాకపోతే ఆరాజు కామకలాపం చారిత్రక గేయకావ్యమై పోతుంది ఫ్రాయిడ్ కోణంనుంచి అన్వేషిస్తే కవిలో అణగ ద్రొక్కబడిన లైంగిక, లైంగికానుబంధ విషయాలన్నీ నిరభ్యంతరంగా చోటుచేసుకో వీలున్నది కూడా!!

చారిత్రక గేయకావ్యాలపై ప్రజాభిమానం మెండయితే ప్రజాస్వామ్యం లాభిస్తుంది. దానికో చిన్న ఉదాహరణ శివయ్యగారి గేయములో తీసుకుందాం.

"కన్నెగంటి హనుమంతు" పలనాటి హనుమంతుగా ప్రసిద్ధుడు. హనుమంతుకి శివయ్యగారి గేయంలో చోటులేకపోతే, పాడబడకపోతే ప్రాచుర్యం వుండేదికాదు. అదే లేకపోతే నాళం మట్టుపల్లిగారి గ్రంథం నుండి డాక్టర్ సత్యనారాయణగారు వుల్లేఖించిన సత్యం మరుగున పడేది.

కోలగుంట్ల కరణం సదాశివయ్య అనేవాడు ఆనాటి కలెక్టర్ రూథర్ ఫర్డ్‌తో ముందు హనుమంతును కాల్చేయమన్నాడట! ఆ గేయం నుండి ఈ చారిత్రక సత్యం పునశ్చరణ చేయబడింది. లేకపోతే కాలగర్భంలో కలిసిపోదా?

గాంధీ, ఇర్విన్, ఫాక్ట్ లాంటి మగటిమి లోపించిన వప్పందాల్ని సమర్థించినపుడే చరిత్ర వక్రీకరణకు గురయింది. కనుకనే భగత్సింగుల వారసుల గురించిన సత్యాలు తక్కువ తెలిశాయి.

**'Language is a social product'** సంఘంలో అధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులైతే, పాటలు సత్యాన్ని చెపుతూ వాళ్ళ నోళ్ళల్లో నానాయి. సత్యం ప్రజలకు తెలిస్తే వాళ్ళే పాటలు కట్టి పాడుకుంటారు. జనంలోంచి పుట్టిన పాటలకు చావుండదు. అయితే సత్యం వారికి వినపడాలి.

> "ఇతిహాసపు చీకటి కోణం
> అట్టడుగున పడి కాన్పించని
> కథలన్నీ కావాలిప్పుడు
> దాచేస్తే దాగని సత్యం"

అన్నాడు మహాకవి శ్రీశ్రీ. బ్రిటన్‌లోని జమిందారీ వర్గంపై పెట్టుబడిదారీ వర్గం తరఫున క్రాంవెల్ పోరాటం సాగిస్తే దాన్ని మొదటి ఛార్లెస్ మీద రోమన్ కేథలిక్ మతం మీదా తిరుగుబాటని రాశారు చరిత్రకారులు. అట్టడుగున పడి కాన్పించని కథలివే. అవే కావాలిప్పుడు. అందుకే యీ పరిశోధనలు.



# నా మాట

చరిత్రను పరిశీలిస్తేనే మానవజాతి సాధించిన అభివృద్ధిని గమనించ గలమని నా నమ్మకం. పౌరుష ప్రతాపాలకు మారుపేరుగా నిలచిన జాతీయ వీరులను, పరిపాలకులను, సంఘ సంస్కర్తలను, త్యాగధనులను, దేశభక్తులను స్మరించడం మనకర్తవ్యం. అనైక్యత వలన కలిగే అనర్థాలనూ జాతీయ సమైక్యత అవసరాన్ని చరిత్ర మనకు గుర్తుచేస్తుంది. పై కారణాలను దృష్టిలో పెట్టుకొని చారిత్రక గేయ కావ్యాలను పరిశోధనాంశంగా స్వీకరించాను.

నా ఆసక్తిని గుర్తించి పుత్రవాత్సల్యాన్ని మించిన శిష్యవాత్స ల్యంచూపించి మా పర్యవేక్షకులు, గురుదేవులు డా॥ ఆకురాతి పున్నారావు గారు ఎన్నో మార్గదర్శక సూత్రాలు బోధించారు. వారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలి.

ఎంతో ఆప్యాయతతో నాసందేహాలను నివృత్తి చేసిన సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డా॥ సి. నారాయణరెడ్డిగారికి . . . .

తెలియని విషయాలను తెలియజెప్పి, సముచితమైన సలహాల నిచ్చి నన్ను నడిపించిన గురువర్యులు తెలుగు విశ్వవిద్యాలయం సిండి కేట్ సభ్యులు శ్రీ నాగభైరవ కోటేశ్వరరావుగారికి . . . .

తమ విలువైన సమయం వెచ్చించి అభిమానంతో విపులమైన పీఠిక వ్రాసి యిచ్చిన డా॥ వరుచూరి రాజారామ్‌గారికి . . . .

పరిశోధనకు అనుమతించిన మా కళాశాల పాలకవర్గం వారికి . . .

తమ అమూల్యమైన అభిప్రాయాలను తెలియజేసిన డా॥ ఎస్. గంగప్ప, కళాప్రపూర్ణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, డా॥ గురవ్ప చౌదరి, శ్రీ అన్నపురెడ్డి విజయభాస్కరరెడ్డి, శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ, శ్రీ కోడూరి శ్రీరామమూర్తి, శ్రీ బాలశౌరిరెడ్డి తదితరులు . . . .

సమాచార సేకరణలో సహకరించిన ఎందరో మిత్రులకు . ....

ఆర్థిక సహాయమందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి.. ....

ఎంతో ఓపికతో తానే అచ్చుతప్పుల్ని సరిదిద్దుతూ గ్రంథముద్రణ పూర్తిచేసిన సంపత్ ఆర్ట్ ప్రింటర్స్ యజమాని శ్రీ ముప్పవరపు రంగారావుకు ధన్యవాదాలు.

మడకా సత్యనారాయణ

గ్రంథ ముద్రణకు సహకరించిన పిడుగురాళ్ళ వాస్తవ్యులకు

# నా కృతజ్ఞతలు

శ్రీ చిన సుబ్బారావు - డిలైట్ కెమికల్స్
శ్రీ గర్రె రామారావు - పళని కెమికల్స్
శ్రీ కొత్త హనుమంతరావు - రవి కెమికల్ ఇండస్ట్రీస్
శ్రీ పచ్చిపులుసు రామనాథం - రాధికా సేవాసంఘం
శ్రీ మేడం ఆంజనేయులు - హిమబిందు ట్రేడర్స్
శ్రీ శ్రీరాం కాశీ విశ్వనాథం - రామనరసింహ సేవాసమితి
శ్రీ చిల్లంచర్ల రామారావు కుమారుడు హనుమంతరావు
శ్రీ పూటుకూరి పున్నారావు - మల్లికార్జునరావు
శ్రీ మారం సత్యనారాయణ కుమారుడు రామకృష్ణ
శ్రీ కొత్త నాగేశ్వరరావు - శివశంకర పాలిమార్ట్
శ్రీ కొలిశెట్టి అనంతరామయ్య - రమాదేవి కెమికల్ ఇండస్ట్రీస్
శ్రీ కొత్త లక్ష్మి కోటయ్య - పాండురంగా లైమ్ వర్క్స్
శ్రీ చల్లా నెమిరిరెడ్డి కుమారుడు సీతారామిరెడ్డి
శ్రీ భవనాశి ఆంజనేయులు - నేషనల్ ఇండస్ట్రీస్
శ్రీ వల్లంకొండ నరసింహారావు - ఇండియన్ కెమికల్ ఇండస్ట్రీస్
శ్రీ పూటుకూరి పున్నారావు, శ్రీ మల్లికార్జునరావు—
దివల్నాడు విలేజ్ ఇండస్ట్రీస్ అసోసియేషన్
విజయ ప్లాస్టిక్స్, వెంకటేశ్వర ప్లాస్టిక్స్

# కృతిస్వీకరణగురించి



మిత్రులు చిటిప్రోలు సుబ్బారావుగారు నరసరావుపేట **S.S. & N.** కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా చేరినప్పటినుండి నాతో ఎంతో ఆత్మీయంగా ఉంటున్నారు. నాగార్జున విశ్వవిద్యాలయం నుండి దరఖాస్తు ఫారం తెచ్చి ఎం.ఫిల్ చేయమని ప్రోత్సహించింది వారే. నాకు లభించని కొన్ని పుస్తకాలను వెదకి తెచ్చి నాపరిశోధన వ్యాసం పూర్తికావటానికి సహకరించిన మిత్రులు సుబ్బారావుగారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు చెప్పుకోవాలి అనుకున్నాను. తలవని తలంపుగా నాపుస్తకాన్ని తనకు అంకితం చేయమని వారు కోరారు. సహవ్రతులు .... సహృదయులు .... మేలుకోరే మిత్రుడికి నాపుస్తకం కానుకగా యివ్వటానికి అభ్యంతరం ఏముంది? కంటికి కనిపించని ఏ అదృశ్య శక్తులకో, విషయం తెలియక పోయినా పేరుకోసం గ్రంథాలను అంకితం తీసుకొనే పెద్దవారికో అంకితం చేయటంకంటె, పరిశోధన వ్యాసంగంలో సహకరించిన మిత్రుడికి అంకితం చేయటం న్యాయసమ్మతంగా నా మనసుకు తోచింది. ఆనందంగా అంగీకరించాను.

మడకా సత్యనారాయణ



## కృతి స్వీకరణ



చిటిప్రోలు సుబ్బారావు, శ్రీమతి పుష్పావతి

# స్వీకృతి

మడకా సత్యనారాయణగారు ఆధునికాంధ్ర సాహిత్యంలో చారిత్రక గేయ కావ్యాలు అనే అంశంపై నాగార్జున విశ్వవిద్యాలయం నుండి 1987 వ సంవత్సరంలో డాక్టరేట్ పట్టాన్ని పొందారు.

మే మిరువురం గురువర్యులు డాక్టర్ ఆకురాతి పున్నారావు గారి పర్యవేక్షణలో పరిశోధక విద్యార్థులుగా 1980 వ సంవత్సరంలో చేరాము

అయితే సత్యనారాయణగారు డాక్టర్ సి. నారాయణ రెడ్డి గారి చారిత్రక గేయకావ్యమైన కర్పూర వసంతరాయలు కావ్యాను శీలనం కావించి 1984లో M. Phil పట్టాన్ని పొందారు. ఆతరువాత అదే స్ఫూర్తిని కొనసాగిస్తూ 1987 వ సంవత్సరం నాటికి డాక్టరేట్ పట్టాన్ని పొందారు.

ఇదే సమయంలో నేను "వల్లూరి సోదరకవుల జీవితము-సాహిత్యము" అను అంశముపై పరిశోధన చేసి పిహెచ్ డి. పట్టం పొందాను.

ఒకేసారి పరిశోధనలో చేరి, ఒకేసారి విశ్వవిద్యాలయములో పరిశోధనాంశాలను సమర్పించిన మేము క్రమంగా డాక్టరేట్ పట్టాలను అందుకొన్నాము.

ఒకే స్థానం నుండి ఒకె గురువుగారి దగ్గర ఒకే సమయంలో ప్రారంభింపబడి సమర్పింపబడి ఒకే చోట మా సిద్ధాంత వ్యాసాలు ముద్రింపబడినవి. అందుకే ఎవరికైనా అంకిత మిద్దామనే ఆలోచన కలగగానే నాకే అంకితం తీసుకోవాలని అనిపించిండి. ఈ సిద్ధాంత వ్యాసానికి ప్రథమ శ్రోతను, ప్రథమ పాఠకుడనైన నాకు ఆ కోరిక కలగటం సహజమేమో!!

అందువలననే కృతిని కామకగా స్వీకరించే భాగ్యాన్ని పొందా ననే తలంపు నాకు కలిగింది.

అంతేకాక ఈ వ్యాసంలో ప్రధాన భూమికవహించిన నాగార్జున సాగరం, కర్పూర వసంతరాయలు, విశ్వనాథ నాయడు, జాతిరత్నం గేయకావ్యాల కృతి కర్తలు, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయపు కులపతి ఆచార్య నారాయణ రెడ్డిగారి రచనలపట్ల నాకెంతో అభిమానం.

రంగాజమ్మ కావ్యాన్ని రచించిన నాగభైరవవారి ఆత్మీయ మిత్ర కోటికి చెందిన వారిలో నేనూ ఒకణ్ణి! శిలామురళి, గండికోటయుద్ధము లను రచించిన ఇంద్రకంటి శ్రీకాంతశర్మ, కొసరాజు రాఘవయ్య చౌదరి గారల కవితామృతాన్ని చవి చూచాను.

బ్రహ్మంగారి చరిత్ర కావ్యకర్త పెద్దోజు నమశ్శివయ్యగారు మా గ్రామ వాస్తవ్యులు. ఆ కావ్యానికి ముందు మాట సంతరించటం, కావ్య ముద్రణ కావించటంలోనూ ప్రధాన పాత్రవహించాను. మా బాబాయి చిటిప్రోలు కృష్ణమూర్తిగారి ప్రభావం ఆ కావ్యం మీద అత్యధికం. "నా తెలుగు మాంచాలకృతిని" వెలయించిన కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీ కాన్తమ్మగారు నాయీ నాటి విద్యా సంబంధమైన సంఘ సంబంధమైన అర్హతలకు, గౌరవాలకు శ్రీకారం చుట్టిన మాన్యమనస్విని, లక్ష్మీకాన్తమ్మ గారి జీవిత చరిత్రను ప్రాగ్దామని సాధన సంపత్తులు కూర్చుకుంటున్నా.

ఇన్నికారణాలు పెనవేసుకొన్న కారణంగా పలనాటి అభిమానినైన నేను - పలనాటివాడే అయిన మా సత్యనారాయణ గారి కావ్యాన్ని సతీ సమేతంగా అంకితం తీసుకుంటున్నాము. వారు మాకు అందిస్తున్నారు.

ఇది మా ఆనందం! అనుబంధం! అందుకే వారు ఇచ్చే కానుకను మనసా, వాచా కర్మణా స్వీకరిస్తున్నాను.

**డా॥ చిటిప్రోలు సుబ్బారావు**

# చరిత్ర

"చర" ధాతువునకు "ఇత్ర" ప్రత్యయము చేరగా "చరిత్ర" అనే రూపం సిద్ధించింది. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువులో "చరిత్ర" శబ్దానికి "చరితము, చరిత్రము, చారిత్రము" అనే రూపాంతరాలు చూపబడ్డాయి. వీనికి "అనుష్ఠింపబడినది, ఆచరింపబడినది, నడవడి, స్వభావము, శీలము, వృత్తాంతము, గత విషయములు" మొదలైన అర్థాలు ఇవ్వబడ్డాయి. "చరిత్రము" అంటే "నడవడిని ప్రతిపాదించు గ్రంథము" అని తెలుపబడింది.[1] ఆంధ్రవాచస్పత్యంలోనూ, "చరిత" శబ్దానికి "నడవడి, వృత్తాంతము, సమాచారము" అనే వివరణ.[2] చార్లెస్ ఫిలిప్స్ బ్రౌన్‌గారి తెలుగు - ఇంగ్లీషు నిఘంటువులో కూడా "చరిత్ర" కు **conduct, behaviour, history,** అనేఅర్థాలు. కనుకనే, శ్రీ జయంతి రామయ్య పంతులు గారు "చరితము, చరిత్రము. చారిత్రము అను నీ శబ్దములకు ఆచరింపబడినది, అనగా చేయబడినది యని వ్యుత్పత్త్యర్థము. ఒకడొనరించిన కార్యము లాతని చరిత్రమని చెప్పవచ్చును" అని వివరించారు.[3] దీనినిబట్టి. సామాజికులు ఆచరించిన సాంఘిక, ఆర్థిక, రాజకీయ, మత విధానాలను వివరించేది "చరిత్ర" అని చెప్పవలసి ఉంటుంది. మంచిపేరుగల మహనీయులు దేశాభివృద్ధికై చేసిన కృషి, త్యాగం, ఆ ఆదర్శ పురుషుల శక్తియుక్తులు మొదలైనవి సార్వజనిక సంఘటనలుగా పరిగణింపబడి దేశచరిత్రగా వ్రాసిస్తాయి.

కేవలం ఒకవ్యక్తికి సంబంధించిన వ్యక్తిగత వివరాలు, కుటుంబ పోషణ విశేషాలే ప్రధానమైతే, అవి వారి స్వీయ చరిత్రలు మాత్రమే.

---

[1] శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు, తృతీయసంపుటము పుట. 56

[2] ఆంధ్రవాచస్పత్యము, ప్రథమభాగము పుట. 518

[3] ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటము-1, సంచిక-1, పుట. 35

అటువంటి రచనలను దేశచరిత్రలో భాగంగా ఉదహరించవలసిన పనిలేదు.

మానవజాతి క్రమవికాస పరిణామాలను చరిత్ర వివరిస్తుంది. మానవుడే చరిత్రకు కేంద్రబిందువు. మానవుల ఆలోచనలు, మాటలు, చేతలు వివిధ కోణాలలో పరిశీలింపబడి చరిత్రరూపం ధరిస్తాయి. దేశాభ్యుదయం కోసం శ్రమించిన మహనీయుల వృత్తాంతాలేగాక, దేశద్రోహుల ప్రసక్తికూడా చరిత్రలో కనిపిస్తుంది. ముందు తరాలవారికి కనువిప్పు కలిగించి, సరైన మార్గాన్ని చూపించేది చరిత్ర మాత్రమే. అందుచేతనే, దేశచరిత్రను విధిగా అధ్యయనం చేయాలి. "దేశచరిత్ర మనునది ఒక దేశము యొక్క ఆర్థిక, రాజకీయ, మత, సాంఘిక, నైతికాది ప్రవర్తనముల కథనమే"[1] అను వేదము వేంకటరాయశాస్త్రిగారి నిర్వచనం గమనార్హం. గత కాలంలో జరిగిన ప్రతి విషయం దేశచరిత్రలో చోటుచేసుకుంటుంది. "దేశచరిత్ర మనగా దేశమునందలి జనసంఘము యొక్క పురావృత్తమని తెలినది. అనగా జనులే కాలమందే స్థితిలోనుండిరో, వారల రాజకీయ పద్ధతులు, ఆచారవ్యవహారములు, మతములు, విద్యా వివేకములు, మొదలగునవి యెప్పుడెప్పుడేయే విధముగా నుండెనో, ఏయే సందర్భములయందు వారేయేవిధమున ప్రవర్తించి, యేయే యిక్కట్టుల దప్పించుకొనగలిగిరో, లేక యేయే యిక్కట్టులకు లోనయిరో, ఎప్పుడెప్పుడు వారి స్థితిగతులయందే యేమార్పులే యేకారణముల వలన గలిగినో, వారి వృద్ధిక్షయము లేయే రీతుల ననుసరించెనో, యివి యన్నియు చరిత్రము నివేదించును."[2] అని శ్రీ జయంతి రామయ్య పంతులుగారు దేశచరిత్ర స్వరూప స్వభావాలను విశదీకరించారు. దీనినిబట్టి దేశచరిత్ర అంటే, మానవజీవితానికి మరోపేరు అని సులభంగానే తెలిసిపోతుంది. ఈ అభిప్రాయం శ్రీ కె. ఎ. నీలకంఠశాస్త్రిగారి విపులీకరణ వలన మరింత బలపడుతుంది.

---

[1] భారతి సాహిత్యమాసపత్రిక, ఫిబ్రవరి 1949, పుట. 69

[2] ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సంపుటము-1, సంచిక-1, పుట. 37

"మానవవంశపు జీవనపరిణామ వృత్తాంత సంగ్రహమే చరిత్ర. మానవులు సాధించిన వివిధ ఘనకార్యములు, వారి ఆశయములు, జీవిత విధానములు, నాగరికత, సంస్కృతి మొదలగునవి అన్నియు చరిత్రలో చేరవలసిన విషయములే. ప్రభుత్వసంస్థ నిర్మాణ స్వరూపము, కార్యకలాపములు, రాజనీతి సిద్ధాంతములు, మతవిధానములు, ఆధ్యాత్మిక భావనలు, వివిధ వస్తువుల ఉత్పత్తి వినిమయములు, యానవాహన సౌకర్యములు, సంగీత సాహిత్య శిల్పనాట్య చిత్రకళాది లలితకళలు, తదితర కళాకౌశలములు, ఆహారవిహార వినోదములు, ఆచార వ్యవహారములు మొదలగునవి అన్నియు మానవుని కృషితో ముడిపడి ఉండుటవలన వానికి అన్నిటికిని చరిత్రయందు సముచితమగు రీతిలో స్థానము కల్పించవలసియే ఉండును".[1] అను శ్రీ నీలకంఠశాస్త్రి గారి వివరణనుబట్టి, అన్నిరంగాల్లోనూ మానవుడు సాధించిన ప్రగతికి సంబంధించిన విశేషాలన్నింటినీ చరిత్రగానే పరిగణించాలి.

సర్వరంగాల సమగ్ర చిత్రణే "చరిత్ర"

**"In an objective sense history is, to use the words of James Harvey Robinson," all we know about everything man has ever done, or thought, or hoped, or felt." Subjectively expressed, History may be regarded as a record of all that has occured within the realm of human consciousness."[2]**

ప్రస్తుతం "చరిత్ర" ను "హిస్టరీ" (**History**) అనే ఆంగ్లపదానికి సమానార్థంలో విస్తృతంగా ఉపయోగిస్తున్నారు. **Histori** అనే గ్రీకుపదానికి **a learing by inquiry** అని అర్థం.

---

[1] విజ్ఞాన సర్వస్వము, (తెలుగుభాషాసమితి) ప్రథమ సంపుటము, పుట.1

[2] **The Encyclopedia of America, Vol. 14, Page. 205**

"History' అంటే "That branch of knowledge, which deals with events that have already taken place, the study or investigation of past, a narrative or account usually chronological of past events in the like of a nation, community, institution, or the like, the sum total of past happenings, anything that happened in the past, any past filled with unusual or memorable happenings, a drama dealing with past events, a story or a tale" అని The Lexicon **Webster Dictionary** లో వివరించబడింది.[1]

పై వివరణ **Oxford** Encyclopaedic Dictonary ను అనుసరించినదే. కాలానుగుణ్యంగా క్రమబద్ధం చేయబడిన, అతిముఖ్యమైన సార్వజనిక సంఘటనలు;జాతుల, దేశముల, సంస్థల క్రమవికాస పరిణామాలను అధ్యయనం చేయడం వలనలభించే సమాచారం, ఒకజాతికి, దేశానికి, సంస్థకు, వ్యక్తికి, లేదా ఒక విషయానికి సంబంధించిన విశేషాలు, గడిచిపోయిన సమస్త మానవ కార్యకలాపాలు, "చరిత్ర"గా పేర్కొనబడతాయని తెలియజేయబడింది.[2]

" History may **be** defined as the recorded memory of mankind"[3]

అనే నిర్వచనం సంక్షిప్తంగా, సారవంతంగానూ ఉంది.

" Every Day is a **History**. Every thing that happens. whe- ther in Science, **Politics**, Art or any of the thousand and one elements that make up 'the story of man',is history"[4] అనడం వల్ల, సువిశాలమైన చరిత్ర పరిధి స్పష్టం చేయబడింది.

---

1 The Lexicon webster Dictionary. Vol 1, Page. 456

2 Oxford Encyclopaedic Dictionary, Vol. 11, Page. 796

3 Arun Bhattachar Jee, History of ancient India, Page, 1

4 The Wonder Land of knowledge(The Pictorial Encyclopedia) Vol. 7, Page. 1879

ప్రసాద భూపాలుడు (జమీందార్ ఆఫ్ దేవిడి) చరిత్రను ఇలా నిర్వచించారు. "సాధారణముగ చరిత్రమున దేశములయొక్క రాజకీయ సంబంధమగునట్టియు, దానితో సంబందించి, సాంఘిక, ఆర్థిక పరివర్తనములు యుద్ధములు, దండయాత్రలు, జయాపజయములు,రాజకీయము నందలి మార్పులు మొదలగు వాటిచరిత్రలను History లని వాడెదరు. History యనిన అన్నింటిని దెల్పు చరిత్ర యని అర్థము."[1]

'చరిత్ర' అనే పదానికిగల వివిధ అర్థాలను, నిర్వచనాలను పరిశీలించిన తరువాత, చరిత్రను పఠించడం, పరిశీలించడం ఎంతఅవసరమో గ్రహించగలము. గతాన్ని విస్మరించిన జాతికి భవిష్యత్తు లేదు. తమ పూర్వీకులు ఎలా నివసించారో, వివిధరంగాల్లో ఏ యే పద్ధతుల్ని పాటించారో తెలుసుకోవాలనే కుతూహలం వర్తమానంలో జీవించేవారికి కలగడం అత్యంత సహజం. పూర్వులు సాదించిన విజయాలను, వైఫల్యాలను, పరిపాలనా పద్ధతులను, ఆర్థిక విధానాలను, ఆచార వ్యవహారాలను నిశితంగా పరిశీలించి పురోగామి దృక్పథాన్ని అలవరచుకోవడం విజ్ఞుల లక్షణం. మానవుడు సోదర మానవాళి సహకారంతో తన అవసరాలను తీర్చుకోవడంతోనే సరిపెట్టుకోకుండా ప్రకృతి శక్తుల్ని తనకు అనుకూలంగా మలచుకుంటూ, నిర్మాణాత్మకమైన కృషిని ఎలా కొనసాగిస్తూ వచ్చాడో చరిత్ర మాత్రమే తెలియజేస్తుంది. జాతిని ప్రభావితంచేసి ముందుకు నడిపించిన మహాపురుషుల జీవితచరిత్రలు చరిత్రలో భాగమై నిత్య స్మరణీయములౌతాయి. చరిత్ర చేస్తున్న హెచ్చరికలను పెడచెవిన పెట్టేజాతికి రక్షణలేదు. చరిత్రను సరిగ్గా పరిశీలింపకపోవడం వల్లనే జాతీయ సమైక్యతకు, దేశ సమగ్రతకు ముప్పు వాటిల్లుతున్నది. స్వార్థంతో, ద్వేషంతో, సంకుచిత మనస్తత్వంతో తాత్కాలిక ప్రయోజనాలను ఆశించి ప్రవర్తిస్తే జాతి మనుగడ దెబ్బతింటుందనీ, జాతీయ జీవనస్రవంతి కలుషితమై పోతుందని చరిత్ర మనల్ని హెచ్చరిస్తుంది.

వేలాది సంవత్సరాలు భారతజాతి అనుభవించిన దాస్య జీవితం వివరించి భారతీయుల్ని చైతన్యవంతుల్ని చేయడానికి చరిత్ర ఉపకరిస్తుంది. పై కారణాల దృష్ట్యా చరిత్రను తప్పనిసరిగా చదివితీరాలనే అభిప్రాయం ఎవరికయినా వెంటనే కలుగుతుంది. "స్వదేశ చరిత్రాధ్యయనము వలన రెండు ముఖ్య ప్రయోజనములు కలవు. అందు మొదటిది ఆత్మ విశ్వాసము, ఆత్మ గౌరవము.... దేశాభివృద్ధికై యత్నించవలసిన రీతుల నిరూపించుట దేశ చరిత్రముయొక్క రెండవ ప్రయోజనము."[1] అని శ్రీ జయంతి రామయ్య పంతులుగారు అభిప్రాయపడ్డారు.

అందుచేత చరిత్రపాఠాలను బలంగాను, వేగంగాను, హృదయానికి హత్తుకునేలా రచించవలసిన బాధ్యత రచయితలపై ఉంది. మాతృదేశం పట్ల ప్రేమ, విశ్వాసం, త్యాగగుణం। పెంపొందింపజేయడానికి చరిత్రను అత్యంత శక్తిమంతమైన సాధనంగా గుర్తించి, తమరచనలలో చారిత్రిక విశేషాలను చొప్పించి రచనలు విరివిగా చేయాలి. అయితే, దురదృష్ట వశాత్తూ, తెలుగు సాహిత్యంలో ఆశించినన్ని, అంటే ప్రస్తుత పరిస్థితులను సరిదిద్దడానికి సరిపడినన్ని చారిత్రక రచనలు రావడం లేదనే చెప్పాలి.

చరిత్ర రచన పట్ల కొన్ని అపోహలు ఉన్నాయి. చరిత్ర అంటే కేవలం రాజుల జీవిత చరిత్ర మాత్రమే అనే అభిప్రాయం కూడా ఉంది ముందుగా ఎంపిక చేసుకొన్న రాజవంశాల వృత్తాంతాలను మాత్రమే చరిత్ర పాఠాలుగా బోధిస్తూ ఉండటంవల్లకూడా, ఈ అపోహకు దారి తీసింది. చరిత్ర అంటే గొప్పవారి జీవిత చిత్రణం మాత్రమే అనే అభిప్రా యం బ్రిటిషు చరిత్రకారులు "కార్లైల్"తో ప్రారంభమైంది. ఈ అభిప్రా యాన్ని ఖండిస్తూ మహాకవి శ్రీశ్రీ ఇలా వివరించారు. రాజుల జీవిత విశే షాలు, దండయాత్రలు మాత్రమే చరిత్రకాదని స్పష్టం చేశారు.

---

[1] ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటము-1, సంచిక-1, పుట. 41,42

"ఏ యుద్ధం ఎందుకు జరిగెనో?
ఏ రాజ్యం ఎన్నాళ్ళుందో?
తారీఖులు, దస్తావేజులు
ఇవి కావోయ్ చరిత్ర కర్థం.

ఈ రాణీ ప్రేమ పురాణం,
ఆ ముట్టడికైన ఖర్చులూ,
మతలబులూ, కైఫీయతులూ,
ఇవి కావోయ్ చరిత్ర సారం"

అని మహాకవి శ్రీశ్రీ ఎలుగెత్తి చాటారు. రాజుల వృత్తాంతం మాత్రమే చరిత్ర అనే అభిప్రాయాన్ని ఈసడించారు.

"ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు!"[1] అని ప్రశ్నించి,

చరిత్రను సరికొత్త దృక్పథంతో గమనించారు. కొందరు రచయితలు చరిత్రను "సంస్కృతి చరిత్ర"గా చిత్రించారు. సంస్కృతి చరిత్రను ఆచార్య ఖండవల్లి లక్ష్మీ రంజనంగారు ఇలా వివరించారు. "చరిత్ర రచనా లక్ష్యముల విపులీకరణమే సంస్కృతి చరిత్రకు బీజము. చరిత్ర వెన్నెముకయైనచో, సంస్కృతి చరిత్ర నిండు దేహం, చరిత్ర చెట్టు బోదెయైనచో, సంస్కృతి చరిత్ర శాఖోపశాఖలు, పచ్చని యాకులు, పుష్పములు, ఫలములు నగును. ఇంకను సూక్ష్మముగ చెప్ప వలెనన్నచో చరిత్ర రాజనాయకము, సంస్కృతి చరిత్ర ప్రజానాయ కము. చరిత్ర గ్రంథములలో రాజులు, రాణులు, నాయకులు, నాయకు రాండ్రుగా నుండుచు వచ్చిరి. వారి జీవితము, వారిసూక్తులు, యుక్తులు యుద్ధములు, సంధులు, రాజతంత్రము, సుపరిపాలనము, ప్రజాపీడనం ఇవన్నియు ప్రభువులను కేంద్రముగ నుంచుకొని బయలుదేరిన వ్యాస

రేఖలు. సంస్కృతి చరిత్రయందు ప్రజలు నాయకులగుదురు. ఈ రెండవ వృత్తమునకు ప్రజానీకమే కేంద్రము. [1]

అందుచేత చారిత్రక కావ్యాలు "రాజనాయకాశ్రయం" మాత్రమే కావలసిన అవసరంలేదు. "మానవసంఘ జీవితమునకు సంబంధించిన సకల విషయములను కధగా కూర్చి సాగించిన రచనయే చరిత్ర." [2] అని చెప్పిన గ్రీకు తత్త్వవేత్త అరిస్టాటిల్ (క్రీస్తు పూ. 4 వ శతాబ్ది) అభిప్రాయం పరిశీలిస్తే, చరిత్ర రచన ఎంత విస్తృతమైన ప్రాతిపదికను కలిగి ఉందో తెలుస్తుంది.

దేశచరిత్రకు, సాంస్కృతిక చరిత్రకు మధ్య కొన్ని బేదాలను వివరించే ప్రయత్నం జరిగింది. "దేశచరిత్ర రాజనాయకమైనది. సామూహికంగా వచ్చే పెద్దమార్పులను మాత్రమే అది వివరిస్తుంది. రాజ్యాంగ విధానాన్ని స్థూలంగా నిరూపిస్తుంది. దైనందిన ప్రజాజీవితాన్ని వ్యక్తీకరించదు. మన తాత ముత్తాతలు ఎలా బ్రతికేవారు? వారి మత విశ్వాసాలు, ఆచార వ్యవహారాలు, వినోదకార్యక్రమాలు ఎటువంటివి? వారుఎటువంటి ఉడుపులంటే మోజుపడేవారు? స్త్రీలు నోచే నోములు, ధరించే ఆభరణాలు, పాడే పాటలు, ఆడే ఆటలు ఎటువంటివి? శిల్ప చిత్ర లేఖన నాట్యాది కళలలో పూర్వులు సాధించిన ప్రగతి ఎటువంటిది? అందు వారు చేసిన కృషి ప్రశంశనీయమేనా? - ఇటువంటి ప్రశ్నలకు సమాధానం కావాలంటే, మనం సాంస్కృతిక చరిత్ర వంక మనదృష్టిని కేంద్రీకరించవలసి ఉంటుంది." [3]

దీనిని బట్టి, చారిత్రక విశేషాలతో ప్రామాణికమైన కావ్యాలు వ్రాసేవారు చరిత్రను మాత్రమే గాక, సాంస్కృతిక చరిత్రను కూడా అధ్యయనం చేయవలసి ఉంటుంది.

---

[1] ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రులచరిత్ర-సంస్కృతి పుట-4,5

[2] .విజ్ఞాన సర్వస్వము, (తెలుగు భాషాసమితి) పుట-1

[3] ఆచార్య కె.వి.ఆర్. నరసింహం, ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి, పుట.6

## చరిత్ర – చారిత్రక కావ్యము

చరిత్రకు సంబంధించిన విశేషాలను వర్ణించే కావ్యాన్ని చారిత్రక కావ్యంగా వ్యవహరిస్తున్నారు. చరిత్రకు, కావ్యానికి మధ్య కొన్ని భేదాలు చెప్పబడుతున్నాయి. చరిత్రలో అభూతకల్పనలకు, అవాస్తవాలకు, అతిశయోక్తులకు స్థానం లేదు. కావ్యాలు ఇందుకు పూర్తిగా విరుద్ధం. భావనా ప్రేరితుడైన కవి రసవత్తరమైన కల్పనలతో, వింతైన కావ్య ప్రపంచాన్ని సృష్టిస్తాడు. తన ఊహలు పయనించినంతవరకు పాఠకుల్ని కూడా పరుగులు తీయిస్తాడు. చరిత్రకారునివలె, జరిగిన విషయాన్ని అధిగమించి మరేమీ చెప్పరాదనే నియమం కవికి లేదు. ఉన్నదానిని వున్నట్లుగా, యథార్థ కథనం చేయడమే చరిత్రకారుని కర్తవ్యం.

"మనకు చరిత్రము వలన కలుగవలసిన లాభము యథార్థ జ్ఞానము, అది మంచిదైనను కాకున్నను, ఇష్టమున్నను లేకున్నను, సరే. కావున నేటి చరిత్రకారునికొక విషయము సత్యమని స్థాపింపననేక సాక్ష్యములు కావలయును; అదిపరస్పర విరోధము లేకయుండవలయును అట్లగుటచే సాక్ష్యము దొరికిన చాలునని తృప్తిపడక యది నమ్మదగినదా, కాదా యని మొదలు పరీక్షింప వలసియుండును. కావున నిప్పటి చరిత్ర కారుడు తానొక న్యాయాధిపతిగా వ్యవహరించుచున్నాడు."[1] అను శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి అభిప్రాయం గమనార్హం.

చారిత్రక రచనలో అనేకమైన సాక్ష్యాధారాలను ప్రదర్శించాలి. కార్య, కారణ సంబంధాలను సక్రమంగా నిర్ణయించి, హేతుబద్ధమైన ప్రతిపాదనలు చేయాలి. మానవుడే చరిత్రకు కేంద్రబిందువు కాబట్టి, మానవేతర శక్తులతో చరిత్రను నడిపించకూడదు.

చరిత్రకారుడు తాను ప్రదర్శించే ప్రత్యక్ష, పరోక్ష కారణాలను సహేతుకమైన వాస్తవాలుగా నిరూపించుకోవాలి. కవికి ఈ నియమాలేవీ

---

[1] రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, వేమన, పుట-18

వర్తించవు. అత్యద్భుత దివ్యశక్తులు కవుల కలాలనుండి ఊపిరిపోసుకొ గళాలు విప్పుతాయి. మానవాతీతమైన సౌందర్యం, మనోహరమైన ర ప్రపంచం కవిలేఖిని నుండి సాక్షాత్కరిస్తుంది. కవి తాను చెప్పిన విషయానికి సాక్ష్యం చూపవలసిన పనిలేదు. ఈ విషయాన్ని ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఇలా వివరించారు.

"కవులకు సత్యము చెప్పవలయునను నియమము లేదు. సత్య కథనము చరిత్ర శాస్త్రాదుల పని. భావ వినిమయమునకై సామాన్యుల పలుకు వాక్యములకును, సత్యకథన ప్రధానములైన చరిత్రాదులందలి వాక్యములకును, కావ్యగతములైన వాక్యములకును తారతమ్యముండును. కావ్య వాక్యము రసప్రధానము. కవులు తాము చెప్పదలచిన విషయము లను పొడిమాటలతో చెప్పక, అలంకారిక మార్గమున చెప్పుదురు. అలంకారములన్నియు అతిశయోక్తి మూలములను వాదమొకటున్నది. అతిశయోక్తి సత్యమునకు కొంత ఐన దూరముగనే ఉండును కదా. అందుచే అసత్యము చెప్పువారని కవులను మనము నిందించి ఫలము లేదు."[1]

చరిత్రలోని విషయం ఒకదేశానికి, ఒకరాజుకు సంబంధించి నిర్ణీత కాలంలో జరిగిన యధార్థ సంఘటన అయివుంటుంది. కాని కావ్యగత విశేషాలు సార్వకాలిక, సార్వదేశిక, సార్వజనీనములుగా వుంటాయి. గత విషయాలను గమనించి, వర్తమానంలో సవ్యంగా జీవిస్తూ, భవిష్యత్తును చక్కదిద్దుకోవడం చరిత్ర పఠనం వల్ల సమకూడే ప్రయోజనం. రసానుభూతిని కలిగించడమే కావ్యప్రయోజనం.

చరిత్రలో "వ్యక్తుల చర్యలు" మాత్రమే ప్రధానంగా చెప్పబడతాయి, సాహిత్యంలో వ్యక్తుల చర్యలకు మూలకారణమైన "చిత్త వృత్తుల విశ్లేషణ" ఉంటుంది.

"పూర్వకాలపు సాహిత్యంలో చాలా భాగము పండితులచే పండితుల కొరకు రచించబడినది. అందులో వాడబడిన భాష సులభ గ్రాహ్యము

---

[1] విజ్ఞాన సర్వస్వము (తెలుగు భాషాసమితి) 6 వ సంపుటము, పుట-165

కాని గ్రాంధికము. సామాన్య మానవులకు ప్రాధాన్య ముండవలెనను భావ మాధారమైన సంస్కృతిని ఉద్ధరించుటలో సాహిత్యమునకు గ్రాంధిక భాషకంటే వ్యవహార భాష ఉత్తమ సాధనమన్న అభిప్రాయము ప్రాబల్యము కలదయ్యెను.... పూర్వకాలములో గ్రంధములలో అత్యధిక భాగము పద్య రూపమందుండెను. ఇటీవలి కాలమున వచన గ్రంధములు విరివిగ రచింపబడుచున్నవి," [1] అని ఆచార్య మామిడిపూడి వేంకట రంగయ్య గారు చరిత్ర రచనకు, కావ్యరచనకు ఉపయోగించు భాషకు సంబంధించిన భేదాలను వెల్లడించారు.

పైన పేర్కొనబడిన స్వల్పమైన భేదాలకంటే, చరిత్రకు, కావ్యానికి మధ్యగల అవినాభావ సంబంధమే బలవత్తరమైనది. చరిత్ర రచనకు ఉపయోగపడు సాధనాల్లో వాఙ్మయము ఒకటి. "లభ్యమగు నాంధ్ర గ్రంధములనెల్ల జాగరూకతతో పఠించి యందలి చరిత్రాంశములనెల్ల సమకూర్చి దేశ కాలానుసారముగ విభజించితిమేని, జీవకళతోడి జాతీయ చరిత్రను వ్రాయుటకు సాధ్యమగును".[2] అని డాక్టరు నేలటూరు వేంకట రమణయ్యగారు అభిప్రాయపడ్డారు.

ఐతే కావ్యాలలోని చరిత్రాంశాలను స్పష్టంగా గుర్తించి ప్రత్యేకంగా చూపగలగడం సులభమైన విషయంకాదు. ఎందుచేతనంటే, చరిత్రకు విరుద్ధమైన ఎన్నో అనవసరమైన కల్పిత విశేషాలతో చారిత్రక విశేషాలు మిళితమై ఉంటాయి.

"కట్టు కథలకు చరిత్రకు ఎంతో భేదం ఉంది. ఒక గ్రంథంలో రెంటినీ చేర్చడంవల్ల ఏది సత్యమో, ఏదికాదో సామాన్య పాఠకులు నిర్ణయించుకోవడం సాధ్యంకాక పోతూవుంది."[3] అని ఆచార్య

---

[1] ఆచార్య మామిడిపూడి వేంకట రంగయ్య,
చరిత్ర చేస్తున్న హెచ్చరికలు, పుట-127

[2] డా॥ నేలటూరు వేంకట రమణయ్య, చరిత్ర రచన, పుట-2.

[3] ఆచార్య మామిడివూడి వెంకట రంగయ్య,
చరిత్ర చేస్తున్న హెచ్చరికలు, పుట-28.

మామిడిపూడి వేంకట రంగయ్యగారు సందేహం వెలిబుచ్చడం సమంజసంగా వుంది.

కనుక చారిత్రక విషయాలను గుర్తించడానికి ప్రత్యేకమైన పరిశోధన, శిక్షణ కావాలి.

కావ్య అవతారికలు, ఆశ్వాసము మొదట చివర వ్రాయబడిన వివరాలు, ప్రత్యక్ష పరోక్ష కారణాలచే అంగీకరింపదగిన యధార్థ సాంఘిక వర్ణనలు చరిత్రకారులకు విలువైన సమాచారాన్ని అందిస్తున్నాయి. రాజుల వంశచరిత్ర, యుద్ధ విశేషాలు, సభామర్యాదలు, పరిపాలనా రీతులు, మానవుల నైతిక జీవిత నిమ్నోన్నతాలు కావ్యాల్లో ద్యోతక మౌతాయి. "కావ్య వశమున చేయువర్ణనలు, ఉపమాదికములు, ఋతు యాత్రోత్సవాదుల వర్ణనలు, వేదాంతచర్చలు, చరిత్ర రచనకు ఉపయోగపడుచున్నవి. ఆంధ్రకవులు, అందను ముఖ్యముగా ప్రబంధకవులు సమకాలిక విషయములను చేర్చి కావ్యములు రచించిరి. కథ పాతదైనను, అప్రయత్నముగా సమకాలిక సాంఘిక పరిస్థితులు వీనియందు కనబడుచున్నవి. చరిత్ర కత్యంతోపయుక్తములగు ఆయా కాలపు జనజీవనము, సంఘపరిస్థితి, జనుల వేషభాషలు, సుఖదుఃఖములు కృషి, వ్యాపారములు. వినోదాదికములు మొదలైన పెక్కు విషయములు వాఙ్మయమునుండియు గ్రహింపవలయును."[1] అని శ్రీ వేదము వేంకట రాయశాస్త్రిగారు, కావ్య సంపదను చరిత్రకారులు ఎలా వినియోగించు కోవచ్చునో విశదం చేశారు. ప్రాచీనకాలంలో కవులు తమ కావ్యాలను రాజులకో, మంత్రులకో. సామంతులకో, ధనవంతులకో అంకితంచేసి, వారినుండి కానుకలు స్వీకరించడం సాధారణ విషయం. అందుచేత, కృతి కర్తల వంశచరిత్రను, అత్యుక్తులతో నింపివేసే ప్రమాదంకూడా లేకపో లేదు. ఒకోసారి, కావ్యాన్ని అద్భుత చిత్రంగా రూపొందించే ప్రయత్నంలో వాస్తవాలు తారుమారవుతాయి. కనుక, కావ్యగత వర్ణనల్ని చారిత్రకప్రమాణాలుగా అంగీకరించరాదనే అభిప్రాయం కూడా ఉంది.

---

[1] భారతి (సాహిత్య మాసపత్రిక), 1949 ఫిబ్రవరి, పుట-74.

"కవుల గ్రంథములందలి వ్రాతలనుబట్టి వారి చరిత్రమును నిర్ణయింప సాధ్యమా? అట్లైనచో ఆంధ్ర వాఙ్మయమందలి కవులెందరికో ఇష్టదేవత స్వప్నమున వచ్చి గ్రంథకరణమును యాచించెననవలసి యుండును. ఎందరికో, ఏమియు వ్రాయకమునుపే గ్రంథకర్తలు జాంబూ నదాంబరాగ్రహారాదులు సంచకారమిచ్చి నారన వలసి యుండును. ప్రతిప్రబంధ కవియును మాతులుంగలుంగలవంగములు మొదలగు తలతోకలేని మహీరుహమాలికలతో దిద్దితీర్చిన యారామమందు, మల్లె మొల్ల జాజి సంపెంగల పొదల నడుమ, గొజ్జగి నీటికాలువలు పూదేనియ సోనలు నావరించియున్న చంద్రకాంత శిలావేదికలపై, పుష్పాడుల మెత్తలపై పరుండియే కవితా కాలక్షేపము చేయుచునో, లేక మధ్యాహ్నపు వంటకు మార్గము నెఱుగని యిల్లాలితో కలహించుటచే విరహమున కోర్వజాలక చంద్ర మలయ మారుతాదులను దూషించుచునో, ప్రొద్దు గడుపుచుండె ననవలసియుండును ఇట్లు ఇల్లాలి ముక్కర కొక ముత్యము గతిలేకున్నను, ఇంటి ముంగలి వీధులకెల్ల ముత్యాలముగ్గులు పెట్టువారు మన కవులు"[1] అని శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు, కవుల వర్ణనల్లోని అతిశయోక్తులను గూర్చి, వ్యంగ్యంగా హెచ్చరించారు.

ఒక విషయాన్ని అతిశయోక్తులతో నింపడం కవి భావనాబలాన్ని, వర్ణనా ప్రియత్వాన్ని, ఆశావాదతత్త్వాన్ని తెలియజేస్తుంది. అయితే, కవి ఎంతటి భావావేశపరుడైనా, తనచుట్టూవున్న పరిస్థితుల్ని విస్మరించలేడు. చరిత్ర రచయితకు వలె కవికి కూడా మానవ జీవిత చిత్రణయే కేంద్రబిందువు. ఈ విషయాన్నే ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు యిలా వివరించారు.

"కవి భావనాయానమున నెంతకాలము భావాంబర విహారపరాయణుడై వర్తించినను, ఎప్పుడోయొకప్పుడు భూతలమున

1 రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, వేమన, పుట-36.

కవతరింపకపోడు, అప్పుడాతని కావ్యమున నజ్ఞాతముగనైన భూతలము, అందలి జనులు, సంఘము, సంప్రదాయములు, ప్రకృతి, తత్పరిస్థితులు ప్రతిఫలించి దానికొక ప్రత్యేకత చేకూర్చును. అందుచే, చరిత్రకారుడాయాకాలముల పరిస్థితులను వర్ణింపదలచినపుడు, విషయసంగ్రహణమునకై యితరాధారములను వలె వాఙ్మయమును గూడ వెదకవలసి వచ్చును. అప్పుడు లభించిన వివిధవిషయ మిశ్ర క్షీరము నుండి చరిత్ర దుగ్ధమును వేరుచేసి యాతడుపయోగించుకొనును"[1]

చరిత్ర మానవజాతికి సంబంధించిన ఆర్థిక, రాజకీయ, మత సాంఘిక పరిస్థితుల్ని వివరిస్తుంది. "వాఙ్మయము వీనిలో నేదోనొక దానినైనను, లేక అన్నిటికైనను కొద్దిగనో, గొప్పగనో తాకక యుండజాలదు. ఈ విషయమును గుర్తించియే, వాఙ్మయ చరిత్రకారులు దేశ చరిత్రను, దేశ చరిత్రకారులు వాఙ్మయ చరిత్రను పఠించుట ఆవశ్యమైనది. ఈ రెంటికిని అవినాభావసంబంధము"[2] అని నిర్ధారించబడింది.

కావ్య విశేషాలు చరిత్ర రచనకు ఏవిధంగా ఉపయోగపడుతున్నాయో, చారిత్రక వివరాలుకూడా కవికి అంతే ఉపకరిస్తున్నాయి. కావ్య రచనకు చారిత్రక పరిజ్ఞానం కూడా అవసరం. సాహిత్యానికి సంబంధించిన పరిణామాలను, వివిధ ఉద్యమాల స్వరూపస్వభావాలను గ్రహించడానికి చరిత్ర నుండే ఆధారాలను స్వీకరించాలి. మహనీయులను నాయకులుగా చేసి కావ్యరచన చేయాలంటే కవికి చరిత్రే మార్గదర్శి.

"భాషా చరిత్ర, వాఙ్మయ చరిత్రములు దేశచరిత్రములో నంతర్భాగములు. దేశచరిత్ర చక్కగా గ్రహించితిమేని మిగిలినవి సులువే."[3] అని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు వెల్లడించారు.

---

1 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటము-49, సంచిక-1, పుట-26.

2 (వేదము వేంకటరాయశాస్త్రి) భారతి, 1949 ఫిబ్రవరి, పుట-70.

1 భారతి, 1949 ఫిబ్రవరి. పుట-70

చరిత్రకారుడు రూపొందించిన ఆధారాలే కవికి పరమ ప్రమాణం. ఆ ఆధారాల పునాదిపై కవి రమణీయమైన కావ్య సౌధాన్ని నిర్మిస్తాడు.

"చరిత్రకారుడు సేకరించిన, ఎండుమట్టిలో దాగి నిక్షిప్తమై ఉన్న బీజాన్ని ఆ నవలాకారుడు ప్రాణవంతమైన మహావృక్షంగా పరిణమింపచేసే మంచి వనపాలకునివలె పెంచి పెద్దది చేసినాడు"[1] – అని కవి సామ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు, చారిత్రక సంఘటనను కవి ఎలా ఉపయోగించుకొంటాడో వెల్లడించారు.

దీనినిబట్టి, కవి వలన చరిత్రకారుడు, చరిత్రకారుని వలన కవి పరస్పరము లాభించుచున్నారని తెలియుచున్నది.

## గేయము – చారిత్రక గేయకావ్యము

"గాతుం యోగ్యం గేయమ్" గానం చేయడానికి ఉపయోగపడేది గేయం. ప్రాక్తన మానవుడి ఆటకు తోడుగా పాట పుట్టింది. ఆదిమ దశలోనే, మానవుడు తనకు కలిగిన ఆనందాన్ని, సాదారణమైన మాటలతో కాకుండా, రాగాలాపనతో వ్యక్తంచేసి వుంటాడు. ఉత్సాహం, ఉద్రేకం, కష్టం, సుఖం, దుఃఖం, రక్తి, భక్తి, విరక్తి ఇంకా ఎన్నో అనుభూతులు హృదయంలో సంచలిస్తే, ఉద్విగ్న హృదయుడైన మానవుడు మధురగానం చేశాడు. జానపదుల జీవితం మొత్తం పాటల్లో ప్రతిబింబించింది. వారి ఆచార వ్యవహారాలు, సాంఘిక, సాంస్కృతిక జీవిత విశేషాలు వివిధ గేయాల్లో సాక్షాత్కరించాయి. ఊయెల పాటలు, రోకటి పాటలు, తుమ్మెద పాటలు, కోలాటపు పాటలు, జోలపాటలు, లాలి పాటలు, గొబ్బి పదాలు, ఏల పదాలు, బొబ్బిలి పదాలు, వెన్నెల పదాలు, గొల్ల సుద్దులు, జంగం కదలు, మేలుకొలుపు పాటలు, విరహగీతాలు, దరువులు, రగడలు – ఇవన్నీ మానవ జీవితాన్ని వివిధ కోణాల్లో ప్రదర్శించాయి. అందుచేత, మానవ జీవితంలోని వైవిధ్యాలు గేయరూపంలో అత్యంత సహజంగా, సజీవంగా చిత్రించబడ్డాయనే విషయం వాస్తవం. మానవుల శ్రమనుండే; శ్రమను మరిపించి మురిపించడానికే పాటపుట్టింది.

---

1 సారస్వత వ్యాసములు, ఐదవ సంపుటము, పుట–108.

భీమఖండంలోనే "జాదుర జాదురంసు మృదు చర్చరి గీతులు..." ప్రస్తావించబడ్డాయి. క్రీడాభిరామంలో "పెద్ద కొలువుగొన ఒక పడతి పల్నాటి వీరుల పాటను" గానం చేయగా - బవనీల చక్రవర్తి (బైండ్ల వారు, పంబాల వారి నాయకుడు) ఏకవీరామహాదేవి ఎదుట పరశురాముని కథలను ఆలపించాడు. జక్కులపురంధ్రి "కామవల్లి మహాలక్ష్మి కైటభారి వలపు" పాటలను (అక్కల పాట) "రాగమున నుండి లంఘించు రాగము" తో గానం చేసింది.

శ్రీకృష్ణదేవరాయలను ఉత్తేజపరచిన—

"కొండవీడు మనదేరా
కొండపల్లి మనదేరా
కాదను వాడుంటే
కటకం దాకా మనదేరా" అనే

గేయాలాపన నేటివరకూ రూపురేఖల్ని కోల్పోలేదు.

తంజావూరులో తెలుగు సాహిత్య శారదా ధ్వజమును ప్రకాశింపజేసిన నాయక రాజులు పద కవిత్వానికి ప్రాణం పోశారు.

"నాయకరాజుల పరిపాలనా కాలంలో మళ్ళీ పదకర్తలు తలెత్తారు. పద్య కవులతో సమాన గౌరవం లభించింది. ఎన్నో యక్షగానాలు ఉద్భవించినవి. రంగాజి, రామభద్రాంబ, కృష్ణాజి మొదలైన కవయిత్రులు పదరచనల్లో పాల్గొన్నారు. విజయరాఘవ నాయకుడు-క్షేత్రయ్య తదితర వాగ్గేయ కారాగ్రణులను పోషించటమే కాకుండా ఎన్నో చౌపదులు, ద్విపదలు, యక్షగానములు రచించారు. ఈతని కాలినడలనే అనుసరించి మహరాష్ట్ర నాయకులలో ప్రముఖులైన శాహజీ ప్రభృతులు పదసారస్వత సేవ చేశారు."[1] శ్రీ వావిలాల సోమయాజులుగారి పై వివరణను బట్టి, గేయసాహిత్య అవిశ్రాంత పురోగమనం స్పష్టమౌతుంది.

---

1 ప్రతిభ, సెప్టెంబరు 1940, సంపుటి-5, సంచిక-1, పుట-18,

ఆధునిక సాహిత్యంలో గేయప్రక్రియకు సమున్నతమైన స్థానం సాధించిన వారు మహాకవి గురజాడ అప్పారావుగారు. దేశభక్తి,సామాజిక స్పృహ, సంఘ సంస్కరణాభిలాష, మానవతావాదం, విశ్వప్రేమ, జాతీయ భావాలు ఈ ప్రజాకవి ముత్యాల సరాల్లో ప్రతిఫలించాయి. పాత పాటనే ఎంతో బలంగా, "క్రొత్త పాతల మేలుకలయికతో" రూపొందించారు. అందుచేత, గేయం నాటినుండి నేటివరకు పాడబడుతూ వచ్చినా, ఆధునిక యుగంలో గేయానికి సరిక్రొత్త వన్నెచిన్నెలు చేకూర్చి, సాంఘిక ప్రయోజనాన్ని లక్ష్యంగా చూపిన ప్రజాకవి గురజాడ అప్పారావుగారిని "ఆధునికాంధ్ర గేయ కవితా పితామహుడు"గా అభివర్ణించవచ్చు. ఎందరో గేయకవులకు మార్గదర్శకుడైన యుగప్రవక్త గురజాడ.

"అడుగుజాడ గురజాడది
అది భావికి బాట
మనలో వెధవాయత్వం
మరపించే పాట"[1]

అని మహాకవి శ్రీశ్రీ గురజాడను అనుసరించి, గేయ ప్రక్రియకు నీరాజనం పట్టారు.

"ఎట్టి మాత్రాచ్ఛందమున్ గాని
ఏము రవ్వలు రాల్చినావో
అట్టి చందస్సు అందరికి నీ
వంచ నడకలు నేర్పినాడవు"[2]

అని ప్రసిద్ధ గేయకవి డా॥ సి. నారాయణరెడ్డి మహాకవి గురజాడను ప్రస్తుతించారు.

---

1 శ్రీశ్రీ, మూడు యాభయిలు, పుట–12

2 అడుగుజాడ గురజాడది, (సంకలనం)పుట–144,
(సంకలన కర్త – కె.వి. రమణారె

"ఎందుకయ్యా బండ్లకొద్దిగ
ఎదకదల్చని కావ్యరాశులు
జాతి నాడులలోన పారెడు
గీతి యొక్కటి చాలదా మరి"[1]

అని డా॥ సి. నారాయణరెడ్డిగారు గురజాడ వారి ముత్యాల సరాల సొగసును లోకానికి వెల్లడించారు. గేయం జన జీవితంతో ముడిపడి వుంటుందనే విషయాన్ని గురజాడ మరోమారు సారస్వత ప్రపంచానికి చెప్పారు.

గురజాడవారి భావాలను, భాషనూ పుణికి పుచ్చుకొన్న ఆధునిక కవి బసవరాజు అప్పారావుగారు. పాటకు ప్రాణాన్ని ముడుపు కట్టిన గేయకవి.

"పాట పాడుతుండగ నాప్రాణి దాటి యేగేనా?
ప్రాణి దాటి యేగుతుండ పాటనోట మోగేనా?"

అని గానంచేసిన సుకుమార కవికుమారులు బసవరాజు అప్పారావుగారు.

"నన్నెవ్వరాప లేరీ వేళా
నాధాటి కోప లేరీ వేళా
నోట పలికేదంత
పాటగా మోగేను
కోటి వరహా కెత్తు
కెత్తుగా తూగేను
గుండురారా మంటు
కొట్టినట్టుగ నేటి
పండితులు రారెత్తి
పరుగుచ్చుకోవాలి"[2]

అని బసవరాజు అప్పారావుగారు పద్య కవిత్వాన్ని ధిక్కరించి పాటకు పట్టంకట్టారు.

---

[1] అడుగుజాడ గురజాడది, (సంకలనం) పుట-144.

[2] అడుగుజాడ గురజాడది (సంకలనం) పుట-12,13.

అడవి బాపిరాజుగారు—

"కంఠమెత్తే పాటలెప్పుడు
కలం హాయిగ నృత్యమెప్పుడు?
కంటి చూపులలోన ఉత్తమ
కళలు తోచేనా?"

అని గానం చేశారు.[1] సందర్భం దొరకబుచ్చుకొని చారిత్రక నవలల్లో మృదుమధురమైన గేయాలను రచించిన వారిలో అడవి బాపిరాజుగారు సుప్రసిద్ధులు.

"పాటుపడే ప్రతివాడూ
పాడునదే పాట
బృహత్కావ్య రసస్ఫూర్తి
గుండె గుండె నాట"

అని శశాంకగారు పనికి, పాటకు ముడిపెట్టారు.[2]

1910 నుండి 1935 వరకు గేయం భావకవుల ఆత్మవేదనను, ప్రేయసీ ఆరాధనను, ప్రకృతి వర్ణనలను ఆవిష్కరించడానికి ఉపకరించింది. ఇదే కాలంలో జాతీయమైన భావనలకు అద్దం పట్టింది. చారిత్రకతను సంతరించుకొన్నది. దీనికిగూడా మూలపురుషుడు గురజాడ అప్పారావుగారే. జాతీయోద్యమకాలంలో "గేయం అవసరం" అడుగడుగునా కన్పించింది. జనబాహుళ్యాన్ని కదిలించాలంటే, వారి హృదయక్షేత్రంలో స్వాతంత్ర్య బీజాలు నాటాలంటే, గేయమే ప్రధాన సాధనమైంది. సత్యాగ్రహ మంత్రాన్ని గేయంలోనే పల్లెపల్లెకూ వ్యాపింపజేశారు. మద్యనిషేధం, అంటరానితనాన్ని నిర్మూలించడం మొదలైన సంఘసంస్కరణ కార్యక్రమాల ప్రచారానికి ప్రబోధ గేయాలను రూపొందించారు. ఆంగ్లేయుల దురాక్రమణ చరిత్రను చెప్పడానికి గేయప్రక్రియ సరైనదని రచయితలు భావించారు.

---

[1] అడుగుజాడ గురజాడది (సంకలనం) పుట 14

[2] శ్రీశ్రీ యుగం(కవితా సంపుటిలో-శశాంక,జీవనగానం) పుట 43

శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు వ్రాసిన "మాకొద్దీ తెల్లదొరతనమూ" అనే పాట పరపాలకుల చరిత్రను, దురాగతాలను హృదయానికి హత్తుకునేలా రచించబడింది. ఈ పాటను 1921, 22, 23 సంవత్సరాలలో పాడని యువకుడు లేడు. యావదాంధ్రదేశమూ పాకిపోయిన పాట యొక్క కర్త జాతికెంత ప్రియుడో వేరే చెప్పపనిలేదు."[1]

మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారు వ్రాసిన

"అంటరాని వారెవరో కారు మా
వెంటరాని వారె"

అనేపాటలో అప్పటి సామాజిక చరిత్ర ప్రతిబింబిస్తుంది.

"మేలుకొనుమీ భరతపుత్రుడ
మేలుకొనుమీ సుజనమిత్రుడ
మేలుకొనుమీ సచ్చరిత్రుడ
మేలుకొనవయ్యా!
వత్సా! మేలుకో"[2]

ఇటువంటి పాటలు "ప్రభాతభేరి" ల్లాగా ఉపయోగపడ్డాయి.

"దండాలు దండాలు భరతమాతా

అవి

అందుకొని దీవించు భరతమాతా"[3] అని కొందరు (శ్రీ పూడిపెద్ది కాశీవిశ్వనాధం) (వడ్డాది సీతారామాంజనేయులు) దేశమాత దీవెనలు కోరారు.

---

1 కురుగంటి సీతారామయ్య, నవ్యాంధ్ర సాహిత్య వీధులు-1, పుట-287

2 జాతీయగీతాలు, (మంగిపూడి వెంకటశర్మ) పుట-12.

3 అందే పుట-14.

బసవరాజు అప్పారావుగారు "కొల్లాయి గట్టితేనేమి
మా గాంధి
కోమట్లై పుట్టితేనేమి?"[1] అని జాతిపితను

శ్లాఘించారు. నిర్బంధించబడిన జాతీయోద్యమ కార్యకర్తలు న్యాయ స్థానాల్లో "గేయ వాఙ్మూలం" ఇచ్చారంటే, గేయప్రక్రియ ఎంతగా విస్తరించిందో తెలుస్తుంది.

1946 నుండి 1951 వరకు సాగిన తెలంగాణా సాయుధ పోరాట కాలంలో, గేయం మరోసారి విజృంభించింది. సామాన్య ప్రజానీకం నైజాం నవాబుకు వ్యతిరేకంగా పాడే పాటల్ని, బుర్రకథల్ని విని చూడ టానికి అధిక సంఖ్యలో హాజరయేవారు. అంటే, ప్రజల్ని సమీకరించ డానికి పాటలు దివ్యౌషధంలా పనిచేస్తాయని ఆంధ్రమహాసభ నిర్వాహకులు గమనించారని చెప్పవచ్చు. ఏదైనా ఒకవిషయాన్ని సులభంగా వ్యాపింప జేయడానికి పద్యం కన్నా గేయమే అనువైనది.

భావకవులు రసగుళికలవంటి ప్రేమ గీతాలువ్రాసి గేయప్రక్రి యను విస్తృతపరచినా, అభ్యుదయ కవులే గేయానికి ఉన్నతరూపాన్ని కల్పించి, సాంఘిక చైతన్యం సాధించారనిచెప్పాలి. తాపీధర్మారావుగారు-

అని ప్రశ్నించి, భావకవుల గేయంలో లేని సామాజిక స్పృహను కలిగి ఉండవలసిన బాధ్యతను అభ్యుదయ కవులకు గుర్తుచేశారు.

---

1 జాతీయ గీతాలు (సంకలనం) పుట-208

2 అడుగుజాడ గురజాడది (సంకలనం) పుట-8

అవి వర్ణనాత్మక గేయకావ్యాలు. నారాయణ రెడ్డి గారి నాగార్జునసాగరం [1955] సమగ్రమైన చారిత్రక గేయకథా కావ్యం. నారాయణ రెడ్డి గారి కర్పూర వసంతరాయలు [1957], విశ్వనాథనాయుడు [1959] తదితర చారిత్రక కథాకావ్యాలు రచయితల దృష్టిని ఆకర్షించాయి. నారాయణరెడ్డి గారి "కర్పూరవసంతరాయలు"ప్రభావంతో, శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు గారు "రంగాజమ్మ"[1963]అనే చారిత్రక గేయకథాకావ్యం రచించారు. అందుచేత, చారిత్రక గేయకథాకావ్యాల రచనకు శ్రీకారంచుట్టి, ఇతరులకు మార్గదర్శకులైనవారు డా॥ సి. నారాయణరెడ్డి అని స్పష్టంగా చెప్ప వచ్చును. కనుకనే ఈ సిద్ధాంత వ్యాసం నారాయణరెడ్డిగారి చారిత్రక గేయ కథా కావ్యాలను వివరించడంతో ప్రారంభింపబడింది.



## కవి పరిచయం

నారాయణరెడ్డిగారు తెలుగు జాతి గర్వించదగిన మధురకవి. తాను మాట్లాడిన ప్రతి మాటనూ పాటగా భాసింపజేసిన కళాతపస్వి. మాత్రా ఛందస్సులో సర్వాంగ సుందరమైన కథా కావ్యాలను సృష్టించిన సాహితీ స్రష్ట. "నిర్మించే కలం, గర్జించే గళం" రెడ్డిగారి అవిశ్రాంత శక్తులు. "ప్రబంధాల పంజరాలను, వ్యాకరణాల ఇనప్పెట్టెలను తప్పించుకొని ఎగిసి వచ్చిన"[1] నారాయణరెడ్డిగారి గేయాలు ఊయెల ఊపులా పాఠకులకు హాయిని కలిగిస్తాయి. రెడ్డిగారి కవిత వాల్మీకి గుండె చేదుకొని: వ్యాసుని తలమోసుకొని స్వచ్ఛగతిని ఊబికి వచ్చినట్టిది.

"సృజనాత్మక శక్తి లేని
భజన కీర్తనలు చెల్లవు
కళా పరిమళమే లేని
గడ్డి పద్యములు నిల్వవు"[2] అంటూ

కావిలోకాన్ని చైతన్య చకచ్చకిత మొనర్చిన నవయుగ వైతాళికుడు. కలాల గాలాలకు లొంగని గ్రంథాల మీనబృందాలు రెడ్డిగారి సొత్తు.

"శిబిరం నుంచి వసంతానికి
చీకటి నుండి ప్రభాతానికి
నిరాశ నుంచి ఆశాశిఖరానికి
అశ్రుజలధినుంచి ఆనందతీరానికి"

పాఠకుల్ని నడిపిస్తూ, సాహిత్య ప్రయోజనాన్ని సిద్ధింపచేసిన ప్రతిభాశాలి. చీకట్లను శపించడం కట్టిపెట్టి చిరుదివ్వెను వెలిగించే ప్రయత్నం చేశారు.

---

[1] డా॥ సి. నారాయణ రెడ్డి, తేజస్సు-నా తపస్సు, పుట-15

[2] డా॥ సి. నారాయణ రెడ్డి, నారాయణ రెడ్డి గేయాలు, పుట-39

[3] డా॥ సి. నారాయణ రెడ్డి, మార్పు-నా తీర్పు, పుట-2

చారిత్రక కావ్యాలను గేయంలోనే వ్రాయడం ఎంతవరకు సబబో, ఎందుకు వ్రాయాలో కూడా స్పష్టం చేయవలసిన అవసరం వుంది. ఒక జాతికి సంబంధించిన 'గతకాలపు సంస్కృతి చరిత్ర' వివరాలు గేయంలోనే (వివిధమైన జానపద గేయాల్లో) అధికంగా లభ్యమౌతున్నాయి. కాలానుగుణ్యమైన మార్పులు కూడా యీ గేయాల్లో చోటు చేసుకొంటున్నాయి.

పద్యకావ్యాల్లో అతిశయోక్తులతో నిండినవర్ణనలు అధికం. గేయాల్లోని వర్ణనలు అత్యంత సహజంగాను, హేతుబద్ధంగాను, కార్యకారణ సంబంధం కలవిగానూ ఉన్నాయి. విస్మృతమైన వీరగాధలు గేయరూపంలో నిలిచివున్నాయి. వీరుల వృత్తాంతాలను, వీరమరణం పొందిన వారి శౌర్యసాహసాలను పాటలు కట్టి పాడుకునే సంప్రదాయం కనుపిస్తుంది. ఈనాటికీ జంగాలు, చిందోళ్ళు, పిచ్చుకకుంట్లు, పంబలు, బైండ్లవాళ్ళు, డప్పులవాళ్ళు, వీరాచారం గలవారు, తరతరాల వారసత్వ సంపదగా వీరగాధలనుగానం చేస్తున్నారు. ఇప్పటికీ అనేక గ్రామాల్లో,తద్దినాల సమయంలోజంగాలతో వీరగాధలను పాడిస్తున్నారు. (స్త్రీలు మరణిస్తే పతివ్రతల కధల్ని గానం చేస్తారు.) వీధిభిక్షుకుల వలన విలువైన చారిత్రక సమాచారం లభ్యమౌతున్నది. అవి సత్య సమీపంగా ఉన్నాయి. ప్రజల హృదయఫలకాలపై ముద్రించబడ్డ ప్రధాన సంఘటనలు పాటలుగా రూపొందుతున్నాయి.

విదేశీ చరిత్రకారుల వ్రాతలనే పరమ ప్రమాణంగా భావించేవారు కొందరు, స్వదేశీ గాయకుల గేయాల్లోని చారిత్రక విశేషాలను స్వీకరించక పోవడం శోచనీయం. కనుక, గేయాల్లోని చారిత్రక వివరాలను గ్రహించి, నిజానిజాలను నిర్ధారించాలి. అంతేగాని, ఆయా చారిత్రక గేయాలను వ్యర్ధగీతాల్లుగా భావించరాదు.

ఇప్పటికి కూడా, చరిత్రకారులు గ్రంథస్థం చేయని ఎన్నో చారిత్రక గాధలు. మహనీయుల జీవిత విశేషాలు జానపద గేయాల్లో ఉన్నాయి. చరిత్రను సమగ్రంగా రూపొందించాలంటే, గేయ సాహిత్యాన్ని ఆమూలాగ్రం అధ్యయనం చేయాలి. చారిత్రక గేయ కధాకావ్యాలు వ్రాసేవారు మరిన్ని జాగ్రత్తలు పాటించాలి. సంప్రదాయ కావ్యాలలోని చారిత్రక వివరాలను; చరిత్ర గ్రంధాలల్లోని వివరాలను. పరిశీలించాలి.

అంటాగాని, ఏదో ఒక జానపద గేయాన్ని మాత్రమే ఆధారంగా స్వీకరించి రచనను పూర్తిచేయడం సబబుకాదు. చారిత్రక రచనలకు సంబంధించి ఆచార్య తూమాటి దొణప్ప గారు చేసిన సూచన మిక్కిలి సమంజసంగా ఉంది.

"చరిత్ర పుటలలోని వాస్తవ సంఘటనలకు కావ్య కళాశిల్పాన్ని కల్పించడం మాటలు కాదు. యథార్థ ఘటనల అనువర్ణనం ఒక నివేదిక అవుతుంది. ఉన్నదున్నట్లు వర్ణించడం చిలుకపలుకవుతుంది. శుష్క వాదాలు, శుకానువాదాలు రసవత్కావ్యాలు కాజాలవు. అందుకే చారిత్రకకావ్యరచన కత్తిమీదసాము. కథనం చరిత్రగతికి విరుద్ధం కారాదు. గ్రథనం కావ్య లక్షణాల మేరలు మీరరాదు. ఎట్టుమొగ్గినమూ అవకళ్ల బరువెక్కి-రెండోపక్క చులకదనం పొడసూపకమానదు.... చారిత్రక సత్యం, సాహితీ సౌహిత్యం సరియైన పాళ్ళలో సమ్మేళనం చెందినపుడే ఆ రచనం చక్కటి చారిత్రక కావ్యంగా రాణిస్తుంది".[1]

చారిత్రక కావ్యాన్ని గేయంలో రచిస్తే, దానిని చారిత్రక గేయ కావ్యంగా వ్యవహరిస్తున్నారు. 1934లో కడప జిల్లా ప్రొద్దుటూరులో కావ్య కళానిధి దుర్భాక రాజశేఖర శతావధానిగారు "రాణా ప్రతాపసింహ" అనే చారిత్రక కావ్యాన్ని సంప్రదాయ రీతిలో రచించారు. 1943లో కవిసింహ శ్రీ గడియారము వెంకట శేషశాస్త్రిగారు రచించిన "శివ భారతం" కూడా సంప్రదాయ కావ్యమే. మొట్టమొదటగా సమగ్రమైన చారిత్రక గేయకథా కావ్యాన్ని ఆధునికాంధ్ర సాహిత్యంలో, రచించినఖ్యాతి డా॥ సి.నారాయణ రెడ్డి గారికి చెందుతుంది. శ్రీ తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి, శ్రీ విశ్వనాధ సత్యనారాయణ, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు మొదలైనవారు గేయకావ్యాలు వ్రాసినా, వాటిలో కథావస్తువునకు ప్రాధాన్యం తక్కువ.

---

1 ఆచార్య తూమాటి దోణప్ప, (ముదిగొండ వీరభద్రమూర్తి గారి "స్వాతంత్ర్యమ చరిత్ర" కు వ్రాసిన ప్రశంసి వచనం నుండి)

"భావకవితలు మాని
భారతీయ ప్రజకు
స్వాతంత్ర్య రణభూమి
సారథివి కావోయ్"[1]

అని దేశభక్తిగల విశాలాక్షిగారు భావగీతాలకు స్వస్తి చెప్పవలసిందిగా కోరారు.

అభ్యుదయ కవితాయుగ ప్రవక్తగా భావించబడే శ్రీశ్రీ గేయ రచనలో క్రొత్తపోకడలు పోయారు. 'ఆకాశపు దారులంట, హడావుడిగ వెళ్ళిపోయె జగన్నాథ రథచక్రాలను. భూమార్గం పట్టించి, భూకంపం పుట్టించడానికి' శ్రీశ్రీకి గేయమే సాహిత్యాయుధం.

"బండెడు చెత్తను ఛంద
శ్ఛండముగా పోగుచేసి స్వారస్యము చూ
డండని కోతలు కోస్తే
చెండాడెద నట్టివారి సిరి సిరి మువ్వా"[2]

అని చెప్పి, సాంఘిక ప్రయోజనం, స్వారస్యం లేని వ్యర్థకావ్యాలను నిరసించారు. 'పద్యానికి గద్యానికి పెళ్ళిచేసి' నవీన రీతిలో పద్య గేయ, వచన గేయం సృష్టించాలని ఉబలాటపడ్డారు.

"ఛందస్సుల చండశాసనానికి కూడా కాలం వెళ్ళిపోయింది. కవి హృదయంలోని రాగాలాపన ఎట్టితీగలుగా సాగితే అదే గీతానికి ఆకారంగా నిర్ణయించాలి. లయగ్రాహిలో వసంతవర్ణన, మహాస్రగ్ధరలో యుద్ధగీతం ఒకప్పుడు బాగానే నడిచాయి. నవకవికి అనుకరణ అసహ్యం. క్రొత్త శక్తులు క్రొత్తరూపంలో సాక్షాత్కరించాలి"[3]

ఛందోబద్ధమైన బందోబస్తుల్ని ఛట్ ఛట్ మని త్రెంచి, 'వ్యాకరణాల సంకెళ్ళు విడిచి, ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి' గేయం ఎన్నుకొన్నాడు శ్రీశ్రీ

---

1 వట్టికొండ విశాలాక్షి, అభ్యుదయగీతాలు. పుట-5

2 శ్రీశ్రీ, మూడు యాభైలు, పుట-12

3 శ్రీశ్రీ (పట్టాభి ఫిడేలు రాగాల డజన్‌కు వ్రాసిన 'ఇంట్రో' నుండి పుట-11

"నా ఈ వచన పద్యాలనే దుడ్డు కర్రతో
పద్యాల నడుముల్ విరుగదంతాను"[1]

అని పట్టాభి పద్యకవిత్వంపై ధ్వజమెత్తాడు. మరీ అంత పరుషంగా కాకుండా, పద్యాన్ని మన్నిస్తూనే గేయ ప్రాముఖ్యము వివరించిన వారు కుందుర్తి.

"నియమబద్ధమై నన్నయాదుల చేత తీర్చిదిద్దబడిన పద్యం మాకు తల్లి. దానిని కించపరచాలనే ఉద్దేశ్యం లేదు. పద్యరచయితలొక వేళ గేయాన్ని తూలనాడినా - ఒకవేళ ఎందుకు? తూలనాడటం తథ్యం - మేము పద్యాన్ని ఏమనేది లేదు. కాని తెనుగు కవిత్వానికి పద్యమే, వృత్తమే తుది స్వరూపమని మాత్రం అంగీకరించం ...."[2] అని శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారు స్పష్టంచేశారు.

"నా గేయం మీ కవచం
మీ ఖడ్గం నా గేయం
కుబుసం వదలిన సర్పం
నా గీతం పులిపంజా"[3]

అని పురిపండా అప్పలస్వామిగారు 'ఎర్రనినల్లని పాటలతో, పచ్చని వెచ్చని గీతాలతో' తన గేయరచన స్వరూపాన్ని తెలియజేశారు.

బెల్లంకొండ రామదాసుగారు "నాగీతం"అనే గేయంలో తనగీతం "గతలోకాన్ని కాల్చి,నవలోకాన్ని చూపిస్తుందని"తెలియజేశారు. శ్రీరంగం నారాయణబాబు, 'బ్రతుకే మరచి, బంబరములట్లు తిరుగు భావకవుల పాటలు' విని మోసపోవద్దని హెచ్చరించి, సాంఘిక చైతన్య ప్రధానంగా అభ్యుదయ గేయ రచన సాగించారు.

అభ్యుదయ గేయాల్లో 'సంస్కృతి చరిత్ర' ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. సామాజిక పరిస్థితులు నిజస్వరూపంతో దర్శనమిస్తాయి.

---

1 పట్టాభి, ఫిడేలు రాగాల డజన్, పుట-1

2 కుందుర్తి ఆంజనేయులు, యుగే యుగే, పాఠకుల్తో పదినిముషాలు

3 శ్రీశ్రీ యుగం (సంకలనంలో-పురిపండా అప్పలస్వామి) పుట-47

నా కీర్తిని రాకాచంద్రజ్యోత్స్నల
- బంతిలోన
సరిగద్దియ నిల్పెడు కాంక్షాలేశము
లేదు నాకు

..........................................

నా చుట్టు భ్రమించెడు అంధ
కారమును వెల్గించగ
బ్రతుకు కర్పూరమువలె అర్పణము
సేయుట ప్రియము నాకు"[1]

అని తన ఆశయాలను వెల్లడించిన మహాకవి.

"మమత నా తల్లి
సౌహార్దం నా తండ్రి
అనాది నా జననం
అనంతం నా పయనం
విశ్వం నా ఊరు
శాంతి నా పేరు"[2] అని

మానవతా వాదాన్ని గానం చేసిన సౌజన్యమూర్తి.
నారాయణ రెడ్డి కవిత శబ్దార్థ సౌందర్యాల సమ్మేళనంతో సాక్షాత్కరిస్తుంది.

"ప్రతి అక్షరాన్ని, ప్రతి శబ్దాన్ని ఆచితూచి పొంకంగాను, బింకం గాను పలుకుతూ, ఒయ్యారం ఒలికిస్తూ, శ్రావ్యంగా ప్రత్యేక భక్కితో కవితాగానం చేస్తూ వేలాది శ్రోతలను ముగ్ధుల్ని చేసి వేయడంలో రెడ్డి గారిది అందెవేసిన చేయి[3] అవడంలో అతిశయోక్తి లేదు.

---

[1] డాక్టర్ సి. నారాయణ రెడ్డి, దివ్వెల మువ్వలు, పుట-45,46

[2] డాక్టర్ సి. నారాయణ రెడ్డి, తేజస్సు -నా తపస్సు, పుట-12

[3] వేమూరి రాధాకృష్ణమూర్తి, ఆణిముత్యాలు, పుట-236

నారాయణరెడ్డి గారు కరీంనగర్ జిల్లా, సిరిసిల్లా తాలూకాలోని హనుమాజీపేట గ్రామంలో పుణ్యదంపతులు బుచ్చమ్మ, మల్లారెడ్డి దంపతుల తపః ఫలంగా 1931 జులై 29 తేదిన జన్మించారు.

నారాయణరెడ్డి గారికి తల్లిదండ్రులు మొదట పెట్టిన పేరు సత్యనారాయణరెడ్డి. ప్రాథమిక పాఠశాల విద్యను హనుమాజీపేటలోను, మాధ్యమిక పాఠశాల విద్యను సిరిసిల్లాలోను, ఉన్నత పాఠశాల విద్యను కరీంనగర్‌లోను పూర్తి చేశారు. చిన్నతనంలో తమ గ్రామ సమీపంలో ఉన్న వేములవాడ వెళ్లి భక్తుల గానాలు, జంగం కథలు, హరికథలు విని తాదాత్మ్యం చెందేవారు. వేములవాడ వాస్తవ్యులు శ్రీ చౌది నరసయ్యగారి హరికథాగానం నారాయణరెడ్డికి గేయఛందస్సుపట్ల మక్కువ, అభిరుచీ కలుగడానికి ప్రేరకమైంది. ఉన్నత పాఠశాల విద్యార్థిగా ఉన్నపుడు కరీంనగర్‌లో శేషాద్రి రమణ కవుల్లో ఒకరైన శ్రీ దూపాటి వేంకటరమణాచార్యులుగారు రెడ్డిగారికి చందో విశేషాలను బోధించారు. అమాయక హృదయాలనుండి పొంగివచ్చే కవితా సంపదను పుక్కిటబట్టిన తెలంగాణా జానపదగీతాల ప్రభావం రెడ్డిగారిపై బలీయంగా వుంది. ఆ ప్రభావంతోనే

"వెన్నవంటి మనసున్న వానికి
అన్నమే మెు కరువాయె
ఉన్నవానికింతన్న విడుదా
మన్న గుండె లేదాయె"[1] వంటి

పాటలు పదో తరగతిలో వ్రాసినారు. విద్యార్థి దశలోనే గేయాలు, పద్యాలు నాటికలు వ్రాసిన బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఎం. ఏ. విద్యార్థిగా హైద్రాబాదు చేరిన తొలిరోజుల్లో మహాకవి డా॥ దాశరథిగారి సాహచర్యం లభించింది. బంగారానికి తావి అబ్బినట్లయింది. శ్రీ దాశరథి నారాయణరెడ్డి గారికి అన్నివిధాలా చేదోడు వాదోడుగా నిలిచారు. అందుకే రెడ్డిగారు

---

1. డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య, నారాయణరెడ్డి సాహితీమూర్తి, పుట377

"నాతరుణ కావ్యలతికలానాడు పైకి
ప్రాకలేక దిక్కులుసూడ, నీ కరాలు
సాచిలేత రేకులకు కెంజాయలద్ది
మించు పందిళ్లపైకి ప్రాకించినావు.

"కలకాలమ్మును నీవునేనిటులె స్నిగ్ధస్నేహబంధాల బ
ద్ధులమైయుందము. ఏకగీతి నిరు గొంతుల్‌విప్పి విన్పింత మాం
ధ్రుల చైతన్య విపంచికావళులు విద్యున్నాదముల్ సేయగా
జలపాతమ్ములవోలె దూకుదము విశ్వశ్రీహితీ శృంగముల్"

అని కృతజ్ఞతతెల్పి తన అభిలాషను వ్యక్తంచేశారు. తాను రచించిన 'జలపాతం' ఖండకావ్య సంపుటిని దాశరధిగారికి అంకిత మిచ్చారు. విద్యార్థిగా వున్నపుడే నైజాం రాష్ట్రానికి స్వాతంత్ర్యం రావాలని జరిపిన సత్యాగ్రహంలో పాల్గొని, పోలీసుల లాఠీ చర్యలకు గురి అయినారు. ఇదంతా దాశరధి, కాళోజీ, ఆళ్వారుస్వాముల వంటి చైతన్య రసమూర్తుల ప్రభావమే. అందుకే నారాయణరెడ్డి గారి వ్యక్తిత్వాన్ని, సాహిత్యాన్ని వివరిస్తూ బెజవాడ గోపాలరెడ్డి గారు "నారాయణరెడ్డి గారు తెలంగాణా నూతన జాగృతికి వైతాళికులలో ఒకరు. తెలుగుకు ఆదరణా, పోషణాలేని నైజాం రాజ్యంలో పుట్టి తమ నూతన రీతులలో, కల్పనలతో, శబ్ద చమత్కారములతో ఆంధ్రుల చకితమొనరించిరి" అని కొనియాడారు.

1954 లో ఎం.ఏ. పూర్తిచేసిన తరువాత సికింద్రాబాద్ ఆర్ట్స్ సైన్సు కళాశాలలో 1954-55 లో కొంతకాలం పార్టుటైం లెక్చరర్‌గా పనిచేసి, 1955 నుండి అదే కళాశాలలో లెక్చరర్‌గా నియమితులయ్యారు. 1958-59లో నిజాం కళాశాలలో పనిచేశారు. 1957 నుండి 1962 వరకు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారి పర్యవేక్షణలో ఆధునికాంధ్ర కవిత్వము అనే అంశంపై పరిశోధన సాగించి 1962 లో పి. హెచ్. డి పట్టాను పొందారు. 1963 లో ఉస్మానియా విశ్వవిద్యాలయములో 'రీడర్'గా చేరి, 1976 లో ఆచార్యులైనారు. 1981 లో మన రాష్ట్రప్రభుత్వం వారిని అధికార భాషా సంఘం అధ్యక్షులుగా నియమించింది.

పత్రికా సంపాదకునిగా, తెలంగాణా రచయితల సంఘానికి కార్యదర్శిగా పనిచేశారు. రెడ్డిగారి కవితాగానం, వ్యాఖ్యానాలు, ఉపన్యాసాలు వినడానికి శ్రోతలు ఉవ్విళ్లూరుతుంటారు. అందుకే ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు రెడ్డిగారిని "కవితా ప్రతిభా హృద్య పద్య గేయ పరనోపన్యాస కౌశలాది గుణములొక్కచో గుమిగూడిన అపూర్వ వ్యక్తి"అని ప్రశంసించారు. బహుభాషా కోవిదులూ, సాహితీ సమితి స్థాపకులూ అయిన శ్రీ తల్లావజ్ఝల శివశంకర స్వామిగారు "ఉపన్యాసము వినసొంపుగ నుండును. స్పష్టమైన వాక్కు. సుశబ్దప్రయోగం, ఉత్తమ భావుకత, ఒకేరకమైనమాధుర్యం ఉపన్యాసములో ఉద్దీప్తినొందుచుండును. నారాయణరెడ్డి ఉత్తమ వక్త ఉత్తమగీతికా రచయిత" [1] అంటూ రెడ్డిగారిని గౌరవించారు. అంతటి సమర్థుడు కనుకనే తెలుగువాణిని ఎన్నెన్నో దేశాల్లో వినుపింప గలిగారు. మలేషియా, రష్యా, అమెరికా, కెనడా, బ్రిటన్, ఫ్రాన్స్ వంటి దేశాల్లో తెలుగు భాషా సాహిత్య విశేషాలు, ద్రావిడ భాషా కుటుంబ స్వరూపం, తెలుగు పద్య ప్రాధాన్యం, గేయ వైవిధ్యం, అష్టావధాన నాట్యావధానాలు, సినిమా సాహిత్యం, శివతాండవం, కూచిపూడి వంటి నాట్య విశేషాలను మరెన్నో విషయాలను ప్రవాసాంధ్రులకు, విదేశీయులకు తెలుగు సాహిత్యంపట్ల ఆసక్తి కలిగేలా ఉపన్యసించారు.

> "నీవు సుకవి జాతికెల్ల నిండు గర్వకారణము
> నీసాహితీ తెలుగమ్మకు నిచ్చవచ్చు తోరణము
> నీ లేఖిని ధౌష్ట్యముతో నిత్యము సేయును రణము" [2]

అనిన డాక్టర్ వానమామలై వరదాచార్యులుగారి అభినందన సార్థకమైంది. నారాయణరెడ్డిగారి నిరాడంబర జీవితం, విశిష్టమైన వ్యక్తిత్వం సాహితీమూర్తుల నెందరినో ఆకర్షించింది.

నారాయణరెడ్డిగారి బహుముఖ ప్రజ్ఞాశాలితనూ, సాధించిన విజయాలను, సాహిత్యపు తీరుతెన్నులనూ పరిశీలించిన డాక్టర్

---

1. తిరుమల శ్రీనివాసాచార్య - నారాయణరెడ్డి సాహితీమూర్తి - పుట. 43,
2. అందే - పుట - 53

జి. వి. సుబ్రహ్మణ్యం గారు "సమకాలీనుల్లో శ్రీనాథుడు డాక్టర్ సి. నారాయణరెడ్డి" అని అభిప్రాయపడ్డారు. నారాయణరెడ్డిగారు పాత జగత్తు అంతరించి కొత్త జగత్తు తలయెత్తాలనీ, ప్రతిహృదయం కర్పూరంలా వెలగాలనీ, ప్రతి నేత్రం మందారంలా విచ్చాలనీ, కక్షలు పెరిగిన తావుల కారుణ్యం కనువిప్పాలని, బర్బరత్వ మంతరించి మానవత్వం జయించాలనీ మహాకాంక్షించే నవకవి"[1] ఈ నవకవిని 'కీర్తి త్రిమూర్తి'గ అభినర్ణిస్తూ జె. బాపురెడ్డిగారు "డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు పుట్టగనే పరిమళించిన పూవు. ఆధునిక తెలుగు సాహిత్యంలో వెన్నెల వాడలు, కర్పూర వసంతాలు, నాగార్జున సాగరాలు సృష్టించి, భావవిప్లవ విశ్వనాథుడై, ప్రగతి ఋతు చక్రధారియై రాగరహన విశ్వంబరకు తన రస హృదయాన్ని భూమికచేసిన కీర్తిత్రిమూర్తి ఆయన. పద్మశ్రీ, కళాప్రపూర్ణాది బిరుదులందుకున్న ఆయన సాహిత్య సరస్వతి ప్రజ్ఞాన పీఠంమీద నోబెల్ శోభావతియై అనంతానందనాడి మోషవతియై విరాజిల్లాలని ఆశిస్తున్నాను." [2] వీరు ప్రస్తుతం సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష స్థానాన్ని అలంకరించి, నూతన పద్ధతుల్ని ప్రవేశ పెట్టడం విశేషం.

నారాయణరెడ్డి సాహిత్య వ్యక్తిత్వాలను గురించి రసజ్ఞులైనసాహిత్య మర్మజ్ఞులు చేసిన కొన్ని అభిప్రాయాలు అమూల్యమైనవి

"నారాయణరెడ్డి శృంగార కరుణరసాల పోహళింపుతో తన కవితా రచన ప్రారంభించారు. వీటికి మాధ్యమంగా మాత్రాచందస్సు అతనికి అద్భుతంగా తోడ్పడింది. గేయరచన వందల యేండ్లుగా తెలుగుదేశంలో ఉన్నా, గేయప్రబంధాలు వ్రాసినవాడు నారాయణరెడ్డి ఒక్కడే అని చెప్పవచ్చు." అంటూ డాక్టర్ దాశరథిగారు నారాయణరెడ్డి సాహిత్య స్వరూపాన్ని ఆవిష్కరించారు.

నారాయణరెడ్డి సాహితీమూర్తిని విభిన్న కోణాల్లో డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య యిలా పరిశీలించారు.

---

1. వేమూరి రాధాకృష్ణమూర్తి, అణిముత్యాలు, పుట. 231.
2. రావూరు వెంకట సత్యనారాయణ – వెన్నెల తెరచాప– నారాయణరెడ్డి – పీఠిక.

"నారాయణరెడ్డి మహాకవి. అగ్రశ్రేణికి చెందిన సాహిత్యాచార్యుడు కవిత్వంలోనూ, జీవితంలోనూ మానవతనూ, చైతన్యాన్నీ, రసహృదయాన్నీ పండించుకున్న సాహితీమూర్తి. అనుక్షణం ఔచిత్యానికి ప్రాణం పోసే సమయస్ఫూర్తి. ఆధునికాంధ్ర సాహిత్యలోకంలో విభిన్నాంశాలకు సమన్వయం సాధించే సహృదయ విమర్శకుడు. శ్రావ్యగళంతో మన చెవులనూ, ఉదాత్తభావాలతో మనలోని కవులనూ, ఏకకాలంలో ఉయ్యాలలూపుతూనే ఉద్దీప్తంచేసే శబ్దరసధ్వని మర్మజ్ఞుడు."

కవిగా, విమర్శకునిగా నారాయణరెడ్డిగారి స్థానాన్ని ఇరివెంట కృష్ణమూర్తిగారు—

"ఆధునికాంధ్ర సాహిత్యంలో మాత్రాఛందస్సులో సమగ్ర కావ్య రచనా నిర్మాణాన్ని చేపట్టి కృతకృత్యులైనారు శ్రీ రెడ్డిగారు. శ్రవణ సుభగమైన శబ్దప్రయోగానికి, రమణీయమూ, గంభీరమూ అయిన అర్థస్ఫూర్తికి రాణాచి కాగలిగిన కవితా రచన చేసినవారు వెయ్యేళ్ళ తెలుగు కవితలోనే అరుదు. శ్రీ రెడ్డిగారు కావ్యరచనతోపాటు సహృదయ విమర్శనా పద్ధతిని అలవరచుకోవడంచేత ఆయన రచనలలో సంయమం, స్పష్టత చోటుచేసికొన్నది."

"డాక్టర్ సి. నారాయణరెడ్డిగారి కవితా ప్రస్థానం అవిరళంగా కొనసాగాలి. కవితా రంగంలో ఇంకా సమున్నత శిఖరాలను ఆయన అధిరోహించాలి. జాగ్రన్మహాగ్నిగా ఆయన హృదయంలో కవిత్వజ్వాల నాలుకలు జాపుతూ వుండాలి........ ఒక మహాకావ్య నిర్మాణంచేసి భారతీయ జ్ఞానపీఠ బహుమానం పొందాలి."[1] అనే డాక్టర్ అమరేంద్రగారి శుభాకాంక్ష తెలుగు ప్రజల చిరకాల వాంఛ.

---

1. డాక్టర్ అమరేంద్ర - నవోదయలహరి - పుట. 141.

# నాగార్జున సాగరం : (చారిత్రక గేయకావ్యం)

డా॥ సి. నారాయణరెడ్డి గారి మొట్టమొదటి చారిత్రక గేయకావ్యం "నాగార్జున సాగరం". హైదరాబాదులోని తెలంగాణా రచయితల సంఘం వారు యీ గేయకావ్యాన్ని 1955 లో ప్రచురించారు. "కావ్య రచనకు పూర్వం కథాకల్పనలో విలువైన సలహాలిచ్చినారు మిత్రులు శ్రీ డి. రామలింగం. కావ్యం ఆమూలాగ్రం విని అక్కడక్కడ చక్కని సూచనలు చేసినారు సుహృన్మణులు దాశరథిగారు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారు. వీరికి నాహార్దిక కృతజ్ఞతలు"[1] అని తమ కావ్యపీఠికలో వివరించారు నారాయణరెడ్డిగారు. ఈ కావ్యానికి శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు విపులమైన పీఠికలు సమకూర్చారు.

నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి పూర్వమే యీ కావ్యాన్ని రచించి, భవిష్యత్తును చూడగల కవిశక్తిని ప్రకటించారు రెడ్డిగారు. సాగరాన్ని సాక్షాత్కరించుకున్న తెలుగు ప్రజలకు "నాగార్జున సాగరాన్ని" అంకితం చేయడం నారాయణరెడ్డిగారి సమయోచిత దృష్టికి నిదర్శనం. డా॥ కోవెల సుప్రసన్నాచార్యగారు యీ కావ్యాన్ని సమీక్షిస్తూ, "కథా కావ్యరచనకు పూనుకోవడంలో భావకవితా యుగం నాటినుంచీ నిరాదృశమైన కావ్య ప్రక్రియ మళ్ళీ ఆదరింపబడ్డదనే చెప్పవలె. .... ఆధునిక కవితోద్యమంలో ఒక భాగంగా కావ్యరచన నారాయణరెడ్డి చేపట్టడంతో ప్రారంభమైనదిగా పేర్కొనవచ్చు"[2] దీనిని బట్టి, అధునిక సాహిత్య చరిత్రలో సమగ్రమైన చారిత్రక గేయకావ్య రచన నారాయణరెడ్డిగారితోనే ప్రారంభమైనదనిచెప్పవచ్చును.

## ఇతివృత్త పరిశీలనం:-

నారాయణరెడ్డిగారు "నాగార్జున సాగరం" కావ్యాన్ని ఐదు తరంగాలుగా విభజించి, తమ చమత్కృతిని చాటుకున్నారు. కావ్యంలోని కథ, పాత్రలు కల్పితాలు. చారిత్రక నేపథ్యంతో కథాంశాన్ని జోడించి యీ

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జునసాగరం, పీఠిక - పుట. 14
2, డా॥ కోవెల సుప్రసన్నాచార్య, సాహిత్యవివేచన, పుట. 61-62.

కావ్యాన్ని "మధురభావనామయ చారిత్రక గేయకావ్యం" గా రూపొందించారు. మతానికీ, ప్రేమకూ మధ్య సంభవించిన సంఘర్షణ యిందలి ప్రధాన వస్తువు. పద్మదేవుడు, శాంతిశ్రీ, మతాచార్యుడు, సుజాత యిందలి పాత్రలు నాగార్జునకొండ, కృష్ణానదీ పరిసర ప్రాంతాలలో యీ కథ జరిగినట్లు వ్రాయబడింది

## ప్రథమ తరంగం:—

ఇక్ష్వాకుల పాలనా కాలంలో నాగార్జునకొండ సింహళంనుండి వచ్చిన బౌద్ధభిక్షువులకు నిలయమై, విజ్ఞాన పీఠంగా విలసిల్లిన రోజులవి. సిద్ధార్థుని సిద్ధాంతాలు శాఖోపశాఖలై విస్తరించిన సమయం. ఆ సమయాన్ని సమీక్షించి, ఆకాలంలో తాను జీవించి ఉన్నట్లు వూహించుకొని, డా॥ సి. నారాయణరెడ్డిగారు, "మనోదృష్టిని చరిత్ర పుటలపైకి మళ్ళించి", యీ కావ్యాన్ని రచించారు. శ్రీ పర్వతంపై గల బౌద్ధసంఘారామంలో శిల్ప నిర్మాణం జరుగుతున్నది. పద్మదేవుడనే యువశిల్పి నాగార్జునకొండను "ఒక అజంతా కందరముగా, ఒక ఎల్లోరా మందిరముగా"[1] తీర్చి దిద్దుతున్నాడు. ఒకనాటి సంధ్యా సమయాన పద్మదేవుడు యశోధరా గౌతముల ప్రణయ సన్నివేశాన్ని అత్యంత మనోజ్ఞ సుందరంగా చిత్రిస్తున్నాడు. ఆసమయంలో "శాంతిశ్రీ" అనే తరుణ విద్యార్థిని శిల్ప సందర్శనార్థమై కళానిలయానికి "నవమల్లిక" వలె కదలి వచ్చింది. చిత్రలేఖనంలో నిమగ్నమైన పద్మదేవుడు శాంతిశ్రీని చూడలేదు. చిత్ర సందర్శనంలో లీనమైన శాంతిశ్రీ పద్మదేవుని పిలువనేలేదు. గాలిదేవర చిలిపితనంవల్ల, శాంతిశ్రీ చేలాంచలము అలలవలె లేచి పద్మదేవుని స్పృశించింది. "దోరవెన్నెల" వంటి ఆమె రూపాన్ని చూచినంతనే, అతని చేతిలోని కుంచె అప్రయత్నంగా జారిపోయింది. విభ్రాంతి నుండి తేరుకున్న పద్మదేవుడు "మీరెవరో" అని మెల్లగా ప్రశ్నించినపుడు, ఆమె చిత్రార్పితమగు తన్మయతనుండి తేరుకొని "శాంతిశ్రీ" అని సమాధానమిచ్చింది. "నాగార్జున విశ్వవిద్యాలయంలో బౌద్ధమత సిద్ధాంతాలను అధ్యయనం చేస్తున్న విద్యార్థినిని" అనివివరించింది. శాంతిశ్రీ పద్మదేవులు పరస్పర ప్రణయ భావ తరంగితులు కావడంతో ప్రథమ తరంగం ముగిసింది

---

1. డా॥. సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పుట. – 11.

## ద్వితీయ తరంగం:-

మరుసటి రోజుకూడా శాంతిశ్రీ పద్మదేవుని కళామందిరంలో ప్రవేశించింది. గతరాత్రి పద్మదేవుడు చిత్రించిన తన వర్ణచిత్రాన్ని చూచి ఆశ్చర్యపోయింది. గడచిన రాత్రి కంటిపై కునుకురాక, రెప్పలార్చక మేల్కొని, శాంతిశ్రీ చిత్రాన్ని రూపొందించిన పద్మదేవుడు కళ్ళు విప్ప గనే కనుపించిన శాంతిశ్రీని చూచి విస్మితుడైనాడు. "బుద్ధదేవుని జాతక కథలను చిత్రించే మీకు నావంటి క్షుద్రజీవుల చిత్రణం తగదు" అని శాంతిశ్రీ హితవు చెబుతుంది. సమాధానంగా పద్మదేవుడు,

"సౌందర్యమె మాదు కళా
మందిర మూల స్తంభము
సౌందర్యాన్వేషణలో
స్వప్నమధుర పరిరంభము
హృదయ కంపనలలోనే
ఉదయించును చిత్రమ్ములు
మధుర కల్పనలలోనే
మలచబడును శిల్పమ్ములు" [1] అని

కళాకారుని మనస్తత్వాన్ని వివరించినాడు.

"నిన్నటె మిమ్ము హఠాత్తుగ
నీరదశూన్య తటిత్తుగ
విలోకించినంతలోనె
పులకరించె నాయెడంద
ఆస్పందనమే చిత్ర
మ్మై నిల్చెను భిత్తికపై
ఆకంపనమే సజీవ
మై మొల్చెను భిత్తికపై" [2] అని,

1. డా॥ సి.నా.రె., నాగార్జున సాగరం, పుట-39.
2. డా॥ సి.నా.రె., నాగార్జున సాగరం, పుట-40.

శాంతిశ్రీపై తొలి చూపులోనే తనకు యేర్పడిన ప్రేమానురాగాలను ప్రకటించాడు. శాంతిశ్రీ తన హృదయంలో రగిలించిన సంచలనాన్ని స్పష్టం చేశాడు. ఒకరి మనస్సును మరొకరు గ్రహించి, అంతమైన ఊహలను అల్లుకుంటూ కొద్ది క్షణాలు మైమరచిపోయారు. పద్మదేవుడు కానుకగా అందించిన తన వర్ణచిత్రాన్ని హృదయానికి హత్తుకొని, శాంతిశ్రీ కళా సదనం నుండి కదలిపోవడంతో ద్వితీయ తరంగం పరిసమాప్తమౌతుంది.

## తృతీయ తరంగం:—

విశ్వవిద్యాలయంలోని బోధనామందిరంలో సహాధ్యాయినుల సరసన కూర్చున్నప్పటికి శాంతిశ్రీ మనస్సు ఆమె స్వాధీనంలో లేదు. పద్మదేవుని తలపులతో ఆమె హృదయం ప్రణయ భావాలకు నిలయమై పోయింది. గురుదేవుడు వివరించే ధర్మ ప్రవచనాలు ఆమె చెవిసోకడం లేదు. అదేసమయాన, కృష్ణానదీ తరంగాలపై తేలి ఆడి వస్తున్న పద్మ దేవుని వేణునాదం ఆమెను బాహ్య ప్రపంచానికి దూరం చేసింది. పద్మ దేవుని సుందర రూపం ఆమె మనోనయనాలకు సాక్షాత్కరిస్తున్నది. ఉపన్యాసం ముగియగానే, మఠాచార్యుడు తనను పరిశీలిస్తున్న విష యాన్ని కూడా పట్టించుకోకుండా, కృష్ణాతీరానికి పరుగులు తీసింది. పద్మ దేవుని గమనించినంతనే, ఆమెహృదయంలో శతకోటి పద్మాలు పుష్పించాయి. అతడు గానం చేస్తుంటే, ఆమె మయూరివలె నాట్యమాడింది. ప్రేమికులిరువురూ అలలవలె, కలలవలె, కళలవలె బాహ్య ప్రపంచానికి దూరంగా సుదూర సుందర తీరాల్లో విహరించారు. అమలినమైన వారి మానసిక ప్రేమ ప్రపంచానికి అవధులు లేవు. పారవశ్యంతో తన తలను పద్మదేవుని హృదయంపై చేర్చిన శాంతిశ్రీ తెలివి తెచ్చుకొని తొట్రుపాటుతో. సంతప్తయై ఆరామానికి వెళ్ళి పోతుంది. పద్మదేవుడు ప్రేమ భారంతో నిట్టూరుస్తూ, తన కళానిలయానికి వెళ్ళడంతో 'తృతీయ తరంగం ముగించబడింది.

## చతుర్థ తరంగం:—

శాంతిశ్రీ తనస్నేహితురాలయిన సుజాతతో కలిసి, "సంఫుల్ల కుసుమాపచయ నిమిత్తమై కృష్ణానదీ పరిసరోద్యాన సీమలకు" వాహ్య

శిగా బయలు దేరింది. పద్మదేవునితో తాను స్నేహంగా మసలుకోవటాన్ని బౌద్ధభిక్షువులు అపవిత్రంగా భావిస్తున్నారని సుజాతవలన విని శాంతిశ్రీ కలవరపడుతుంది. అమలినమైన తన ప్రణయాన్ని, సంఘారామానికే కళంకంగా అనుకుంటున్నారని విని ఆవేదన చెందుతుంది. అప్పుడే వస్తున్న పద్మదేవుని రాకను గమనించి సుజాత వెళ్ళిపోగా, అతడు శాంతిశ్రీ దుఃఖాన్ని చూచి చలించిపోయాడు. కన్నీటికి కారణాన్ని తెలుసుకొని, బౌద్ధభిక్షుల దయారహిత ప్రవర్తనను దూషించి, శాంతిశ్రీని ఓదార్చాడు. కాని, శాంతిశ్రీ లోకం తనను పతితగా భావిస్తున్నదనే విషయాన్ని భరించలేక భయకంపితురాలౌతుంది. బౌద్ధమతం పట్ల ఆమెకుగల గాఢాభిమానం ముందు పద్మదేవుని అనునయ వచనాలు వ్యర్థమైనాయి.

> "నీవు సుఖమ్మనెడు ఎండ
> మావికొరకు అర్రుసాచి
> తిరిగితివా తుదకు దుఃఖ
> పరితప్తుడవగుట నిజము
> ఎల్ల జీవకోటులపై
> చల్లుము ప్రేమామృతమ్ము
> ప్రత్యేక ప్రాణిపైన
> పనికిరాదు మమత్వమ్ము
> విలాసజీవన పిపాస
> విసర్జనీయమ్ము సదా
> చిత్త చలత నిర్వాణ
> శ్రీ నాశన కారిగదా!" [1] అను గురుదేవుని సూక్తులు

శాంతిశ్రీ శ్రవణకుహరాల్లో ప్రతిధ్వనించాయి. పద్మదేవుడు తన యెదుట వున్న విషయాన్ని కూడా విస్మరించి రోదిస్తూ సంఘారామం వైపు పరుగులు తీసింది. ఆమె మతావేశానికి పద్మదేవుడు నిశ్చేష్టుడయినాడు. ఆవేదనతో ఆయువశిల్పి తన కళామందిరానికి కదలిపోవడంతో చతుర్థ తరంగం ముగిసింది.

పంచమ తరంగం.—

గౌతమ బుద్ధుడు జన్మించిన "వైశాఖ శుద్ధ పూర్ణిమ" రోజును పర్వదినంగా భావించే బౌద్ధభిక్షువులు శ్రీ పర్వతంపై వేడుకలు ప్రారంభించారు. బుద్ధ జయంతి సంరంభం శాంతిశ్రీ హృదయంలో మతావేశాన్ని ప్రజ్వలింపచేసింది. యువశిల్పి పద్మదేవుడు గుర్తురాగా ఆమె హృదయం విలవిల లాడింది. ప్రత్యేకించి యేర్పాటు చేయబడిన సమావేశంలో, మతాచార్యుడు "శాంతిశ్రీని" చూస్తూ,

> "మీలోపల నెవ్వరైన
> కాలుజారి అడుసులోన
> దిగినచో వచించు డిట్టి
> దినమున దీక్షగై కొనుడు" 1

తీవ్రంగా పలుకగానే శాంతిశ్రీ కలత చెందింది.

జీవిస్తే, సంఘం తనను పతితగా భావించి, నీచంగా చిత్రిస్తుందనే భయాందోళనలతో, గురుదేవుని ప్రార్థించి శాశ్వత బ్రహ్మచర్య దీక్షను స్వీకరించింది. అదే సమయాన శాంతిశ్రీ కోసం వచ్చిన పద్మదేవుని భిక్షువులు అడ్డగించారు. ఆచార్యుని మతదురహంకారాన్ని పద్మదేవుడు తీవ్రంగా విమర్శించాడు.

> "తరుణుల సన్యాసినులుగ
> పరివర్తన చేసి, మీరు
> సాధించెడు ఘనకార్యము,
> మేధ కందుటయే లేదు." 2 అని పద్మదేవుడు

మతమౌఢ్యాన్ని తీవ్రంగా తూలనాడాడు. ఆగ్రహించిన ఆచార్యుడు పద్మ దేవుని శ్రీపర్వత ప్రాంతంనుండి బహిష్కరించాడు.

---

1. డా॥. సి. నారాయణరెడ్డి, నాగార్జునసాగరం, పుట. 90
2. డా॥. సి. నారాయణరెడ్డి, నాగార్జునసాగరం, పుట 98.

మీ మతమునకై నాకళ
మీదుగట్టియుంటకన్న
మానవునిగ చేతు దీన
మానవ కోటుల సేవలు
కళా స్వరూపిణి శాంతిని
కనలేదను బాధ మాత్ర
మనవరతము నాదుగుండి
యను తొలచుచునే యుండును "[1] అని

పలుకుచూ, నిరాశతో వ్యధాభరిత హృదయంతో, భగ్న ప్రేమికుడై పద్మ దేవుడు సంఘారామాన్ని విడిచి, శ్రీ పర్వతానికి దూరంగా కనుమరుగై పోయాడు. పద్మదేవుని మనసారా తన జీవితంలోకి ఆహ్వానించాలని ప్రయత్నించిన శాంతిశ్రీ కోరిక, ఆచార్యుడు అడ్డగించడంవలన నెరవేర లేదు. కలత నిద్రపోయే "శాంతిశ్రీ"కి స్వప్నంలో తమ సంఘారామం వున్నచోటనే ఒక దివ్యనవ్యసాగరం కనుపించింది. ఆ నాగార్జునసాగర తరంగాలపై కళామూర్తి పద్మదేవుడు దీనమానవసేవకై కదలి పోతు న్నాడు. అతనిని చేరుకోవాలని శాంతిశ్రీ వడివడిగా నడిచింది. అతని ఉత్తరీయాన్ని అందుకోవాలని ప్రయత్నించింది.

"ఆమె ఉత్తరీయాంచల
మందుకొనెనా లేదా మది
పద్మదేవుడామెను
స్పర్శించినా లేదొమరి"[2] కలలో నైనా శాంతిశ్రీ

పద్మదేవుని చేరుకోవాలని చేసిన విఫల ప్రయత్నం నెరవేరాలని కవికోరిక.

"అది నిజముగ స్వప్నమేని
అటులె నిల్చి యుండు గాక!
శాంతిశ్రీ పద్మదేవ
సాన్నిధ్యము పొందుగాక!" అనే ఆకాంక్షతో

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జునసాగరం, పుట 103
2. అందే పుట 115

నారాయణరెడ్డిగారు పంచమ తరంగాన్ని పూర్తి చేశారు.

నారాయణరెడ్డి గారు కావ్యాన్ని ముగించిన తీరు పాఠకుల్లో ఉత్కంఠను కలిగించకమానదు. ముగింపును గూర్చి ఎన్నెన్నో ఆలోచనలు స్ఫురిస్తాయి. శాంతిశ్రీ పద్మదేవుని చేరుకొని, సుఖజీవనం చేస్తూ మానవసేవలో తరించాలనే సహృదయలోకం కోరుకుంటుంది. అయితే మతదీక్షను స్వీకరించిన బౌద్ధసన్యాసిని పద్మదేవునితో కలసి జీవించడం అసాధ్యమనే నగ్నసత్యాన్ని విజ్ఞులైనవారు గుర్తించకపోరు. ఈ సందిగ్ధస్థితిలోనే కవితా మర్మజ్ఞులైన రెడ్డిగారు కావ్యాన్ని కలతో ముగించారు. శాంతిశ్రీ పద్మదేవుల ప్రణయ జీవితం కలవలె కరిగి పోయింది. ఈ భగ్న ప్రేమికుల కన్నీటి గాథ పాఠకులకు కన్నీరు తెప్పిస్తుందనడం అత్యుక్తి కాబోదు. "కళారాధన", అందమైన కలలాంటి మధుర ప్రణయ భావాలు, "సాంఘిక నియమాలు", "భగ్న ప్రేమికుల కన్నీరు", మానవ సేవకు అంకితం కావాలనుకునే హృదయ సౌకుమార్యం" అనే సామగ్రిని సంకలనంచేసి నారాయణ రెడ్డిగారు "నాగార్జున సాగరం" నిర్మించారు.

# నాగార్జునసాగరం - చారిత్రకత

చరిత్రాంశాలకు భంగం కలగని రీతిలో, చారిత్రక సత్యాలతో, శాసనాలనూ, కావ్యాలనూ పరిశీలించి నారాయణరెడ్డిగారు "నాగార్జున సాగరం" గేయకావ్యాన్ని రచించారు.

"వస్తుబలం కావ్యశాశ్వతత్వ సాధకం అని గ్రహించినాడు నారాయణరెడ్డి. వస్తువు లభించక కేవలం అభ్యుదయ కవితా ధోరణులతో విసిగి కవులు బాధపడుతున్న ఆరోజుల్లో నారాయణరెడ్డి వస్తువుకోసం అన్వేషణ మారంభించినాడు. ఆంధ్రుల చరిత్ర పుటలను తిరుగవేసినాడు. అతని కళాచక్షువుల ముందు బౌద్ధశిల్పరామణీయకాన్ని తనలో రంగరించుకున్న నాగార్జునకొండ మెరిసింది."[1] అని డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య గారు యీ గేయకావ్యాన్ని చారిత్రక కావ్యంగా పరిగణించారు.

"బౌద్ధమత ప్రచారము ప్రపంచమందంతా జయశీలముగా సాగుచుండిన కాలమది. నాగార్జున గిరియందలి మహాచైత్యము శిల్పారామముగా నిర్మింపబడుచున్న నాళ్ళవి"[2] అని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు కథాకాలంనాటి చారిత్రక నేపథ్యాన్ని సూచించారు. శర్మగారు తమ "మంగళా శాసనము"లో యీకావ్యాన్ని "మధుర భావనామయకావ్యము" గా పేర్కొనడం గమనార్హం.

డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు యీ కావ్యానికి వ్రాసిన "ప్రస్తావన" లో "నారాయణరెడ్డిగారి కావ్యము తెనుగునందున్న ఉత్తమ చారిత్రక కావ్యములలో నొకటియని నిస్సందేహముగ జెప్పవచ్చును. ఈ విధముగ వారు చరిత్ర కొనర్చిన సేవ, పాశ్చాత్యదేశములందు షేక్స్పియర్ మొదలగు రచయితల మహాకావ్యములను జ్ఞప్తికి తెచ్చుచున్నది.

---

1. డా॥ తిరుమల శ్రీనివాసాచార్య, నారాయణరెడ్డి-
   సాహితీమూర్తి, పుట - 187
2. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పీఠికలో పుట - 1.

ఆనకట్టవలన నాగార్జునకొండ మునిగిపోవుచున్నదే అని విచారపడ నవసరములేదు. శ్రీ నారాయణరెడ్డిగారు నాగార్జునకొండకు ఒక శాశ్వత కీర్తికాయము సృష్టించియున్నారు." [1] అని వివరించారు. వీరి అభిప్రాయం ప్రకారం యీ కావ్యం నిస్సందేహంగా చారిత్రక గేయకావ్యం.

ఈ కావ్యంలోని కథాంశం, పాత్రలు కల్పితం. కాని కథాకాలంనాటి చారిత్రక సత్యాలను పొందుపరచి, చారిత్రక నేపథ్యంతో రెడ్డిగారు యీ కావ్యాన్ని రచించారు. పై అభిప్రాయాలను సమన్వయిస్తే యీకావ్యం చారిత్రక నేపథ్యంగల మధుర భావనామయ కావ్యమని స్పష్టమౌతుంది.

ఇక్ష్వాకులు ఆంధ్రదేశాన్ని పరిపాలిస్తున్న రోజులవి. శ్రీపర్వతం బౌద్ధభిక్షువులకు విజ్ఞానపీఠమై విలసిల్లిన కాలం. ఆకాలంలో తాను జీవించి ఉన్నట్లు భావించుకొని రెడ్డిగారు యీ కావ్యాన్ని వ్రాశారు. నాగార్జున కొండ ప్రక్కనే విజయపురి అనే పట్టణం ఉండేదని, ఆపట్టణాన్ని రాజధానిగా చేసికొని ఇక్ష్వాకులు ఆంధ్రదేశాన్ని అర్ధశతాబ్దం వరకు పరిపాలించారనేది చరిత్రకారులు అనేకమైన ఆధారాలను సేకరించి తేల్చిన సారాంశం. [2] శాతవాహన సామ్రాజ్య పతనానంతరం ఇక్ష్వాకుల పాలన ప్రారంభమైంది. అప్పటికే బౌద్ధమతం ఆంధ్రదేశంలో ప్రబలంగా ఉండటమే గాక, రాజాదరణ మతంగా ప్రసిద్ధి చెందింది. శాతవాహనులు అమరావతి

అజరామర కీర్తినొందిరి. చిత్రలేఖనము కూడ యీకాలమున వర్ధిల్లినది"[1] అనే వాక్యాలు పరిశీలింపదగ్గవి. "సింహళద్వీపవాసి ఒకడు సింహళద్వీప సన్యాసినుల కోసం, ఒకవిహారం ఆంధ్రదేశంలో నిర్మించాడట! సింహళ బౌద్ధానికి, ఆంధ్రదేశానికి చాలా సాన్నిహిత్యం ఉన్నట్లు దీనివల్ల తెలుస్తుంది."[2] ఈనిర్మాణం ఇక్ష్వాకులు ఆంధ్రదేశాన్ని పాలించేసమయంలో నాగార్జున కొండపై జరిగింది. ఈచారిత్రక సత్యాలను పరిశీలించిన నారాయణరెడ్డిగారు

"ఇక్ష్వాకు వంశ క్షి
తీంద్ర చంద్రుల కీర్తి
కౌముదులు నల్గడల
కలయ విరిసిననాడు
కృష్ణవేణీ తరం
గిణీ పయః కింకిణులు
త్రి శరణ క్వాణాల
దెసల నింపిననాడు
శ్రీ పర్వతాగ్రమ్మ
సింహళాగత బౌద్ధ
భిక్షువుల విజ్ఞాన
పీఠకమ్మగునాడు" [3]

అని చరిత్ర పుటల్లోని వాస్తవాలను గేయంగా రూపొందించారు.

"…. విజయపురి సమీపమున గొప్ప బౌద్ధ చైత్యముండెడిది. ఆచార్య నాగార్జునుడో లేక అతని కొరకు శాతవాహన చక్రవర్తులో దీనిని నిర్మించిరి. ఏ పర్వత రాజముపై నీచైత్యము విల్లసిల్లెనో దానిని గౌరవ సూచకముగ శ్రీ పర్వతము అనిరి. శ్రీ పర్వతము

1. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి, పుట 143
2. శ్రీ రత్నాకరబాలరాజు, బౌద్ధయుగము (మొదటివాల్యూం) పుట 344.
3. డా॥ సి.నా.రె., నాగార్జునసాగరం, పుట-1.

మీద విజయపురి ముఖ్యపట్టణముగా గలవారు గనుక, ఇక్ష్వాకువంశీయులను పురాణములు శ్రీపర్వతీయులు అని పేర్కొనినవి."[1] అని 'శ్రీ పర్వతం' పూర్వాపరాలు వివరించబడినాయి శ్రీపర్వతానికి 'నాగార్జునకొండ' అనే పేరు రావటానికికారణం ఆచార్య నాగార్జునుడు శ్రీ పర్వతంపై నివసించ డమే. పై చరిత్రాంశాలను పరిశీలించిన రెడ్డిగారు,

"నాగార్జునుని పట్ల
ననలెత్తు భక్తి సం
భ్రమములో తనపేరు
మరచె శ్రీ పర్వతుడు
మలచుకొనె తనుతాను
నాగార్జునుని పేర
నవపై భవము మీర"[2]

అని గానంచేసి, విస్మృతమైన శ్రీ పర్వత చరిత్రను వివరించారు. శ్రీ పర్వతం అంటే శ్రీశైల శివక్షేత్రమే గుర్తువస్తుంది. "శ్రీపర్వతమునే శ్రీశైలమని కొంతకాలము లోకము తలచెను. ఈ రెండును (శ్రీ పర్వతం పేరుగల రెండు కొండలు) నల్లమల కొండలలోని పుణ్యస్థానములగుట నిజమేకాని అందొకటి శ్రీపర్వతము బౌద్ధపవిత్ర క్షేత్రము, రెండవది యగు శ్రీశైలము శైవులకు దివ్యప్రదేశము"[3] చైనాయాత్రికుడైన "పాహి యాన్" దీనిని పారావత విహారమని వర్ణించాడని కొందరంటారు."[4]

ఆచార్య నాగార్జునుడు సర్వవిద్యలలోనూ నిష్ణాతుడు. "కరుణాళు వైన ఆచార్య నాగార్జునుడు మనుష్యులు దేహరోగములను బాపుకొనుట కవసరమగు వైద్యశాస్త్ర సూత్రములను స్తంభములమీద చెక్కించి

1. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, పుట 140–141
2 డా॥ సి.నా.రె., నాగార్జున సాగరం, పుట 6
3. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి, పుట 141
4. శ్రీరత్నాకర బాలరాజు, బౌద్ధయుగము (మొదటివాల్యూం), పుట 335

ప్రకటించెనట. ఈతని యాధ్వర్యమున నాగార్జునకొండ సంఘారామము ఒక గొప్ప పరిశోధనా గారముగ పరిణమించెనని చెప్పుదురు. డిస్టిలేషను **(Destilation)** కాల్సిలేషను **(Kalcilation)** మున్నగు రసాయనిక ప్రక్రియలను నాగార్జునుడు కనిపెట్టెను. లోహవిజ్ఞానము నందీతడు ప్రథమాధికారి. బీదసాదల దారిద్ర్యమును తొలగించు నిచ్ఛగలవాడై, క్షుద్రలోహములను సువర్ణముగా మార్చు విద్యను సాధించుటకై, ఈ శాస్త్రజ్ఞ శిఖామణి యెంతయో కృషిచేసెనట"[1]

బౌద్ధమతంలో మహాయాన శాఖను రూపొందించింది నాగార్జునుడే. ఈ మార్పువలన శిల్పకళ విపరీతంగా అభివృద్ధి చెందింది. నాగార్జున కొండపై "వందలకొలది బౌద్ధ భిక్షువులు సుఖజీవయాత్ర గడపుచు,తత్త్వ వివేచనము చేయుచు, ముముక్షువులై యుండిరి. ఈ సంఘారామము నందొక బ్రహ్మాండమైన గ్రంథాలయము కూడ నుండెడిది."[2]

నారాయణరెడ్డిగారు ఆచార్య నాగార్జునుని గొప్ప తనాన్ని కొనియాడారు.

"నాగార్జునుని మేధ
లోగట్లు తెగిపారు
విజ్ఞానము రసాయ
న జ్ఞానమై పొంగె.
నాగార్జునుడు చూపి
నట్టి నూత్నపథమ్ము
బౌద్ధ మత సౌధ సం
ప్రాప్తి సోపానమ్ము"[3] అని వివరించారు.

నాగార్జునుడు నిర్యాణం పొందినా, నాగార్జున కొండ బౌద్ధ జీవన ప్రతిబింబమై ప్రకాశించింది. నాగార్జునుని కాలంనాటి శాతవాహన సామ్రా

---

1. ఆంధ్రుల చరిత్ర–సంస్కృతి, పుట 127–128
2. అందే పుట 127
1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పుట. 6

జ్యం పతనమైనా, తరువాత వచ్చిన ఇక్ష్వాకులు బౌద్ధ మతాన్ని అత్యధికంగా ఆదరించారు. ఇక్ష్వాకుల కాలం నాటి చరిత్రాంశాలే యీ కథకు చారిత్రక నేపథ్యము. పద్మదేవుని వంటి యువశిల్పులు తమ శిల్ప కళా నైపుణ్యాన్ని ప్రదర్శించి బుద్ధ భగవానుని జీవిత సన్నివేశాలను అత్యద్భుతంగా రూపొందించిన కాలంలోనే యీ కథను కవి కల్పించాడు.

స్థూపాలను, చైత్యాలను ఆరాధనామందిరాలుగా చెప్పవచ్చును. ఇవి బుద్ధ భగవానుని శరీర అవశేషాలపైగాని, పవిత్ర చితాభస్మంపైగాని నిర్మించబడేవి. అందుకే రెడ్డిగారు,

> "బుద్ధ ధాతువును తనలో
> పొదిగిన స్వర్ణ కరండము
> పైన మహాచైత్య రచన
> ప్రశస్తముగ సాగుచుండె.
> అండాకృతి గల్గిన చై
> త్యాననమ్ము పరికించగ
> అచ్చముగా ధర్మ చక్ర
> యచ్చొత్తిన యటులదోచు"[1] అని వివరించారు.

"మహాపరి నిర్వాణ సూక్తంలో బుద్ధుడు ఆనందునకు యీ స్థూప నిర్మాణాన్ని గురించి చెబుతాడు. తథాగతుని అవశేషాలను నాలుగు బాటలూ కలిసే చోట నిక్షేపించి, వానిపైన ఈ స్థూపాన్ని నిర్మించాలి. ఎవరైతే వీనిని చందన పుష్పాదులతో పూజించి, నమస్కరించి, ఎదుట శాంతి ప్రసన్న హృదయాలతో నిలుస్తారో వారు శాశ్వత సత్యానందాలను పొందుతారని బుద్ధుడు అన్నాడు"[2] అందుచేతనే బౌద్ధమతాభి నివేశం గల శాంతిశ్రీ శిల్పసందర్శనార్థమై మహాచైత్య నిర్మాణం జరిగే చోటుకు వెళ్ళింది.

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జునసాగరం, పుట. 7-8

2. శ్రీ రత్నాకర బాలరాజు, బౌద్ధయుగము-రెండవవాల్యూం, పుట. 616

నారాయణ రెడ్డిగారు యీ కావ్యంలో పేర్కొనిన "త్రిశరణములు", "త్రిరత్నములు", "చత్వారి సత్యములు", "పంచశీలములు", "అష్టసన్మార్గములు" అనే పదాలు నూతనంగా సృష్టించబడినవేమీకావు. అవి బౌద్ధమతంలో సుప్రసిద్ధమైన సంప్రదాయాలు, వాటికి ఆధారములయిన ధర్మాలు, ఆచరణీయములైన సిద్ధాంతాలు.

కథాకాలానికి తగినట్లుగా నారాయణరెడ్డిగారు పాత్రలకు పేర్లు పెట్టారు. కావ్యనాయిక శాంతిశ్రీ, కథా కాలం నాటికి ఇక్ష్వాకులు పాలకులు. ఇక్ష్వాకురాజైన శాంతిమూలునకు "అడవి శాంతిశ్రీ" పేరు గలకుమార్తె, "శాంతిశ్రీ" అనే తోబుట్టువు వున్నట్లు తెలుస్తున్నది. [1]

"రాజకాంతలందరును బుద్ధ ధర్మము నందభిమానము గలవారై, నాగార్జునకొండపై ఎన్నియో దానములు చేసిరి. ఇచ్చటి మహాచైత్య నిర్మాణమునకు కారకురాలు శాంతిమూలుని సోదరి శాంతిసిరి. అంతఃపుర స్త్రీలు విహారములను, మండపములను నిర్మించి, అయ స్తంభములనెత్తించిరి" [2] అనే వాక్యాలు పరిశీలింప దగ్గవి నారాయణరెడ్డిగారి "శాంతిశ్రీ" కూడా మహాచైత్య నిర్మాణ సమయంలోనే సాక్షాత్కరించింది. కథానాయకుడైన పద్మదేవుడు శాంతిశ్రీని

"నా శిల్ప కళా రథమును
నడిపించిన శాంతి!" [3] అని సంబోధించడం

గమనార్హం. నాగార్జున కొండ శాసనాల్లో కూడా శాంతిశ్రీ పేరు కనుపిస్తున్నది. [4]

ఈ కావ్యాన్ని గురించి డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు వ్రాసిన "ప్రస్తావన"లోని వాక్యాలను యీ సందర్భంగా గుర్తు చేసుకోవలసి వుంటుంది.

---

1. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి, పుట 142.
2. అందే పుట 143
3. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జునసాగరం, పుట. 104
4. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి, పుట. 76-77.

"........ నారాయణరెడ్డిగారు చారిత్రకాధారములగు శిల్పములను శాసనాలను గూడ పరిశీలించి ఈ కావ్యరచనకు పూనుకొనిరి" [1]

కథానాయకుడైన పద్మదేవుడు సృష్టించినట్లుగా రెడ్డిగారు వర్ణించిన శిల్పాకృతులు నాగార్జున కొండ త్రవ్వకాలలో లభించినట్టివే. "పద్మదేవుడు కల్పిత పురుషుడేగాని, ఆతడు నిర్మించెనని వర్ణించిన శిల్పములన్నియు నాగార్జునకొండ యందు దొరకిన ప్రాచీన శిల్పములే" [2]

శాంతిశ్రీ ప్రియసఖి పేరును సుజాతగా నిర్ణయించడం రెడ్డిగారి చారిత్రక దృష్టికి నిదర్శనం. సుజాత శాంతిశ్రీ దుఃఖాన్ని చూడలేక కన్నీరు గార్చిన కరుణామయి. ఈ కావ్యం బౌద్ధమతం ప్రధాన నేపథ్యంగా గల చారిత్రక కావ్యం. గౌతమబుద్ధుని జీవిత చరిత్రలో "సుజాత" పేరుకు ప్రత్యేకత వుంది. గౌతముడు ఆరు సంవత్సరాలు కఠోరతపస్సు చేసి కూడా, ముక్తి మార్గానికి తపోవిధానం పనికిరాదని విడిచిపెట్టాడు.

"ఈ సమయంలోనే "సుజాత" అనే పతీమణి సిద్ధార్థునకు ఆతిథ్యమిచ్చింది ఈ ఆహార ప్రధానంలోని కరుణను గౌతముడెప్పుడూ మరచిపోనేలేదు. బుద్ధుడైన తరువాత, తన మరణ దశలో ఉన్నప్పుడు తన శిష్యులతో సుజాత విందు తనకు జ్ఞానోదయ కారణమైనదని ప్రశంసించాడు". [3] బుద్ధదేవుడు యీ లోకాన్ని విడిచి పెట్టబోయే ముందు ఆనందునితో "అన్నిటి కంటె రెండు గొప్ప విందులు నా జీవితంలో లభించాయి. సుజాత ఆతిథ్యంవల్ల నాకు జ్ఞానోదయం కలిగింది. చందుని ఆతిథ్యంవల్ల జన్మరాహిత్యం కలిగింది". [4] అని వివరించాడు. అటువంటి దయామయి పేరును నారాయణరెడ్డిగారు శాంతిశ్రీ స్నేహితురాలుగా రూపొందించారు. సుజాత మాటలు విన్న తరువాతనే శాంతిశ్రీ మతదీక్షను స్వీకరించింది.

బుద్ధ జయంతినాడు ఏర్పాటు చేయబడిన "మహోత్సవం"లో శాంతిశ్రీ శాశ్వత బ్రహ్మచర్యదీక్షను గ్రహించినదని వ్రాయడం నారాయణరెడ్డిగారి చారిత్రక దృష్టికి మరో నిదర్శనం.

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జునసాగరం, పుట (పీఠిక) 10.
2. అందే పుట (పీఠికలో) 11
3. శ్రీ రత్నాకర బాలరాజు, బౌద్ధ యుగము (మొదటి వాల్యూం) పుట.26
4. అందే పుట. 57

"దుర్వాంధానాశనం చేసి, ఆర్య చతుస్సత్యాలను తెలుసుకొని బ్రహ్మచారులై నిర్వాణానుభవం పొందడమే మహోత్సవం" అని బుద్ధభగవానుడు స్వయంగా చెప్పిన విషయం.[1] నారాయణరెడ్డిగారు బౌద్ధమత గ్రంథాలను పరిశీలించి, శాంతిశ్రీ మతదీక్షను స్వీకరించిన సన్నివేశాన్ని సృష్టించారు.

మతాచార్యునకూ, పద్మదేవునకూ మధ్య జరిగిన వాగ్వివాదం కూడా ఆనాటి సాంఘిక పరిస్థితుల్ని వివరించే విషయమే. బౌద్ధ విహారాలు సోమరులకు నిలయంగా మారాయని, భిక్షువులు రోగులను సేవించడం మరచి పోయారనీ, దీన మానవులకు మేలు కలిగించే పనులు చేపట్టడం లేదనీ పద్మదేవుడు ఆరోపించిన విషయాలు ఆనాటి ప్రజల అభిప్రాయాలే.

"కాషాయాంబరములలో
కాముకు లెందరో కలరు" అనే పద్మదేవుని ఆరోపణ

ఆనాటి ఆరామ పరిస్థితుల్ని, బౌద్ధమత క్షీణ దశను గుర్తుకు తెస్తుంది. మానవసేవే పరమార్థంగా భావించిన ఆచార్య నాగార్జునుని పేరుతో నిర్మించబడిన "నాగార్జునసాగర్ ప్రాజెక్టు"ను నేడు మనం ప్రత్యక్షంగా చూస్తున్నాము. ఆంధ్రుల దారిద్ర్యాన్ని పారద్రోలే "నాగార్జున సాగరం" ప్రయోజనాలను అనుభవిస్తున్నాము.

"అలల నెత్తి యా సాగర
మాహ్వానించెను జనతను
ఓహో సాగరమదుగో
ఓదార్చెను మానవతను

దాని కాలియంచుల మం
ద స్పర్శన మాత్రమ్మున
బీటలు వారిన నేలల
పేరును మరకత శ్రీలు.

యోజనముల కొలదిగ తల
లూపెను నవ సస్యమ్ములు
ఎటు చూచిన పచ్చదనము
పోట మరించు దృశ్యమ్ములు.

1. శ్రీ రత్నాకర బాలరాజు, బౌద్ధ యుగము (మొదటి వాల్యూం) పుట. 39

ప్రజాకోటి వరసమ్ముల
పై కలకలలాడి పోయె
నిత్య పూర్ణిమాని శలే
నిత్యవసంతర్తువులే" [1]

మతమౌఢ్యం పనికిరాదనీవీ మతం కళలూ మానవ సేవకు ఉప యోగపడాలనే, కాంతా సమిత్మంగా కావ్య సందేశాన్ని నారాయణరెడ్డి గారు అందించడం ఎన్నెన్నో చారిత్రక సత్యాలను పాఠకుల మనో దృష్టికి సాక్షాత్కరింప జేస్తుంది.

## పాత్ర చిత్రణం : –

నారాయణరెడ్డిగారి చారిత్రక గేయకావ్యాల్లో చాలపరిమితంగా పాత్రల రూపకల్పన జరుగుతుంది. ఈ చారిత్రక కావ్యంలో నాలుగు పాత్రలే ప్రధానంగా కనుపిస్తాయి. పద్మదేవుడు, శాంతిశ్రీ, మతాచార్యుడు సుజాత. రెడ్డిగారి రెండవచారిత్రక గేయకావ్యమయిన "కర్పూర వసంత రాయలు" లోనూ నాలుగుపాత్రలే ప్రధానమైనవి. కుమారగిరి, లకుమ, పట్టపురాణి, కాటయవేముడు. వీరి మూడవ చారిత్రక కథాకావ్యమయిన "విశ్వనాథనాయడు"లో కూడా నాలుగే ప్రాతలు ప్రధానమైనవి, విశ్వ నాథనాయకుడు, నాగమనాయడు, మల్లికాంబ, కృష్ణదేవరాయలు. సాభి ప్రాయ విశేషణాలతో, ఆయా పాత్రల రూపురేఖలను సర్వాంగ సుంద రంగా, కళ్ళకు కట్టినట్లు స్పష్టంగా రూపొందించడంలో నారాయణరెడ్డి గారు సిద్ధహస్తులు.

## పద్మదేవుడు:—

"నాగార్జునసాగరం" గేయకావ్యంలో పద్మదేవుడు కథానాయకుడు. "చైత్యోపరి శిలాఫలక జాలమ్మున నిదురించెడు కళాత్మలను ఉలితో మేల్కొలిపిన" [2] యువశిల్పి. నాగార్జున కొండను "ఒక అజంతా కంద

---

1. డా॥ సి. నారాయణరెడ్డిగారు, నాగార్జునసాగరం, పుట 113.
2. అందే పుట 8

రముగా, ఒక ఎల్లోరా మందిరముగా" [1] వెలిగించిన కళాతపస్వి. గౌతమ బుద్ధుని జీవితాన్ని సజీవంగా సాక్షాత్కరింపచేసిన శిల్పకళామర్మజ్ఞుడు. అతడు చెక్కిన కళాఖండాలను చూడటానికి విదేశములనుండి రసజ్ఞశేఖరులు వచ్చేడివారు. ఆతని శిల్పకళానైపుణ్యం వేనోళ్ళపొగడబడింది. బౌద్ధసిద్ధాంతాలను అధ్యయనం చేసేందుకు వచ్చిన శాంతిశ్రీ వంటి తరుణ విద్యార్థినిని కూడా ఆకర్షించింది తొలుత ఆతని శిల్పకళానైపుణ్యమే. తన కళానిలయానికి వచ్చిన శాంతిశ్రీని చూడగానే పద్మదేవుని ప్రణయార్ద్ర హృదయం స్పందించింది. శాంతిశ్రీని అప్సరగను, తననొక గంధర్వునిగాను భావించుకొని తాదాత్మ్యంచెందాడు. పద్మదేవుడు సౌందర్యారాధకుడు. కాగా శాంతిశ్రీ అత్యద్భుత సౌందర్యాన్ని ఆరాధనాపూర్వకంగా వర్ణ చిత్రంగా రూపొందించాడు. పద్మదేవుని వాక్చాతుర్యం, కళాదర్శాలు, సౌందర్యం, నిర్మలమైన అంతరంగం శాంతిశ్రీని ఆకర్షించాయి. అతని వేణునాదం శాంతిశ్రీని కృష్ణాతీరానికి పరుగులు తీయించింది. ఆతని గంధర్వగానం ఆమెను మయూరిలా నాట్యమాడించింది.

పద్మదేవుడు సూక్ష్మగ్రాహి, లోకజ్ఞుడు. ఎదుటనున్నవారి హృదయాలను విప్పిచెప్పగలనేర్పరి. శాంతిశ్రీలో గూడుకట్టుకున్న మతావేశాన్ని తొలిచూపులోనే పసిగట్టాడు.

"మతపాకములు దప్ప
ఇతరాంశముల మీకు
ఆస్వాదనీయమ్ము
లైనట్లు కన్పడవు". [2] అని శాంతిశ్రీ మనోగతమైన అభిరుచిని స్పష్టంచేశాడు. తాను కానుకగా యిచ్చిన వర్ణ చిత్రాన్ని శాంతిశ్రీ హృదయానికి హత్తుకొన్న తరువాతనే పద్మదేవుని ప్రేమభావాలు మరింత బలపడ్డాయి. సుజాత మాటలువిని దుఃఖిస్తున్న శాంతిశ్రీని చూడగానే ఆతని ప్రేమైక హృదయం బాధతో విలవిల్లాడింది. పద్మదేవుని ప్రేమ అత్యంత పవిత్రమైనది. శాంతిశ్రీ శాశ్వతబ్రహ్మచర్యదీక్షను స్వీకరించినపుడు, పద్మదేవుడు అప్రయత్నంగా కలతచెందాడు. తనకు శాంతిశ్రీ

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పుట 11
2. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జునసాగరం, పుట. 25.

దూరమై పోగలదనే సందేహం కలిగింది. తన క్రిందనున్న నేల గిరగిర తిరిగినట్లు భ్రమించి, తొట్రుపడే నడకతో బోధనా మందిరం వైపు బయలుదేరాడు. శాంతిశ్రీ దీక్షను గ్రహించిందనే మాట పద్మదేవుని అశనిపాతంలా తాకింది. నిరాశానిస్పృహలతో భగ్నప్రేమికుడైనాడు.

పద్మదేవునకు మతాన్ని గురించి కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. "మతమే ప్రతివారికి జీవిత సర్వసమ్ముకాదు" [1] అని భావించే మానవతావాది అతడు.

"మత సూక్తులు జీవిత ని
ర్మాణమ్మును చేయలేవు
సరికద, పచ్చని బ్రతుకును
సన్యాసము వైపుత్రోయు" [2] అని పద్మదేవుడు

ఆవేశంతో అనినప్పటికీ, అందులో ఎంతైనా వాస్తవం వుంది.

"మానవత్వ సంరక్షణ
మహాప్రయోజనము కొరకు
మతము........" అని పద్మదేవుడు

మత ప్రయోజనాన్ని ప్రకటించినతీరు ప్రశంసనీయం. పద్మదేవుడు యథార్థవాది. మతాచార్యునితో మతాన్ని గురించి, సంఘారామం స్థితిగతుల్ని గురించి స్పష్టంగా సంభాషించిన సత్యవాది.

"మీ సంఘారామమ్ములు
మీ బౌద్ధవిహారమ్ములు
సోమరులను పోషించెడు
ధామమ్ములుగా మారెడు" అని మతాచార్యునకు

స్పష్టం చేశాడు.

---

1. డా॥ సి.నా.రె., నాగార్జునసాగరం, పుట 25.

2. అందే పుట 37

"మీరు రుజాగ్రస్తులైన
వారి సేవ చేయలేదు
మీరు దీన మానవులకు
మేలును తలపెట్టలేదు

సంఘారామమున ధర్మ
శాస్త్రోక్తులు వల్లించిన
సకల జగద్బాధావళి
సమసిపోవలేదెన్నడు" [1] అని

అనాటి బౌద్ధ భిక్షువుల మనఃస్థితిని, ప్రవర్తనా విధానాలను అపహాస్యం చేశాడు.

"మతసూక్తుల చర్వణమే
మహితధ్యేయమ్ము మీకు
మానవులుగ మీరుచేయ
బూనిన కార్యమ్ము లేవి?" [2] అని ప్రశ్నించినందునే

ఆచార్యుని ఆగ్రహానికి గురియైనాడు. సంఘబహిష్కరణ దండనకు పాత్రమైనాడు. మతదురహంకారులవద్ద కళాసేవచేయడం కంటె, సామాన్య మానవునిగ దీన జనకోటిని సేవించడమే జీవిత పరమార్ధంగా భావించిన సేవాతత్పరుడు పద్మదేవుడు. అతడు కళామూర్తి. కఠిన శిలలను నవనీతంగా మార్చగల యీ యువశిల్పి మతాచార్యుని కర్కశ హృదయాన్ని మార్చలేకపోయాడు. మతావేశానికి బలైపోయన యీ భగ్నప్రేమికుడు మానవసేవలో తనబాధను మరచి పోవాలని నిశ్చయించుకున్నాడు.

**శాంతిశ్రీ:—**

ఈ కావ్యంలో కథానాయిక. శ్రీ పర్వతంపైగల బౌద్ధ సంఘారామంలో మత సిద్ధాంతాలను అధ్యయనం చేస్తున్న తరుణ విద్యార్థిని. శాంతిశ్రీ అత్యద్భుత సౌందర్యవతి. ఆమె "అవయవమ్ముల దాల్చినట్టి అమృతము" "కదలివచ్చిన మల్లికా వల్లిక" "భానుదేవుని మొదటి

---

1. డా॥ సి.నా.రె., నాగార్జున సాగరం, పుట 102
2. అందే పుట 103

బంగారు కిరణం" "భూలోకాన అడుగు మోపిన వసంతలక్ష్మి." ఆమె సౌందర్యానికి పద్మదేవుడు చలించిపోయాడు. ఆమెరూపం అతని హృదయంలో ముద్రితమై వర్ణ చిత్రంగా రూపుదాల్చింది.

శాంతిశ్రీకి బౌద్ధమతం మీదగల భక్తి శ్రద్ధలు అపరిమితం. ఆ శ్రద్ధాసక్తులే బుద్ధదేవుని చిత్రాలు చూడాలనే కుతూహలానికి ఆధారమై పద్మదేవుని కళామందిరగమనానికి కారణమయ్యాయి. ఆమె పద్మదేవుని శిల్పకళను మెచ్చుకొవటానికి హేతువు అతడు బుద్ధుని జీవితాన్ని శిల్పాలుగా సృష్టించడమే. తనచిత్రాన్ని పద్మదేవుడు చిత్రించినపుడు సంతోషించడానికి బదులు అసంతృప్తిని వ్యక్తం చేస్తుంది. బుద్ధదేవుని చిత్రించే మీకుంచెతో నావంటి క్షుద్రజీవులను చిత్రించడం తగదని హితవు చెబుతుంది. పద్మదేవుని ప్రభావంవలన ఆమె మతదీక్షకొంచం సడలిందనే చెప్పాలి. ఆచార్యుడు బోధనామందిరంలో మత సిద్ధాంతాలను బోధిస్తున్న సమయంలో కూడా ఆమె మనస్సు పద్మదేవుని గూర్చి ఆలోచించేది. పద్మదేవుని వేణునాదానికి ఆకృష్టయై ఆచార్యుడు గమనిస్తున్న సంగతినిగూడా పట్టించు కోకుండగనే కృష్ణాతీరానికి పరుగులు తీస్తుంది. ఇంతకు పూర్వం మత సూక్తులను మాత్రమే అధ్యయనంచేసే శాంతిశ్రీ, యిప్పుడు సౌందర్య సంబంధి సూత్రాలను ఆలకిస్తున్నది.

సంఘారామ వేదికపై శయనించే శాంతిశ్రీ, ప్రస్తుతం కృష్ణాతీరానవున్న యిసుక తిన్నెలపై నిద్రించాలని ఆశిస్తున్నది. నిత్యం గురుదేవునివద్ద కూర్చొని ధర్మ ప్రవచనాలను ఆలకించే ఆమె, నేడు పద్మదేవుని సాన్నిధ్యాన్ని అభిలషిస్తున్నది. విద్యాలయంలో అశాంతిని, పద్మాలయంలో ప్రశాంతినీ పొందుతున్నది. ఆమెకు ఆరామం పూజనీయం కాగా, కళానిలయం ఆనందరాజ్యం. అయితే గురుదేవుని మతసూక్తులను ధిక్కరించే గుండెబలంలేని అధీర. పద్మదేవుని వైపు పరుగులు తీసే మమతా వేశాన్ని అణచి పెట్టలేని అనిశ్చితస్వభావ.

"ఆమె చిత్తము ప్రవా
హనీతమైన పూ
దోనె చందాన ఆం
దోళనము ....." చెందినది. [1]

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం. పుట 65.

స్నేహితురాలు సుజాతతో కలసి కృష్ణాతీరానికి వాహ్యాళి వెళ్ళినపుడు, బౌద్ధ భిక్షువులు తనను పతితగా భావిస్తున్నారని తెలుసుకొని పరితపిస్తుంది. పద్మదేవుని అనునయవచనాలు కూడా ఆమె దుఃఖాన్ని తగ్గించలేకపోవ టానికి కారణం ఆమె మతావేశమే. ఆమతావేశంతోనే పద్మదేవుని ప్రేమను కూడా ప్రక్కకునెట్టి శాశ్వత బ్రహ్మచర్యదీక్షను స్వీకరించింది. దీక్షామృ తాన్ని గహించిన తరువాతకూడా పద్మదేవుని గూర్చి పరితపించటానికి కారణం ఆమె ప్రణయార్ద్ర చిత్తమే.

శాంతిశ్రీని పద్మదేవుడు కళాస్వరూపిణిగా భావించాడు. అతడు గానంచేస్తుంటే ఆమె మయూరిలా నాట్యమాడింది. శిల్ప చిత్రలేఖన కళల పట్లకుతూహలాన్ని వ్యక్తం చేసింది. యశోధరా గౌతముల చిత్రాన్ని చూసితాదాత్మ్యస్థితిని అనుభవించింది. తుదకు శాంతిశ్రీకి మిగి లింది పద్మదేవుని యెడబాటు మాత్రమే. పద్మదేవుడు లేని తనజీవితం వ్యర్థమని దీక్షను స్వీకరిం చిన తరువాత గ్రహించింది. పద్మదేవుడు తన కోసమై మతాచార్యునితో ఘర్షణపడి మరలిపోతున్న సమయంలో

"తిరిగి రమ్ము పద్మదేవ
మరలి రమ్ము పద్మదేవ
ఈ సజీవ శిల్పమ్మును
ఇచటే విడిపోయెదవా?
ఎడదను నాసుండి వీడి
పడునట్లుగ జేసి పొమ్ము
నాతిని పీవొక్కమాట
రాతిగ నొనర్చిపొమ్ము" [1] అని విలపించింది.

ఆమె హృదయంలో పద్మదేవునిపై యేర్పడిన ప్రేమ చెరిగిపోనిది. శారీర కంగా బౌద్ధసన్యాసిని అయినా, మానసికంగా పద్మదేవుని ఆరాధిస్తున్నది. మతానికి ప్రేమకూ మధ్య జరిగిన సంఘర్షణలో శాంతిశ్రీ బలిపశువైనది.

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పుట 1

**బౌద్ధమతాచార్యుడు:—**

ఉత్తుంగ గంగా తరంగ స్వరంతో బౌద్ధమత సిద్ధాంతాలను బోధించే ఆచార్యుడు "మూర్తబౌద్ధమతమ్ము".[1] సుధాప్రవాహతరంగాల వంటి మధుర బోధనలతో విద్యార్థుల మనశ్శ్రవణములకు ఉత్సవాన్ని చేయగల సమర్థుడు. మానవ దేహం బుద్బుద ప్రాయమని విశ్వసించిన విరాగి. "కోరికలే దుఃఖానికి మూలకారణం" అనే బౌద్ధమత సిద్ధాంతాన్ని యౌవన దశలోని విద్యార్థినీ విద్యార్థులకు బోధించే వీతరాగుడు. అహంకారము వేరుపురుగు వంటిదనీ, మమకారం కమ్మనిహాలాహలమనీ, ఇంద్రియాలు పడగెత్తెడు పాముల వంటివనీ ఆచార్యుని విశ్వాసం.

"నీవు సుఖమ్మనెడు ఎండ
మావి కొరకు అర్రుసాచి
తిరిగితివా తుదకు దుఃఖ
పరితప్తుడవగుట నిజము"[2] అని

సిద్ధాంతీకరించే సర్వసంగ పరిత్యాగి. కత్తితో జయించలేనిది కరుణతో సాధించవచ్చునని, ద్వేషంతో లభించనిది ప్రేమతో సంపాదించవచ్చునని ఆతని నమ్మకము. మానినులందరినీ మాతృ సమానలుగా భావించే సంస్కారహృదయం గలవాడు. శాంతిశ్రీ మనఃస్థితిని గుర్తించి, గంభీర నయోక్తులతో ఆమె మనసు మార్చడానికి ప్రయత్నించాడు. శాంతిశ్రీ పద్మదేవునితో కలసి సంఘారామనియమాలకు విరుద్ధంగా సంచరించటాన్ని గమనించి, సమయం కోసం వేచి వున్నాడు. బుద్ధజయంతినాడు, బోధనామందిరంలో,

"మీలోపల నెవ్వరైన
కాలుజారి అడుసులోన
దిగినచో వచించుడిట్టి
దినమున దీక్షగైకొనుడు.

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పుట 45
2. అందే పుట 45

అంతఃక్షాళనము కన్న
అమల సాధనమ్ము లేదు
పాపగోపనమ్ము కన్న
పరమనైచ్యమేదిలేదు." [1] అని వ్యంగ్యంగా

శాంతిశ్రీని ఉద్దేశించి సంభాషించాడు. అతని పథకం ఫలించింది. శాంతిశ్రీ బౌద్ధమత దీక్షను స్వీకరించింది. శాంతిశ్రీ కోసం వచ్చిన పద్మ దేవుడు తనను ధిక్కరించి మాట్లాడటాన్ని యేమాత్రం సహించని కర్కశ మతవాది ఆ బౌద్ధాచార్యుడు. పద్మదేవుడు తన కళానైపుణ్యంతో తమ మతాన్ని సేవించిన సంగతిని కూడా విస్మరించి,

"నీ కళలును, నీవు మాకు
నేటినుండి త్యాజ్యమ్ములు
నిను బహిష్కరించితి నీ
నేలనుండి తక్షణమ్ము
వెడలి పొమ్ము" [2] అని శాసించిన కఠినచిత్తుడాతడు.

తాను కఠినంగా వ్యవహరించకపోతే, మిగిలినవారు కూడా నియమాలను ఉల్లంఘిస్తారనే భయంవల్ల ఆచార్యుడు పరుషంగా వ్యవహరించాడను కోవడం సబబుగా వుంటుంది. ఆచార్యునిదృష్టిలో పద్మదేవుడు

"కళయనెడు తెరలోన
కామగోపనము చేసిన" మానవుడు.

నారాయణరెడ్డిగారు ఆచార్యునకు పేరు పెట్టలేదు. ఈ కావ్యంలో మతా చార్యుడు ప్రతినాయకునిలా వ్యవహరించాడు. ఆదర్శ ప్రేమికులైన పద్మదేవుడు, శాంతిశ్రీల వియోగానికి కారణభూతుడైనాడు.

**సుజాత :—**

ఈ కావ్యంలో సుజాత శాంతిశ్రీ ప్రియసఖి. శాంతిశ్రీ సుజాతతో కలసి సంఫుల్ల పుష్పాపచయనిమిత్తం కృష్ణానది పరిసరోద్యానసీమలకు వాహ్యాళి వెళ్ళింది. తోటలోని పూలపై అనిష్టతను వెల్లడించి, నీటిలోని పద్మాలను శాంతిశ్రీ కోయడం చూచి సుజాత ఆశ్చర్యపోయింది.

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పుట-90

శాంతిశ్రీ హృదయం పద్మదేవునిపట్ల యెంతగాఢంగా ఆకృష్టమైందో సుజాత గ్రహించింది. అందుకే ఆమె వ్యంగ్యంగా

"ఏమె చెలి! నీ వింత
గా మారిపోయితివి?
"పద్మమ్ము" పై వంచ
ప్రాణాలు నిల్పితివి" అని

శాంతిశ్రీ హృదంతరం ఉలికిపడేలా సంభాషించింది. శాంతిశ్రీ కలత పడటంచూచి,

"ఎంత బేలవె నీవు
శాంతి! పద్మపదమ్ము
నుచ్చరింపగ వదన
మొందెనై వర్ణ్యమ్ము
నేనొక్కర్తినె పల్క
గానింత బెదరెదవు,
సంఘమెదురై వచిం
చగ నెట్లు సైచదవు?" [1] అని

శాంతిశ్రీని సుజాత సూటిగా ప్రశ్నించింది. సుజాత శాంతిశ్రీకి ప్రాణ సమాన. తన స్నేహితురాలిని గురించి బౌద్ధభిక్షువులు గుసగుసలుపోవడం సహించలేకనే శాంతిశ్రీకి వాస్తవం వివరించింది.

"నీవు వెన్నెల చీర
తే వరింపగ భిక్షు
వుల కండ్లలోన ని
ప్పులు వోసినటులయ్యె" [2] అని తన

స్నేహితురాలిని ఆడిపోసుకునే భిక్షువులపై కసిని వ్యక్తం చేసింది. శాంతిశ్రీ దుఃఖాన్ని చూడలేని సుజాత,

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పుట 68–69
2. అండే

"నిజనేత్ర గళితాశ్రు
నీరధారలతోడ
ఆమె శిరమును మాత్ర
మభిషేచనము." చేసినది. [1]

తమను సమీపిస్తున్న పద్మదేవుని చూచి సుజాత చల్లగా జారుకొన్నది. శాంతిశ్రీ పద్మదేవులు కలసి జీవించడమే సుజాత అభిమతం.

1. డా॥ సి. నారాయణరెడ్డి, నాగార్జున సాగరం, పుట 72.

# కర్పూర వసంతరాయలు

**ఇతివృత్తము-చారిత్రకత :**

నారాయణరెడ్డిగారి కర్పూర వసంత రాయలు సంప్రదాయ గల కథాకావ్యం. వర్తమానకాలంలోని యీ మధురకావ్యం

"గతమనెడు వజ్రంపు గోడల
కట్టడముపై నిట్టనిలువున
శిరసునెత్తిన స్వర్ణమయ గో
పురము" [1] వంటిది.

రెడ్డిగారు గతంలోని జిలుగువెలుగులను కవితా రూపంలో నిసర్గ రసవద్గీతాలుగా వెలికి జిమ్మిన సంప్రదాయాభిమాని. "క్రమంగా ఆంధ్రుల చరిత్రలో అక్కడక్కడా నిల్చివున్న వెలుగుకంబాలను కావ్య జగత్తులో నాటాలనే సంకల్పంతో" యీ కావ్యాన్ని రచించారు. రెడ్డిగారు ఎం.ఏ., విద్యార్థిగా ఉన్నపుడు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి **"History of Reddy Kingdoms"** అనే చరిత్ర గ్రంథాన్ని చదవటం తటస్థించింది. కొండవీటి రెడ్డిరాజైన కుమారగిరిరెడ్డికి "కర్పూర వసంత రాయలు" అనే బిరు దుండేదని తెలుసుకొని, ముగ్ధుడై, అతనిపై కావ్యం వ్రాయాలని సంకల్పించుకున్నారు. రెడ్డిరాజ్య చరిత్రకు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు పితామహులని నారాయణరెడ్డిగారి ప్రగాఢ విశ్వాసం. తాను రచించిన యీ చారిత్రక కావ్యాన్ని, రాగిరేకులలో, రాతి పలకలలో కనుమూసిన తెనుగుల చరితకు ప్రాణం పోసిన మహామనీషి అయిన శ్రీ శర్మగారికే అంకితమిచ్చారు. శర్మగారు వివరించిన చారిత్రక సత్యాల పునాదులమీద, శాసనాధారాలతో, కథావస్తువుకొక సర్వాంగ సుందరమయిన రూపాన్ని కల్పించి నారాయణరెడ్డిగారు యీ కథా కావ్యాన్ని రచించారు.

---

1. డా॥ సి.నా.రె., భారతి, 1958 మే.

ఈ కావ్యసౌధానికి కుమారగిరి, లకుమ, కాటయవేముడు, పట్టపు రాణి మూలస్తంభముల వంటివారు. కొమరగిరి లలితకళారసజ్ఞత, లకుమాదేవి త్యాగశీలం, కాటయవేముని పరాక్రమం, పట్టపు రాణి దేశభక్తి కావ్యేతి వృత్తమునకు బిగువును చేకూర్చిన బలమైన పోషక శక్తులు. ఆంధ్ర తేజమునకు, సంస్కృతికి ప్రతీకలా ప్రజ్వలించిన కాకతీయసామ్రాజ్య పతనానంతరము తెలుగు సీమ విపత్కర దుస్థితి ననుభవించింది. అట్టి సంక్లిష్ట పరిస్థితిలో హైందవమత పరిరక్షణకై తెలుగువీరులు సమర దుందుభుల్ని మోగించారు. ప్రాణాలను పణంగా పెట్టి స్వాతంత్ర్య సమరాన్ని సాగించారు. అట్టివారిలో ముఖ్యులు రెడ్డిరాజులు. నారాయణ రెడ్డిగారి "కర్పూర వసంత రాయలు"లో కథానాయకుడైన కుమారగిరి రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి మనుమడు. రెడ్డిరాజుల రాజధానిని అద్దంకి నుండి కొండవీడుకు తరలించి, దుర్భేద్యమైన గిరి దుర్గాన్ని నిర్మించిన వీరన్నపోతారెడ్డి కుమారుడు. సంగ్రామ భీముడగు కాటయవేముడు బావగారు కావడం కుమారగిరి పూర్వజన్మ సుకృతము. కుమారగిరి పాలనా కాలాన్ని సువర్ణాక్షరాలతో లిఖంపవచ్చు.

తెలుగుదేశ మానాడు స్వర్ణయుగమనుభవించి, సుగంధసురభిళమై శోభించింది. శత్రువులను జయించే భారం కాటయవేమునిపై వుంచి, కుమారగిరి నర్తన ప్రదర్శనములతోడను, వసన్తోత్సవములతోడను కాలం గడిపేవాడని కాటయవేముడు రచించిన శ్లోకంవల్ల తెలుస్తున్నది.[1]

అంతమాత్రాన కుమారగిరి పరాక్రమహీనుడుగాదు. అనపర్తి శాసనము, కాటయవేముని కొమరగిరి పురశాసనము కుమారగిరి ప్రతాపాభరణుడని చాటుతున్నాయి. కుమారగిరి కొలువులో లకుమ అనే నర్తకి ఉన్నట్లు కాటయవేముని శాకుంతల వ్యాఖ్యానారంభంలోని యీ శ్లోకం వల్ల తెలుస్తుంది.

---

1. భాగ్యం నామ సమగ్రమీదృశమతి స్నేహైకపాత్రం యతో
   వీరం కాటయవేమయుద్ధతరిపు ధ్వంసే నియుజ్య స్వయమ్।
   నిత్యం వందతి వర్తపై రభినవైః కాన్తైర్వసన్తోత్సవైః
   సంతానాభ్యుదయైః కుమారగి భూపాలో నృపాలోత్తమః ॥

   మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్య శ్లో. రెడ్డి సంచిక-353 పుట.

" జయతి మహిమాలోకాతీతః కుమారగిరి ప్రభోః
సదసి లకుమాదేవి యస్య ప్రియా సదృశీప్రియా॥

నవమభినయం నాట్యార్థానం తనోతి సహస్రధా
వితరతి బహూనర్థాన్ అర్థి వ్రజాయ సహస్రితః॥ [1]

లకుమా రాజనర్తకియేగాక నృత్య రహస్య పారీణ. 'ప్రియాసదృశీప్రియ' భరతాగమ రహస్య పారీణ. లకుమనుగూర్చి యింతకుమించిన అధారాలు చరిత్రలో లేవు.

సంగ్రామార్జునుడయిన కాటయవేముడు కుమారగిరికి కూర్చిన హితుడు. అంతేకాదు, తన చెల్లెలిని చేపట్టిన కూర్మి చుట్టము. మహాప్రధాని, సర్వసేనాని. తొత్తరమూడి శాసనంలో వీరిరువురి అనుబంధం యిలా తెలుపబడింది.

" సింహాసనీ విధాయసౌ, కుమారగిరి భూవరం।
అతేజయన్మహాతేజా, శ్రీకృష్ణ ఇవ ధర్మజం॥"

ఈ శ్లోకాన్నిబట్టి శ్రీకృష్ణుడు ధర్మరాజునకు వలె కాటయవేముడు కుమారగిరికి రాజ్యప్రాప్తిలో తోడ్పడి ఉంటాడని తెలుస్తుంది. క్రీ.శ. 1386 ప్రాంతంలో కాటయవేముడు విజయనగర ప్రభువైన రెండవ హరిహర రాయలను ఓడించి, అతని కూతురు హరిహరాంబికను స్వీకరించిన సంఘటన చరిత్ర సమ్మతమైనది. కుమారగిరి అహోబలానికి, ద్రాక్షారామానికి వెళ్లినట్లు శాసన ప్రమాణాలున్నాయి. [2] రెడ్డిరాజుల వంశక్రమాన్ని, వారి పాలనాకాలంలోని వసంతోత్సవ వైభవాలను ఎత్తిన శ్రీనాథుడు కొరవి గోపరాజువంటి సమకాలీన కవులు తమ కావ్యాల్లో పొందుపరచారు. కుమారగిరి పట్టపురాణి పేరు చరిత్ర గ్రంథాల్లోగాని, కావ్యాల్లోగాని స్పష్టంగా లేకపోవడంచేత నారాయణరెడ్డి గారు ఆ పాత్రకు యేపేరూ పెట్టలేదు. ఈ కావ్యం లోని కథ క్రీ.శ. 1386 వసంతంలో ప్రారంభమై సంవత్సరం ముగిసేలోపుగా సమాప్తమవుతుంది. రెడ్డిగారు తన రుచికి అనుగుణంగా చరిత్ర ప్రమాణాలకు క్షతి కల్గకుండా యీ

1. రెడ్డి సంచిక – పుట 72
2. అందే – పుట 80

కథను అల్లుకున్నారు." [1] చరిత్ర ప్రసిద్ధులైన వ్యక్తుల్ని, సన్నివేశాల్ని దృష్టిలో పెట్టుకొని నారాయణరెడ్డిగారు యీ కావ్యంలోని కథను ఐదు ఆశ్వాసాలలో అత్యంత ప్రతిభావంతంగా తీర్చిదిద్దారు.

## ప్రథమాశ్వాసము :

కుమారగిరి ప్రభువును సంబోధిస్తూ మాగధులు గానంచేసిన కైవారాలతో ప్రథమాశ్వాసం ప్రారంభమౌతుంది. ఈ వందిమాగధుల స్తోత్రపాఠాలు చక్కని నాటకీయశైలిని సంతరించుకున్నాయి. సూత్రధారుడు నాటక ప్రస్తావనలో పాత్ర ప్రవేశమును సూచించేవిధంగా రెడ్డిగారు కుమారగిరిని పాఠకులకు పరిచయంచేశారు. రెడ్డిరాజులకున్న బిరుదుల్ని దృష్టిలోపెట్టుకొని యీ ప్రశంసచేయడం కవిగారి చారిత్రక దృష్టికితార్కాణం. "జగనొబ్బగండ, జగరక్షపాల, చెంచుమలచూరకార" వంటి బిరుదులు కుమారగిరికి పూర్వులనుండి సంక్రమించినది. జగనొబ్బ గండ అనగా జగదేక వీరుడు. తనను ఆశ్రయించిన వారిని రక్షించి, ధర్మోపదేశము చేసి ప్రజలను పాలించినవారు. "జగరక్షపాల" బిరుదు వహించారు. 'చెంచుమల చూరకార' అనే పదాన్ని మల్లంపల్లివారు యిలా వివరించారు. "....రెడ్లకు కృతియిచ్చిన కొన్ని తెలుగు కావ్యములలో 'చెంచుమలచూరకార' యన్నది చెంజిమల చూరకారయని కలదు. చెంజిమల యనగా దక్షణార్కాటులోని జింజి దుర్గము, చెంచుమల యన్నది అహోబలము కావచ్చును. చెంచుమల అహోబలమైనచో వేమారెడ్డియే అరవీటి సోమదేవరాజు హావళిలో దానిని చూరగొని ఆ బిరుదమును వహించి యుండవచ్చును. చెంజిమల అయినచో వేమారెడ్డికి ఈ బిరుదు అతని పూర్వులనుండి సంక్రమించినట్లు తలంపవలసియున్నది. [2] నారాయణరెడ్డిగారు కావ్యప్రారంభంలోనే యీ బిరుదుల్ని ఉపయోగించి కుమారగిరి పూర్వుల రాజకీయ, ఆధ్యాత్మిక, సాంఘిక, ఆర్థిక జీవితఘట్టములలోని ముఖ్య సంఘటనలను సూచించి చరిత్ర ప్రియులకు ఆహ్లాదమును కలిగించినారు. రెడ్డిగారు కుమారగిరి 'వంటలకు పద్మసం

1. డా॥ సి.నా.రె., కర్పూర వసంతరాయలు, భూమికలో, పుట 11

2. తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము, పుట 307

వద్ద్యోమణి'గా కీర్తించినారు. మల్లంపల్లివారు "పంట రాష్ట్రమున ఉండిన వారగుటచే వీరికి పంటరెడ్లనియు, పంటకాపులనియు వ్యవహారము కలిగి నది. పంట పదునాల్గు కులాలని నాసుడి, మోటాటి, వెల్నాటి, పాకనాటి, మున్నాటి, దేపటి, కురిచేటి మొదలైనవన్నియు పంట మహాన్వయము లోని కులములే" [1] అంటూ పంట శబ్దాన్ని వివరించారు. హరివంశములో ఎర్రన కుమారగిరి తాతగారైన వేమారెడ్డిని 'పంటవంశోద్భవుడని' ప్రస్తుతించాడు. [2] భీమేశ్వర పురాణంలో శ్రీనాథుడు కృతిపతి వర్ణనలో "........పంటదేపటి మహాన్వయంబు బాకనాటి దేశంబున భద్రపీఠంబు నధివసించి, సింహ విక్రమనగర, దువ్వూరు, గండపరాది పట్టనంబుల నిజనివాసంబులుగా, భూరిలతాదిష్టాష్టాదశ ద్వీపాంతరాళులగు భూపాల గ్రామణులన్ త్రిలింగ భూమండలాఖండలును ప్రోలయవేమాన్న పోతాన్ననేను కుమారగిరీశ్వరాదులంబూజ్య సామ్రాజ్య పీరస్తులం గాంచె" నని వివరించినాడు. రెడ్డిరాజుల శాసనాల్లో 'పంట' శబ్దంకనిపి స్తుంది. విజ్ఞులైన రెడ్డిగారు కుమారగిరి వంశావతార వర్ణనను విస్తృతపర చక, ఒక్క వాక్యంలో పొందుపరచారు.

చైత్రశుద్ధ త్రయోదశినాడు మదనుని పూజించుటకై ఉద్యానవనా నికివెళ్లి కుమారగిరి రాజరికపు జిలుగువెలుగుల్ని శబ్దవిన్యాసంతో సూచించారు.

> "ప్రస్ఫురత్ బ్రహ్మతే
> జస్ఫురత్ ఫాలతల
> విస్ఫురద్రాజరేఖా" అంటూ

పారకుల శిరస్సులూగునట్లు చిత్రించారు. కుమారగిరిని వెంబడించిన కొండవీటి సైనిక బలాన్ని సమీక్షిస్తూ

> "అతనివెంట అనేక మండల
> పతులు సచివులు దండనాథులు
> అ వెనుక భూమీనినట్టుల
> హయదళమ్ములు కాల్బలమ్ములు" అంటూ

---

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటం, 306
2. ఎర్రన - హరివంశము

కథాకథన శైలితో ముందుకు సాగిపోతారు. నారాయణరెడ్డిగారి వర్ణల్లోన ఎక్కడలేని వన్నెచిన్నెలు కనుపిస్తాయి.

వసంతోత్సవం పట్ల ప్రజల ఉత్సాహాన్ని వర్ణిస్తూ

"ఏ మొగమ్మున చూపునిల్పిన
ఇగురుపోసెడు కాంతివల్లులు
ఏ సిగను పరికించి చూచిన
ఏటవాలుగ నవ్వు మల్లెలు" అని

వినూత్న సౌందర్యాన్ని సాక్షాత్కరింప జేశారు. పండుగ సందర్భముగా

"యువతులెల్లరు రతిరాములు
యువకులో మన్మథస్వాములు
నాడు నిజముగ పండుముసలులు
గూడ నవయువతాభిరాములు" గా

మారడం పాఠకలోకానికి కొత్త హుషారును కలిగిస్తుంది. పండుముసలులు గూడ నవయువతాభిరాములుగా వ్యవహరించడంలో చమత్కార ముంది. పంచమహావాద్యములు మ్రోగుచుండగా జనవాహినితో తరలివెళ్ళే వసంత రాజు మోహనమూర్తిని కొందరు సుందరాంగనలు దర్శించిన తీరును రెడ్డి గారు అత్యంత సుందరంగా, పాఠకుల హృదయాలకు చక్కలిగింత కలి గేలా వర్ణించారు. యవ్వన దశలో అడుగుపెట్టిన ముగ్ధలు వసంతేశ్వరుని "గవాక్షరంధ్రములన్ని కన్నులుచేసికొని" చూడగా, యవ్వనదశయం దుండిన మధ్యలు "ఒక్క తలుపురెక్కతీసి ఒయారముగ" తిలకించినారట! ఇక ప్రౌఢలు "ద్వారమ్ములడాసి, ప్రతపాఖారములద్రోసి" రాజును చూచి రట. కళ్ళకు కట్టినట్లుగా వారి కదలికలను వ్యక్తం చేయడంలో రెడ్డిగారు కృతకృత్యులైనారు. పురపురంధ్రులు లాజలు కురిపించగా, వృద్ధాంగనలు అశీరమృతములో తడిసిన మంగళాక్షతలు చల్లినారు. "ఈ వర్ణనలు రెడ్డి గారి లోకపరిశీలనమును లెస్సగా వ్యక్తము చేయుచున్నవి."[1] అనడం అతిశయోక్తి కాదు.

---

1. ఆచార్య దివాకర్ల వెంకటావధాని–కర్పూర వసంత రాయలు– పీఠిక (కర్పూర సౌరభం) – పుట 19.

నగరితోటలో కుమారగిరి, కాటయవేముడు సంభాషించిన సన్ని వేశం ప్రతినిత్యం మనం చూసే బావామరదుల సరసమే. కాటయవేముడు కుమారగిరిని

"మృడుని మూడవ కంటి చిచ్చున
బడి శరీరము విడిన మరునికి
మిమ్ముతోటి రసజ్ఞులే రూ
పమ్ము సల్పిన వారు సుమ్మా" అని

ఎత్తి పొడవగా కొమరగిరి నవ్వుతూ

"కాళిదాసు శకుంతలకు పా
రాలునేర్పెడు బావగారూ!
మీ రసజ్ఞత మదనదేవ స
మీపవర్తిని కాదనెదరా" అంటూ హాస్యమాడతాడు.

విద్యన్మణులైన వీరిద్దరికి సరసానికి అధికారపు పొరలు అడ్డురాలేదు. వీరి సంభాషణ విన్నవారి ముఖములపైన ముసిముసినగవులు మొల్చె నట! ఇంకెంతసేపు యీ కవ్వింపు మాటలు జరిగెనోగాని, పూజాకాలం సమీపించిందని విప్రమండలి సూచించడంచేత కుమారగిరి దేవతార్చనా యత్త మనస్కుడౌతాడు. సంప్రదాయబద్ధంగా మన్మధపూజను ముగి స్తాడు. రాయలు నగరాభిముఖుడగుచు "నిండు దోసిళ్ళతో మృగమదశ్రీ చందన రజమ్మును కుండికలతో అచ్చగొజ్జంగి నీరమ్మును" క్రుమ్మరించి వసంతోత్సవమును ప్రారంభించగా, జనచిత్తములు కుసుమించినవి.

"ఈరీతిగ తొమ్మిది దినములు సుమ
నారాచుని పండుగలే జరుగును" అంటూ

కవి వసంతోత్సవ వర్ణనలు వివరించి, కాలైక్యాన్ని, వస్త్వైక్యాని పాటిస్తూ తిరిగి కధను కొనసాగిస్తారు.

చైత్రశుద్ధ త్రయోదశినాడు ప్రారంభమైన వసంతోత్సవం చైత్ర పూర్ణిమతో పరిసమాప్తమౌతుంది. చైత్రపూర్ణిమ వసంతరాయల జీవితంలో వసంతాన్ని నింపి, అతని జీవిత గమనాన్నే మార్చివేసింది. నారాయణ

రెడ్డిగారు చైత్రపూర్ణిమనాడు చేసిన చంద్రోదయ వర్ణన మిక్కిలి రసవత్తరంగా సాగుతుంది. చైత్రపూర్ణిమనాటి చంద్రుడు

"విరహి చిత్తముల జర్జరితమ్ములుగ జేయ
దండు వెడలిన మన్మథ స్వామి రథముపై
ముద్దుమూటలుగట్టు ముత్యాల గొడుగు" లా ఉన్నాడట!

నారాయణరెడ్డిగారి ప్రౌఢకవితా శక్తి ధ్యూపదాల్లో విచ్చుకత్తుల దాళధళ్యమువలె సాక్షాత్కరించింది. చంద్రోదయ సమయంలోని తెల్లని కాంతులు ముత్యాల గొడుగులా భాసించాయి. మరికొంచెం సేపటికి ఎర్రని చంద్రబింబం "వలకాక నణచికొను తలిరు బోణుల జూచి కనులెర్ర జేసినట్లు" కనుపించగా, నిశాపతి "తన అల్లునికి లోబడని మానసాల జయింపకారమ్ముల మారుగతి" కనుపిస్తాడు. నారాయణరెడ్డిగారు అక్షరాల కుంచెతో ఎర్రరంగును విదిల్చినట్లు చక్కటి భావచిత్రాన్ని చూపించారు. ఎరుపు వెన్నెలలు తిన్నగ సుధా లలితమ్ములుగ మారడం, తెలుపెక్కిన కుముద బాంధవుడు గృహలక్ష్మి చిరునవ్వులీలను ప్రసన్నుడు కావడం కాలగమనాన్ని సూచించే చక్కటి వర్ణనలు.

"పాలవెల్లిని దేలు పూలదోసియలీల
ఎల్లలోకము భాసించె వెన్నెలలోన" వంటి

మధురమైన భావనలు పొరకుల్ని మైమరపిస్తాయి. "నురుగు వెన్నెల చెదరనోయనెడు బీతితో పవనుడు ఊపిరి బిగబట్టి అడుగులు వేస్తాడట! వాద్యమేళమ్మును విని తోటలో నిదుర మత్తున ఉన్న గడ్డిపోచలు లేచి చూచినవట. కొండవీడు ఆనాటి వెండి వెన్నెలలో కైలాసగిరివలె ప్రకాశించింది. "వెండి వెన్నెల" చక్కటి పదప్రయోగం. నటరాజ నివాసమైన కైలాసగిరిని స్ఫురింపజేయడంలో ఔచిత్యముంది.

ఆ సుప్రసన్న సమయాన, నగరోద్యానమందున ఏర్పాచేయబడిన లకుమ నాట్యాన్ని చూచి కుమారగిరి తనపైన పారిజాతములు జలజల కురిసినట్లు పులకిస్తాడు. నాట్యరాణియైన లకుమ దివ్యాభినయములో ప్రభువు తన్మయుడై, చిన్మయుడై, లకుమాలగ్న పంచప్రాణుడై, వివశుడై తనచుట్టూవున్న ప్రపంచాన్ని విస్మరిస్తాడు. విరహోత్కంఠితగా అభినయించు లకుమ గద్గదకంఠియై "కృష్ణా" అనుచు విలపించగా, తోటలో

ఒకమూలమన్న కోయిలబోటి జాలిగా కూసినదట! జ్యోత్స్నాభిసారికయైన లకుమ "వెన్నెల తరుణి వేషము గట్టెనో" యనగ స్ఫురించినదట. నారాయణరెడ్డిగారు ఖండిత, వాసకసజ్జిక, జ్యోత్స్నాభిసారిక, విరహోత్కంఠిత మున్నగు నాయికల లక్షణములను, లకుమ నాట్యప్రదర్శనలోని భాగాలుగా, కడు నేర్పుతో హృద్యంగా వర్ణించినారు. లకుమ అభినయానికి ముగ్ధుడైన రాజు రత్నహారమును బహూకరింపగా, లకుమ సిగ్గుతో తల వాల్చి మొగ్గయైనది. వీరి అవస్థలు చూడలేక,

"నింగిలో తారాదినేత వల్చని మొయిలు
ముసుగు తెరతోడ మోమును చాటు" చేసుకున్నాడని

మనోహరంగా వర్ణిస్తూ రెడ్డిగారు ప్రథమాశ్వాసానికి తెరవేశారు.

కుమారగిరి, లకుమలు పరస్పరానురాగపూరితమైన మధుర భావనలతో కలలుగనడం, కుమారగిరి లకుమను రాజనర్తకిని చేయ బోతున్నాడనే వార్త లకుమకు సంతోషాన్ని, రాణికి సంతాపాన్ని కలిగించడం ద్వితీయాశ్వాసంలోని కథాంశం.

లకుమ నాట్యాన్ని చూచిన నాటిరేయి, కుమారగిరి రాణ్మౌళి కన్నులరెప్ప వాలదు. కనులు మూసినా, కనులు తెరచినా లకుమరూపమే సాక్షాత్కరిస్తుంది. గాడుపు ఎంతో వాడిగా, వెన్నెల వేడిగా, ప్రఫుల్లమల్లికలు పల్లేరు కాయలుగా రాయలను బాధిస్తాయి.

"వెండి గజ్జెల రవళియే క
వ్వించునా నన్నింతగా?
గుండె గజ్జెలలోన చొరబడి
యుండెనేమో వింతగా"

అంటూ, తనను తానే ప్రశ్నించుకుంటాడు. నేల, నింగి, గాలి నిద్రించినవిగాని రాజుకు మాత్రం నిద్రరాదు. కాని రాణి తనను గమనిస్తున్నట్లు గుర్తించి, రాయలు తల్పముపై శయనించి కలగంటాడు.

నారాయణరెడ్డిగారు ఈ కలలను అత్యద్భుతంగా, కథాగమనానికి

తోడ్పడేవిధంగా రచించారు. సుప్రసిద్ధ మనస్తత్వ శాస్త్రజ్ఞుడైన "సిగ్మండ్ ఫ్రాయిడ్" **"Dream Psychology"** సిద్ధాంతాన్ని యీ స్వప్నాల్లో పొందుపరచారు.

"డాక్టర్ సి. నారాయణరెడ్డిగారి కర్పూర వసంత రాయలు అనన్యమైన స్వప్నశిల్పాన్ని వెలార్చింది. ప్రఖ్యాత మనశ్శాస్త్రవేత్తయైన సిగ్మండ్ ఫ్రాయిడ్ స్వప్న సిద్ధాంతానికి కవితారూపమే పై కావ్యంలోని స్వప్న శిల్పమేమో అన్నంత దగ్గరగా అది రూపొందింది". [1]

కుమారగిరి, తన కలలో, నూతన జీవగోళానికి పయనిస్తాడు.

"జలద సోపానాగ్ర సంగత
చరణుడై అలనల్ల రాయడు
సాగిపోయెను కోటితారా
స్థగిత గగన జగత్తలమున"

అని వర్ణించడంలో ఫ్రాయిడ్ ప్రభావం స్పష్టంగా కనుపిస్తుంది. "........రమ్యమైన స్వప్నశిల్పాన్ని వెలార్చిన కర్పూర వసంత రాయలు లకుమ నాయికగా, ధర్మ (ప్రాణత్యాగ) వీరంరసంగాగల సుమనోహర గేయకావ్యం. తూర్పు పడమరలవంటి కావ్యశిల్పాన్నీ, స్వప్నశాస్త్రాన్నీ, సరస కవితా సూత్రంతో అంటగట్టిన, దంటగట్టిన మొట్టమొదటి కథా కావ్యం".

స్వప్నంలో నింగికెగసిన లకుమ తారాసుమాలు దూసి ధమ్మిల్లమందు సింగారించుకోవడం చక్కని ఉత్ప్రేక్ష. కలలో మదనుడు కనుపించగా, ఆమె లేత యెదలో పూలు పూసినవి. మదన సమానుడయిన కుమారగిరి కనిపించగా అమృత పవనము వీచినట్లు లకుమ పరవశించినది. అంతలో వెంటనే పరమశివుడు కనిపించడం, కంకాళధరుని మెడలోని పాము తన పూత్కారములతో లకుమ మెడపై ప్రాకటం అగామి ప్రమాదసూచికగా, ధ్వని ప్రధానంగా కవి చిత్రించారు. కంపమాన మానసయై లకుమ నిద్రనుండి మేల్కొన్నది.

---

1. రావికంటి వసునందన్ - భావదీపికలు, పుట - 9.

"తన మెడలో పాములేదు,
ధరణీశ్వర దత్త రత్న
హారము మాత్రము జాలిగ
నామెనే విలోకించెను" అని

రెడ్డిగారు లకుమ దయనీయ స్థితిని వర్ణించారు. రత్నహారము వంటి "జడపదార్థానికి చేతనత్వాన్ని" కల్పించారు. లకుమ స్వప్నము తునాతునకలై పోయినట్లుగా రేయి వెలిసి పోయినదట! ఆమె శరీరంపై చెమట బిందువులు యింకిపోయినట్లుగా, తెలివెన్నెలలు కలువల కను మోడ్పులందు అరిపోయినవట. కాలవిహంగము రాత్రి, పగలు అనే రెక్కలతో దివ్వన ఎగసిపోయినదట!

కొన్ని రోజులు గడచిన తరువాత కొమరగిరి కాటయవేమునితో, లకుమను రాజనర్తకిగ చేయాలనే తన అభిలాషను వెల్లడించినాడు. కుమారగిరి సంతోషాన్ని ఆశించే కాటయవేముడు తన అంగీకారాన్ని తెలియజేస్తాడు. కుమారగిరి, కాటయవేముల మధ్యనున్న స్నేహబంధం యీ సన్నివేశంలో స్ఫురిస్తుంది.

## తృతీయా శ్వాసము :

తృతీయాశ్వాసంలో లకుమను రాజనర్తకిగా అభిషేకించు శుభతరుణాన పాత్రల మనోస్వభావాలను కవిగారు అత్యంత నైపుణ్యంతో తీర్చిదిద్దారు.

"రేనిలో వెలుతురు మేడలు
రాణిలో తిమిరంపు నీడలు
కాటవేమునిలోన రెండును
కలసిపోయిన సందెజాడలు!" అంటూ

ప్రతియోగరీతిలో **(by contrast)** ఆయా పాత్రల మనస్తత్వాన్ని వివరించారు.

మంగళవాద్యములు మ్రోగుచుండగా, సుందరీజనము పూవుల ప్రోవులను చల్లుచుండగా, సాలంకారయైన లకుమ సభకు వస్తుంది.

భూసురుల పుణ్యాశీషారవములు సమాప్తమైన తరువాత, చీనిచీనాంబర సువర్ణ కంకణ కింకిణీయుతమైన బంగరు పళ్ళెరాన్ని కాటయ వేముడు అందించగా, రాజు లకుమకు బహూకరిస్తాడు. చరిత్రలో రాజ నర్తకిని యిలానియమించేవారో, లేదోగాని; రెడ్డిగారు పాఠకుల మనో నేత్రాలకు ఆనాటి కొలువు కూటాన్ని, సభామర్యాదల్ని కళ్ళకు కట్టినట్లు వర్ణించారు. లకుమ సాన్నిహిత్యంలో, ఆమె కాలి గజ్జెలలో కాలము గడుప నెంచిన రాయలు, కాటయవేముని పిల్చి, తాను తీర్థయాత్ర చేయదలచిన విషయాన్ని వెల్లడిస్తాడు. కాటయవేముని మౌనాన్ని అంగీకారంగా భా వించిన మహారాజు లకుమతో తీర్థయాత్రకు బయలుదేరతాడు. రథచక్రాల వలె రాత్రులు, పగళులు గడిచిపోగా వీరు అహోబలాన్ని చేరారు. ఆ రాతిరి రాతితిన్నెపై నిద్రించిన రాయలు పూలసజ్జకన్నను అతివేల సుఖ మును అనుభవించాడు. కుమారగిరి నిరాడంబరత్వము, రాజభోగములపై నిరాసక్తత యీ సన్నివేశంలో విస్పష్టంగా వివరించబడ్డాయి. సుఖనిద్ర లోఉన్న కుమారగిరికి ప్రాతస్సమీరములు పైతాళికత్వమును నిర్వర్తిం చినవట! లకుమ నల్లని వెంద్రుకలతో కోడెగాడుపులు దాగుడుమూతలాడి నవి. రాజు నిద్రిస్తున్న లకుమను సమీపించగనే చిలిపి పవనుడు ఆమె చేలాంచలమును త్రోసివేసినాడు. నిరాకార పదార్థములకు స్వరూపమును కల్పించిన రెడ్డిగారి సృష్టి అత్యద్భుతము. ఆ సన్నివేశాన్ని పాఠకుల మనోనేత్రాలకు సాక్షాత్కరింపజేసి, మదిలో చిలిపి ఊహలు కలిగిస్తారు. కనులువిప్పిన లకుమ రాజునుచూచి తొట్రుపాటుతో తన కొంగునకు బదు లుగా ముంగురులను సవరించినది. లకుమ మనస్థితిని, తనూలావ ణ్యాన్ని కుంచెతో గీసినట్లు చిత్రించారు. భవనాశినిలో స్నానమాడి ఇరు వురూ నృసింహుని ఆరాధిస్తారు. కళ్యాణమంటపంలో లకుమ చెంచెతగా అభినయిస్తుంది. కవిగారు ఈ సన్నివేశంలో లకుమ పోషించిన సాత్త్విక, ఆంగిక, వాచిక, ఆహార్యాభినయాలను మిక్కిలి రసవత్తరంగా వర్ణిం చారు. కటిచుట్టూ నెమలి యీకల దండను బిగించి, మృగచర్మమును ధరించి, అడవి మల్లెలతో సింగారించిన సిగను ఒకవంకకు వోరగా ఉం చిన లకుమ సాక్షాత్తు చెంచులక్ష్మిగా సాక్షాత్కరించెననిపించినదట! ఖండిత యైన చెంచులక్ష్మి సింగని ప్రశ్నించడం, సింగడు చెంచులక్ష్మి అలకలు తీరునట్లు సమాధానమివ్వడం నాటకీయశైలిలో మిక్కిలి రసవత్తరంగా

సాగిపోతుంది. నాట్యానంతరం రాజు, నర్తకి స్వామికి నమస్కరింప నిల చిరి. రాజునకు "స్వామి ప్రసన్న నేత్రాలలో అమృతంపు నవ్వు మొలకలు కనుపించగా; లకుమకు నృసింహుని కళ్ళలో ఎర్రని సంధ్యాకాంతులు, హిరణ్యకశిపుని నెత్తురు చారలు కనుపించాయి. వింజామరలవంటి వెంట్రుకల సముదాయంతో వెలుగొందు స్వామినిజూచి రాజునకు భక్త్యావేశము కలుగగా, కేశములు పటపటనూగించుచు గర్జించు క్రుద్ధ కంఠీరవ మూర్తిగ కనుపించు స్వామినిజూచి లకుమ బెదరి మూర్ఛపోతూ, రాయల భుజములపై ఒరుగుతుంది. మూర్ఛతేరి తన తప్పు తెలుసుకొని రాజు పాదములపై వ్రాలుతుంది.

తదుపరి మజిలీ ద్రాక్షారామం. శివునికి నాట్య నైవేద్యంగా లకుమ జగజ్జననిగా అభినయిస్తుంది. పార్వతీ పరమేశ్వరులపై మన్మథుడు పంచబాణాలను ప్రయోగించడాన్ని ప్రదర్శిస్తుంది. రసావేశుడైన రాయలు లకుమను కౌగిలించి, మన్మథుని మరణాన్ని తానుచూడలేననీ, శివగిరిజల బిగికౌగిలి చెదరిపోవడాన్ని ఊహించలేననీ అంటూ లకుమ పట్ల తన ప్రణయాన్ని వెల్లడిస్తాడు. తన్మయురాలైన లకుమ రాయని బిగిగా కౌగిలించి –

> "నా దేవర! నాగుండియ
> పాదున రతనాల మొల్క।
> నా మనసే పంజరమ్ము
> గా మెలగిన రామచిల్క" అంటూ

రాయల పట్ల ప్రగాఢ ప్రేమను వ్యక్తం చేస్తుంది.

## చతుర్థాశ్వాసము :

తీర్థయాత్రలు ముగించి, రాయలు లకుమాసమేతుడై కొండవీడుకు మరలి వస్తాడు. రాణి ఉండవలసిన స్థానంలో నర్తకి కూర్చోవడమేమిటని ప్రజలు గుసగుసలు పోతారు. రాజును చూచి సంతోషంతో వికసించిన కాటయవేముని కళ్ళు, లకుమను చూడగనే సగము ముడుచుకు పోయినవి. రాయల ప్రక్కనే ఒయ్యారంగా నడుస్తున్న లకుమను చూచి సుడిగాలి

చరచినట్లు, వడదెబ్బ తాకినట్లు మహారాణి వణకి పోయినది. ఆమె నేత్ర ములందు అమవసలు జడలు విరబోసికొన్నవి. మరునాడు కాటయ వేముడు విజయనగరంపై దండయాత్ర చేయవలసిన అవసరాన్ని కుమారగిరితో ముచ్చటిస్తాడు. విజయనగర రాజయిన రెండవ హరిహరరాయల వలన, బహమనీ సుల్తాను ఫిరోజుషావలన రెడ్డిరాజ్యానికి రాబోయే అపద లను వివరిస్తాడు. కుమారగిరి సమరోత్సాహుడై "ఈనాడే సమరభేరి ప్రయోగింపుము" అని ఆజ్ఞాపించి, "నేనూ వస్తాను" అనబోయి, లకుమ తల పుకురాగా ఆగిపోతాడు. కాటయవేముడు రాయల హృదయంలో మొల కెత్తిన ఇంద్రచాపాన్ని గమనించి ఒక్కడే జైత్రయాత్రకు వెళతాడు. కుమారగిరి లకుమకై రమ్యకేళికాహర్మ్య నిర్మాణంలో నిమగ్నుడౌతాడు. కేళీగృహాన్ని కవిగారు అత్యంతసుందరంగా వర్ణించారు. బంగారు తలు పులు స్త్రీల శరీర సౌందర్యాన్ని, చంద్రకాంత శిలలు స్త్రీల ముఖమండ లాన్ని, ముత్యాల వాకిళ్ళు స్త్రీల నవ్వునూ, పగడపు చూరులు పడతుల అధిక్యాన్ని పరిహసిస్తున్నాయి. చంద్రశాలలో, క్రీడాసరస్సులతో క్రీడా రమ్య హర్మ్యము నిర్మింపబడింది. కేళీమందిరం ప్రక్కనే "గృహరాజ సౌధం" నిర్మింపబడింది. అందులో మహాలక్ష్మి ప్ర తి ష్ఠి ం ప బ డి ం ది. కుమారగిరి లీలాగృహము, గృహరాజ సౌధము చరిత్రలో వర్ణింపబడి నవే అగుట విశేషము. కొండవీటి కైఫియతులో గృహరాజ సౌధానికి సంబంధించిన వివరణ ఉంది. ఆంధ్రేతిహాసమండలి వారి పత్రికలోని కొమరగిరి పురశాసనము నందు గృహరాజసౌధము కుమారగిరిచే నిర్మింప బడినట్లు స్పష్టపరచబడింది. నారాయణరెడ్డి చారిత్రాధారాలను దృష్టిలో ఉంచుకొని యీ వర్ణనలు చేయడం వారి విజ్ఞతకు తార్కాణంగా కనుపి స్తుంది. భ క్తి, ర క్తి ప్రభువు జీవితంలో పర్యాయ పదాలుగా నిలచిపోయా యి. ఆ సుందర వాతావరణంలో ర క్తి భ క్తిని జయించినది. అనుర క్తితో కుమారగిరి లకుమ తనూలావణ్యమునకు దాసుడయినాడు. లకుమ వసం తరాయని జీవనాడులకు స్పందనము కలిగించు రసకేళి అయినది. భర తుడు చూపించని భావాలను లకుమ అభినయించగా రాజు "వసంతరాజీ యము" అనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని రచిస్తాడు.

విజయుడై కాటయవేముడు కొండవీడుకు మరలివస్తాడు. నెలల తరబడి జరిగిన యుద్ధంలో హరిహరరాయలను ఓడించి, అతని కుమార్తె

హరిహరాంబికను కానుకగా గ్రహించిన విషరాలను కాటయవేముడు కుమారగిరికి వివరిస్తాడు. కుమారగిరి తాను రచించిన "వసంతరాజీయము"ను కాటయవేమునకు చూపగా, అతడు పరిశీలించి, పరవశుడయి

"ఇన్ని నాళ్ళ మనస్సులో వే
దన్ని ప్రౌఢత్వమ్ము నందిన
నీకళాభిజ్ఞత బహిర్ముఖ
మై కనంబడె నేడు బావా!" అని ప్రశంసించినాడు.

ఇలా కొంతకాలం గడిచిన పిదప, రాయడు వేశ్యాలోలుడని రాజ్యంలో గుసగుసలు హెచ్చినవి. రాయలు లకుమాదాసుడని చర్చలు సాగాయి. కుమారగిరి రాజకార్యములను పట్టించుకోవడంలేదని తెలిసి కటకేశుడు కత్తులు నూరగా, ఫిరోజుషాహా గర్జించినాడు. అంతఃకల్లోలాలను కాటయ వేముడు అణచివేసినాడు. అఖిలరాజ్యం అగ్ని పర్వతంవలె ఉడికిపోతున్నది. కొండవీడును అగ్నిపర్వతంగా పోల్చడం కవి ప్రజ్ఞకు నిదర్శనం. రాణి వ్యాధిగ్రస్థయైనది. ఆ దుర్వార్త తెలిసి కాటయవేముడు రాణి వద్దకు వెళ్ళి ఆమెను పరామర్శించినాడు. కుమారగిరి ప్రవర్తన రాణిని క్రుంగదీసినదని గ్రహించాడు. రాయలువద్దకువెళ్ళి కొలువుకూటానికి రావలసిందిగా అభ్యర్థిస్తాడు. కుమారగిరి తన అంగీకారమును తెలుపగా క్రొత్త దుర్గమును అవలీలగ కొల్లగొట్టినంత సంతోషంతో కాటయవేముడు మరలిపోతాడు.

**పంచమాశ్వాసము :—**

మరునాడు కుమారగిరి లకుమను విడువలేక విడచి కొలువున కేగినాడు. రాజును చూచిన ప్రజలు వికసించిన ముఖాలతో రాయల ముత్యాల మాటలను వినడానికి కుతూహలపడుతున్నారు. అంతలో లకుమ కాలుబెణకినదను వార్త ప్రభువునకు అందించబడింది. వెంటనే కుమారగిరి ఆస్థానమును విడచి లకుమచెంతకు వెళ్ళినాడు. రాయల ప్రవర్తన ప్రజలకు ఆగ్రహాన్ని కలిగిస్తుంది.

"ఒక నర్తకి కాల్బెణుకుటేమి?
ఎకిమీడు పర్వులెత్తుటయేమి?
ఒకచిన్న ఘటన జరుగుటయేమి?
ఒడ్డోలగమ్ము వీడుటయేమి?

సభకిది తిరస్కారము
సభ్యతకు సీత్కారము" అని

నిరసిస్తారు. ఏమి చేయవలెనో తోచక కాటయవేముడు యిరుకున పడి నాడు. లకుమ కొరకు రాజు పేరోలగమును తృణీకరించి వెళ్ళిన వార్త రాణి హృదయంలో విషవాయువీచికవోలె తాకింది. పలుకరించగ వచ్చిన కాటయవేముని పాదాలపైబడి విలపిస్తుంది. ఈ సన్నివేశంలో కాటయ వేమునితో రాణి సంభాషించిన తీరు మిక్కిలి ఉదాత్తంగా చిత్రింప బడింది.

"మనది ఒకసత్ సంప్రదాయము
మన చరిత్రము శ్రవణపేయము
మన కులమ్మున కింతవరకును
మహీసంరక్షణయె ధ్యేయము" అనడంలో

సువిశాలమైన చరిత్ర యిమిడివుంది. వెంటనే కాటయవేముడు రాయల వద్దకువెళ్లి రాణిని పరామర్శించి రావలసిందిగా ప్రబోధించి నిష్క్రమిస్తాడు. లకుమ కూడా కుమారగిరిని రాణివద్దకు వెళ్లవలసిందిగా ప్రార్థిస్తుంది. అప్పుడు రాయలు 'రాణిపై తనకెంతో ఆదరభావం ఉన్నప్పటికి, ఆమె ఎదుటనిల్చుటకు జంకుగా ఉన్నదని' లకుమ కోర్కెను తృణీకరిస్తాడు.

అర్ధరాత్రి సమయంలో, చెలికత్తెలు వెంటరాగ, మహారాణి, "కేళీసౌధము" వద్దకు వెళ్లి తలుపుతట్టి లకుమను పిలుస్తుంది. లకుమకు తానెవరో తెలుపుతుంది. రాణి మూర్ధము తన చరణాగ్రములయందు వినమ్రముకాగా లకుమ చకితురాలవుతుంది. రాణిని లేవనెత్తి "ఎంత పాపము చేసితిని మహారాణి" అనుచు రాణి పాదములపైబడి వలవలమని విలపిస్తుంది. రాణికోసం తాను ప్రాణత్యాగం చేయగలనని లకుమ మాట యిస్తుంది. "దేశక్షేమాన్ని దృష్టిలోపెట్టుకొని రాజును విడిచి పోవలసిందిగా" మహారాణి కోరుతుంది.

లకుమ హృదయంలో సంఘర్షణ ప్రారంభమౌతుంది. ఈ సన్నివేశంలో నారాయణరెడ్డిగారు వర్ణించిన లకుమ "మనోవిశ్లేషణము" పాఠకుల హృదయాలను కరుణరస ప్లావితం చేస్తుంది. తనను ప్రాణాధికంగా ప్రేమించిన రాయని విడువలేదు. ఒకవేళ విడిచివెళితే, రాయలు మతిభ్రమించి బెంబేలుపడి తిరుగుతాడు.

" ఎటుల వాగ్దానమ్ము తీర్తును
ఎటుల రాయనివీడ నేర్తును
ఎందుకీ హృదయమ్ము నిచ్చితి
వీశ్వరా యీ సానిదానికి "

అంటూ లకుమ దుఃఖిస్తుంది సానికి హృదయం ఉండకూడదు. లకుమ పవిత్రమయిన హృదయం గలది కనుకనే యింతటి వేదనకు గురికావలసి వస్తుంది లకుమ ఆత్మాహుతి చేసుకోవాలనే నిర్ణయానికి వస్తుంది. రాజు సమక్షంలో నృత్యంచేస్తూ పిడిబాకుతో పొడుచుకొని మరణిస్తుంది. కత్తి పిడికి చుట్టబడిన లకుమ సందేశాన్ని రాజు చదువుకొంటాడు. శిబి, దధీచు లను మించిన లకుమ త్యాగశీలాన్ని గుర్తిస్తాడు. లకుమ సందేశంతో జాగృతుడయిన రాజుకు కొండవీడును. మహారాణియు, జనమహాంబోధి యును" కనుపించాయి.

కథావిషయాన్ని గురించి నారాయణరెడ్డిగారు కర్పూర వసంత రాయలు ద్వితీయ ముద్రణలో పాఠకులకు యిలా విజ్ఞప్తి చేశారు.

" ఈ సారి కావ్యం ముగింపులో చిన్నమార్పు జరిగింది. లకుమ సందేశం చేత జాగృతుడైన రాయడు వెంటనే రాణి దగ్గరకు వెళ్లినట్లు మొదటి ముద్రణలో వుంది. అలా వాచ్యంగా కాకుండా సూచ్యంగా వదిలి వేస్తే సముచితంగా వుంటుందనే ఉద్దేశ్యంతో ఈ చిన్న మార్పు చేశాను. దీనికి బీజప్రాయమైన అభిప్రాయమందించిన ఆత్మీయులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారికెంతో కృతజ్ఞుణ్ణి"

నారాయణరెడ్డిగారి దృష్టిలో గుమ్మడి ఉత్తమనటుడేకాదు, ఉదాత్త భావుకుడు, కళలూ, సాహిత్యమూ అంటే కరిగిపోయే రసహృద యుడు. తాను రచించిన " విశ్వనాథనాయకుడు " కావ్యాన్ని గుమ్మడి వెంకటేశ్వరావుగారికి అంకితమిచ్చారు. కర్పూర వసంత రాయలు కావ్యం ముగింపు ఉదాత్తంగా రూపొందడానికి ముఖ్యకారణులైన గుమ్మడి వెంకటేశ్వరరావు గారు అభినందనీయులు.

## పాత్రచిత్రణము :—

ప్రశస్తమైన ఈ గేయకావ్యంలో వున్నది నాలుగు పాత్రలు మాత్రమే. 1. కుమారగిరి, 2. లకుమ, 3. మహారాణి, 4. కాటయవేముడు.

ఈ నలుగురి స్వరూప స్వభావాలను ఆచార్య శ్రీ నారాయణరెడ్డిగారు ఎంతో నేర్పుతో చిత్రించారు.

**కుమారగిరి ;**

కుమారగిరిరెడ్డి కొండవీటిరెడ్డి రాజ్య సంస్థాపకుడైన ప్రోలయ వేమా రెడ్డి మనుమడు. అనపోతారెడ్డి కుమారుడు పినతండ్రి అనవేమారెడ్డి తరువాత కొండవీడుకు మహారాజయినాడు. కుమారగిరి ధీరలలితుడు " పరిపంథి నృపతి దోర్బల కంధి మంథనావర మందరాద్రి స్వరూపుని"గా కీర్తించబడినా, " కళామగ్గ సాగరమునోముగ్ధ సంపూర్ణ చంద్రమూర్తి " గానే సాక్షాత్కరిస్తాడు. "జగనొబ్బగండ, జగరక్షపాల, చెంపమలచూ రకార " వంటి బిరుదులు అతనికి వంశపారంపర్యంగా సంక్రమించినవే. కుమారగిరి పాలనలో తెలుగునాడు స్వర్ణయుగాన్ని అనుభవించింది. ప్రజానురంజకంగా వసంతోత్సవాలను నిర్వహించి " కర్పూర వసంతరా యలు " గా ప్రసిద్ధిచెందాడు. రెడ్డిగారు అభివర్ణించిన " కవిగమకి వాది వైణవిక వైణిక జన స్తవనీయ కవితా విచారా! " అనే వాక్యం కుమారగిరి విద్వత్తును ప్రకాశింపజేసింది. అతడు " రాజమూర్తి, " " ఇక్షుధన్వి కీడగు మోహనమూర్తి, లోకబంధువు, " " నిండు దోసిళ్లతో మృగమద శ్రీ చందనరజమ్ము, కుండికలతో అచ్చగొజ్జంగి నీరమ్ము కుమ్మరించి" వసంతోత్సవాలను సంప్రదాయబద్ధంగా, కళాత్మకంగా నిర్వహించిన రసజ్ఞుడు. ఉత్సవాలను నిర్వహించటంవల్ల అనేక ప్రయోజనాలు సమ కూరుతాయని విశ్వసించిన ఇంగితజ్ఞుడు. కాటయవేమునితో సాగించిన సరససంభాషణము కుమారగిరి వాక్చతురతను వెల్లడిస్తుంది.

కుమారగిరి నాట్యకళాకోవిదుడు. మెఱుపులాంటి "లకుమ" నాట్యాన్ని చూచి చకితుడైనాడు. లకుమ "రాధగా" అభినయించేవేళ, తనను కృష్ణ స్వామిగా ఊహించుకొని రసజగత్తునకు ఈశ్వరుడైనాడు. మహానుభ వాన్ని పొంది

"ప్రభువు తన్మయుడయ్యె
ప్రభువు చిన్మయుడయ్యె
ప్రభువు లకుమాలగ్న
పంచ ప్రాణుండయ్యె"

అతని రసావేశహృదయం లకుమకు రత్నహారాన్ని బహూకరింపజేసింది. ఆమెను "ఆ స్థానలాసికను" చేసింది. తాను ఎంతో కాలంగా ఎదురు చూస్తున్న నాట్యాధి దేవత కళ్ళముందు సాక్షాత్కరించినట్లుగా కుమారగిరి సంతసించాడు.

"వెండి గజ్జెల రవళియే క
వ్వించునా నన్నింతగా?
గుండె గజ్జెల లోన చొరబడి
యుండెనేమో వింతగా". అని తనను తానే ప్రశ్నించు
కుంటాడు.

"ఆటవెలదుల యింటిపడు చే
నాటికైనను కాదు లకుమ
శప్తయై దివినుండి భువిపై
జారి వచ్చిన అచ్చర సుమ" అని

నిర్ణయిస్తాడు. లకుమను తూలికగా తీసుకొని గ్రంథరచన చేయాలని సంకల్పిస్తాడు. ఆమెను వెంట పెట్టుకొని తీర్థయాత్రలకు వెళ్ళటంలోని అంతరార్థమిదే. ఈ ప్రయాణంలోనే వారిరువురి మధ్యా అనురాగం అంకురించింది. మొదట లకుమ నాట్యకళా నైపుణ్యానికి ముగ్ధుడైన రాయలు, ఆ తరువాత ఆమె తనూలావణ్యానికి దాసుడైనాడు. ద్రాక్షారామ భీమేశ్వరుణ్ణి అహోబల నృసింహునీ షోడశోపచారములతో సేవించిన భక్తి తత్పరుడు. భూసురులకు "హిరణ్యాది పుష్కర దానములు" చేసిన ఉదార హృదయుడు. కాటయవేమారెడ్డి కొండవీటి శత్రువుల ఆగడాలను వివరించినపుడు, అతనిలోని "పౌరుషబడబాగ్ని" ఒక్కమారు విజృంభించినా, లకుమ జ్ఞప్తికి రాగానే "మోములోని శౌర్యరేఖ" మాసిపోతుంది. అతని పౌరుషాగ్ని "జానువెన్నెల"గా మారిపోతుంది. కళారాధకుడై "గృహరాజసౌధాన్ని" నిర్మింపజేసి "రాజశిల్పి"గా ప్రసిద్ధిచెందాడు. లకుమ ప్రేమతో, తనచుట్టూవున్న సమాజాన్ని విస్మరించాడు. "ఆమె కన్నులు విరిసినంత సేపతడు పగలను కొనుచు, ఆమె కన్నులు మోడ్చినపుడే రాత్రియయ్యెనను కొనును".

తొలకరిజల్లునకు బీళ్ళు పులకరించినట్లుగా, లకుమాసాంగత్యము వలన కుమారగిరి పైదుష్యధార పెల్లుబికింది "భరతుడు చూపించనట్టి భావములను" లకుమ ప్రదర్శించగా, రాయలు వ్రాసిన "వసంతరాజీయం" వినూత్నకాంతులతో వెలుగొందింది. హరిహరరాయలపై విజయాన్ని సాధించివచ్చిన కాటయవేమారెడ్డికి ఎదురేగి "స్వాగతము వీరావతారునకు" అని గౌరవించిన సహృదయుడు. కాటయవేమునకు తనపై గల ప్రేమాభిమానాలకు కట్టుబడి కొలువు కూటమునకు వెళ్ళిన స్నేహశీలి. కాని, లకుమ కాలు బెణకినదని విన్నంతనే సభనుండి వచ్చి, "ఆమె చరణాబ్జములను నిమిరి, "ముత్యాలంతటి భాష్పములతో" తనచప్పని బ్రతుకులో రసధ్వనులను పలికించిన లకుమ పాదాలను అభిషేకించిన ప్రేమస్వరూపుడు. లకుమనే సర్వస్వంగా భావిస్తున్నా, అతనికి రాణిపై ఎంతో ఆదరభావముంది. తనకోసమై అనుగురాణిని, రాచకొల్వును అఖిలరాజ్యమును ప్రక్కకుపెట్టిన కుమారగిరిని విడువలేకనే లకుమ మరణాన్ని వరించింది. లకుమ మరణిస్తే "తన శరీరము, మనసు, సర్వమ్ము పాతాళ కుహరాన" పడిపోయినట్లుగా గగ్గోలు పడతాడు. తాను ఆరాధించిన లకుమ సందేశమే అతడ్ని జాగృతుడ్ని చేసింది. ఇటువంటి ప్రేమమూర్తిని, "నిత్యభోగపరాయణుడని, వారాంగనాభినయములతో కాలము గడిపెననీ" భావించినవారున్నారు.[1] ఈ మిథ్యావాదాన్ని వడ్డాది అప్పారావుగారు చాలా తీవ్రంగా ఖండించారు. కుమారగిరి జీవితాన్ని వారు ఇలా వివరించారు.

"కొమరగిరి పాలన కాలము ఆంధ్రదేశ చరిత్రలో గొప్ప ఘట్టము. ....దేశము నిరుపద్రవమగుటచే లలిత కళలు విస్తరించెను. వసంతోత్సవములు, కవిపండిత పరీక్షలకును, సంభావనకును సమయమయ్యెను. కొమరగిరి ఆంధ్రప్రజల ప్రేమకు పాత్రుడయ్యెను. అతని నాట్యశాస్త్ర పాండిత్యము అభినయ విద్యకు ప్రోత్సాహకమయ్యెను"[2]

---

1. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, శృంగార శ్రీనాథము, ద్వితీయ ప్రకరణము, పుట–57

2. రెడ్డి సంచిక, పుట–84

నారాయణరెడ్డిగారు కర్పూర వసంతరాయలైన కుమారగిరి జీవితాన్ని క్షుణ్ణంగా పరిశీలించి తన కావ్యాన్ని యిలా ముగించారు.

"కొమరగిరి చరితమ్ము కొండవీటను
శిశిరమును సైతము వసంతముగ రూపు గట్టించు
కొండవీటను పాదుకొన్నట్టి మట్టిలో
సైతమ్ము కర్పూర సౌరభమ్ములు వీచు"

ఈ ముగింపు వాక్యాలు కుమారగిరి పాత్రకు పరిపూర్ణమైన న్యాయాన్ని చేకూర్చాయి.

## లకుమ

లకుమాదేవి పాత్రచిత్రణలో నారాయణరెడ్డిగారు చూపిన ప్రతిభ అనన్య సామాన్యమైనది. "....రెడ్డిగారి మనస్సుమీద పీటవేసుకు కూర్చున్నది లకుమేకాని రాయడు కాదు. తమ సునిశిత కావ్యనిర్మాణ దృష్టిలో రెడ్డిగారికి రాయని ధరా ధురంధరత గుడ్డిగవ్వ వెల చేయలేదు. నిర్వ్యాజమైన కవిసహజ ధార్మికదృష్టికీ, సమదర్శన భావానికీ ఇది ఉదాహరణ. కవిదృష్టిలో లకుమ పుణ్యశీల, సుగుణాలవాల" [1]

లకుమ పాత్రకు కవి ప్రయోగించిన మొట్టమొదటి విశేషణం "కళాలక్ష్మి." కనుకనే కుమారగిరికి ఆరాధ్యదైవమయింది. నాట్యవేదికపై "మెఱుపు వలెనున్న యొక కాంత". మెఱుపు అశాశ్వతమైనది. లకుమ జీవితము అంతేనని ధ్వని. కళ్ళు మిరుమిట్లు గొలిపే ఆమె అత్యద్భుత సౌందర్యాన్ని కూడా పై విశేషణం వ్యక్తం చేస్తుంది. ఆమె ఒక "నర్తకి" మన్మథుని ఆరవ బాణంగా, అమృతాంశు పదునేడవ కళగా కుమారగిరి హృదయాన్ని దోచుకుంది. ఆమె పేరు "లకుమ" అని కాటయవేముడు తెలియజేస్తాడు. అసలు లకుమ అనే పేరు లోకానికి తెలిసింది కాటయవేముని వల్లనే. తాను వ్రాసిన శాకుంతల వ్యాఖ్యానారంభంలోని ఒక శ్లోకంలో లకుమ పేరును మొదట చెప్పినవాడు కాటయవేముడే.

1 [illegible] పు. 18

"జయతి మహిమా లోకాతీతః కుమారగిరి ప్రభోః
సదసి లకుమాదేవీ యస్య ప్రియా సదృశీ ప్రియా
నవమభినయ నాట్యార్ధానం తనోతి సహస్రధా
వితరతి బహూనర్థా నర్థి ప్రజాయ సహస్ర శః

ఇంతకు మించి లకుమ చరిత్రకు ఆధారాలు కనుపించవు నారాయణరెడ్డి గారు ఎంతో నేర్పుగా కాటయవేముని తోనే "లకుమ" పేరును చెప్పించారు. రెడ్డిగారు సమయస్ఫూర్తికి యిదొక చక్కని నిదర్శనము.

ఆమెనాట్యము జడప్రకృతికే గిలిగింతలు పెట్టినదట! లకుమ రాధగా అభినయించినవేళ, రాయలు తాను కృష్ణునిగా రూపొందినట్లు అనుభూతిని పొందాడు. లకుమను రాధగా పోల్చడము ఔచిత్యవంతంగా వుంది. తననాట్యముతో కళామర్మజ్ఞుడైన కుమారగిరిని ముగ్ధుణిచేసి, అతనిచేత రత్నహారాన్ని బహుమతిగా పొందిన భరతాగమ రహస్యపారీణ.

లకుమను "పాలసంద్రపు నురుగుపైన తేలిన యిందిర"గా, "తన కొరకు తపము చేసిన పార్వతిగా" కుమారగిరి ఊహించుకుంటాడు. కుమారగిరి రత్నహారాన్ని తనకంఠసీమలో అలంకరించేటప్పుడు, "సిగ్గుతో తలవాల్చి మొగ్గయైన" ముగ్ధ. రెడ్డిగారు " పురూరవుని " ముందవతరించిన ఊర్వశివలె, లకుమ కుమారగిరికి కనిపించింది." అని వర్ణించి, వారిరువురి సంబంధం శాశ్వతమైనది కాదని సూచించారు. కుమారగిరికి వచ్చిన కలలో లకుమను శకుంతలగా చిత్రించారు. కాళిదాసు శకుంతల శాపగ్రస్తురాలై (అదీ ప్రియుని విషయములో) దుష్యంతునకు దూరమైంది. లకుమకూడా విధిచేత శపించబడి, మహారాణికి ఇచ్చిన మాటకు కట్టుబడి, ఆత్మాహుతి చేసుకుంటుంది. లకుమ లోకజ్ఞురాలు.

" ఎచటనర్తకి? ఎచట వార్ధి స
మీడిత క్ష్మానాథ రత్నము?
తానెచట, సుకళాపయోధి క
ళానిధి వసంతేశు డెచ్చట? "

అని ప్రశ్నించుకొంటుంది. నారాయణరెడ్డిగారు లకుమ మనోభావాలను విశ్లేషించినతీరు హేతుబద్ధంగా వుంది. దుస్స్వప్నమువలన కలత చెందిన లకుమ,

" పూర్వ వాసనావళి గు
ప్పున తనలో గుబాళింప
ఆమె హారమును కన్నుల
కద్దుకొనెను ముద్దు గొనెను. "

కుమారగిరి తనమెడలో అలంకరించిన హారాన్ని తన మాంగల్యంగా భావించిన పరమసాధ్వి లకుమ.

లకుమ వినయశీలము గలది. రాజు ఆమెను రాజనర్తకిగా నియమిస్తూ, కానుకలు నిండిన పసిడి పళ్లెరాన్ని యిచ్చినపుడు

" లకుమ ఈషన్నత ముఖాంబుజ
లక్ష్మియై కించిత్ సముద్గత
పక్ష్మయై రాసిక్య రాశికి
ప్రభువునకు " అంజలిఘటించింది.

ఆమె సందేహాలు తీర్థయాత్రలో సడలిపోయాయి. వసంతరాయలను త్రికరణశుద్ధిగా ప్రేమిస్తుంది. రాబోయేజన్మలో కూడా రాయలు "యువ హృదయము"గా జన్మించాలని కోరుకుంటుంది. ఆమెకు కావలసింది భోగభాగ్యాలుకాదు, రాయలప్రేమ. కుమారగిరిని తన హృదయ పంజరంలో మేలిగే రామచిలుకగా భావిస్తుంది. ఆమె సద్గుణాలే ఆమెను కుమారగిరి " హృదయ పట్టమహిషి"గా చేశాయి. కుమారగిరి లకుమలు రతీమన్మథుల ప్రతిరూపాలుగా జీవించారు. లకుమ కుమారగిరి రసహృదయాన్ని చైతన్యవంతంచేసింది. లకుమ సాంగత్యంవల్లనే కుమారగిరి " వైదుష్యధార " పెల్లుబికింది. ఆమె ప్రదర్శించిన నాట్యవిశేషాలనే " వసంతరాజీయం"గా రచించాడు.

రాయలు ఆమెను " మట్టిముద్దనొక అనర్ఘమణిగా మలచితివి " అని కీర్తించినా,

" ప్రభూ! చరణదాసి నిటుల
ప్రశంసించతగునా?
కాలిధూళియే నాటికి
గంధపు పొడియగునా?

నీవొక నాగ స్వరమవు
నేనా నాగిని మాత్రము
ఇరువుర బంధించివేసె
నేదో అంతస్సూత్రము "

అని వినయంగా సమాధానమిస్తుంది కుమారగిరి " పాదసరాగాన్ని తనపాపట సిందూరముగా " ధరించే భాగ్యాన్ని ఆశిస్తుంది. కాటయ వేముని పట్ల లకుమకు ఎంతో గౌరవభావముంది. కాటయవేమునకు రాజుపైగల అభిమానాన్నిచూచి, అతని సహృదయతకు మనసులోనే నమస్కరిస్తుంది. కాటయవేముడు కుమారగిరిని కొలువుకూటానికి రావల సిందిగా కోరినపుడు, తానే స్వయంగా అలంకరించి పంపిస్తుంది. కాటయవేముడు కుమారగిరికి మహారాణి స్థితిని వివరించినపుడు.....

" పట్టమహిషి వ్యాధి మహా
పత్ప వమ్మునకు సూచిక
రాణిగారి సేమము దే
శాన కమృత రసవీచిక. "

అనిచెప్పి, కుమారగిరిని మహారాణి వద్దకువెళ్ళి, పరామర్శించవలసిందిగా ప్రార్థిస్తుంది. పవిత్రమైన, ఈర్ష్యాద్వేషాల కతీతమైన, ఋజుప్రవర్తనగల ఆదర్శమహిళగా లకుమ పాత్రను నారాయణరెడ్డిగారు తీర్చిదిద్దారు.

లకుమకు మహారాణిపట్ల భక్తి ప్రపత్తులున్నాయి. మహారాణిని "రాజమతల్లి" అని సంబోధిస్తుంది. కుమారగిరిని తన కౌగిట్లోబంధించి రాణికిదూరంచేయాలనే తలపు లకుమకు ఏనాడు లేదు. అర్ధరాత్రి సమయంలో రాణివచ్చి తనపేరును తెలిపినప్పుడు "లకుమగుండెలు జల్లుమన్నవట! రాణి తన పాదములపై తలనుపెట్టి విలపిస్తుంది. రాణికిచ్చిన మాటను నెరవేర్చుకోవడం కోసమై తన ప్రాణాలను అర్పించింది. లకుమ త్యాగశీలం "శిబిదధీచులను" అలంకరించింది. లకుమ "భువిపై అవతరిలిన శంపాలతిక" "శప్తయై దివినుండి భువిపై జారి వచ్చిన అచ్చర. వ్యక్తికన్నను దేశదృష్టియె గరిష్ఠమని, కుమారగిరిని జాగృతుణ్ణిచేసిన చైతన్యమూర్తి.

" నేటికిని లకుమ అందెల ఝణత్కారముల
వినిపించు కొండవీటను వీచు వాయువులు "

లకుమ చేసిన త్యాగం నిత్యస్మరణీయం. కళాస్వరూపిణి అయిన ఆమె రక్తంతో తడిసినకొండవీటి మట్టిలోసైతము కర్పూర సౌరభమే నిండి వుంటుంది. పంచభూతాత్మకమైన నిఖిలసృష్టికి లకుమయే ప్రతీక. పృథ్వి ఆమె కటిచక్రమూ, జలమామె కంటి పాపల లోతులు, తేజము ఆమె ముఖరాజీవము, వాయుగతి ఆమె నిశ్వాసములు, ఆకాశము ఆమె మధ్యము. పంచభూతాత్మకమైన యీ సృష్టి ఉన్నంతకాలం లకుమ చరిత్ర కీర్తింపబడేలా నారాయణరెడ్డిగారు లకుమాదేవి పాత్రను తీర్చిదిద్దారు.

## మహారాణి —

ఈ కావ్యంలో నారాయణరెడ్డిగారు మహారాణి పాత్రకు పేరుపెట్ట లేదు. దీనికికారణం కావ్యాల్లోగాని, శాసనాల్లోగాని ఆమె పేరు లభించక పోవడమే. మహారాణి "అదిసతికెనవచ్చు" పవిత్రురాలు. వసంతోత్సవంలో కుమారగిరి "పూవిల్తుని పూజించునపుడు నీడవోలె" అనుసరించింది. కుమారగిరి లకుమ నాట్యాన్ని చూచి రసావేశుడయి లకుమను చేరాలని ఆసనంపైనుండి లేవబోగా, మహారాణి "అతనిభుజాగ్రాన చేయిమోపి" యధాస్థితికి తెస్తుంది. లకుమకు రాయలు రత్నహారాన్ని బహూకరించిన పుడు "నవ్వలేకయె లోననవ్వుకొన్న" గంభీరురాలు. లకుమను చూచిన తరువాత తనభర్త మనసులో చెలరేగిన కోరికలను పసికట్టి కూడా, కుమారగిరిని పల్లెత్తుమాట అనదు. ఆమె వ్యక్తిత్వం ముందు రాయలు కుంచితాంగుడౌతాడు. రాజు లకుమా దాసుడౌతాడేమోనన్న భయంతో లకుమ రాజనర్తకి కాబోతున్నదనే వార్తనువిని కలవరపడుతుంది. ఆమెకు ఆవార్త "కల్వనెలత చెవులలో ఖరకరుని అశ్వరింఖల చప్పుడుగ" తోచింది. ఆమె జీవితంలో "తిమిరింపునీడలు" ప్రవేశించాయి. తన భర్త లకుమతో కలసి తీర్థయాత్రలకు వెళ్లాడనితెలిసి "అర్ధాంగికి చేసెడి మర్యాదయిదేనా ప్రభూ" అని తనలోనే కుమిలి కుమిలి యేడ్చినదేగాని, నోరువిప్పి తనబాధను ఎవ్వరితోనూ చెప్పలేదు.

ఆమె మనసు ఎప్పుడూ భర్తను అంటిపెట్టుకొని ఉంటుంది. లకుమ తొలిసారిగా రాయలను కౌగిలించినప్పుడు ఆమెకు వికృతస్వప్నం వచ్చింది. ద్రాక్షారామంలో కుమారగిరి "లకుమను తన హృదయపట్టమహిషిగా ప్రతిష్ఠించినపుడు" కొండవీడులో మహారాణి కలలో శయ్యపై పొరలి పొరలి నేలపై దొర్లింది. మేలుకొని భర్తను తలచి బిక్కు బిక్కుమని విలపించింది. కొండవీడుకు మరలి వచ్చిన రాజు ప్రక్కనే లకుమను చూచి సుడిగాలి చరచినట్లు, వడదెబ్బ తాకినట్లు వణకిపోతుంది. ఆమె కళ్ళలో అమవసలు జడలు విరబోసుకున్నాయి". రాజులకుమతో సుఖించిన కాలంలో, ఆమె విషాదాశ్రుమయ జీవితాన్ని గడిపింది. లకుమాదాసుడైన రాయులు తన మందిరానికి రాలేదన్న బాధకన్నా, రాచగద్దెనువిడిచి సభను తృణీకరించాడనేబాధను మహారాణి సహించలేకపోతుంది. రాజు దేశాన్ని మరచినందుకు పరితపించింది.

" కేళికామందిరము కన్నను
ఓలగమ్ము పవిత్రమైనది.
వ్యక్తి కన్నను దేశ సౌభా
గ్యమ్ము ఆదరపాత్రమైనది.
మనది ఒక సత్సంప్రదాయము
మన చరిత్రము శ్రవణ పేయము
మన కులమ్మున కింత వరకును
మహీ సంరక్షణమె ధ్యేయము "

అని కాటయవేమునకు రాణి చెప్పిన మాటలు ఆమె దేశభక్తికి నిదర్శనంగా నిలిచిపోతాయి. మహారాణి పాత్రపట్ల పాఠకులకుజాలి కలుగుతుంది. ఆమె ఆలోచనలపట్ల గౌరవం కలుగుతుంది.

మహారాణి కర్తవ్య నిష్ఠురాలు. ప్రజలు తన భర్తను లకుమాదాసుడని గుసగుసలాడటం ఆమెకు నచ్చదు. దేశక్షేమంకోసం, ప్రజా సౌభాగ్యం కోసం అర్ధరాత్రివేళ లకుమ యింటికివెళ్లి లకుమ పాదాలకు మొక్కుతుంది. ఎంతో జాలికలిగేలా యిలా ప్రార్థిస్తుంది.

" నిమ్నరాయలు కన్నులందున
నిల్పినందుకు పరితపించను
కాని దేశమ్మును తృణమ్ముటు
కాలద్రోయుట నెట్లు సైతును
గుండెరాయిగ జేసికొని కగ
కొక్క మాటయె యందునమ్మా!
భూపతిని ఎటులైన వీడి పో
వుటయె నీకు అవశ్యమమ్మా! "

రాణి ఉపదేశాన్ని అనుసరించి లకుమ ఆత్మాహుతి చేసుకొన్నా, మహారాణిపై పాఠకులకు కోపంరాదు. గౌరవభావమే మిగులుతుంది. ఈ కావ్యంలో పట్టపురాణి "భూదేవికి ప్రతినిధి". నిరుపమాన దేశభక్తురాలు.

## కాటయ వేముడు —

కాటయవేమారెడ్డి కుమారగిరి "మనసుకెక్కినట్టిప్రధాని", అతని బావ, సమర భీముడు. కుమారగిరి సంతోషం కోసం, రాజ్యసౌభాగ్యం కోసం అహర్నిశలు శ్రమించినరాజభక్తి పరాయణుడు. లకుమను రాజనర్తకిగా అభిషేకించడం, రాజు లకుమతో తీర్థయాత్రలకు వెళ్ళటం తనకు సమ్మతం కాకపోయినా తన అసంతృప్తినివ్యక్తంచేయని ధీరగంభీరుడు. అతడు "ప్రతివాసరపరిజృంభిత పరిపంధినృపాల జిగీషుడు." కుమారగిరి అతని సమరోత్సాహాన్ని గమనించి "చాంగురె? బావా! నీయురు శౌర్యమునకు జోహారులు" అని ప్రశంసిస్తాడు. కాటయవేముడు విజయ నగర రాజైన హరి హరరాయలను ఓడించిన వీరావతారుడు. శరణు జొచ్చిన హరి హరరాయలను మన్నించి, అతని కుమార్తెనుగృహలక్ష్మిగా స్వీకరించి యుద్ధ ధర్మములనుపాటించిన తేజస్వి. కుమారగిరి రచించిన వసంతరాజీయాన్ని పరిశీలించి, అతని కళాత్మక హృదయం ఉప్పొంగింది. సర్వోత్కృష్టమైన వసంతరాజీయాన్ని చూచి

" కాళిదాసుని నాటక వ్యా
ఖ్యా రచన ముగియించి మీ చర
ణాంబుజమ్ముల నుంచి ధన్యుడ
నౌదు .... "

అని కుమారగిరి విద్యత్తుకు మోకరిల్లిన రసజ్ఞుడు. లకుమ నాట్యకళాకౌశ లాన్ని గుర్తించిన "కళలపాల్కడలి". లకుమకు సోదరి సమానుడని ధ్వని. కాటయకాటయవేముని నుండి లకుమ యేనాడూ యిబ్బందిని ఎదుర్కో లేదు. లకుమ నిర్ణయం తెలిసినట్లయితే కాటయవేముడు ఆమెను రక్షించే వాడేమో అనిపిస్తుంది. తనకు ప్రాణసమానుడైన కుమారగిరి కోసమైనా ఆమెను కాపాడేవాడు.

రాజ్యంలోని అంతః కల్లోలాలను అణచివేసిన పరిపాలనా దక్షుడు. కుమారగిరి తనమాట మన్నించి కొలువు కూటానికి వచ్చేందుకు అంగీక రించినపుడు క్రొత్తదుర్గమవలీలగ కొల్లగొట్టినట్టుల ఉప్పొంగిన అల్పసం తోషి. మహారాణి స్థితినివివరించి. "దేశమ్ము కొరకైనను సరే. మీరు అర్ధాంగ లక్ష్మినోదార్చగా పోవలయు" అని మహారాజుకు కర్తవ్యాన్ని ఉపదేశిం చిన ఉత్తముడు. నారాయణరెడ్డిగారు కాటయవేమారెడ్డి పాత్రను నిరుప మాన రాజుభక్తునిగా, కుమారగిరి ఆత్మబంధువుగా, మహాపరాక్రమ వంతునిగా, సహృదయ రసజ్ఞునిగా, విద్వన్మణిగ ఎంతో ఉదాత్తంగా చిత్రించారు.

" శ్రీ నారాయణరెడ్డి గారిందలి నాలుగు పాత్రలను చాలనేర్పుతో చిత్రించియున్నారు." [1] అని డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు వెలిబుచ్చిన అభిప్రాయంలో అతిశయోక్తి లేదు.

## కర్పూర వసంతరాయులు నామౌచిత్యం

సాధారణంగా ఏకావ్యానికయినా నాయికా నాయకులను బట్టిగాని, కథా ప్రాధాన్యమును బట్టిగాని పేరుపెట్టడం జరుగుతుంది. కావ్యనామం కావ్యాత్మను సూచిస్తుంది. ఫలితార్థాన్ని నిరూపిస్తుంది. నారాయణరెడ్డి గారికి కర్పూర శబ్దంపై ఎంతో మక్కువ. తన బ్రతుకును కర్పూరలాం వెలిగించి, సాహిత్య సౌరభాన్ని దిగంతాలకు వ్యాపింపజేసిన మధురకవి.

1. డా॥ సి. నారాయణరెడ్డి కర్పూర వసంతరాయలు (కర్పూర సౌర భము) పుట-24.

"వసంతరాయలు" "కర్పూర వసంతరాయలు" అనే రెండు పదాలు పరిమళవంతమైన బిరుదులు. ఆంధ్రచరిత్రలో కృష్ణదేవరాయలు, అచ్యుత రాయలు, రఘునాథరాయలు వంటి పేర్లున్నవి కాని "కర్పూర వసంత రాయలు" వంటి పదం ఎంతో అపురూపంగా కనుపిస్తుంది. 14 వ శతాబ్దానికి పూర్వం ఈ బిరుదును ఏ మహారాజు కూడా ధరించినట్లుతోచదు. వసంతోత్సవాలను వైభవోపేతంగా నిర్వహించిన కొందరు రెడ్డిరాజులు, వారిబంధువులు, ప్రీతిపాత్రులైన వారి ఆశ్రితులు, ప్రముఖులైన మరికొందరు కర్పూర వసంతరాయలు, వసంతరాయలుగా వ్యవహరింపబడినారు.

నారాయణరెడ్డిగారు వ్రాసిన "కర్పూరవసంతరాయలు" కావ్యంలో కుమారగిరి నాయికుడు. ఇతనికి "వసంతరాయలు", "కర్పూర వసంత రాయలు" అనే బిరుదులున్నట్లుగా సమకాలీన కావ్యాల్లోను, శాసనాల్లోను (కుమారగిరి రెడ్డి నూతన అనపర్తి తామ్రశాసనము) తెలుపబడింది.[1] శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్రాసిన 'History of Reddy Kingdoms' అనే గ్రంథంలో, కుమారగిరి నిర్వహించిన వసంతోత్సవాల వివరాలను చదివి సహస్రమల్లికల సౌరభం ఒక్కుమ్మడిగా వీచినట్లు కవిగారు తన్మయులైనారు. వారికి కుమారగిరి చరిత్ర పరమాప్తంగా కనుపించింది. ఆ ప్రేరణతోనే వారికావ్యాన్ని రచించారు.

కుమారగిరి రెడ్డిరాజ్యస్థాపకుడైన ప్రోలయవేమారెడ్డి మనుమడు. ప్రోలయ వేమారెడ్డి హైందవ సంస్కృతిని పరిరక్షించడంలోను, శత్రునిర్మూలనంలోను నిమగ్నుడైనాడు గనుక వసంతోత్సవాల పట్ల విశేషమగు ఆసక్తినిచూపినట్లు కనుపించదు. అయితే ఇతనికాలంలో కూడా వసంతోత్సవాలు నిర్వహింపబడేవి. వేమారెడ్డి ఆస్థానకవి ఎఱ్ఱన రచించిన నృసింహపురాణంలోని వర్ణనలు పైవిషయాన్ని బలపరుస్తున్నాయి. వసంతోత్సవాలను నామమాత్రంగా నిర్వహించడంచేత, ఇతడు "కర్పూర వసంత రాయలు"గా వ్యవహరింపబడలేదని భావింపవలసియున్నది. కుమారగిరి తండ్రి అనపోతారెడ్డి మోటుపల్లి రేవు పట్టణాన్ని వ్యాపార కేంద్రంగా అభివృద్ధిచేసి, సుగంధ ద్రవ్యాలపై సుంకాన్ని తగ్గించి, వసంతోత్సవాలు

1. రెడ్డి సంచిక–పుట 382.

వైభవోపేతంగా జరగడానికి దోహదంచేశాడని చెప్పవచ్చు. రాజధానిని అద్దంకినుండి కొండవీడుకు తరలించి, కొండవీడును దుర్భేద్యమగు గిరిదుర్గంగా నిర్మించినవాడు అనపోతారెడ్డి.

## అనవేమారెడ్డి —

అనపోతారెడ్డి తరువాత అతని సోదరుడు అనవేమారెడ్డి మహారాజై వసంతోత్సవాలను నిర్వహించి, "వసంతరాయుల"ని కీర్తింపబడినట్లుగా శాసనాధారాలున్నాయి. ద్రాక్షారామ శాసనంలో అనవేముని కాలంలోని వసంతోత్సవాల వైభవం ఎంతో హృద్యంగా చిత్రించబడింది.

> స్రపోలమాంబా తనయః కృతార్థో వసంతకాలీం ప్రతివర్షమర్ఘ్యం
> కస్తూరికా కుంకుమ గంధసార హిమాంబు కర్పూర ముఖైశ్చకారశ్చ
> వసంతరాయశ్చ వసంతకేళా కస్తూరికారేణు జయాంబువాహః
> క్షిప్తం హిమాంభోఘనవర్షధారా కర్పూరకఖండాః కరకావికీర్ణాః [1]

ధర్మవేమన్నగా ప్రఖ్యాతిచెందిన ఈ మహారాజు కాలంలో ప్రజలు ఎంతగానో సుఖించారని, జనులకు మధురాన్నము, మృదులాంబరము, మృగమదము, చామీకరము, చామరము లభించేవని తెలుస్తుంది. [2] అనవేమారెడ్డి "ఘనసార కస్తూరికాది వస్తువిస్తార విరచితా పూర్వ వసంత విహారు" [3] నిగ కీర్తించబడ్డాడు. పినతండ్రి నిర్వహించిన యీ వసంతోత్సవాలను కుమారగిరి మరింత వైభవంగా కొనసాగించాడు.

## అవచి తిప్పయశెట్టి —

"కొమరగిరి రాజదేవేంద్రుని కూర్మిహితు" [4] నిగా శ్రీనాథునిచే ప్రస్తుతింపబడిన అవచి తిప్పయశెట్టి అనే వర్తక శ్రేష్ఠుడు కూడా "కర్పూర వసంతరాయలు" బిరుదును కల్గివున్నట్లు హరవిలాసంలో వివరింపబడింది.

---

1. రెడ్డి సంచిక-పుట 66
2. డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి, శ్రీనాథుడు, పుట-12, 13.
3. అందే పుట-13.
4. శ్రీనాథుడు, హరవిలాసము-అవతారిక 26.

" కర్పకప కొండ్రిపి సేవక!
కర్పూరవసంతరాయ! కావేరితా
దర్పిత రిపుగర్వ తమో
హర్పతి సౌకర్య దక్షయంబురుహాక్షా! [1]

కుమారగిరి కొండవీడును పాలించేకాలంలో, అవచి తిప్పయ "సుగంధి శాలాధ్యక్షుడు"గా వ్యవహరించాడు. కుమారగిరి రెడ్డి ఎంతో వేడుకగా జరిపే వసంతోత్సవాలకు సంబంధించిన గంధసారము, కస్తూరి, కుంకుమ, కర్పూరము, పన్నీరు మొదలైన సుగంధద్రవ్యాలతో కూడిన సుగంధి శాలలను పర్యవేక్షించేవాడు.

" కొమరగిరి నృపవసంతా
గమకేళీ గంధసార గస్తూరీ కుం
కుమ కర్పూర హిమాంబు
స్వము దంచిత బహుసుగంధి శాలాధ్యక్షా! [2]

వసంతోత్సవప్రియుడైన కుమారగిరి అవచి తిప్పయశెట్టిని ఎంతగానో మన్నించి, ఉచితమైన స్థానాన్ని కల్పించాడు. దానికికారణం అవచి తిప్పయ వసంతోత్సవాలకు కావలసిన సుగంధద్రవ్యాలను కొరత లేకుండా సమకూర్చటమే. అవచి తిప్పయ ".. ..... కొమరగిరి వసంత నృపాలువలన నాందోళికాచ్ఛత్ర చామర తురంగాది రాజ్య చిహ్నములు వడసియమ్మహారాజునకుం బ్రతివత్సరంబును సంవత్సరోత్స వంబునకుం దగిన కస్తూరీ కుంకుమ ఘనసార సంకుమద హిమాంబుకాలాగరు గంధసార ప్రభృతి సుగంధద్రవ్యంబు లొడగూర్చు," [3] వణిక్ప్రముఖుడు.

రెడ్డిరాజుల బిరుదుల్ని వారి మంత్రులు, సామంతులు, బంధువులు, ప్రభుత్వ సంబంధులు ధరించే సంప్రదాయం ఉన్నదిగనుక, కుమారగిరి

---

1. శ్రీనాధుడు, హరవిలాసము; ద్వితీయాశ్వాసము-144.
2. శ్రీనాధుడు, హరవిలాసము, ప్రధమాశ్వాసము, 30 వ పద్యం
3. అందే, అవతారిక-7 వ వచనము.

పైగల రాజభక్తితో అవచి తిప్పయశెట్టి "కర్పూర వసంతరాయలు" అనే బిరుదాన్ని ధరించి ఉండవచ్చు. "శ్రీమత్కుమార శైలస్వామి (కుమార గిరి) కృపాలబ్ధ నిత్య శాశ్వత విభువుడు"[1] కనుకనే అవచి తిప్పయ "కర్పూర వసంతరాయలు" బిరుదుకు అర్హుడు కాగలిగినాడు.

## మామిడి సింగనామాత్యుడు

శ్రీనాధుని శృంగార నైషధాని కృతిపతి అయిన మామిడి సింగనా మాత్యుడు కూడా "కర్పూర వసంతరాయలు" గా గణుతికెక్కాడు.

> "నవరత్నావల దివ్యలింగ వరదాన ప్రీత దాక్షాయణీ
> ధవ, 'కర్పూర వసంత రాయ', యనవద్య ద్వాదశీ వాసరో
> త్సవ రుక్మాంగన, వేమభూపతి మహా సామ్రాజ్య రక్షామణీ
> యవనాధీశ సభానిరంకుశ వచోవ్యాపార పారంగతా![2]

మామిడి సింగనామాత్యుడు పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో మహామంత్రి. "పెదకోమటి వేమభూపాల కరుణా పాత్రుడు"[3] ప్రభుత్వాధికారియైన సింగనామాత్యుడు సంప్రదాయాన్ని బట్టి రెడ్డిరాజులకు ఉన్న జగనొబ్బగండ, త్రిభువన రాయవేశ్యాభుజంగ, కదనగాండీవి, చెంచుమల చూరకార మొదలైన బిరుదులు ధరించాడు. అందువలన సింగనామాత్యుడు "కర్పూర వసంతరాయలు" బిరుదాన్ని అలంకార ప్రాయంగా ధరించాడని చెప్పవచ్చు. పెదకోమటి వేమారెడ్డి "కర్పూర వసంతరాయలు"గా ప్రసిద్ధి చెందకపోయినా, అతడుకూడా యీ బిరుదాన్ని కలిగి వుంటాడని ఊహించవచ్చును. కుమారగిరి కాలంలో రాజుకు సన్నిహితుడు, సుగంధి శాలాధ్యక్షుడూ అయిన అవచి తిప్పయ "కర్పూర వసంతరాయలు" బిరుదును ధరించినట్లుగా, పెదకోమటి వేమారెడ్డి కాలంలో మహామంత్రి అయిన మామిడి సింగనామాత్యుడు "కర్పూర వసంతరాయలు" బిరుదుతో సన్మానించ బడినట్లు తలపవలసి ఉన్నది.

---

1. శ్రీనాధుడు, హరవిలాసం, పంచమాశ్వాసము, 1వ పద్యము.
2. శ్రీనాధుడు, శృంగార నైషధము, ద్వితీయాశ్వాసము 144 వ పద్యం
3. అందే, అష్టమాశ్వాసము, 202 వ వచనము.

## వీరభద్రారెడ్డి :

రాజమహేంద్రవరం రెడ్డిరాజుల్లో వీరభద్రారెడ్డికి "కర్పూర వసంత రాయలు" అనే బిరుదున్నట్లు శ్రీనాధుని కాశీఖండంలో వర్ణించబడింది.

" అని యనంతరంబ 'కర్పూర వసంతరాయడు' వీరభద్రేశ్వరుడు కర్పూర తాంబూల సహితంబుగా జాంబూనదాంబరాభరణంబు లిచ్చినం బరిగ్రహించి "[1]

వీరభద్రారెడ్డి కొండవీటి రాజ బంధువు. కాటయవేముని కుమార్తె "అనితల్లి"ని చేపట్టిన పరాక్రమవంతుడు. కొండవీటి రెడ్డి రాజుల ఆచార వ్యవహారాల్ని తు.చ. తప్పకుండా రాజమహేంద్రవరం రెడ్డిరాజులు అనుసరించేవారు. వీరభద్రారెడ్డి వసంతోత్సవాలను ప్రతి సంవత్సరం నిర్వహించేవాడని నిశ్శంక కొమ్మన శివలీలా విలాసం వల్ల తెలుస్తున్నది.

" ప్రతివత్సర వసంత మహోత్సవ నిర్భర సందర్భ విహార సముచిత వసంతరాయ తథ్యా ప్రదాన వివిధ వీధికాధిగత తత్తత్పదార్థ విశేషంబును ... నగుచు తేజరిల్లు నా రాజమహేంద్రవరంబున కధీశ్వరుండు... .... అల్లనృప వీరభద్రవిభుడు "[2]

వంట వంశకమల మిత్రుడయిన వీరభద్రారెడ్డి నిర్వహించిన వసంతోత్సవాల వైభవము కాశీఖండంలో యిలా వర్ణించబడింది.

> "కలపుంస్కోకిల కంఠకోమల కుహూకార స్ఫురత్పంచమ
> స్థల వద్వశ్యములైన కాలముల మార్కండేయనాధేశ్వరున్
> లలితోరస్కుడు వీరభూపతి వసంతం బాడు నీవీటి వీ
> థులఁ గర్పూర హిమాంబు సంకుమది కస్తూరీ పటీరంబులన్"[3]

---

1. శ్రీనాధుడు, కాశీఖండము - పీఠిక 15 వ వచనము
2. నిశ్శంక కొమ్మన, శివలీలా విలాసము, ప్రధమాశ్వాసము, 50,60
3. శ్రీనాధుడు, కాశీఖండము, ప్రధమాశ్వాసము, 59 వ పద్యము

అయితే అవచి తిప్పయసెట్టివలె, మామిడి సింగనామాత్యునకు వలె "కర్పూర వసంతరాయలు" బిరుదమును వీరభద్రారెడ్డికి " ... అలంకార బిరుదము కాదు. అనవేమారెడ్డివలె, కుమారగిరి రెడ్డివలె వీరభద్రారెడ్డికి కూడ ప్రతి సంవత్సరము వసంతోత్సవములు చేయుటవలన సార్థక బిరుదము"[1] అను కొర్లపాటి శ్రీరామమూర్తిగారి అభిప్రాయము సమంజసంగా కనుపిస్తుంది. వీరభద్రారెడ్డి సోదరుడైన వేమారెడ్డి కూడా ప్రతి సంవత్సరము వసంతోత్సవాలను నిర్వహించేవాడని నిశ్శంక కొమ్మన శివలీలా విలాసంలో తెలుపబడింది.

"ఉక్తవేళల షోడశోపచారంబుల
శివుని చిత్తము రంజితము సేయు
బ్రతి వత్సరంబు నుద్భట వసంతోత్సవ
శ్రీలదిక్చయము వాసితముచేయు
...... ... ...[2]

ఇతనికి కర్పూర వసంతరాయలు బిరు దున్నట్లు కనుపించదు.

రెడ్డిరాజులేగాక మరికొందరు "వసంతరాయలు"గా వ్యవహరింపబడినారు. వెలుగోటి వారి వంశచరిత్రలో.... " ఆ యవచోళమనేనికి సర్వజ్ఞ సింగమనేడున్నూ, వసంతరాయడు నృపరుశేగ్రజుండు"[3] అని ఉన్నది.

అసలు అతనిపేరు వసంతరాయడో, లేక ప్రసిద్ధనామమోగాని వివరములు లేవు. సాహితీ సమరాంగణ సార్వభౌము డయిన శ్రీకృష్ణ దేవరాయలు ప్రతి సంవత్సరము వసంతోత్సవాలు నిర్వహించేవాడని, కవి పండిత గోష్ఠులతో వినోదించేవాడని నంది తిమ్మన పారిజాతాపహరణంలో వర్ణించబడింది.

---

1. డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి, శ్రీనాథుడు, పుట - 41
2. రెడ్డి సంచిక - పుట 371.
3. వేటూరి ప్రభాకరశాస్త్రి, శృంగార శ్రీనాథము, అనుబంధం - 4

ప్రతి వర్షవసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంభిత కావ్య
స్ఫూర్తి రోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూ ప్రసాద రసికా[1]

అయితే కృష్ణదేవరాయలు "కర్పూర వసంతరాయలు"గా కీర్తిని పొందలేదు.

శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారు తమ కాలజ్ఞానంలో "తాను కలియుగంలో తిరిగి "వీరభోగ వసంతరాయలుగా" జన్మిస్తానని. భక్తులకు తెలిపినట్లు వివరించబడింది. బ్రహ్మంగారు చెప్పిన "వీరభోగవసంతరాయలు" పదానికి, 14.15 శతాబ్దాలలో రెడ్డిరాజులు ధరించిన కర్పూర వసంతరాయలు బిరుదానికి కొంతపోలిక కనుపిస్తుంది. "వసంతరాయలు" అనేపదం కాలక్రమేణా ఎంతో పవిత్రతను, గొప్పదనాన్నీ సంపాదించు కున్నదనడానికి బ్రహ్మంగారి కాలజ్ఞానంలో వాడబడటమే నిదర్శనం. ఇప్పటికీ కొన్ని కుటుంబాల వారు బ్రహ్మంగారు "వీరభోగ వసంతరాయలు"గా జన్మిస్తాడనే విశ్వాసంతో వ్రతాలు చేస్తున్నారు! నియమాలు పాటిస్తున్నారు.[2] తమిళదేశంలోని "ముద్దు వీరప్ప" కు వీరభోగ వసంతరాయలనే పేరువుంది.[3]

## కుమారగిరి విశిష్టత

ఎందరెన్ని విధాలుగా కీర్తించబడినప్పటికీ, వసంతోత్సవాల కారణంగా ప్రసిద్ధిపొందినవాడు కుమారగిరి రెడ్డి మాత్రమే. కుమారగిరిని "వసంతరాజు"గా కీర్తించారు. వసంతరాజుచే వ్రాయబడిన నాట్యశాస్త్రం కూడా వసంతరాజీయమనే పిలువబడింది.

"ప్రోక్తం వసంతరాజేన కుమారగిరి భూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్"[4]

---

1. నంది తిమ్మన - పారిజాతాపహరణము.
2. పలనాడులోని అడిగొప్పులలో ఆలా ఆచరిస్తున్నారు. ముఖాముఖి, శ్రీ చిటిప్రోలు సుబ్బారావు, ఆంధ్రోపన్యాసకులు, నరసరావుపేట-'82 మే
3. కన్నెగంటి రాజమల్లాచాగారి లేఖ
4. రెడ్డి సంచిక - పుట 356

చరిత్రను క్షుణ్ణంగా పరిశీలించిన తరువాతనే నారాయణరెడ్డిగారు కుమారగిరిని నాయకుడుగాచేసి, అతని చరిత్రను పరమాప్తంగా భావించి, ఈ కావ్యానికి "కర్పూర వసంతరాయలు" అనే పేరు పెట్టారు.

రెడ్డిగారి దృష్టిలో "కర్పూర వసంతరాయలు" ప్రధానంగా కుమారగిరి రెడ్డి మాత్రమే. వసంతోత్సవాలు కుమారగిరి జీవితంలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించాయి. ఈ అంశాన్ని నారాయణ రెడ్డిగారు—"కుమారగిరి ప్రతి సంవత్సరం చైత్ర శుద్ధ త్రయోదశి మొదలుకొని తొమ్మిది రోజులు వసంతోత్సవాలు నిర్వహించేవాడు. ఈ ఉత్సవాలకోసం సుగంధద్రవ్యాలను విదేశాలనుండి తెప్పించడానికి అవచి తిప్పయశెట్టి ప్రత్యేకాధికారిగా ఉండేవాడు. సెట్టి-కుమారగిరి ద్రవ్యభాండాగారానికి అధ్యక్షుడు. పంజాబునుండి కర్పూర పాదపములు, గోవానుండి సంకుమదద్రవము తెప్పించేవాడు. ఉత్సవాలకు విచ్చేసిన జనంమీద ప్రభువు కర్పూర ఖండాలను, కస్తూరిని, గొజ్జగినీటిని వెదజల్లుతూ వినోదించేవాడు. అందుకే కుమారగిరికి "కర్పూర వసంతరాయ బిరుదు సార్థకమైంది." [1] అని వివరించారు. కుమారగిరి నిర్వహించిన వసంతోత్సవాల స్వరూప స్వభావాలను సర్వాంగ సుందరంగా చిత్రించారు.

కావ్యనాయకుడు "వసంతరాజు"గా "కర్పూర వసంతరాయలు"గా చరిత్ర ప్రసిద్ధిచెందిననాడు కావడంచేత, నారాయణరెడ్డిగారు ఈకావ్యాన్ని వసంతోత్సవాలతో ప్రారంభించడం మిక్కిలి సముచితంగావుంది. వైతాళికులచే కుమారగిరిని "జయ జయ వసంతరాడ్బిరుదా" అని కీర్తింపజేయడంలో రెడ్డిగారి చారిత్రకపరిజ్ఞానం, నిశితమైన పరిశీలన, వ్యక్తమౌతాయి. పంచభూతములు ఒక్కసారిగా "ఓ వసంత ప్రభూ!" అని మైమరచి శబ్దించినవని చెప్పడంలో, కుమారగిరికి ఉన్న "కర్పూర వసంతరాయలు" బిరుదు, అతడు నిర్వహించిన వసంతోత్సవాలు జగద్విఖ్యాతమని వెల్లడిచేయడమే కవిగారి ఉద్దేశంగా కనుపిస్తుంది. ఈ వసంతోత్స

---

1. డాక్టర్ సి. నారాయణరెడ్డి, కర్పూరవసంతరాయలు (భూమిక) పుట, 9-10.

వాల్లోనే నాట్యరాణి లకుమ కుమారగిరికి కనుపించడం, అతని జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభం కావడం సంభవించింది. కావ్యం చివరిలో కవిగారు ...

" కొమరగిరి చరితమ్ము కొండవీటను శిశిర
ము సైతము వసంతముగ రూపుగట్టించు
కొండవీటను పాదుకొన్నట్టి మట్టిలో
సైతమ్ము కర్పూర సౌరభమ్ములు వీచు"

అని వర్ణించడంలో కుమారగిరి వసంతోత్సవాలు నిర్వహించడంలో చూపిన ఉత్సాహం, కృషి, రసికృత ప్రస్ఫుటమౌతాయి. లలితకళా రసజ్ఞుడైన కుమారగిరి జీవితాన్ని ప్రధానంగా తీసుకొని, ఈ కావ్యాన్ని వ్రాయడం చేత "కర్పూర వసంతరాయలు" అనే పేరు పెట్టడం మిక్కిలి సముచితంగా వుంది.

రెడ్డిరాజులు నిర్వహించిన వసంతోత్సవాలను నారాయణరెడ్డిగారు చారిత్రక ప్రమాణాలతో రచించారు. ఎఱ్ఱన, శ్రీనాథుల వర్ణనలను అధారంగా స్వీకరించారు ఈ విషయాన్ని "కర్పూరవసంతరాయలు - కావ్యానుశీలనం" అనే సిద్ధాంతవ్యాసంలో సోదాహరణంగా వివరించాను [1]

## నేటిరచనల్లో "లకుమా కుమారగిరులు"

డాక్టర్ సి. నారాయణరెడ్డిగారి "కర్పూర వసంతరాయలు" పాఠక లోకానికి పరిచయం కాకపూర్వమే 'కుమారగిరి, లకుమల' చరిత్రను వివరించే కొన్ని రచనలు వెలువడ్డాయి. నారాయణరెడ్డిగారి కావ్య భూమికలో " ...చారిత్రక సత్యాల పునాదుల మీదనే ఈ కావ్యం నిర్మించినాను. దీనిలోని కథమాత్రం కేవలం కల్పితం. కొన్నేళ్ళ క్రితం "భారతి"లో లకుమాదేవికి సంబంధించిన ఒక నాటిక ప్రచురితమైందని మిత్రులన్నారు. నేను దానిని చూడలేదు. నారుచికి అనుగుణంగా, చరిత్ర ప్రమాణాలకు క్షతికల్గకుండా ఈ కథను అల్లుకున్నాను." [2] అని వివరించారు.

---

1 మడకా సత్యనారాయణ, "కర్పూరవసంతరాయలు - కావ్యానుశీలనం' అముద్రిత సిద్ధాంతవ్యాసము, 3,4 భాగాలు.

2. డా॥ సి.నా.రె. "కర్పూర వసంతరాయలు" భూమిక - పుట II

## లకుమాదేవి – శ్రీభావరాజు వేంకట కృష్ణారావు :

1939 ఏప్రిల్ నెల భారతిలో "లకుమాదేవి" అనే శీర్షికలో శ్రీ భావ రాజు వేంకట కృష్ణారావుగారు వ్రాసిన కథ ప్రచురింపబడింది కథను ముగించిన తరువాత శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు గారు– "ఇంతవ రకు చదివినదంతయు కేవల కల్పనా కథగాని చరిత్రగాదు. లకుమాదేవి, కుమారగిరి,వసంతభూపాలుడు, కాటయవేమారెడ్డి, ఇమ్మడి హరిహర రాయ మహారాయలును మాత్రము చారిత్రక పాత్రములు. గృహరాజ సౌధమును చరిత్రయందు ప్రసిద్ధికెక్కినదే. "కూర్మినమరావతికి జోడై"యిన కొండవీడు, ఒకనాడు ఆంధ్రమహానగరమై విరాజిల్లెను. ఇట్టిచరిత్ర ప్రసిద్ధములయిన సామగ్రియందు ఒక కల్పనా కథను పొదవినారము! చదువరి యీ కల్పనను చరిత్రయని భ్రమపడి మోసపోకుండునుగాక!"[1] అని విపులీకరించారు.

వీరి కథలో "లకుమాదేవి కొమరగిరి భూపాలుని భోగపత్ని, వారాం గన. ఆ మహారాజేంద్రునికి కడుగూర్చు ప్రియురాలు." వసంతరాయ బిరుదాంచితుడైన కుమారగిరి సమస్త కళాకలాపచతురుడు. కుమారగిరికి చిన్ననాటి స్నేహితుడైన దోరవరెడ్డి సేనాని, రాజుగారి అనుగ్రహాన్ని పొందాలనే ఉద్దేశ్యంతో సమస్త గాంధార్వ విద్యావేదినియైన నర్తకిని కానుకగా సమర్పిస్తాడు. ఆమెయే లకుమ. ఆమె సౌందర్యానికి కుమార గిరి సమ్మోహితుడవుతాడు. ఆమెను తన కొలువుకూటంలో రాజనర్తకిగా నియమిస్తాడు. ఈ లకుమ శావరట్టడికిని, వేంపల్లి భావనారాయణస్వామి. దేవదాసియైన వల్లెమకూ జన్మించిన ఏకైక పుత్రికగా వేంకట కృష్ణారావు గారు తమ కథలో ఊహించారు.

కుమారగిరి లకుమాదేవి సంగీత నృత్యాలలో వినోదిస్తూ, అజాగ్ర త్తగా ఉండటాన్ని గమనించి విజయనగర సార్వభౌముడయిన హరిహరరా యలు మోపూరు సీమను, రేనాటిసీమను, మోటుపల్లిసీమను ఆక్రమిస్తాడు.

---

1. డాక్టర్ సి. నారాయణరెడ్డి, కర్పూర వసంతరాయలు (భూమిక), పుట – 11.

కాని కాటయవేమారెడ్డి మహాసైన్యసమేతుడైపోయి శత్రువులు జయించిన రాజ్యభాగాన్ని కైవశం చేసుకుంటాడు. హరిహరాయలు కాటయవేముని ధాటిని అడ్డుకోలేక ఓటమిని అంగీకరిస్తాడు. భవిష్యత్కాలంలో రెండు రాజ్యాలవారికీ యుద్ధప్రమాదం ఏర్పడరాదనే సదభిప్రాయంతో తన మనుమరాలిని కాటయవేమునికిచ్చి పెండ్లిచేస్తాడు. ఈ వృత్తాంతం జరిగిన తరువాత, కుమారగిరి శ్రీశైలయాత్ర చేస్తాడు. శ్రీశైలంలో ఉండగా అహోబల నృసింహుని సందర్శించాలనే కుతూహలం కలుగుతుంది. తాను చిన్నతనంలో ఎంతో ఆప్యాయంగా చదివిన శంభుదాసుని నృసింహ పురాణంగాథ జ్ఞాపకమొస్తుంది. వెంటనే అహోబలానికి వెళతాడు. ఆనాడు ఫాల్గుణ శుద్ధపూర్ణిమ. నృసింహస్వామికి ఆరోజు ఎంతోవైభవంగా గరుడోత్సవం జరుగుతుంది. చెంచులక్ష్మితోసహా పన్నగశయనుడు డోలాయాత్రను చేస్తాడు. ఆబాలగోపాలం కామోత్సవాన్ని నిర్వహించి ఆనందిస్తారు శివుని దివ్యలీలలను ఆకర్ణిస్తారు. ఆనాటి వెన్నెలరాత్రి, కుమారగిరి నృసింహదేవుని సమక్షంలో లకుమ నృత్యాన్నిచూచి పరవశిస్తాడు. ఆసంతోషంలో తన బావగారయిన కాటయరెడ్డితో "బావా! మీరభ్యసించిన భరతనాట్య శాస్త్రమునకీ లావణ్యవతి సంపూర్ణవ్యాఖ్య కాదుగదా!" అని సరసమాడతాడు. ఆ తరువాత తనమెడలోని రత్నహారాన్ని లకుమకు బహూకరిస్తాడు. కుమారగిరి మన్నన లకుమకు ఊహించని విధంగా లభించింది. "కాని- తానెక్కడ! క్షుద్రవారాంగన, నట్టువపట్టి. ఆంధ్ర క్షమా మండలాఖండలుడు, జగత్ప్రసిద్ధుడు, పూజ్యుడు, ధరయేలిక కొమరగిరి క్ష్మారమణుడెక్కడ?" అని లకుమ పరిపరివిధాలుగా ఆలోచిస్తుంది.

మహారాజు శిబిరంలోను, అంగడి వీధుల్లోనూ, వీధివిటంకములందు "చందనమున కలయంపిచల్లినారు. కర్పూర రజమున ముగ్గిలిడినారు. కుంకుమపువ్వుతోడను రంగవల్లికలు దిద్దినారు. అరవిచ్చిన తామర పూవులను అందందు తోరణములుగట్టినారు. ఆ శుభసందర్భంలో లకుమ నానా విధములైన నాట్యలీలలను అభినయిస్తుంది. "శిరము, చూడ్కులు, చెక్కిళ్లు, కనుబొమలు, మొదలగు అంగోపాంగముల నాట్యమభినయించెను" అని కృష్ణారావుగారు లకుమ ప్రదర్శించిన నాట్యవిధానాలను అభివర్ణించారు.

లకుమపైగల ప్రేమతో కుమారగిరి ఆమె నివాసమునకై గృహరాజ సౌధాన్ని నిర్మింపజేస్తాడు. అది మూడంతస్తులుగల ఒంటిగోపురపు పెద్ద మేడ. వీరిరువురి ఆదర్శప్రేమ ఎందరికో కంటగింపుగా మారుతుంది. కుమారగిరికి లకుమాదేవి శీలంపై అనుమానాన్ని కలిగించడానికి ఎవరో కుట్రపన్నారు. లకుమనుగూర్చి అపనిందలు ప్రచారమవుతాయి. కుమారగిరి మొదట ఆనిందను విశ్వసించలేదు. కాని చివరకు అతడుకూడా లకుమను పరీక్షించాలని భావించాడు. గృహరాజ సౌధగోపుర శిఖరాన్నుండి క్రిందకు దుముకవలసిందిగా లకుమను కుమారగిరి ఆజ్ఞాపిస్తాడు. లకుమ కుమారగిరి ఆజ్ఞను శిరసావహించి క్రిందకు దుముకుతుంది. "లకుమాదేవి ధరించిన పావడ అపుడామెకు రక్షణసాధనమయ్యెను. మృత్యువాతబడదలచి, నాట్యశాస్త్రోపాధ్యాయ గావున, ఆమె ఒయ్యారముగ దుమికెను. ఆయొయ్యారము శోభనాస్పదమై వెల్గుచుండ, ధరించినట్టి పావడ విచ్చిన ఆతపత్రమట్లు రక్షింప, మెల్లగ నాకల్యాణి నేలకు వ్రాలెను" ఆ తరువాత లకుమ కుమారగిరిని ఉద్దేశించి "ప్రాణవల్లభా! తమ పరీక్ష పూర్తియైనది. నేను అకలంకను. కాని నేను తమచరణదాసిగా నుండనన ర్హను. క్షమింపుడు...."అనుచు ఒడ్డాణములో దాచుకొనియున్న చేకత్తితో పొడుచుకొని మరణిస్తుంది." "గృహరాజ సౌధముపై కొన్ని దినములకు పిడుగు పడి పాడుపడియెను. సర్వమునక్కడ తుత్రిటిలో కూలిపోయెను" అని వేంకట కృష్ణారావుగారు కథను ముగించారు.

నారాయణరెడ్డిగారి కావ్యానికీ, శ్రీభావరాజు వేంకట కృష్ణారావుగారి కథకూ కొన్ని పోలికలు కనుపిస్తున్నాయి. లకుమాదేవి కుమారగిరి ఆస్థాన నర్తకి కావడమూ, విజయనగర రాజైన రెండవ హరిహరరాయలపై కాటయ వేమారెడ్డి దండయాత్ర, కుమారగిరి లకుమల తీర్థయాత్ర, కుమారగిరి కాటయవేముల సరస సంభాషణం, కుమారగిరి లకుమకు రత్నహారాన్ని బహూకరించడం, వసంతోత్సవ వైభవం, లకుమ ప్రదర్శించిన నాట్య విశేషాలు, గృహరాజ సౌధవృత్తాంతం, ప్రజలలో అలజడి చెలరేగడం, (కారణం వేరైనప్పటికీ) లకుమ కత్తితో పొడుచుకొని చనిపోవడం వంటి కథాభాగాలు కావ్యంలోనూ కనిపిస్తున్నాయి.

అయితే నారాయణరెడ్డిగారి కావ్యంలోని కొన్ని రసవత్తరమైన సన్నివేశాలు యీకథలో లేవు. తమ రాజ్యాన్ని రక్షించుకోవడం కోసమై పట్టపురాణి, అర్ధరాత్రి సమయంలో లకుమాదేవి. కుమారగిరి నివసించే కేళీమందిరానికి వెళ్లి, లకుమ కాళ్లపై బడి, ఆమెను వేడుకునే సంఘటనను నారాయణరెడ్డిగారు ఎంతో గొప్పగా తీర్చిదిద్దారు. ఒక సామాన్యమైన నర్తకిని పట్టపురాణి ఎంతో దయనీయంగా అర్థించే యీ సంఘటన పాఠక లోకాన్ని కదిలించివేస్తుంది. ఆమె త్యాగదీక్షను అత్యున్నతంగా భాసింపజేశారు రెడ్డిగారు. వేంకట కృష్ణారావుగారి కథలో పట్టపురాణి విషయం ప్రస్తావించబడలేదు.

నారాయణరెడ్డిగారి కావ్యంలో వాగ్దాన బంధితురాలైన లకుమ మానసిక క్షోభను అనుభవించి, ఆత్మాహుతి చేసుకున్న సంఘటన అత్యున్నతంగా తీర్చిదిద్దబడింది. భావరాజువారి కథలో లకుమ మరణించిన పద్ధతి సమంజసంగా లేదు. ఆమె సౌధాగ్రాన్నుండి, (అది సుమారు దంతస్తుల ఒంటిగోపురపు పెద్దమేడ) దూకి కూడా చెక్కుచెదరకుండా జీవించగల్గటం అసహజంగా ఉంది. చారిత్రాత్మకమైన ఇతివృత్తాన్ని తీసుకున్నపుడు సాధ్యమైనంతవరకు అవాస్తవికత చోటుచేసుకోకుండా వ్రాయవలసి ఉంటుంది. ఈ కథనుబట్టి లకుమ మరణానికి కారణం ఆమెపై మోపబడిన అపనింద, శీలవతి కాదనే ఆరోపణ ఈ అపనిందను విశ్వసించడంవల్ల కుమారగిరి ప్రేమజీవితానికి కళంకం ఏర్పడుతుంది. సందేహాస్పద చిత్తుడయిన కుమారగిరి నాయకుడు గావటానికి అనర్హుడనిపిస్తుంది. ఇటువంటి సంకుచితమైన మనస్తత్వాన్ని కలిగిన కుమారగిరి లకుమాదేవి ప్రేమకు తగినవాడు కాడనిపిస్తుంది. కాని నారాయణరెడ్డిగారి కావ్యంలో కుమారగిరి ఆదర్శ ప్రేమికుడు. లకుమయే ప్రాణంగా ప్రవర్తించిన ప్రణయస్వరూపుడు. లకుమ కాలు బెణికిందన్న వార్తను విన్నవెంటనే కొలువుకూటాన్ని విడిచివచ్చిన ప్రేమమయ హృదయుడు. రెడ్డిగారి కావ్యంలో కుమారగిరి పాత్ర ఎంతో ఉన్నతంగా రూపొందించబడింది. వేంకటకృష్ణారావుగారి కథలో లకుమాదేవి కాపరట్టడికిని, వేగిపల్లి భావనారాయణ స్వామి దేవదాసి అయిన "వల్లెమ"కు జన్మించినట్లు వివరించబడింది. లకుమ జన్మవృత్తాంతం, ఆమె తల్లిదండ్రుల వివరాలు ఏశాసనా

ల్లోగానీ, కావ్యంలోగానీ తెలుపబడలేదు. నిరాదారమైన యీ విషయానికి నారాయణరెడ్డిగారు తమ కావ్యంలో చోటివ్వకపోవడమే సమంజసంగా వుంది.

కథలో కుమారగిరి లకుమతో కలిసి శ్రీశైలానికీ, అహోబలానికి వెళ్లినట్లు వ్రాశారు. కావ్యంలో నారాయణరెడ్డిగారు కుమారగిరి లకుమా సమేతుడై అహోబలానికీ, ద్రాక్షారామానికి వెళ్లినట్లు వివరించారు. కుమారగిరి ద్రాక్షారామానికి వెళ్లి తులాపురుషదానం చేసినట్లు ఆధారాలున్నాయి! అందుకే రెడ్డిగారు శ్రీశైలాన్ని విడిచిపెట్టి, ద్రాక్షారామాన్ని ప్రస్తావించారు. పై విషయాన్ని పరిశీలించినట్లయితే నారాయణరెడ్డిగారు ఈ కథను అనుసరించలేదనే విషయం స్పష్టమౌతుంది.

## లకుమ : రజని (బాలాంత్రపు రజనీకాంతరావు)

శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు గారి కథను అనుసరించి రజనీగారు 1945 అక్టోబరు, 46 మార్చి ప్రతిభ సంచికలో "లకుమాదేవి" అనే సంగీత రూపకాన్ని రచించారు. ఇది నాలుగు రంగాలుగా విభజింపబడిన శ్రవ్యరూపకం.

## కొండవీడు : శ్రీ రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు.

1944 సంవత్సరంలో శ్రీరాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు వ్రాసిన "కొండవీడు" అనే ఇతిహాసిక నాటకంలో కుమారగిరి నాయకుడు. పీఠికలో రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు కర్పూరవసంత రాయలైన కుమారగిరిని గురించి ........ "కొండవీడు చరిత్ర పరిశీలిస్తున్న రోజుల్లో కొమరగిరి నృపాలుడు (వసంతరాజు) నా మనస్సున బాగా హత్తుకున్నాడు. అతని భావములు భవిష్యత్తులోకి, కొన్ని శతాబ్దుల ముందుకు తొంగి చూచినట్లు నాకు తోచింది. వసంతరాజు ఆదర్శవాది...." [1] అని వివరించారు. ఈనాటక కుసుమం "సాహిత్య తపస్వి, నవ్య సాహిత్య

---

1. శ్రీరాయప్రోలు సుబ్రహ్మణ్యం, కొండవీడు, పీఠిక, పుట - 5.

స్వరూప పరివ్రాజక, తీర్థాశ్రమయతి శ్రీ శివశంకరస్వామి వారి పాదపద్మముల సన్నిధిని" సమర్పింపబడింది

ప్రయోగ సౌలభ్యంకోసం నాటకకర్త ఈ నాటకాన్ని 11 రంగాలుగా విభజించారు. గుంటూరులో నవ్యజ్యోతి నాటకసమాజంవారు ఈ నాటకాన్ని "విశేషకృషిచేసి," రమణీయముగా కొన్ని సారులు ప్రదర్శించారు." "నవజ్యోతి సంఘమువారికిని, విశేషించి పాత్రధారణాదికము నిర్వహించి, ఘనముగా నాటకమును నడిపించిన ముక్కామల కృష్ణమూర్తి, డాక్టరు అమరేశ్వరరావు, న్యాయవాది యజ్ఞనారాయణ, పండిట్‌రావు, యస్. టి రామారావు ప్రభృతులకు కృతజ్ఞుడను" [1] అని రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు నాటక ప్రదర్శన వివరాలను తెలియజేశారు.

ఈ నాటకానికి రాయప్రోలువారు మొట్టమొదట పెట్టినపేరు "వసంతరాజు," "మరికొంత కాలానికి కొన్ని కారణాలచేత "నిర్ణయము" అని పేరు ఉంచినాను. చివరకు, ప్రదర్శన కాలములో నటుల సూచనలను బట్టి "కొండవీడు" అనే పేరు నిర్ధారణచేసినాను" [2] అని నాటకకర్త ఈ నాటకం"కొండవీడు"గా రూపాంతరం పొందిన కారణాలను వెల్లడించారు.

ఈ నాటకం వసంతోత్సవాలతో ప్రారంభంకావడం విశేషం. "వకుళోద్యానము"లో "ప్రభాతసమయం"లో ఈవసంతోత్సవాలు ప్రారంభమౌతాయి. తెరవెనుకనుండి దేవాలయంలోని గంటలూ, వేదాధ్యయనం వినిపిస్తాయి. ఆ తరువాత రాజనర్తకి లకుమ, కొందరు బాలికలు బృందగీతి నాలాపిస్తూ నృత్యంచేస్తారు. వందిమాగధబృందం— "రాయ వేశ్యాభుజంగ! శ్రీ వసంత నృపాలా! బహుపరాక్! దుర్మదవైరి వీర భయంకర శ్రీ కుమారగిరి మహీపాలా! బహుపరాక్" అని కీర్తిస్తుండగా కుమారగిరి శ్రీనాథునితో ప్రవేశిస్తాడు. [3] వసంతోత్సవాల ఏర్పాట్లను లకుమకు వివరిస్తాడు. యువరాజు బాణం తగిలి మరణించిన కోకిలను

1. శ్రీ రాయప్రోలు సుబ్రహ్మణ్యం, కొండవీడు, పీఠిక పుట-5
2. అందే
3. అందే, (ప్రథమ రంగం), పుట - 3

చూచి పరితపిస్తాడు కుమారగిరి మూలగూరమ్మ దేవాలయంలో జరుగ బోయే బలులను అడ్డగించి, జాతరలను నిషేధిస్తాడు. కుమారగిరి అహింసా విధానాలు నచ్చని ప్రజల్లో అలజడి చెలరేగుతుంది. రాజద్రోహులు కుట్రలు పన్నుతారు. పెదకోమటి వేమారెడ్డి లకుమ వద్దకు వెళ్లి దేశంకోసం రాజు గారి మనసు మార్చవలసిందిగా అభ్యర్థిస్తాడు. లకుమ ప్రార్థనలను రాజు పట్టించుకోలేదు. శత్రురాజులు దండెత్తివస్తారు. కుమారగిరి స్వయంగా శాంతిపతాకాన్ని చేతబట్టి, "సత్యము, అహింస మానవ ధర్మ సూత్రాలుగా వర్ధిల్లాలి" అంటూ శత్రుసైన్యంలోకి వెళ్లి ప్రచారంచేస్తాడు. చివరకు క్షతగాత్రుడైన కుమారగిరి తన రాజ్యాన్ని రెండు భాగాలుగాచేసి కొండవీడు ప్రాంతాన్ని పెదకోమటి వేమారెడ్డికి, రాజమహేంద్రవరం ప్రాంతాన్ని తన బావగారయిన కాటయవేమారెడ్డికి అప్పగించి మరణిస్తాడు.

ఈ నాటకంలో కుమారగిరి వసంతోత్సవ ప్రియుడు, మహోన్నత మానవతావాది, ధీరలలితుడు. మరణిస్తూ కూడా "... వైషమ్యాలు తలెత్తకుండా చేయండి....శాంతిదేవత నారాధించండి, కళాసామ్రాజ్యం స్థాపించండి"[1] అని ప్రబోదించిన పరమ కారుణ్యమూర్తి. రాజనర్తకి లకుమ ప్రభువుకోసం ఏత్యాగం చేయడానికైనా వెనుదీయని సాహసమూర్తి, కళారాధకురాలు. ఐతే ఈ ఐతిహాసిక నాటకానికీ, చరిత్రలోని కొన్ని విషయాలకు పొంతనలేదు. ఈ నాటకంలో తెలుపబడినట్లు శ్రీనాధుడు కుమారగిరి ఆస్థానకవిగాదు. పెదకోమటి వేమారెడ్డికి, కుమారగిరికి వారసత్వపు వైషమ్యాలున్నట్లుగా చరిత్రకారులు వివరించారు. ఈనాటకంలో పెదకోమటి వేమారెడ్డి కుమారగిరిని అంటిపెట్టుకొని సేవిస్తుంటాడు. ఇటువంటి అవాస్తవాలు రెడ్డిగారి కావ్యంలో ఎక్కడా కనుపించవు.

## రాజశిల్పి - పాటిబండ మాధవశర్మగారు.

శ్రీ పాటిబండ మాధవశర్మ వ్రాసిన "రాజశిల్పి" అనే చారిత్రాత్మక నవలలో కుమారగిరి లకుమల చరిత్ర చిత్రింపబడింది. ఈ చారిత్రాత్మక నవలకు 1957 వ సంవత్సరం ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు నిర్వహించిన పోటీలో బహుమతి లభించింది. ఇందులో మొత్తం 22అధ్యాయాలున్నాయి.

1. శ్రీరాయప్రోలు సుబ్రహ్మణ్యం, కొండవీడు, (11 వ రంగం) పుట-67.

ప్రథమాధ్యాయంలో కుమారగిరి నిర్వహించిన వసంతోత్సవాల వైభవం వర్ణించబడింది. నారాయణరెడ్డిగారి "కర్పూర వసంతరాయలు" కావ్యంలో కూడా ప్రథమాశ్వాసం వసంతోత్సవాలకు సంబంధించినదే. ఈ వచన గ్రంథంలోని వసంతోత్సవాలకు మూలం రెడ్డిరాజులనాటి కావ్య వర్ణనలే.

"రాజవీధియు ప్రధాన వీధులును గస్తూరి శ్రీగంధ సమ్మిశ్రిత పటీర జలముల గలయంపి చల్లబడి యుండెను. చతుష్పథము లందెల్ల కాశ్మీర ఘనసారములతో చిత్రచిత్రములుగ రంగవల్లులు తీర్పబడి యుండెను. ఎడనెడజాత కింశుక కుసుమ గుచ్ఛములు ఉభయపార్శ్వ స్థాపితములగు క్రముకాలోక తరుశేఖరములనుండి తోరణములుగా గట్టబడియుండెను."[1] ఇటువంటి వర్ణనలకు క్రీడాభిరామం మూలంగా కనిపిస్తుంది. [2]

నారాయణరెడ్డిగారి కావ్యంలోవలెనే ఈ నవలలో కూడా, కుమారగిరి రెడ్డి పట్టపుటేనుగుపై కూర్చొని, చతురంగబల సమేతుడై, ప్రజలు జయ జయ ధ్వానాలు చేస్తుండగా, ఆప్తులు అనుసరించి రాగా ఉద్యానవనంలో ప్రవేశిస్తాడు. అలంకరించబడిన పూజావేదికపై ఉన్న వసంతుడ్ని, రతీ మన్మథులను, లక్ష్మీనారాయణులను, గౌరీశంకరులను, శచీపురందరులను షోడశోపచారములతో పూజిస్తాడు. ఈ పూజాక్రమాన్ని మాధవశర్మగారు కొఱవి గోపరాజు "సింహాసనద్వాత్రింశిక" నుండి గ్రహించినట్లు భావింప వచ్చు.

"అందు వసంతునిన్ రతి ననంగుని లక్ష్మినుపేంద్రు గౌరి న
య్యిందు కళాధరున్ శచి సురేంద్రు క్రమంబున పూజచేయగా
దుందుభి మర్దళ ప్రముఖ తూర్యరవంబులునిండ నేర్పున
న్నందరు లాటపాటల వినోదము సూపిరి తీపులంటగన్" [3]

---

1. పాటిబండ్ల మాధవశర్మగారు, రాజశిల్పి, పుట – 3
2. వల్లభరాయుడు, క్రీడాభిరామం, పుట – 41, 178 వ పద్యం.
3. కొఱవి గోపరాజు, సింహాసనద్వాత్రింశిక, సప్తమాశ్వాసము 26వ పద్యం

అయితే నారాయణరెడ్డిగారు శ్రీనాథుని వర్ణనలను అనుసరించారు. భీమేశ్వర పురాణంలో పరమేశ్వరుడు, విఘ్నేశ్వరుడు, అప్సరసలు, వసంతుడు, మన్మథుడు వసంతోత్సవాల్లో ప్రధానపాత్ర వహించారు అందుకే నారాయణరెడ్డిగారు కుమారగిరిచేత "మదన మధుశివ విఘ్ననాథాప్సరః ప్రతిమలను" [1] ఆరాధింపచేశారు. కుమారగిరి నిర్వహించిన వసంతోత్సవాలను చూచి శ్రీనాథుడు బీమేశ్వర పురాణంలో వసంతోత్సవాల వైభవాన్ని వివరించాడని నారాయణరెడ్డిగారి నమ్మిక.

తన కావ్యాన్ని నిజమైన చరిత్రాధారాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దాలనే ఉద్దేశ్యంతో నారాయణరెడ్డిగారు ఆధారాలులేని లకుమ జీవిత వృత్తాంతాన్ని ఏ సందర్భంలోనూ వివరించలేదు. ఈ వచన గ్రంథంలో లకుమాదేవి కుమారగిరి సోదరిగా చిత్రించబడింది. 15 వ అధ్యాయంలో నరసింహ పండితునకునూ; కుమారగిరి చెల్లెలు, కాటయవేముని అర్థాంగి అయిన మల్లాంబికకూ జరిగిన సంభాషణలో యీ విషయం వెల్లడిఅవుతుంది.

(నరసింహ పండితుడు, మల్లాంబికల సంభాషణము)

మల్లాంబిక:- లకుమాదేవి మాయన్నగారి యుంపుడు కత్తెయని అనుకొందురుగదా !

నరసింహ పండితుడు:- శివశివా! ఎవరమ్మా ఆ అన్నవారు?

మల్లాంబిక :- లోకము.

నరసింహ పండితుడు:- లోకమునకేమి తెలియును? పోనీ, లోకమనినంత మాత్రమున నీవెట్లు నమ్మితివి? ప్రభువునకు నీవొకటియు, లకుమాదేవి యొకటియునా తల్లీ!

మల్లాంబిక తెల్లబోయి నరసింహపండితుని వంక జూచెను.

నరసింహ పండితుడు:- తల్లి! నీవు మఱచితివా? మీతండ్రిగారికి పంప, పొన్ని, రన్నియని ముప్వురుంపుడు గత్తెలుండిరి గదా! వారిలో "పంప" నాయన

2 డా॥ సి. నారాయణరెడ్డి, కర్పూరవసంతరాయలు, పుట - 37.

రెండవదేవేరిగా మన్నించెడివాడు. అపంపాదేవి కూతురే కదా యీ
లకుమాదేవి ! ఆమె ప్రభువున కేమగును ? నీకేమగును ?
ప్రభువువంత వావి వరుసలెఱుగని వాడనుకొంటివా ![1]

ఈ కల్పన వలన లాలసాకుమార్‌గారు 1964, అక్టోబరు నెల భారతి సంచికలో రాజశిల్పి నవల ఐతిహాసికతను సందేహించారు. లకుమకు కుమారగిరితో గల సంబంధాన్ని వారు ప్రశ్నించారు. [2] సమాధానంగా శ్రీ మాధవ శర్మగారు "కుమారగిరి కళాప్రియుడు, నాట్యశాస్త్రకర్త. లకుమ నాట్యకర్త్రి. కాటయవేమువి వ్యాఖ్యానములవలె, లకుమాదేవి నాట్యములును వసంతరాజీయాను సారులని నా భావము. తాను నాట్యమునేర్పిన లకుమతో కుమారగిరికి శరీర సంబధము ఉన్నదన్న తలంపు నాకునచ్చలేదు. రాజ్యలక్ష్మివలె నాట్య లక్ష్మియైన లకుమ కుమారగిరికి ప్రేమపాత్రురాలు అన్నయర్థమే ఉచిత తరమని తోచినది. కుమారగిరికి ఉంపుడుకత్తె కానిచో సోదరివంటిదని సంబంధము కలుపుట కథాచమత్కారమునకు తోడ్పడుచే నేనట్టి కల్పన చేసితిని" [3] అని వివరించారు.

లకుమ రాజనర్తకియేకాక, కొమరగిరి "ప్రియాసదృశీప్రియు,"[4] ఐతే దీనికి పాఠాంతరంగా చెప్పబడిన"శ్రియా సదృశీప్రియా" [5] అనే పాఠాన్ని మాధవశర్మగారు స్వీకరించారు. రాజుగారు ఆస్థానవర్తకితో సంబంధాన్ని కలిగి ఉండటం ఆకాలంలో అసహజమైన విషయం కాదు. భరతాగమ రహస్య పారీణ, సౌందర్యరాశి అయిన లకుమాదేవిని రసజ్ఞుడైన కుమారగిరి తన ప్రియురాలుగా మన్నించి ఉంటాడు.

"నావిష్ణుః పృథ్వీపతిః అన్నట్లుగా కుమారగిరి వైష్ణవుడు. అటువంటి కుమారగిరి లక్ష్మిదేవితో సమానురాలైన లకుమను ప్రియురాలుగా భావిం

---

1, పాటిబండ మాధవశర్మగారు, రాజశిల్పి, పుట - 145, 146.
2. లాలసాకుమార్, భారతి, 1964 అక్టోబరు.
3. పాటిబండ మాధవశర్మ, భారతి, 1964 నవంబర్.
4. రెడ్డి సంచిక పుట-
5. అందే

చుటయే సమంజసం. తాను వీణ నేర్పిన వాసనదత్తను వత్సరాజు వివాహమాడటాన్ని భాసుడు మనోజ్ఞంగా రూపొందించాడు. ప్రతాప రుద్రుడు - మాచల్దేవి; కృష్ణదేరాయలు - చిన్నాదేవి; విజయరాఘవ నాయకుడు-రంగాజమ్మ వంటివారి అనురాగబంధాన్ని ఎవ్వరూ నిరసించలేదు. ఏవిధంగాచూచినా లకుమను కుమారగిరి ప్రియురాలిగా భావించడంలో అనౌచిత్యం కనుపించదు. ఒక్క మాధవశర్మగారు మాత్రమే లకుమను కుమారగిరి సోదరిగా ఊహించారు. లకుమ అనపోతారెడ్డికి రెండవ దేవేరివంటిదయిన "వంప" కుమార్తె అనే విషయుం నిరాధారం. మాధవశర్మగారే "చరిత్రలందు చెప్పబడని ఈ సంబంధము కేవలము కల్పితము" [1] అని తెలిపారు, తన కుమారుని మరణంతో బాధపడుతున్న కుమారగిరి లకుమ నాట్యంవలన సేదతీరుతాడు. లకుమ ఎంతో సాహసంతో హరిహరరాయల కుమార్తె అయిన హీరాంబను పెదకోమటి వేమారెడ్డి నుండి రక్షించి కొండవీడుకు చేరుస్తుంది. లకుమ సాహసం రాజ్యానికి శ్రీరామరక్షగా భావింపబడుతుంది.

## వసంతరాజు – శ్రీ కూచిభొట్ల హరి:

శ్రీ కూచిభొట్ల హరిగారు వ్రాసిన "వసంతరాజు" అనే చారిత్రక నవల 1958 మే నెలలో ప్రచురింపబడింది. ఇందులో కుమారగిరి జీవితంఆద్యంతం వివరించబడింది. రచయిత లకుమాదేవిని శ్రీనాథుని సోదరిసమానంగా చిత్రించడం విశేషం. ఈ నవలలో, లకుమాదేవి తల్లిపేరు వకుళాబాయి. ఈమెను మహారాష్ట్రమునుండి ఎవ్వరో ఆశలుచూపి, తీసుకువచ్చి కొండవీడు ప్రాంతంలో విడిచిపెట్టారు. దిక్కులేని ఆమెను శ్రీనాథుని తండ్రి మారయామాత్యుడు తనయింటికి తీసుకువెళ్లి ఆశ్రయమిచ్చాడు. ఆ సమయంలోనే ఆమెకు లకుమ జన్మించింది. శ్రీనాథుని తండ్రి మారయామాత్యుడే లకుమ తండ్రి. [2] కుమారగిరి, శ్రీనాథుడు బాల్యమిమిత్రులు. ఇరువురును వేశ్యావాటికలో విచ్చలవిడిగా తిరిగెడివారు. యువరాజుగా ఉన్నపుడే కుమారగిరి లకుమకు ఎన్నో కానుకలిచ్చేవాడు.

---

1. పాటిబండ మాధవశర్మ, భారతి, 1964.
2. కూచిభొట్ల హరి, వసంతరాజు పుట - 8

శ్రీనాథుడు లకుమతో ఆత్మీయంగా మాట్లాడటాన్ని కుమారగిరి సహించ లేడు. తాను మహారాజు కాగానే లకుమను రాజనర్తకిని చేస్తాడు. గాఢంగా ఆరాధిస్తాడు శ్రీనాథునిపై ద్వేషాన్ని పెంచుకొని, అతణ్ని కొండవీడు నుండి బహిష్కరిస్తాడు. వసంతోత్సవాలను ఎంతో వైభవంగా నిర్వహించి "వసంతరాజు"గా కీర్తించబడతాడు తన బావ కాటయ వేమారెడ్డికి రాజ మహేంద్రవరం ప్రాంతాన్ని సర్వహక్కులతో దానమిస్తాడు. పట్టపురాణిని నిరాదరిస్తాడు. లకుమాదాసుడైన కుమారగిరి రాజ్యపాలనను సవ్యంగా కొనసాగించక పోవడంచేత ప్రజల్లో అసంతృప్తి చెలరేగుతుంది. కరువు కాటకాలు సంభవిస్తాయి. కుమారగిరి దాయాదియైన పెదకోమటి వేమారెడ్డి తనమంత్రి మామిడి సింగన సహాయంతో కొండవీడును వశపఱచుకోగా, కుమారగిరి రాజమహేంద్రవరం పోయి కాటయవేముని వద్ద తలదాచు కుంటాడు. లకుమ కొండవీడులో తనభవనంలోనే నిర్బంధించబడుతుంది. ఆ తరువాత లకుమ మరణించిందనే వార్త వ్యాపిస్తుంది. కుమారగిరి మానసిక వేదనతో కృశించి, లకుమను స్మరిస్తూ మరణిస్తాడు. రచయిత లకుమ తల్లిని వకుళాబాయిగా వివరించడం, లకుమ తండ్రిని మారయా మాత్యునిగా చిత్రించడం రమణీయమైన కల్పన మాత్రమే. లకుమవంటి భరతాగమ రహస్యపారీణను కవి సార్వభౌముడైన శ్రీనాథుని సోదరిగా ఊహించడం కథాచమత్కారమే అనవచ్చు. కుమారగిరిని అసూయాపరు నిగా చిత్రించడంలో ఔచిత్యంలేదు. నారాయణరెడ్డిగారి కావ్యంలో యిటు వంటి లోపాలు కనిపించవు.

## రాగమాలిక (అముద్రితనవల) శ్రీ కోడూరి శ్రీరామమూర్తి

కుమారగిరి, లకుమల ప్రణయగాథను శ్రీ కోడూరి శ్రీరామమూర్తి గారు "రాగమాలిక" అనే పేరుతో 1956లో వ్రాశారు. 1963వ సంవత్సరము "కృష్ణాపత్రిక"వారు నిర్వహించిన పోటీలో ఈ నవలకు బహుమతి లభిం చింది. కృష్ణాపత్రిక ఆగిపోవుటచేత యింతవరకు ప్రచురింపబడలేదు.

1. కూచిభొట్ల హరి, వసంతరాజు, - పుట 8.

ఈ నవలలోని కుమారగిరి, లకుమాదేవి, కాటయవేముడు చరిత్రలోని వ్యక్తులు. ఈ కథను నవలీకరించడానికి రచయిత "వాణీనాథుడు" అనే పాత్రను సృష్టించారు. వాణీనాథ శాస్త్రి మంచి సంగీత విద్వాంసుడు. అతని తండ్రి రామనాదశాస్త్రి ఆ రోజుల్లో పేరెన్నికగన్న సంగీతవిద్వాంసుడు. అతనిదగ్గరే యువరాజు అయిన కుమారగిరి సంగీతం నేర్చుకుంటాడు. ద్రాక్షారామంలో భీమేశ్వరుడి ఉత్సవంలో ఏర్పాటయిన నృత్యప్రదర్శన పోటీలో లకుమాదేవి పాల్గొనడంతో నవల ప్రారంభమౌతుంది. అప్పటికి కుమారగిరి సంగీత విద్యాభ్యాసాన్ని ముగించి కొండవీడులో ఉంటాడు. అయితే ద్రాక్షారామ భీమేశ్వరుడి ఉత్సవాలకు కుమారగిరి ద్రాక్షారామం రావడంతో కుమారగిరికి లకుమతో పరిచయం ప్రారంభమవుతుంది. లకుమాదేవికి కుమారగిరి సంగీతరసజ్ఞత ఎంతగానో నచ్చుతుంది. కొండవీడు రాజాస్థానంలో రాజనర్తకిని కావాలని అనుకుంటుంది. అయితే వాణీనాథ శాస్త్రికికూడా లకుమాదేవిపై మనసుంది. లకుమకు కూడా వాణీ నాథునిపై అభిమానమే కాని, ఆమె అతడిని ఒకసోదరిలా ప్రేమించింది. రామనాథశాస్త్రి ప్రమేయంతో లకుమాదేవి సులువుగానే రాజనర్తకి కాగలుగుతుంది అంతేకాదు కుమారగిరి హృదయసామ్రాజ్యానికి సామ్రాజ్ఞి కాగలుగుతుంది. ఇది వాణీనాథునికి భరించలేని విషయమౌతుంది. తన విద్యా సంపత్తిని, సంస్కారాన్ని, అన్నింటిని మరచిపోయి కుమారగిరిని హత్యచేసేందుకు కూడా పథకాన్ని వేస్తాడు. అయితే అతని జన్మ సంస్కారం అతడిని హంతకుడిగాచెయ్యదు. కొండవీడులోని రాజకీయ ఎత్తుగడలు వివరించబడ్డాయి. కుట్రదారులు లకుమా దాసుడైన కుమారగిరిని ఒక దశలో బలిగొనబోతుంటే, కుమారగిరిని చంపడానికి వెళ్లిన వాణీనాథుడు (లకుమ మనస్సును అర్థంచేసుకున్న తరువాత) ప్రాణ త్యాగంచేసి, కుమారగిరిని రక్షించి, ప్రేమికులను కలుపుతాడు.

ఈ నవలపై నారాయణరెడ్డి గారి కావ్య ప్రభావంలేదని చెబుతూనే శ్రీరామమూర్తిగారు " అయితే, ఈ నవల రాయాలనే కోరిక మాత్రం నారాయణరెడ్డి గారి కావ్యంగురించి విన్న తర్వాత మాత్రమే కలిగింది. నారాయణరెడ్డిగారి దృక్పథానికి, రచనలో నేనుఎన్నుకున్న యితివృత్తానికి చాలా తేడామాత్రం ఉంది ఈ నవలను రాయడానికి ఆ రోజులనాటి

సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులను చాలా క్షుణ్ణంగా పరిశీలించాను. ఎంతోమంది పెద్దలను కలుసుకొని ఎన్నో వివరాలు సేకరించాను. పుస్తకాన్ని దాక్షారామ భీమేశ్వరునికి అంకితం యిచ్చాను. ఈ నవలలో అవచి తిప్పయశెట్టి పాత్రను అలంబనంగా చేసుకొని ఆనాటి దేశీయ, అంతర్జాతీయ వ్యాపారపు తీరులకు చోటు కల్పించాను"[1] అని నవలకు సంబంధించిన వివరాలను వెల్లడించారు.

## లకుమ

(హిందీ మూలం) శ్రీబాలశౌరిరెడ్డిగారు

(ఆంధ్రానువాదం) శ్రీ పి. రాజగోపాలనాయుడు గారు

తెలుగు గడ్డపై పుట్టి, హిందీ సాహితీ నందనంలో వికసించి పరిమళిస్తున్న శ్రీ బాలశౌరి రెడ్డిగారు, హిందీలో "లకుమ" అనే పేరుతో కుమారగిరి, లకుమల జీవితాన్ని చిత్రిస్తూ 1968లో సర్వాంగసుందరమైన చారిత్రాత్మక నవలను వ్రాశారు. 1969లో సాహిత్య భవన్ ప్రైవేట్ లిమిటెడ్ అలహాబాద్-3 వారు మొదట ఈ నవలను ప్రచురించారు. "ప్రస్తుతం బోపాల్ మరియు విక్రమ్ యూనివర్శిటీ ( ఉజ్జయినీ ) లలో బి. ఏ., బి. యస్. సి. లకు నాన్‌డిటైల్డ్‌గా వుండినది.[2] అని శ్రీ బాలశౌరిరెడ్డి గారు ఈనవలకు సంబంధించిన వివరాలు తెలిపారు. ఈ నవలను చిత్తూరు మాజీ పార్లమెంటుసభ్యులు శ్రీ పి. రాజగోపాల నాయుడుగారు అనువదించారు. "లకుమ" అనే పేరుతోనే, ఈ అనువాద నవలను 1977 మే నెలలో ప్రచురించారు.

ఈ నవలలోని చారిత్రకతను బాలశౌరిరెడ్డిగారు ఇలా వివరించారు. ..... ......" రెడ్డిరాజుల యుగంనాటి సాహిత్యం, మల్లంపల్లివారి భారతిలోని రచనలు, మరెన్నో విధాల విషయం సేకరించడం జరిగింది. అయితే నవలా రచనలో చారిత్రక సత్యాలకు విఘాతం కల్గకుండా, వాటి

---

1. కోడూరి శ్రీరామమూర్తిగారు నాకు వ్రాసిన లేఖ.
2. శ్రీ బాలశౌరిరెడ్డిగారు నాకు వ్రాసిన లేఖ.

పరిపుష్టికి అనుకూలంగా కల్పనచేయడం జరిగింది. సోమదేవ్, నాగరాజ్ లాంటి కొన్ని పాత్రలు క్రొత్తగా సృష్టించబడినవి. వాటివల్ల నవలలో మౌలికతతోపాటు చక్కటి సౌందర్యపోషణ జరిగింది." [1]

ఈ నవలలో 12అధ్యాయాలున్నాయి. ప్రథమ, ద్వితీయాధ్యాయాల్లో లకుమ చరిత్ర వివరింపబడింది. బాపట్లలో భావనారాయణస్వామి దేవాలయంలో నృత్యం చేస్తున్న లకుమను కుమారగిరి సేనాపతులలో ఒకరైన దోరపరెడ్డి (ద్వారపరెడ్డి) తీసుకువచ్చి, కుమారగిరికి కానుకగా యిస్తాడు. కుమారగిరి లకుమ వివరాలను ప్రశ్నించినపుడు, ఆమె తన నివాసమును బాపట్లగా తెలిపి, "నా మాతృ శ్రీ పలలేమ, నాతండ్రి పేరు కాపరట్టడి నాతల్లి భావనారాయణస్వామి దేవాలయంలోదేవదాసి" [2] అని వివరిస్తుంది.

తృతీయాధ్యాయంలో వసంతోత్సవాల వర్ణనవుంది. ఉత్సవాల సందర్భంగా లకుమ నృత్యం ఏర్పాటు చేయబడింది. ఈ సన్నివేశంలో నారాయణరెడ్డిగారికావ్యానికీ, ఈ నవలకూస్పష్టమైనపోలికలుకనుపిస్తాయి.

" ........... వెడల్పయిన ధవళవేదిక వున్నది. అది అవనికతో ఆచ్ఛాదించబడింది. ........వేదికకు ఎదురుగా సామ్రాట్టు కుమారగిరిరెడ్డి గారు, సామ్రాజ్ఞితో బంగారు ఆసనం మీద కూర్చొని వెలిగిపోతున్నారు. వారి ప్రక్కన మహామంత్రి, సేనాపతియైన కాటయవేముడు ఆసీనుడై వున్నారు. వారి వెనుక వరుసలలో మంత్రులు, సామంతులు, దండనాథులు మండలాధిపతులు, పురప్రముఖులు ఉచితాసనాల మీద ఉపవిష్టులై యున్నారు........సభా భవనంలో పూర్తి శాంతి నెలకొనియున్నది... తాళ లయ రాగ బద్ధ మధుమయగీతం శ్రవణేంద్రియాలకెంతో ఇంపుకూర్చింది.

---

1. బాలశౌరిరెడ్డిగారు నాకు వ్రాసిన లేఖ.

2. శ్రీ పి. రాజగోపాలనాయుడు, లకుమ, పుట-20, 21.

మెరుపుతీగలాంటి నర్తకి ఉన్నతంగావున్న వేదికమీదకువచ్చి భరత నాట్యం చేయసాగింది." [1]

దీనికి మూలం నారాయణరెడ్డిగారి కావ్యంలోనే వుంది. [2]

కావ్యంలోనూ, నవలలోనూ లకుమ విరహిణియైన రాధగానే అభినయించింది. ఆమె నృత్య విశేషాలను రచయిత నారాయణరెడ్డిగారి కావ్యాన్ని దృష్టిలోపెట్టుకొని వర్ణించాడనిపిస్తుంది. లకుమ నృత్యానికి తన్మయుడై కుమారగిరి ఆసనంపైనుండి లేవబోతాడు. మహారాణి తన చూపులతో వారిప్రయత్నాన్ని అడ్డగిస్తుంది. నర్తకికి రాజు రత్నహారాన్ని బహూకరిస్తాడు. ఈ కథాంశాలన్నీ నారాయణరెడ్డిగారు తన కావ్యంలో వర్ణించినవే.

ఈ కావ్యంలో వలనే ఈ నవలలోనూ, కుమారగిరి లకుమను స్మరిస్తూ కలగంటాడు. ఇదంతా గమనించి రాణి కలవరపడుతుంది. కొండవీటి రాజ్యభాగాన్ని ఆక్రమించాలని ప్రయత్నించిన హరిహర రాయలను కాటయవేమారెడ్డి ఎదిరించి విజయం సాధిస్తాడు. హరిహర రాయలు తన కుమార్తె హరిహరాంబికను కాటయవేమునికిచ్చి వివాహం చేస్తాడు. రాజు లకుమతో కలసి అహోబలానికీ, ద్రాక్షారామానికి తీర్థ యాత్రగా వెళతాడు. మహారాజుగారికి పరిపాలనలో ఆసక్తిలేదని ప్రజలు గుసగుసపోతారు. ఇరుగు పొరుగు రాజులు అదనుచూచి విజృంభించడానికి ఉద్యుక్తులౌతారు, రాజు విలాస మందిరంలోనే కాలం గడుపుతుంటాడు. మహారాణి మనోవ్యాధితో పరితపిస్తుంది. కాటయవేముడు కుమారగిరిని కలసి మహారాణి పరస్థితిని, రాజ్యస్థితిని, ప్రజల మనోభావాలను వివరిస్తాడు. కాటయవేముని కోరికపై కుమారగిరి కొలువుకూటానికి వెళతాడు. అంతలోనే లకుమకు కాలుబెణికినదనే వార్తను విని సభను విడిచి వెళ్లిపోతాడు. సభలోని వారు రాజుగారి ప్రవర్తనను నిరసిస్తూ సంభాషిస్తారు. ఈ సన్నివేశాలన్నీ నారాయణరెడ్డిగారి "కర్పూర వసంతరాయలు" లోనివే.

---

1. శ్రీ పి. రాజగోపాలనాయుడు, లకుమ, పుట-34/35.
2. డా॥ సి. నా. రె., కర్పూర వసంతరాయలు, పుట-42,43.

కాటయవేముడు, మహారాణి సంభాషించినతీరు రెడ్డిగారి కావ్యాన్ని పూర్తిగా అనుసరించినట్లు కనుపిస్తుంది. కావ్యంలో వలెనే నవలలోనూ రాణి లకుమను కలసి, రాజును విడచి వెళ్ళవలసిందిగా కోరుతుంది. ఈ సన్నివేశంలో నారాయణరెడ్డిగారి కావ్యంలోని చరణాలే,[1] నవలలోని వాక్యాలుగా మారాయనిపిస్తుంది.[2] నారాయణరెడ్డిగారు తన కావ్యాన్ని ఏ విధంగా ముగించారో, నవలాకర్త కూడా అటువంటి ముగింపునే చేశారు. లకుమ కుమారగిరి ఆశ్చర్యపడేలా వింతగా అలంకరించుకుంటుంది. ఎంతో అద్భుతంగా లాస్యనృత్యం చేస్తుంది. చివరగా శివతాండవాన్ని అభినయిస్తూ, కత్తితో పొడుచుకొని మరణిస్తుంది. రాణికిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చడానికి లకుమ మరణాన్ని వరించింది. ఆమె సందేశం రాజుని జాగృతుణ్ని చేస్తుంది.[3]

నారాయణరెడ్డిగారు తమ కావ్యం చివరలో

"నేటికిని లకుమ అందెల ఝణత్కారముల

వినుపించు కొండవీటను వీచువాయువులు" అని వ్రాశారు.

నవలాకర్త ముగింపు వాక్యంకూడా కావ్యాన్ని అనుసరించివుంది.

"లకుమానూపుర ధ్వనులు ప్రతిధ్వనిస్తున్నాయని చెపుతుంటారు."

శ్రీ బాలశౌరి రెడ్డిగారు నారాయణ రెడ్డిగారి "కర్పూర వసంత రాయలు" కావ్యాన్నిగురించి తమ అభిప్రాయాన్ని యిలా వివరించారు.

"డాక్టర్ నారాయణరెడ్డిగారి "కర్పూర వసంతరాయలు" ఒక కళా ఖండం. సంగీత రూపకంలా కన్పిస్తుంది. మంచి గేయకావ్యం చదివిన తర్వాత నేనెంతో ఉత్తేజంపొందాను. వ్యక్తిగా, సాహిత్య ప్రియునిగా పాఠకుడిగా ఆనందించాను....."[4]

---

1. డాక్టర్ సి. నారాయణరెడ్డి, కర్పూర వసంతరాయలు, పుట-148, 151.
2. శ్రీ సి. రాజగోపాలనాయుడు, లకుమ, పుట- 152 మొదలు 184.
3. అందే, పుట-186 మొదలు 188.
4. శ్రీబాలశౌరిరెడ్డిగారు నాకు వ్రాసిన లేఖ.

కథ ముగింపు సన్నివేశాన్ని వివరిస్తూ "చివరి ఘట్టంలో లకుమ రాజ్యరక్షణకొరకు ఆత్మాహుతి చేసుకోవడం-ఈ ఘట్టాన్ని రెడ్డిగారు బహు హృద్యంగా, రమ్యంగా చిత్రించారు. ఈ సంఘటన నన్నెంతో ప్రభావితుణ్ని చేసింది ఈ ఘటన ప్రభావం నా రచనపై స్పష్టంగా కనిపిస్తుంది. ఈ విషయం నేను డాక్టర్ రెడ్డిగారికి కూడా చెప్పాను."[1] అని బాలశౌరి రెడ్డిగారు లకుమ పాత్ర పట్ల తన అభిమానాన్ని వ్యక్తంచేశారు. అయితే లకుమ నివాసము బాపట్ల అనడానికిగానీ, ఆమె తల్లిదండ్రులను "వలలేమ" "కాపరట్టడి"గా భావించడానికిగానీ ఆధారాలు లేవు. నిరాధారమైన యీ వివరాలను నారాయణరెడ్డిగారు పరిత్యజించారు.

## లకుమాదేవి-కుమారగిరి ; డాక్టర్ కొణ్ణపాటి గంగాధరరావు

ఈచారిత్రాత్మక నవల 1979 ఏప్రియల్ నెలలో ప్రచురింపబడింది. రచయిత శ్రీ కొణ్ణపాటి గంగాధరరావుగారు తమ రచనను గురించి ఇలా వివరించారు.

" కల్పనాయుతమైన చరిత్రాత్మక నవలయిది. అయితే సాధ్యమయినన్ని చారిత్రిక సత్యాలను చరిత్ర గ్రంథాలనుండి సేకరించాను. ..... ...లకుమను గూర్చి చరిత్ర చాలా తక్కువ దొరికింది. లకుమను బట్టి శ్రీనాథుని చరిత్ర అంతటితోనే ఆగిపోవలసి వచ్చింది."[2]

ఈ నవలలో 25 అధ్యాయాలున్నాయి. కుమారగిరి వాహ్యాళికి వెళ్లినపుడు, అణ్యంలో లకుమ కనుపిస్తుంది. ఆమె పేరును "లకుముకి"గా తెలుసుకుంటాడు. కుమారగిరిని చంపాలని ప్రయత్నించిన ఇంద్రజాలికుడు మహేంద్రుడు, అతని శిష్యుడు సింగన్న తమ ప్రయత్నం విఫలంకాగా, లకుమ ఉంటున్న పల్లెకు వెళతారు. లకుమని పెంచిన ముసలమ్మనడిగి లకుమ తల్లిదండ్రుల పేర్లు వల్లెమ్మ, దోరవరెడ్డి సేనాని

---

1. బాలశౌరి రెడ్డిగారి లేఖ
2. డా॥ కొణ్ణపాటి గంగాధరరావు, లకుమాదేవి-కుమారగిరి (మువదుమాట)

అని తెలుసుకుంటారు. వల్లెమ్మ భావపురిలో భావనారాయణస్వామి దేవాలయంలో దేవదాసి. దోరపరెడ్డి సేనాని యుద్ధరంగంలో మరణించాడు. లకుమను, ఆమె తమ్ముడిని ముసలమ్మ పెంచి పెద్దచేసింది. [1] వివరాలు తెలుసుకొని, ఆమె పోషణకు ఏర్పాట్లుచేసి మహేంద్రుడు పిల్లలిద్దరిని తమవెంట తీసుకువెళతాడు. రాజదర్శనాన్ని అపేక్షించి కొండవీడు వచ్చిన శ్రీనాథుడు లకుముకి పేరును "లకుమ"గా మారుస్తాడు. మహేంద్రుని వద్ద లకుమ ఇంద్రజాల విద్యనభ్యసిస్తుంది. కుమారగిరి మహారాజు లకుమను స్మరిస్తూ, ఆమె జాడకై పరితపిస్తున్న సమయంలో సభలో మహేంద్రుని ఇంద్రజాల ప్రదర్శన ఏర్పాటుచేయబడుతుంది. ఆ ప్రదర్శనలో లకుమను గుర్తించిన కుమారగిరి, ఆమెను అంతఃపురానికి చేర్పిస్తాడు. లకుమకు భరతనాట్యాన్ని, స్వయంగా బోధిస్తాడు. కుమారగిరి బహూకరించిన కానుకలను లకుమ బిచ్చగాళ్లకు దానం చేస్తుంది. ఆమె దాతృత్వం అందరికీ సంతోషాన్ని, ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. కాటయవేముడు తూర్పు దిగ్విజయయాత్ర పూర్తిచేసి, విజయాన్ని సాధించిన శుభసందర్భంలో, కుమారరిరి లకుమతో ద్రాక్షారామ భీమేశ్వరుని సేవిస్తాడు. కుమారుని తొడపై కూర్చుండ పెట్టుకొని తులాపురుషదానం చేస్తాడు. రాజధానికి మరలివచ్చి గృహరాజసౌధంలో లకుమకు నాట్య విశేషాలను బోధిస్తూ, వసంతరాజీయమనే నాట్యశాస్త్ర గ్రంథాన్ని రచిస్తాడు. వసంతోత్సవాలను వైభవోపేతంగా నిర్వహిస్తాడు. ఉత్సవాలు ముగిసిన ఆరు నెలల తరువాత తీవ్రమైన కరువు సంభవిస్తుంది. లకుమపై వ్యామోహంతో కుమారగిరి రాజకార్యాలను విస్మరించాడని దుష్ప్రచారం సాగుతుంది. ప్రజలు తమ కష్టాలకు, కన్నీళ్ళకు లకుమయే కారణమని భావించి ద్వేషాన్ని పెంచుకుంటారు. రాజద్రోహులు చెలరేగుతారు. వారి ప్రేరణవల్ల ప్రజలు కొందరు లకుమను చంపాలని ఆమెను నిందిస్తూ గృహరాజసౌధం వద్దకు వస్తారు. తనను కీర్తించిన ప్రజలే నిందిస్తుంటే సహించలేని లకుమ చివరిసారిగా ప్రభువువద్ద నాట్యంచేస్తూ గృహరాజసౌధం పైనుండి క్రిందకు దూకి మరణిస్తుంది.

---

1. డా॥ కొల్లిపాటి గంగాధరరావు, లకుమాదేవి-కుమారగిరి పుట-5.

వసంతోత్సవాలనూ, అవచి తిప్పయశెట్టి ద్వీపాంతరవ్యాపారాన్ని, శ్రీనాథునకూ తిప్పయశెట్టిగల సన్నిహితత్వాన్ని శ్రీకొట్టపాటి గంగాధర రావుగారు వివరించారు. శ్రీనాథుడు కుమారగిరి ఆస్థానంలో వున్నట్లు ఆధారాలు లేవు కాబట్టి, నారాయణరెడ్డిగారు శ్రీనాథుని వృత్తాంతాన్ని తమ కావ్యంలో ఎక్కడా వ్రాయలేదు. శ్రీ భావరాజు వెంకట కృష్ణారావు గారి కథలో కుమారగిరి లకుమ శీలాన్ని శంకించి ఆమెను పరీక్షించాలనే ఉద్దేశ్యంతో గృహరాజసౌధంపైనుండి దుముకవలసిందిగా ఆజ్ఞాపిస్తాడు. లకుమ తన సౌశీల్యాన్ని రుజువుచేసుకోవడానికి సౌధం మీదనుండి క్రింద కు దూకుతుంది; కొట్టపాటివారు ఈ విషయాన్ని పూర్తిగా మార్చి లకుమను త్యాగమయిగా చిత్రిస్తూ, ఈ సన్నివేశాన్ని కల్పించారు.

## వసంతరాయలు; విహారి, శాలివాహన.

ఈ చారిత్రాత్మక నవలను 1965 సెప్టెంబరులో ప్రచురించారు. ఈ నవలల్లో "వసంతరాయలు" అనవేమారెడ్డి. అనవేమారెడ్డి తరువాత మహా రాజైన కుమారగిరి చిన్నతనం యిందులో వివరించబడింది. కాటయవే మారెడ్డికి కుమారగిరి రెడ్డిపై ఉన్న అభిమానం, రాజభక్తి వర్ణించబడ్డాయి. అనవేమారెడ్డి సాధించిన విజయాలను, కాటయవేమారెడ్డి వ్యూహరచనా చాతుర్యాన్ని రచయిత ఎంతో చక్కగా చిత్రించారు. అనవేమారెడ్డి నిర్వ హించిన వసంతోత్సవాలను కుమారగిరి కొనసాగించి మరింత వైభవంగా నిర్వహించాడని చెప్పవచ్చు.

## కొండవీటి రెడ్డిరాజ్య మహోదయము

## శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

ఈ కావ్యాన్ని అనంతపురం జిల్లా రచయితల సంఘంవారు 1977 లో ప్రచురించారు. కుమారగిరి లకుమల చరిత్ర యిందులో పరిమితంగా వర్ణించబడింది. కొండవీడును పాలించిన రాజులను, ఆ కాలపు వైభవాన్ని, కవిగారు ఎంతో రమ్యంగా చిత్రించారు.

"కొండవీటి సార్వభౌముల చరిత్రకు కావ్యసౌందర్యము నాపాదించిన వారు మృగ్యము గేయకవితాచార్య డా॥ సి. నారాయణరెడ్డిగారి గేయకృతిలో కుమారగిరిరెడ్డి చరిత్ర యొక్కటి కూర్చబడినది అంతకు మించి విస్తృత కావ్యములు వెలువడలేదన్నను సత్యదూరము కాదు"[1] అని తమ అభిప్రాయాన్ని వెల్లడించారు.

కవిగారు లకుమ వృత్తాంతాన్ని పాటిబండ్ల మాధవశర్మగారి "రాజశిల్పి" నవలనుండి గ్రహించారు. లకుమను సామాన్య నర్తకిగా భావిస్తున్న కాటయవేముని భార్య మల్లికాంబతో విద్వాంసుడయిన వామనభట్టు,
"వామనభట్టు నవ్వి తెలుపందగు నీకొక గోప్యమంచు నా
భామినితోవచించె, "పితృపాదులు మీ అనపోతరెడ్డికిన్
స్వామినిగా ద్వితీయగ ప్రశస్తి వహించిన వేశ్యకాన్పు పం
పామహిళామతల్లి ప్రియవత్సల తల్లకుమన్ గ్రహింపవే"[2]
"సోదరి నీకు.. ..---- అని లకుమను కుమారగిరి సోదరిగా వివరిస్తాడు.
లకుమ త్యాగాన్నీ, గొప్పదనాన్నీ కవి యిలా వర్ణించారు.

లకుమ హీరను రక్షించె - లకుమ కొండ
వీటి రాజ్యము రక్షించె - కాటవేము
రక్షణము సల్పె నృత్య సామ్రాజ్య పీఠ
మధివసించిన లకుమ దైవాంశకలన.

లకుమ నాట్యవిద్య లాలించె రసికుల
లకుమ నాట్యవిద్య సకల రాజ్య
రక్షణము సల్పి రాచరిక మొనర్చె
లకుమ నిజము రాజ్యలక్ష్మి ఆమె[3]

ఇదంతా "రాజశిల్పి" నవలలోని విషయమే.

---

1. శ్లూరి శ్రీనివాసమూర్తి, కొండవీటి రెడ్డిరాజ్య మహోదయము (క్రైమోడ్పు)
2. అందే, పుట - 97,98
3. అందే పుట - 98.

## లకుమాదేవి: లల్లాదేవి

ఈ నవల "ఆంధ్రభూమి" వారపత్రికలో సీరియల్‌గా వెలువడింది. లల్లాదేవిగారిచే వ్రాయబడిన యీ నవల 1982 జనవరిలో ప్రచురింపబడింది. ఈ నవలలో 23 అధ్యాయాలున్నాయి.

కథాంశము:- ఇల్లువిడిచి పారిపోయిన భర్తవలన విరక్తిచెంది, ఒక సిద్ధుని వల్ల జ్ఞానోదయం పొందిన కమలయోగిని శ్రీపర్వత పాదపీఠిక వద్ద ఆశ్రమాన్ని నిర్మించుకుంది చెన్నకేశ్వర స్వామిని ప్రార్థించడానికి గుడికి వెళ్లిన కమలయోగినికి, ఒక మందసంలో ఏడుస్తున్న పసిపాప కనుపించింది. దయతో ఆమె ఆ పాపకు లకుమ అనే పేరుపెట్టి పెంచిపెద్దచేస్తుంది. "'లకుమ కారణ జన్మురాలు. చెన్నకేశవస్వామి ముద్దుబిడ్డ." అని కమలయోగిని నమ్మకం. లకుమ చెన్నకేశవస్వామి దేవాలయం దేవాదాసియైన కుసుమ నాట్యాన్నిచూసి నాట్యం నేర్చుకోవాలనే కోరికను కమలయోగినివద్ద వెల్లడిస్తుంది. కుమారగిరి సమక్షంలో నాట్యం చేయడమే గొప్ప అదృష్టంగా కుసుమ చెప్పిన మాటలు లకుమ హృదయంలో ముద్రించుకున్నాయి. శాంతి వర్ధనుడు అనే శిల్పి శ్రీపర్వతము నుండి వచ్చి, కమలయోగిని ఆదేశముమేరకు గృహరాజసౌధాన్ని నిర్మించాలనే పట్టుదలతో కొండవీడు వెళ్తాడు. లకుమ రూపం శాంతి వర్ధనుడిహృదయంలో దోబూచులాడుతుంది. కొండవీడులో వసంతోత్సవాల సంరంభం ప్రారంభమౌతుంది. అవచి తిప్పయశెట్టి వెంట శ్రీనాథుడు కూడా కొండవీడు చేరాడు. మహారాజుగా అభిషేకించబడే కుమారగిరిని కమలయోగిని దీవిస్తుంది. ఆమె వెంటవచ్చిన లకుమ తాను ప్రాణసమానంగా పెంచిన "కపిల" అనే లేగదూడను కుమరగిరికి కానుకగా సమర్పిస్తుంది. కుమారగిరి లకుమ కోరికను గుర్తించి ఒక నర్తకిని ఆమెవెంట పంపిస్తాడు. లకుమ నాట్యరాణి అవుతుంది. పలనాటిసీమ ప్రభువైన వెలుగోటి రాయపనాయకుడు ఆమెను తన శిబిరానికి రప్పించి బలాత్కరించబోతాడు. సమయానికి కమలయోగిని వచ్చి లకుమను రక్షిస్తుంది. కాటయవేముడు విజయనగరరాజు హరిహరరాయలపై విజయాన్ని సాధించి,హరిహరరాయల కుమార్తె హరిహరాంబికను చేపట్టిన సందర్భంగా విజయోత్సవాలు వసంతోత్సవాలు ఎన్నడూలేనంత ఘనంగా నిర్వహించడానికి నిర్ణయం చేయబడింది. నాట్యంలో పోటీలు ఏర్పాటుచేయబడ్డాయి. శాంతివర్ధనుడి

సహాయంతో లకుమ కొండవీడు చేరుకుంది. శాంతివర్ధనుడు తాను చెక్కిన లకుమ శిల్పాన్ని ఉద్యానవనంలో ప్రతిష్ఠించాడు. ఆ శిల్పాన్ని చూచిన కుమారగిరి శాంతివర్ధనుణ్ణి పిలిపించి, రత్నహారాన్ని బహూకరించాడు. శాంతివర్ధనుడు ఆ శిల్పంలోని స్త్రీమూర్తి (లకుమ) గొప్పదనాన్ని కుమారగిరికి వివరిస్తాడు.

"ప్రభూ! ఆమె దురదృష్టవశాత్తూ నేలకుజారిన వెన్నెల కిరణం. ఒక పవిత్రమైన ఆశ్రమంనుండి నర్తకిగా ప్రపంచంలోకి వచ్చిన విచిత్ర వ్యక్తి. ఆమె చిన్నతనంలోనే తల్లినీ, తండ్రినీ, తనవారిని అందరిని పోగొట్టుకుంది. వ్యక్తిత్వం వచ్చాక పెంచిపోషించినవారిని పోగొట్టుకుంది. ఆమెకు హృదయాన్ని అర్పించుకున్నవారిని ప్రేమించలేక పోయింది. తాను ప్రేమించినవారికి దగ్గరకాలేపోతుంది. అన్నివిధాలా శాపగ్రస్తస్త్రీ అయి, ఒంటరిదయి, బ్రతుకు భారంగా గడుపుతుందా నర్తకి."[1] ఇందులో లకుమను ప్రేమించినవాడు శాంతి వర్ధనుడు ఆమె ప్రేమించినది కుమారగిరిని.

మరునాడు లకుమ నృత్యాన్నిచూచి కుమారగిరి పరవశిస్తాడు. తన మెడలోని రత్నపతకంతీసి లకుమ మెడలో వేస్తాడు. ఆమెకు ఆస్థాన నర్తకి పదవిని బహూకరిస్తాడు. "లకుమ తనకు ప్రాణాధిక. ఎంతో కాలంగా తాను ఎదురుచూస్తున్న పరిపూర్ణస్త్రీమూర్తి. ఆమెలేకుండా బ్రతుకుటం అసాధ్యమనిపిస్తుంది,"[2] అని కుమారగిరి భావిస్తాడు. శాంతివర్ధనుడు లకుమపై పెంచుకున్న ప్రేమోన్మాదంతో పరధ్యానంగా ప్రవర్తిస్తుంటాడు. లకుమ అంధురాలైన ఒక వృద్ధవనితను ఆదరిస్తుంది. లకుమను తూలికగా తీసుకొని కుమారగిరి నాట్యశాస్త్రాన్ని వ్రాయాలని నిర్ణయించుకుంటాడు. తాను ఆదరించిన వృద్ధురాలిని కమలయోగినికి అప్పగించాలనే లక్ష్యంతో లకుమ మాచెర్ల బయలుదేరుతుంది. దారిలో ఆ వృద్ధురాలు తన జీవిత వృత్తాంతాన్ని వివరిస్తుంది. గుత్తికొండలో జన్మించిన ఆమె నాట్యం నేర్చుకొని నాట్యరాణిగా ప్రశంసలందుకొంది. పలనాటి యువరాజు వేలుగోటి రాయపనాయకుడు ఆమెను తన ఆస్థాన

1. అల్లాదేవి, లకుమాదేవి, పుట - 140.
2. అందే, పుట - 171.

నర్తకిగా నియమిస్తాడు. రాయపనాయకుడు తనను కోరుచున్నాడని తెలిసి ఆమె యుక్తిగా కొండవీడువెళ్ళి, ప్రభువు అనవేమారెడ్డి సమక్షంలో నాట్యంచేసి అతని మెప్పును పొందుతుంది. ప్రభువులను దర్శించేందుకు వచ్చిన రాయపనాయకుడు ఆమెను బలవంతంగా కార్యమపూడికి చేర్పించాడు. ఆమె శీలాన్ని అపహరించి బంధించాడు. ఆమె కావలా సైనికుల్ని మోసగించి, ఒక ఆశ్రమాన్ని చేరుకుంటుంది. తాను గర్భవతిననే విషయాన్ని గ్రహిస్తుంది. ఆమెను రక్షించిన పుణ్యాత్ముణ్ని వధించి సైనికులు ఆమెను వెంబడిస్తారు. ఆమె మారుమూలగ్రామాలకుపోయి బిచ్చమెత్తి జీవిస్తుంది తాను ప్రసవించిన ఆ బిడ్డను ఒక మందసములోపెట్టి, చెన్న కేశవాలయము వద్ద విడిచివెడుతుంది."

ఆమె చెప్పిన విషయాన్నివిని లకుమ ఆ వృద్ధురాలిని తన తల్లిగా గుర్తిస్తుంది. తన తల్లిని అంధురాలిగా చేసినవాడు రాయపనాయకుడని తెలుసుకుంటుంది. కొండవీడును చేరిన లకుమను కుమారగిరి రహస్యంగా ఏటాలగూరమ్మ ఆలయంలో వివాహమాడతాడు. కుమారగిరి లకుమతో కలసి తీర్థయాత్రకు వెళతాడు. "వసంతరాజీయాన్ని" రచిస్తాడు. ప్రజలకు లకుమపట్ల ద్వేషం కలుగుతుంది, మరలావసంతము వచ్చింది. నాట్యంలో పోటీ జరుగుతుంది. లకుమను రాజునుండి విడదీయాలని, తమరాజ్యంలో స్థానంలేకుండా చేయాలనీ అసూయాపరులు కుట్రపన్ని లకుమ నాట్యంలో లెని తప్పులను ఎత్తిచూపుతారు. లకుమ తనకు జరిగిన అన్యాయానికి పరితపిస్తుంది లకుమ ఒక యోగినివలె మనసును పదిలపరచుకొని, తనను ప్రాణాధికంగా ప్రేమించే కుమారగిరిని విడిచిపెట్టి, తనకోసం విచ్చివాడైన శాంతివర్ధనుణ్ని మళ్లీ మామూలు మనిషిని చేయడానికి విశాలవిశ్వంలోకి పయనమైపోతుంది.

ఈనవలలో కీలకపాత్రలైన కమలయోగిని, శాంతివర్ధనుడు, లకుమ తల్లి, కుసుమ మొదలగువారు రచయిత కల్పించిన పాత్రలే. వసంతోత్సవాలు, యుద్ధవర్ణనలు, వసంతరాజీయాన్ని రచించడం వంటి సన్నివేశాలు మినహాయిస్తే, మిగిలినవాటికి చరిత్రాధారాలు కనుపించవు, ప్రజలను, రాజ్యాన్ని మరచిపోయిన కుమారగిరితో లకుమ, "మనం ఇలాగే దేశాలుపట్టుకు తిరిగితే ప్రభువును నమ్ముకున్న ప్రజలు ఏమవుతారు? ఎన్నో శ్రమలకు ఓర్చి రచించిన యీ కావ్యం ఏమవుతుంది?

ఎవరికి కానప్పుడు యీ బ్రతుకు ఎందుకు? మన ఉనికిలో అర్థమేమిటి." అని రాజును జాగృతుణ్ని చేస్తుంది. ఇందులో లకుమ నాట్యరాణి, త్యాగమయి. కాని ఆమె పుట్టుక, పెరుగుదల, కొండవీడును విడిచివెళ్లడం - ఇవన్నీ రచయిత ఊహించినవే.

లకుమ నాట్యవిషయంలో చేసిన న్యాయనిర్ణయమువల్ల కుమారగిరి మౌనం వహించడం సముచితంగా లేదు. నాట్యకోవిదుడైన కుమారగిరి లకుమకు జరిగిన అన్యాయాన్ని సహించడం నాట్యకళకు తీరని అపచారం చేసినట్లవుతుంది. లకుమపై అతనికి గల ప్రేమను శంకించవలసి వస్తుంది. నారాయణరెడ్డిగారు చిత్రించిన కుమారగిరి ధీరలలితుడు. లకుమ కాలు బెణకినదని విన్నంతనే కొలువునుకూడా విడిచిపెట్టిన ప్రేమమయుడు. ఆమె కాలుబెణకుటను "తన జీవనవామృత భాండమే తొణకినట్లుగా" భావించిన నాట్యకళాకోవిదుడు. మరణం మాత్రమే కుమారగిరి లకుమలను వేరుచేయగలిగింది.

నవలలో లకుమ దిక్కులేని దానిలా విలపిస్తూ, ప్రజలచేత రాళ్ళతో కొట్టబడి, దేశాన్ని విడిచిపెట్టి పోతుంటే కుమారగిరి చూస్తూ వూరుకోవడం సముచితంగా లేదు. కుమారగిరిని అసమర్థుడిగా, వంచకుడుగా భావింపవలసి వుంటుంది. లకుమను త్యాగమయిగా తీర్చిదిద్దడంలో రెడ్డిగారి కల్పన ఎంతో ఉదాత్తంగా వుంది. లల్లాదేవిగారి నవలలో మహారాణి అసూయాపరురాలు. కులీనురాలైన పట్టపురాణి పాత్రను నారాయణరెడ్డిగారు ఎంతో ఉన్నతంగా తీర్చిదిద్దారు. దేశక్షేమంకోసం, అర్థరాత్రి సమయంలో మహారాణి లకుమ యింటికివెళ్లి రాజునువిడిచి పోవలసిందిగా ప్రార్థించడం, లకుమ ఆత్మాహుతి చేసుకొవడం పాత్రల మనోస్వభావాలకు అనుకూలంగా, సహజ గంభీరంగా నారాయణరెడ్డిగారు రూపొందించారు. ఈ నవలలో లకుమ అభిమానవంతురాలుగా కనుపించదు. తన తల్లిని అంధురాలినిగా చేసి, చిత్రహింసలకు గురిచేసినవాడు వెలుగోటి రాయప నాయకుడని తెలిసికూడా ఏమీ చేయలేకపోతుంది. పోనీ, తండ్రిగా అతనిని దండింపచేయక పోయినా, కనీసం అతనిలో పరివర్తన కలగేలా, అతనికి తనపట్ల కుమార్తెఅన్న ప్రేమ జనించేలా సన్నివేశాన్ని కల్పించినా బాగుండేది. లల్లాదేవిగారి నవలలో పాత్రచిత్రణ విషయంలో ఎంతో అసహజత, అనౌచిత్యం కనుపిస్తుంది.

# విశ్వనాథనాయుడు

## ఇతివృత్తము - చారిత్రకత

నారాయణరెడ్డిగారి చారిత్రిక గేయకథా కావ్యాల్లో విశ్వనాధనాయుడు మూడవది. వారి మాటల్లో చెప్పాలంటే శృంగార స్పర్శ లేకుండా వ్రాసిన వాటిలో మొట్టమొదటిది. ఒకానొక ప్రాచీన కవిచే వ్యావహారికంలో వ్రాయబడి, కీ॥శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే పరిష్కరింపబడిన, తంజాపురాంధ్ర రాజుల చరిత్ర" నుండి యీ వస్తువును గ్రహించారు. వీరరస ప్రధానమైన యీ గేయకావ్యాన్ని మహానటులు, మధుర హృదయులు, కళలూ సాహిత్యమూ అంటే కరిగిపోయే రసహృదయులైనశ్రీ గుమ్మడి వేంకటేశ్వరరావుగారికి అంకితమిచ్చారు. ఈ కావ్యం 1959 డిసెంబరులో ప్రచురింపబడింది.

## కథాంశం

శ్రీకృష్ణదేవరాయల మన్నిడైన విశ్వనాధనాయుడు రాజద్రోహానికి పాల్పడిన తన తండ్రి నాగమనాయకుని బంధించి, రాయలసమక్షమున నిలిపి, తన రాజభక్తిని ప్రకటించడం ఈ కావ్యంలోని ప్రధాన వస్తువు.

కావ్యేతి వృత్తాన్ని నారాయణరెడ్డిగారు ఆరుఖండాలుగా విభజించారు. ప్రథమఖండంలో విశ్వనాధనాయని జనన వృత్తాంతం వర్ణించబడింది. తమస్సును పారద్రోలే సూర్యావతరణంతో కథ ప్రారంభించబడింది. స్వార్థంతో రాజద్రోహానికి పాల్పడిన తండ్రినిజయించి, తన ధర్మాను రక్తినీ, నిష్కళంకరాజ భక్తినీ ప్రకటించిన విశ్వనాధుని పుట్టుకను సూర్యోదయ వర్ణన ద్వారా సూచించిన తీరు రసజ్ఞులను అలరిస్తుంది. లోకానికి వెలుగును ప్రసాదించే సూర్యావతరణ వర్ణనము విశ్వనాథుని ఆదర్శాన్ని లోకానికి వెల్లడిచేస్తుంది.

" సూర్యావతరణ ప్రచురణార్థ సమయ సం
భృత శంఖమన మింట వేగుచుక్క వెలింగె" అనే సూర్యోదయ వర్ణన జన్మించబోయే విశ్వనాథుని గొప్పదనాన్ని వెల్లడిస్తుంది. వేగుచుక్క మహాపురుషుల జననాన్ని సూచిస్తుందనే సంప్రదాయాన్ని కవివ్యక్తీకరించారు. సూర్యుని వంటి తేజస్వి, నిజధర్మ నిర్వహణ తత్పరుడు అయిన విశ్వనాథుడు అవతరింపబోతున్నాడనే అర్థస్ఫూర్తి ఈ వర్ణన ద్వారా కలుగు తున్నది.

' సంఘృష్ట కాంతి నిర్ఘర విఘాతములతో
చిట్లిపోయినవి చీకట్ల కూకటి వ్రేళ్లు
లేఖా కృతులుగ చీలిన యెర్రిడాళ్లు క
న్పడెను నెత్తుట తడిసినట్టి ఒల్లెములట్లు "

ఎంతో ఉత్తేజకరంగా సాగిన యీ వర్ణన,వలన- కావ్యం వీరరస ప్రధానమని సూచించబడింది. ఆ సూర్యోదయ సమయాన విద్యానగరము స్తన్యముగ్ధ శిశువు విధాన ఆనందమూర్తియైనదట. జన్మించబోవు విశ్వనాథుని వీరోచితగాధ, రాజభక్తి, విజయనగర సామ్రాజ్యమునకు ఆనందహేతువుకాగలదని భావన. విశ్వనాథుని కటాక్షము నాగమ, మల్లికాంబలకు లభించిందని తెలుపుటకై "నగరము వెలుపలవున్న విశ్వనాథమూర్తి దివ్యము సమాధివిడిన యోగీంద్రునివలె కన్పడినది." అని వర్ణించినాడు కవి.

కృష్ణరాయుల యశోగీతి సంచాలకుడు, కుడిభుజము అయిన నాగమనాయకుడు, అతని భార్య మల్లికాంబపుత్రకాంక్ష కలితమకూలై, విశ్వనాథుని ఆలయానికి వచ్చి ధ్యానముద్రాభద్రులై నిలచినారు. వారి మనో నేత్రములలో వేయి మెరుపుతీగల కాంతి భాసించింది. ఆ దంపతులకు పరమశివుని కన్నులలో పాలవెన్నెల కనుపించింది సాంబ్రాణి ధూపముల సౌరభములు మూడు నాలుగింతలై నాసికాపుటములను సోడుముట్టించినవి. గర్భగుడిలోని జే గంటలు తమంతతామే గణగణమని మ్రోగాయి. ఈ వర్ణనలో "సినిమా టెక్నిక్" యిమిడివుంది. విశ్వనాథుని

1. డా॥ సి. నా. రె. విశ్వనాథనాయడు, పుట. 1

కటాక్షంలో జన్మించబోయే కావ్యనాయకుని గొప్పదనాన్ని యీ వర్ణనలు వెల్లడిస్తున్నాయి.

వెలుతురు హత్తిళ్లలోన కిలకిలమని నవ్వుతున్న బాలసూర్యబింబాన్ని నాగమనాయకుడు దర్శింపవటము, గూటినుండి వెలుపలికివచ్చి కొమ్మపై కూర్చుండి తన సంతానమును ప్రేమతో దువ్వు ఆడపక్షిని మల్లికాంబ చూచి పులకరించడమూ వారి భవిష్యత్సంతాన ప్రాప్తిని సూచించే వర్ణనలు. నాగమనాయకుడు కార్తాంతికులను రప్పించి ఆలయంలోని తమ అనుభవాలను వివరింపగా, వారు "జగదేక మహావీరుడు" జన్మించగలడని తెలియజేస్తారు. నాగమనాయని సంతానాపేక్షను గమనించిన రాయలు, స్వయంగా నాయని మందిరానికి వెళ్లి బాలచంద్రుని వంటి కొడుకును పొందగలవని ఓదారుస్తాడు. కొంత కాలానికి మల్లికాంబ గర్భవతియై రత్నము వంటి కుమారుణ్ని ప్రసవిస్తుంది. నాయని పుత్రోదయాన్ని విని విజయనగర పౌరులు సంతసించారు. వేడుకలతో నాయని మేడ పూవువలె తేలిపోయింది. ఎందరో సామంతరాజులు, దండనాయకులు, శ్రీమంతులు వచ్చి కానుక లిచ్చారు. విశ్వనాథుని జన్మదినోత్సవపు వేడుకల్లో రాయలవారు స్వయంగా పాల్గొన్నారు. కందిగుబ్బెత్తలు మధురాగణికలు నాట్యం చేశారు. "విశ్వనాథకృపాజలధి వీచికవలె జన్మించినాడు" గనుక విశ్వ"నాధుడనే పేరు నిర్ధారించబడింది.

## ద్వితీయ ఖండం

చిన్నతనంలోనే విశ్వనాధుడు సుగుణాలరాశిగా ప్రకాశించాడు. ఊయలలోని విశ్వనాధుడు "చిట్టిమ్ముగట్టిన అధర్మమును నెట్టివేసినయటు" దూరంగా నెట్టివేసేవాడు. శ్రీకారము ప్రారంభించి ఒకయేడు గడవక ముందే తిక్కనన్న భారతమును వల్లించాడు. తన తోటికుర్రకారుతో కలసి సాహసోపేతమైన ఆటలు ఆడేవాడు. మొలకమీసం వచ్చేసరికి విశ్వనాధుడు తండ్రినిమించిన తనయుడని పేరొందినాడు. విశ్వనాథుని బాల్యానికి సంబంధించిన యీ వర్ణనలు భావికథాసూచకములై భాసించాయి. వాత్సల్యంతో కృష్ణ దేవరాయలు విశ్వనాథనాయకుణ్ని సేనాపతిని చేశాడు. అరివీరుల శిరస్సులను బంతులవలె చెండాడి, శత్రుగిరి దుర్గాలను

తు త్తనియలుచేసి, మదపుటేనుగుల కుంభస్థలాలను చేతిదెబ్బతో పగలగొట్టి, హుంకారముతో ఉద్రిక్తతరంగాలను మరల్చి విశ్వనాథుడు రాయల మన్ననకు పాత్రుడైనాడు. దినదిన వర్ధిష్ణువైన తనయుని కీర్తిని గమనించి, అరువదేండ్లు పైబడిన నాగమనాయుని హృదయంలో అసువ చ్చని ఊహలు సందడించాయి.

" అంతటి తన విశ్వనాథు
డెంత కాలమని రాయల
నీడలోన ఒదిగి ఒదిగి
నిల్చునని వితర్కించెను.
మకుటధారి కావలసిన
మన్నీడొక దళవాయిగ
బ్రతుకుటయా " 1

అని దురాలోచన ప్రారంభమైంది. నాగమనాయకుడు అవకాశం కోసం పొంచివున్నాడు. ఆ అవకాశం రానే వచ్చింది. తంజావూరును పాలించే చోళుడు, మధురను పాలించే చంద్రశేఖర పాండ్యుడు విజయనగరానికి సామంతరాజులు. బలవంతుడైన చోళుడు పాండ్యరాజ్యాన్ని ఆక్రమించాడు.

కన్నుమిన్నుగానని చోళుని కండకావరమణచి తనరాజాన్ని తనకు యిప్పించవలసిందిగా చంద్రశేఖర పాండ్యుడు రాయలకు విన్నవించు కొన్నాడు. కృష్ణరాయలు మహామంత్రి తిమ్మరుసుతో ఆలోచించి, చోళుని శిక్షించవలసిందిగా నాగమనాయకుని నియోగించాడు. నాగమనాయకు నిలో గుడుసుళ్ళువడే అత్యాశ ఒక్కసారిగా పెల్లుబికింది. వెదుకబోయిన తీగ కాలికి తగిలినట్లుగ సంతసించాడు.

" రాజకార్యముతోడ తీరును
నైజకార్యము, చోళరాజును
తరిమి కొట్టుటతోడ పాండ్యుని
చరిత సైతము చెరిగి పోవును.

---

1. డా॥ సి.నా.రె. విశ్వనాథనాయకుడు పుట. 28

"తంజపురియును మధురనగరియు
తనకు క్రీడావందనములగు
తనకుమారుడు విశ్వనాధుడు
దక్షిణాపథ సార్వభౌముడు " [1]

ఇట్టి వక్రోహావరంపరలు నాగమనాయనిలో చెలరేగినవి. చోళదూపరి పీచమణచడానికి సైన్య సమేతుడై బయలుదేరాడు.

## తృతీయ ఖండం

నాగమనాయకునితో వెళ్లిన పాండ్యభూపతి "ఝుంఝునిల సముద్ధూత శరన్మేఘ శకలమువలె" కృష్ణదేవరాయలవద్దకు తిరిగివచ్చాడు. తనతో ఆప్తాజిమాత్రమే వుండగా పాండ్యభూపతిని అభ్యంతరమందిరానికి పిలిపించాడు రాయలు. ఆ సమావేశంలో పాండ్యుడు తనకు జరిగిన అన్యాయాన్ని విన్నవించుకొన్నాడు. కృష్ణరాయలు విస్మయం చెందాడు. క్రమక్రమంగా అతని కంటి కొనలు ఎరుపెక్కాయి. పాండ్య నృ పా లు న కు రా య ల ఆశ్రయం లభించింది. విషయమంతా తెలుసుకున్న విశ్వనాధుడు ఖిన్నుడైనాడు. నాగమనాయకుని వెంటనే మరలి రావలసిందిగా రాయలు వర్తమానం పంపాడు. నాగమనాయకుడు ఎంతో నేర్పుగా—

చెల్లా చెదరౌ పాండ్య
శ్రీకి సిగను ముడచినాడ
మంట లెగయు దేశమ్మున
మల్లెలు పండించినాడ!
ఇంతచేసి పాండ్యునకే
నెటుల రాజ్యమర్పింతును?
చేనుగాచి నక్కలపాల్
చేయు వెర్రి వాడెవ్వడు?

ఏ పాండ్యునిపై నో కురి
పించెడు వాత్సల్యములో
ఒకసగమీ బంటుపైన
ఒలికించిన దోష మేమి?
తమసేవలో బ్రతుకులు
ధారవోసినట్టి మేము
ఈ మాత్రము ఫలమ్మనుభ
వించుట కైనను తగమా?
అంతదాక యెందుకు రా
జ్యమ్ము వీరభోజ్యమ్మని
తమకు తెలియనట్టి రాజ
ధర్మమ్మా.........................."[1]

కృష్ణరాయలు క్రోధంతో ఉత్తరాన్ని పూర్తిగ చదవకుండగనే చించివే శాడు. కొలువు దీర్చి నాగమనాయకుని దుష్ట చింతనను సభ్యులకు తెలియ జేశాడు.

"మోహమేదో క్రమ్మి రాజ
ద్రోహమునకై కొలువువ్విన
వాడు మనకాప్తుండెయైనను
వధ్యుడే- ఇది ధర్మమార్గము!
నాయడింతకును ప్రభుద్రోహ మొ
నర్చె; అతని రెండు రెక్కలు
గట్టి తీసుకవచ్చి యిట నిల
బెట్టు డెట్టి యెవండో తెల్పుడు"[2]

అని సభ్యులను కోరాడు. నాగమనాయకునితో పోరాటానికి సిద్ధపడలేని

1. డా॥ సి.నా.రె., విశ్వనాథనాయకుడు, పుట. 35-36
2. అందే పుట. 39

సభ్యులను చూచి, "ఎవరు లేరా? సిగ్గుసిగ్గని" రాయలు పలుకగా, "ఉన్నానో ప్రభో" అని విశ్వనాథుడు ముందుకు వచ్చాడు. ధర్మక్షతిని చూడలేక తండ్రిపై ధ్వజమెత్తిన విశ్వనాథుని కృష్ణరాయలు దీవించాడు.

## చతుర్థ ఖండం

విశ్వనాథుడు చతురంగ బల సమేతుడై తండ్రిపైకి యుద్ధానికి బయలుదేరాడు. ఈ సందర్భంగా నారాయణరెడ్డిగారు వర్ణించిన గ్రీష్మర్తు వర్ణన ఉద్వేగ భరితమై సాగిపోయింది.

కటిక రాత్రులను, మండిపడు పగళ్ళను చీల్చుకొని, విశ్వనాథుడు కొన్నాళ్ళకు మధురను సమీపించాడు. తాను వచ్చిన కారణాన్ని తండ్రికి ఉత్తరం ద్వారా తెలియజేశాడు. నాగమనాయకుడు తనపై అమాంతం పిడుగుపడినట్లుగా ఆక్రోశించాడు. "ప్రాణము పోయినగానీ పాండ్యరాజ్య మివ్వనని" వార్త పంపాడు. ఈ వార్తను విన్న విశ్వనాథుడు వగచి వగచి గుండె దిటవు పరచుకొని తండ్రికి "దయతో యుద్ధమునకు సిద్ధము కమ్మని కబురు పంపాడు.[1]

## పంచమ ఖండం

తండ్రి కొడుకులు యుద్ధసన్నద్ధు లౌతున్న సమయంలో సూర్యాస్తమయ వర్ణనం చేయబడింది. ఈ వర్ణన కథాగమనానికి ఆటంకాన్ని కలిగించకుండా, కథాంశానికి మెఱుగులు దిద్దింది.

గుండెపై కుంపటి రగుల్కొనగ వరుగెత్తి
పశ్చిమాంబోధి గర్భమున సూర్యుడు దూకె"[2]

అనడంలో విశ్వనాథుడు, అతని తల్లిదండ్రుల మనోవేదన ధ్వనిస్తుంది. ఒక భ్రష్టచేతనుని వికృతోహలకు బాహ్యరూపమో యన్నట్లు"
తమస్సు వ్యాపించినదట! కథాంశానికి బిగువును చేకూర్చే వర్ణనలివి.

---

1. డా॥ సి.నా.రె. విశనాధనాయడు పుట. 52
2. అందే పుట. 57

ఇచట భ్రష్టచేతనుడు నాగమనాయకుడు విశ్వనాధుని తల్లి మల్లికాంబ పుత్రుని తనవద్దకు రావలసిందిగా వార్తాహరునిచే లేఖనుపంపుతుంది. విశ్వనాధుడు జామురాతిరివెళ్ళి "నిజానుగమద్భటద్వయమాత్రుడై" నాయని సౌధమునకు వెళ్లాడు. మూర్తిభవించిన శోకదేవతవలెవున్న మల్లికాంబ కుమారుని కౌగిలించుకొని విలపించింది. అప్పుడే వచ్చిన నాయకుడు ఒర లోపలి కరవాలముతో ముందుకురాగా, విశనాధుడు తండ్రివాలకమునకు చింతపడి ఖడ్గంచూశాడు. "స్వామిద్రోహముచేసిన జనకుడైన శిక్షార్హు"డని పలికి, తండ్రికాళ్లకు ప్రణమిల్లి విశ్వనాధుడు సైనిక శిబిరం చేరాడు. ఈ పంచమ ఖండంలో తండ్రి కొడుకుల సంభాషణ అధర్మానికి, ధర్మానికి మధ్య జరిగే సంఘర్షణలా వుంటుంది. మల్లికాంబ మాతృప్రేమ ప్రస్ఫుటమౌతుంది. కరుణరసపూరితమైన యీ సన్నివేశంలోనూ విశ్వనాధుని ధర్మానురక్తి వ్యక్తమౌతుంది.

## షష్ఠ ఖండం

కథను వేగంగానూ, శక్తిమంతంగాను నడపడంలో నారాయణరెడ్డి అందెవేసినచేయి. సుదీర్ఘమైన యుద్ధవర్ణనలను త్రోసిపుచ్చాడు. విశ్వనాధుని చేతిలో నాగమనాయుడు ఓటమి చవి చూచాడు.

"హిగమంచువలె రుంద్రముగ ముసురుకొన్న పెం
ధూళిలో నిగళబద్ధుడు నాయుడగుపించె"

అని నాయని పరాజయం క్లుప్తంగా చెప్పబడింది. ఈ విజయం విశ్వనాధునకు ఆనంద హేతువుకాదు.

" చింతా వికీర్యమాణాంతరుండై విశ్వ
నాధుడగ్రస్యందనస్థుడై పయనించె "

ఇది విశ్వనాధుని మనస్థితి.

వేరొక్క రథముపై వ్రీడామలీమసా
నన భాగుడైన నాయని మూర్తికనప్పట్టె " [1]

1. డా॥ సి.నా.రె. విశ్వనాధనాయకుడు పుట. 77

ఇది నాగమనాయకుని దుస్థితి. తండ్రి నాగమనాయకుని బంధించి విశ్వనాధుడు మరలివస్తున్నాడని వార్తతెలిసి, రాయలు మిక్కిలి సంతసించాడు. విజయనగరపౌరులు "కొడుకుచే ఇనుపగొలుసులు కట్టబడిన తండ్రినిజూడ" కుతూహలపడ్డారు. బంధితుడైన తండ్రితో విశ్వనాధుడు సభలో ప్రవేశించాడు. రాయలు గద్దెనుండి దిగివచ్చి రెండుచేతులు సాచి విశ్వనాధుని కౌగిలించాడు. తన కౌగిటిలో కన్నీళ్లను రాల్చెడు విశ్వనాధుని ఆప్యాయంగా స్పర్శించి, వెంటబెట్టుకొని తన సింహాసనపార్శ్వమున కూర్చుండబెట్టాడు. విశ్వనాధునకు లభించిన యీ సభాగౌరవాన్ని చూచి సభికులు జయ జయధ్వానాలు చేశారు. కృష్ణరాయలు నాగమనాయనితో -

" నిన్ పాతరవేసినన్ మా
కున్న కసి చల్లారి పోవదు.
ఈ వొనర్చిన నేరమున కిం
తట్టి దండనమైన చాలదు.

ఐన నినుమన్నించుచుంటిమి
అత్యుదాత్త గుణవ్రత హృ
దంతరుండగు విశ్వనాధుని
తండ్రివై యున్నావు గావున "

అనిపలికి, క్షమాభిక్షను ప్రసాదించాడు. కృష్ణరాయలవాక్కులకు "కొలువెల్ల పులకలపంట పొలమై పరవశించింది. తండ్రిని బంధించి తెచ్చి తన ప్రభుభక్తిని ప్రదర్శించిన విశ్వనాధుని సద్వర్తనమునకు పాండ్యభూపతి విస్తుపోయాడు. తన రాజ్యాన్ని విశ్వనాధునకు యివ్వవలసిందిగా రాయలవారిని అర్థించాడు.

" నేటినుండియె విశ్వనాధా!
నీవు పాండ్య శ్రీయుతుడవై
దక్షిణా పథమందు శాంతి
ధ్వజము నాటుము నీకుమేలగు " [1]

---

1. డా॥ సి. నా. రె, విశ్వనాధనాయకుడు, పుట 81.

అని రాయల విశ్వనాథునితో వచించాడు. విశ్వనాథుడు సవినయంగా -

" మహాప్రభూ! ఏమి చిత్ర
మయ్యా! బంటేమిటి రా
జగుటేమిటి ? వదాన్యతకు
హద్దు పద్దులే లేవా?
నాకా రాజ్యమ్ము? గరిక
కా కిరిటమున స్థానము?
మీరు నడుచుదారుల ఈ
మేను పరచుకొన్న చాలు "

అని సమాధానమిచ్చాడు.[1] "మీనీడను గల ఆత్మ సుఖానుభూతి రాచగద్దెపై లభించదని" మనవి చేసినాడు. సభ్యులు నిరాశచెందారు. పాండ్య భూపతి "విశ్వనాథు రాజ్యము నేలుకొనక తప్పదని" తిరిగి ప్రార్థించాడు. కృష్ణరాయలు "పాండ్య ప్రజాశ్రేయముకైనను' రాజ్యమును స్వీకరించవలసిందిగా విశ్వనాథుని కోరినాడు. తుదకు విశ్వనాథుడు మధుర రాజ్య రక్షణభారం వహించడానికి అంగీకరిస్తాడు. విశ్వనాథుని ప్రభుభక్తి ఆదర్శప్రాయమై వేనోళ్ల ప్రస్తుతింపబడినది.

## చారిత్రకత

ఈ ఇతివృత్తం చాలావరకు చారిత్రకం. ఒకానొక ప్రాచీన కవిచే వ్యావహారికంలో వ్రాయబడిన తంజాపురాంధ్ర రాజుల చరిత్ర నుండి ఈ వస్తువును తీసుకున్నాను. కీ॥శే॥ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి గ్రంథాన్ని పరిష్కరించి ప్రకటించినారు. శ్రీ కురుగంటి సీతారామయ్యగారి తంజాపుర నాయక రాజుల చరిత్రలోగూడ ఈ కథ ప్రస్తావించబడింది.[1] అని నారాయణరెడ్డిగారు పీఠికలో సహృదయులకు తెలియజేశారు. చారిత్రకమైన యీ గేయ కావ్యంలో కావ్య సౌందర్యం దృష్ట్యా అక్కడక్కడా చిన్న మార్పులు చేశారు. విశ్వనాథనాయని జననవృత్తాంతం, విశ్వనాథ నాయని తల్లిమల్లికాంబ విషయం మూలంలో కనిపించవు. అయితే చారి

1. అందే పుట 83.

త్ర కాంశాలకు భిన్నంకాని మార్గంలో, కావ్యౌచిత్యానికి భంగం కలుగని రీతిలో యీ మార్పులు చేయబడ్డాయి.

నారాయణరెడ్డిగారు ప్రామాణికంగా స్వీకరించిన మూలాధార గ్రంథాలు చారిత్రక సత్యాలతో కూడినట్టివి వీనిలో "తంజాపురాంధ్ర రాజుల చరిత్ర"ను వ్రాసిన వారెవరో తెలియదు. వ్యావహారికంలో వ్రాయ బడిన యీ వచన గ్రంథాన్ని పరిష్కరించి ప్రకటించినవారు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. మధురనాయక రాజులను గూర్చిన చారి త్రక విశేషముల నెన్నిటినో విశదీకరించే విలువగల పీఠికతో వేటూరివారి గ్రంథాన్ని 1914 లో ప్రచురించారు. శ్రీకురుగంటి సీతారామయ్యగారి "తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రము" చివరనున్న అనుబంధములో ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన "తంజాపురాంధ్ర రాజుల చరిత్ర" కొం తవరకు ముద్రింపబడివుంది. టైలరుగారి ప్రాచ్యచరిత్ర గ్రంథము.

తంజాపురాంధ్ర రాజుల చరిత్ర ఏయే విషయాల్లో ఏకీభవిస్తు న్నాయో ఆ విషయాలను కురుగంటి సీతారామయ్యగారు అనుబంధంగా ప్రచురించారు. శ్రీ కురుగంటి సీతారామయ్య "తంజాపురాంధ్ర రాజుల చరిత్రము"ను గూర్చి తమ అభిప్రాయాన్ని యిలా వివరించారు. "తం జాపురాంధ్ర రాజుల చరిత్రము" ఇది చిన్న గ్రంథమయ్యును ఉపకా రము. కాని తరువాత చాల కాలమునకు రచియింపబడినది. అందుచే పరమ ప్రమాణముకాదు. వైరుద్ధ్యము లేనట్టియు, సాక్ష్య మున్నట్టియు విషయములను ప్రమాణముగా గొననగును. దీనిని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రకటించారు." [1] తంజాపురాంధ్ర రాజుల చరిత్రము వ్రాసిన వారు ఆ రాజుల ఆస్థానకవి కాదని కురుగంటి వారి అభిప్రాయము. అందు చేత ప్రతివిషయమును ప్రామాణికముగా గ్రహింప వచ్చునో లేదో అనే సందేహాన్ని వ్యక్తం చేసినప్పటికీ, మధుర నాయకరాజ్యస్థాపన వృత్తాం తానికి తంజాపురాంధ్ర రాజుల చరిత్రనే ఆధారంగా స్వీకరించారు.

1. కురుగంటి సీతారామయ్య, తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రము, పుట. 5

"పై రెండు గ్రంథములును (తంజాపురాంధ్ర రాజుల చరిత్ర, టి. ఆర్. కుప్పుస్వామి శాస్త్రిగారు తమిళంలో వ్రాసిన తంజావూరు నాయిక రాజుల చరిత్రము) తరువాతి యన్ని వ్రాతలకును ముఖ్యాధార భూతములు"[1] అని కురుగంటి సీతారామయ్యగారే సెలవిచ్చారు. పై విషయాలను సమీక్షిస్తే "తంజాపురాంధ్ర రాజుల చరిత్రము" అత్యధిక భాగము ప్రామాణిక మైన చరిత్ర గ్రంథమని భావించవచ్చును.

తంజాపురాంధ్ర రాజుల చరిత్రములో మొదట మధురలో నాయక రాజ్య స్థాపనము, ఆ తరువాత తంజావూరి నాయక రాజుల చరిత్రము వివరింపబడింది. నారాయణరెడ్డిగారు చెప్పినట్లుగా విశ్వనాధనాయని జనన వృత్తాంతం మూల గ్రంథంలో (తంజాపురాంధ్ర రాజుల చరిత్రలో) లేదు. అయితే యీ గ్రంథంలో నాగమనాయకుడు తన కుమారుడు తనపై కత్తి కట్టాడని తెలిసి "నేను ఈ కుమారుడు కలుగవలెనని బహుత పస్సు చేసి విశ్వనాధ స్వామిని ప్రార్థించినందుకు నా మీద కత్తియెత్తే కొమారుడు కలిగినాడు" [2] అనే పంక్తుల ఆధారంగా విశ్వనాధుని జనన వృత్తాంతాన్ని విస్తరించి వ్రాసినారని భావింపవచ్చును. విపులంగా వ్రాయ బడిన జననవృత్తాంత వర్ణనలు విశ్వనాధుని ధీరోదాత్త నాయకునిగా నిరూపి స్తాయి. నాయకుని భవిష్యద్వ్యక్తిత్వమును మహోన్నతంగా వ్యక్తీకరించే ప్రథమభాగమిది. కావ్యనాయకుని ధీరోదాత్త చరిత్రను దృష్టిలో పెట్టుకొని కావ్యానికి విశ్వనాధనాయడనే పేరు పెట్టబడింది. కావ్యాన్ని విశ్వనాధుని జనన వృత్తాంతంతో ప్రారంభించడమే సమంజసం. దీనివల్ల చరిత్రకు ఎట్టి విఘాతము కలుగకపోగా కావ్యగౌరవం యినుమడించింది. విశ్వనా ధుని పుట్టుక, పెరుగుదల మూల గ్రంథంలో కనుపించవు. "ఆదిలో కృష్ణ దేవరాయల వారు కటకం మొదలుకొని కన్యాకుమారి దాకా దేశం లోపర చుకొని సుఖసంతోషంలో, వినోదంతో విజయనగరంలో రాజ్యమేలుతూ వుం డగా, మధురలో చంద్రశేఖర పాండ్యుడున్ను తంజావూరులో వీరశేఖర చోళుడున్ను రాయలవారికి వశవర్తులై రాజ్యంచేస్తూ వుండిరి" [3] అని

---

1. అందే పుట. 6.
2. వేటూరి ప్రభాకరశాస్త్రి, తంజాపురాంధ్రరాజుల చరిత్ర పుట. 38
3. అందే పుట. 35

తంజాపురాంధ్ర రాజుల చరిత్ర ప్రారంభమౌతుంది. నారాయణరెడ్డిగారి కావ్యంలో ద్వితీయ ఖండం చివరిలో యీ కథాంశం ప్రారంభమౌతుంది. ఈలోగా కావ్యనాయకుడైన విశ్వనాథుని ఔన్నత్యం. విశ్వనాథు నితండ్రి, ప్రతినాయకుడును అయిన నాగమనాయని మనస్తత్వం వివరించబడ్డాయి.

నారాయణరెడ్డిగారి కావ్యంలోనూ చోళభూపతి, పాండ్యరాజు "కృష్ణ రాయల కంటి చల్వల నిగురులిడు సామంతులే" అయితే నారాయణరెడ్డి గారు చోళభూపతి పేరును వీరశేఖర చోళునిగా పేర్కొనలేదు. కురుగంటి సీతారామయ్యగారు కాని "యాకాలమునందు చంద్రశేఖర పాండ్యుడు మధుర యందును, వీరశేఖరచోళుడు తంజావూరునందును రాజ్యము చేసినట్లు శాసనాధారము లెవ్వియుగానరావు. అట్లువారు రాజ్యము చేయ లేదనుటకును వలనుపడదు. మెకంజీ రికార్డులు కూడా యిట్టికథనే చెప్పుచు న్నవి." [1] అని వివరించారు. వీరశేఖర చోళుడనే పేరు వివాదగ్రస్త మైనది. [2] కనుకనే నారాయణరెడ్డిగారు "చోళభూపతి" అనిమాత్రమే పేర్కొన్నారు. చోళుడు పాండ్యదేశాన్ని ఆక్రమించి చంద్రశేఖర పాం డ్యుని పారద్రోలినట్లును, పాండ్యుడు రాయల చెంతకుచేరి తన దురవ స్థను తెలిపినట్లు, చోళుని జయించుటకై శ్రీ కృష్ణదేవరాయలు నాగమ నాయని నియోగించినట్లును మూలంలో వుంది. నారాయణరెడ్డిగారీ భాగా న్ని యథాతథంగా స్వీకరించారు. రాయలు నాగమనాయని వెంటనే రమ్మని ఉత్తరువులు పంపినపుడు నాగమనాయకుడు యిచ్చిన సమా ధానం మూలంలో వివరంగా వుంది. "ఈ గ్రామాలు యావత్తు జాగ్రత్త చేసేటప్పటికి నేను అనేక ద్రవ్యం ఖర్చుచేసినాను. ఈ పాండ్యుడు ఇంతకు లోవయినం మీదగ్గరికి రారాదా. ఇంత అరాచకంగా ఉన్న రాజ్యం మనకు స్వాధీనానికి రాదని ఇదివరదాకా ఊరికే ఉన్నాడు. ఇప్పుడు చోళరాజును కొట్టి రాజ్యం కట్టడం కాకుండా, అరాచకంగా వున్న రాజ్యం కూడా స్వాధీనం లోనికి తేవడం చూచినాడు. ఇంతకుమునపు రాజ్యం నాకు స్వాధీనానికిరాదు. మీరు యావత్తు కట్టుకొని నాకు అన్నవస్త్రాలకు

---

1. కురుగంటి సీతారామయ్య, తంజాపురాంధ్ర నాయకరాజుల చరిత్రము పుట. 57

2. అందే పుట. 57-61

మాత్రం జరిగిస్తేచాలును అని చెప్పాకుంటుండేవాడు. ఇప్పుడు అతనికి ఆశపుట్టింది; అయితే నేమాయెను. అతనికి రాజ్యం ఇస్తే నగరికీ తోఫా రూకలు కూడా రావు.

మరిన్ని ఇతను పాండ్యవంశం అని చెప్పాకోవడం మాత్రమే కాని జాతికి తక్కువ. దాపీ కొమారుడు. రాజ్యం ఇతనికి అర్హం కాదు గనుకనే చోళరాజు కట్టుకొని యితణ్ణి వెళ్ళగొట్టినాడు. దూరంగా ఉన్నాము గనుక ఈ జాతి నీతులు మనకు తెలియలేదు. ఇంతకు నేను ఒహు దినములు తమ కొలువు కొలిచినాను. ఇక కొన్ని దినములు అయినా సుఖపడవద్దా! ఇది గాక అనేక ద్రవ్యం యీ సంస్థానంమీద పెట్టి యింతమాత్రం రాజ్యం స్వాధీనంలోనికి తెచ్చినాను. నా అర్థం యావత్తు రాబట్టుకొని నేను వస్తాను కాని అంతపర్యంతం నేను వచ్చేదిలెదు."[1] ఈ వివరణ వలన పాండ్యుని వ్యక్తిత్వానికి మచ్చ యేర్పడుతుంది. పాండ్యుడు దురాశాపరుడు, హీను డనే భావం కలుగుతుంది. తన రాజ్యాన్ని విశ్వనాధనాయనికి కానుకగా యిచ్చినవాడు అల్పుడెలా కాగలడు? అందుకే నారాయణరెడ్డిగారు పాం డ్యుని పాత్రకు మచ్చకలగని విధంగా తీర్చిదిద్దారు. నాగమనాయని అత్యాశను, అహంభావాన్ని, దురాలోచనను మాత్రమే వ్యక్తీకరించారు. మూలంలో కృష్ణదేవరాయలు "నాగమనాయుడు మా ఆజ్ఞతప్పి నడచి నాడు గనుక అతని తలమేరు ఎవరైనా తేగలరా?"[2] అని ప్రశ్నిస్తాడు రెడ్డిగారి కావ్యంలో రాయలు "అతని రెండు రెక్కలు గట్టి తీసుకువచ్చి యిట నిలబెట్టు జెట్టి యెవండొ తెల్పుడు"[3] అని మాత్రమే ప్రశ్నిస్తాడు. ఈ వాక్యాలు శ్రీ కృష్ణదేవరాయలు పాత్రకు మెఱుగులు దిద్దాయి. తనకు కుడిభుజమై రాజ్యానికి అపారమైన సేవచేసిన నాగమనాయకుని శిర స్సును ఖండించి తెమ్మనడంకంటె, బంధించి తెమ్మనడమే సమంజసంగా వుంది. మూలంలో కృష్ణరాయలు విశ్వనాధుని "మీ తండ్రిగారి దగ్గరకు మీరుకూడాపోయి కలుసుకోవడానికి ఆజ్ఞ అడుగుతారా"[4] అని ఆక్షేపిస్తాడు.

---

1. వేటూరి ప్రభాకరశాస్త్రి, తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర, పుట. 36
2. అందే పుట. 36-37
3. డా॥ సి.నా.రె. విశ్వనాధనాయడు పుట. 39
4. వేటూరి ప్రభాకరశాస్త్రి, తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర, పుట. 37

కావ్యంలో కృష్ణరాయలు—

"తండ్రి కొడుకులు గలసి మాపై
దండయాత్రను జేతుకని శం
కించుచున్నానంచు నెంచకు
ఎరుగుదును నీ యెడదలోతును"[1]

అని విశ్వనాధునిపై సంపూర్ణమైన విశ్వాసాన్ని ప్రకటిస్తాడు. పాఠకులకు శ్రీకృష్ణదేవరాయలపై గౌరవభావం యినుమడిస్తుంది. విశ్వనాథుడు మధురసీమకు వచ్చి రాయలవారికి లొంగిపోవలసిందిగా తండ్రికి కబురు పెట్టడము, నాగమనాయకుడు వ్యతిరేకించడమూ మూలంలోను, కావ్యంలోను సమానమే.

విశ్వనాధుని తల్లి మల్లికాంబ కుమారుని తన మందిరానికి రమ్మని లేఖ పంపడాన్ని నారాయణరెడ్డిగారు కల్పించారు. కన్నతల్లి కోర్కెను కాదనలేక విశ్వనాధనాయడు అంతఃపురానికి వెళ్ళడము, మల్లికాంబ కుమారుని కౌగిలించికొని విలపించడము, అప్పుడేవచ్చిన నాగమనాయకుడు కుమారునిపై కత్తిదూయడం, గత్యంతరములేని విశ్వనాథుడు తండ్రిని యెదుర్కొన డానికి సిద్ధపడటము, తండ్రికి తన నిశ్చితాభిప్రాయాన్ని తెలిపి శిబిరానికి మరలి వెళ్ళడము అనేవి మూలంలో లేని విషయాలు. ఈ సన్నివేశాల కల్పన కావ్యనాయకుని మచ్చలేని వ్యక్తిత్వాన్ని తెలియజేస్తుంది. తల్లి విలపించినా, కన్నతండ్రి ప్రలోభపెట్టినా తన ప్రభుభక్తిని చెక్కుచెదరనివ్వని విశ్వనాధనాయని ధీర గంభీర హృదయం తేటతెల్లమౌతుంది. ఇవి చరిత్రకు హాని కలిగించే విషయాలుకావు. కావ్య సౌందర్యాన్ని పాత్రౌన్నత్యాన్ని రాణింపజేసే స్వల్పమైన చేర్పులువిశ్వనాధుని తల్లి మల్లికాంబ పాత్ర కల్పితమైనదే. నారాయణరెడ్డిగారు పీఠికలో "విశ్వనాధనాయని తల్లి ప్రసక్తిగూడా ఇంతవరకెక్కడా కానరాదు. ఆమెపేరు సైతం తెలియదు. నేను ఆమె పాత్రకు రూపురేఖలు దిద్దడమే గాక "మల్లికాంబ అన్న నామకరణగూడ చేసినాను."[2] మూలంలో, బంధి

---

1. డా॥ సి.నా.రె. విశ్వనాధనాయడు. పుట. 41
1. డా॥ సి.నా.రె. విశ్వనాధనాయడు, పీఠిక (సహృదయులకు)

తుడై వచ్చిన నాగమనాయని రాయలవారు "ఎందుకు యింత విశ్వాస ఘాతం చేసినావని" ప్రశ్నించినపుడు నాగమనాయుడు చెప్పిన సమాధానం సమర్థనీయంగా వుంది. రాజ్యాన్ని అప్పగించిపోతాను అని నాగమనాయుడు పాండ్యునితో చెప్పినపుడు, పాండ్యుడు "తనకు రాజ్యంతో నిమిత్తంలేదని, తనకు సంతానంలేదు గనుక రాజ్యాన్ని మీరే పాలించుకొనవలసిందని నాగమనాయుని కోరినట్లు మూలగ్రంథం తెలుపుతుంది. "ఈ సంగతి నిజమేనా?" అని రాయలు ప్రశ్నించినపుడు పాండ్యుడు, "నేను యితని కొమారుడు విశ్వనాధనాయని వారికి రాజ్యం వ్రాసి యిచ్చినాను. నేను ఇప్పటికి ఆ మాట తప్పలేదు. రాజ్యం విశ్వనాథనాయని వారికి పట్టం కట్టితే బహుసంతోషం" అని సమాధాన మిస్తాడు.[1] ఈ వివరణ పాండ్యుని అసత్య ప్రలాపిగా తెలుపుతుంది. నారాయణరెడ్డి గారి భాగాన్ని మార్పుచేశారు. విశ్వనాథుని నిరుపమాన రాజభక్తిని గమనించి, తన అశక్తతను, సంతానహీనతను దృష్టిలో పెట్టుకొని పాండ్యుడే స్వయంగా—

> చీటిమాటికి నదిరిపడు నా
> చేత పాండ్యప్రజల కేమి సు
> ఖమ్ముగలదు? సమర్థునికి ప
> ట్టమ్ము గట్టుట సాధుమార్గము
> విశ్వనాథుని కన్న యోగ్యుడు
> వేరెవడు? నా రాజ్యలక్ష్మిని
> అతని చేతులనుంచుడో! రా
> జాగ్రణీ! నా ఋణము తీరును"[2]

అని కృష్ణరాయలను అర్థిస్తాడు. "నా ఋణము తీరును" అనే ఒక్క మాటలోనే నారాయణరెడ్డి మూలంలో నాగమనాయుడు రాయలకు వివరంగా మనవి చేసికొన్న ఋణప్రస్తావనను[3] క్లుప్త పరచారు. చోళుణ్ణి పాండ్య

1. వేటూరి ప్రభాకరశాస్త్రి, తంజావూరి ఆంధ్రుల చరిత్ర పుట. 39-40
2. డా॥ సి.నా.రె. విశ్వనాథనాయుడు, పుట. 80-81
3. వేటూరి ప్రభాకరశాస్త్రి, తంజావూరి ఆంధ్రరాజులచరిత్ర పుట. 39-40

దేశంనుండి పారద్రోలడానికి, కోటను నగరాన్ని బాగుచేయడానికి నాగమనాయుడు ఎంతో ధనాన్ని వెచ్చించాడు. ఆ విధంగా పాండ్యుడు తనకు ఋణగ్రస్తుడైనాడనే విషయాన్ని నాయుడు రాయలవారికి సూచిస్తాడు. ఈ వాస్తవాన్ని పాండ్యుడుకూడా అంగీకరిస్తాడు.

శ్రీకృష్ణదేవరాయల ఆశీస్సులతో విశ్వనాథనాయుడు మధురలో ఆంధ్రనాయక రాజ్యాన్ని స్థాపించాడు. విశ్వనాథనాయని వీరగాథ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడింది.

అతని చరిత్రము ధర్మ
వ్రత వృతనాధిప కోటీ
రత్నశ్రేణికి కల్కి వచ్చు
లతురాయిని కైచేసెను. [1]

"చరిత్రలో మెరిసిన ఘట్టాలకు కావ్యత్వాన్ని పులమడంలో నారాయణరెడ్డి అపూర్వమైన ప్రతిభా పాటవాలను ప్రదర్శింపగలుగుతాడు. యాథార్థ్యానికీ కల్పనకూ కవితా సేతువులు నిర్మించడం తెలుగులో ఏకొందరికో సాధ్యమైన పని. రేఖామాత్రంగా ఉన్న చారిత్రక సత్యానికి మహాకావ్యమర్యాదలను సంతరించడంలో కృతార్థుడైన నారాయణరెడ్డి నిజంగా ధన్యజీవి." [2]

## పాత్రచిత్రణం

చిత్రకారుడు జీవం తొణకిసలాడే మనోహర చిత్రాలను చిత్రించినట్లుగా నారాయణరెడ్డిగారు సజీవమూర్తులను పాఠకుల మనోనేత్రాలకు సాక్షాత్కరింపజేస్తారు. ఈ కావ్యంలోని పాత్రలు-విశ్వనాథుడు, నాగమనాయుడు, మల్లికాంబ, శ్రీకృష్ణదేవరాయలు, చంద్రశేఖర పాండ్యుడు. పరిమితమైన పాత్రలతో చరిత్రలో జరిగిన యథార్థ సంఘటనలకు అక్షరా

1. డా॥ సినారె, విశ్వనాథనాయకుడు, పుట. 87.
2. డా॥ తిరుమలశ్రీనివాసాచార్య, నారాయణరెడ్డి సాహితీమూర్తి పుట 229.

కృతిని కల్పించడంలో నారాయణరెడ్డిగారు అందెవేసినచేయి. తిమ్మరుసు పేరు ప్రస్తావించబడి నప్పటికీ ఎటువంటి ప్రాధాన్యము లేనిపాత్ర. పై పాత్రలలో "మల్లికాంబ" మాత్రం కల్పితము. చరిత్రాంశాన్ని కథావస్తువుగా గ్రహించారు గనుక పాత్రల విషయంలో నూతనమైన కల్పనలకు చోటులేదు. "మల్లికాంబ" పాత్ర ఔచితీదృక్పథంతో, కావ్య సౌందర్యం యినుమడిస్తుందనే ఉద్దేశంతో, చరిత్రకు విఘాతం కలగని రీతిలో రూపొందించబడిన పాత్ర.

## విశ్వనాథనాయుడు

వీరరస ప్రధానమైన యీ చారిత్రక గేయ కథాకావ్యంలో నాయకుడు నాగమనాయకుడు, మల్లికాంబలకు "విశ్వనాథకృపా జలధివీచికయై" జన్మించిన ధీరోదాత్తుడు. ఇతని జననవృత్తాంతం మనోహరంగా వర్ణించబడింది. సంతానార్థులై విశ్వనాథుని దేవాలయంలో పూజలుచేసే నాగమనాయుడు, మల్లికాంబలకు అద్భుతదృశ్యాలు సాక్షాత్కరించాయి. కార్తాంతికులు జగదేక మహావీరుడు జనవ మొందగలడని వివరించారు. వారు చెప్పినట్లుగనే మల్లికాంబకు పుత్రోదయం జరిగింది. విశ్వనాథుని అనుగ్రహంవలన జన్మించాడు గనుక విశ్వనాథుడనే పేరు పెట్టుకొన్నారు. లేక లేక కలిగిన విశ్వనాథుని సుగుణాలు గుబాళించాయి. తనతోటి కుర్రవారితో మహ లదిరిపడ సరిక్రొత్త ఆటలాడేవాడు. శ్రీకారము మొదలుచేసి ఒక యేడు గడువకముందే తిక్కన మహాభారతమును పల్లించిన కుశాగ్రబుద్ధి. మొలకమీసములు వచ్చేసరికి ఖడ్గాది శస్త్రాస్త్ర ప్రయోగాలలో ఆరితేరి తండ్రిని మించిన తనయు డనిపించుకొన్నాడు. "కావ్యపరనరసాత్త కాలమున విశ్వనాథునిలోన సత్త్వమ్ము ధునులు ధునులై" ప్రవహించెడిదట. బాలచంద్రునివంటి కొడుకును పొందగలవని నాగమనాయనితో రాయలు పలికిన మాటలు యథార్థములైనవి. రాయల మెప్పును పొంది విశ్వనాథుడు విజయనగర సంస్థానంలో సేనానియైనాడు. అరివీరుల శిరస్సులను బంతులవలె చెండాడి, గిరిదుర్గ ప్రాకారములను తుత్తునియలుచేసి, ఎదిరించిన శత్రువుల చతురంగబలాలను పిండిగొట్టి, చేతి దెబ్బతో మదేభకుంభములను వగులగొట్టి, ఉద్రిక్తతురంగాలను హుంకారంతో మరల్చి తనప్రతాపాన్ని ప్రకటించాడు. కారు దున్నపోతులను

కాళికకు బలియిచ్చిన పరాక్రమవంతుడు. తన శౌర్యాగ్నిలో శత్రువులను సమిధలుగా మండించి అన్నిదెసల రాయల విజయాంకములను హత్తించిన వీరమూర్తి. విశ్వనాథుని పరాక్రమం లోక విదితమైంది. విద్యానగరం విశ్వనాథునకు జేజేలు పలికింది.

విశ్వనాథుని ధర్మానురక్తి ప్రశంసించదగింది. కన్నతండ్రి రాజద్రోహానికి పాల్పడ్డాడనే విషయం తెలిసి కృంగి పోయాడు. ఏలిక ఆనతిని ధిక్కరించడం క్షంతవ్యం కాదని భావించిన ధర్మవ్రతుడు. నిండుసభలో తన తండ్రి రెండు చెక్కలు కట్టి తెచ్చెదనని ప్రతిజ్ఞచేసిన సాహసి. కన్నతండ్రిపై భక్తి శ్రద్ధలున్నప్పటికీ ధర్మక్షతిని చూడలేక ధ్వజమెత్తాడు. రాజుగారి అనుమతిలేకుండా గడ్డిపుల్లనైనా గ్రహింపరాదని తండ్రికి వివరించాడు. తండ్రితో పలికిన యీ మాటలు విశ్వనాథుని వ్యక్తిత్వానికి పన్నెచిన్నెలు సమకూర్చాయి.

" అక్రమముగ గడియించిన
అమృతమ్మైనను హేయము
స్వధర్మ నిర్వహణములో
నిధనమ్మైనను శ్రేయము. "

స్వామిద్రోహము చేసిన జనకుడైన శిక్షార్హుడని నొక్కివక్కాణించిన నిరుపమాన రాజభక్తుడు. తండ్రిని పరాజితుణ్ని చేసినందుకు పొంగిపోలేదు, మానసిక చిత్రహింసను అనుభవించాడు. స్వార్థాన్ని జయించిన విశ్వనాథుడు కృష్ణరాయల సభలో ఇంద్రునితో కలసి వెళ్లే పార్థునిలా ప్రకాశించాడు. "ధర్మవీరమునకు జయపతాకమైన విశ్వనాథమూర్తిని గని కవుల డెందములు కావ్యములై యెగసినవట! అతడు "జ్ఞానకృశానుదగ్ధానేక కర్ముడు"గా, "ఆత్మహుత సర్వేంద్రియుడు"గా, అలౌకిక "ప్రతిభోన్నతుడు"గా కృష్ణరాయలచే ప్రశంసింపబడినాడు. పాండ్యరాజ్యాన్ని స్వీకరించవలసిందిగా కోరిన కృష్ణరాయలతో

" యుగ యుగాలనుండీ వెల్గు
చుండిన ధర్మాగ్ని కుండ
మున నేనొక గరిటెడు నే
యిని బోసితి, నంతే కదః " [1]

అనిన నిరహంకార శీలి "మీరు నడుచుదారుల ఈ మేను పరచు కొన్న చాలు"[2] అని పలికిన స్వామి భక్తి పరాయణుడు. తన ప్రభువు చెప్పిన మాటలను ఋక్కులుగ భావించిన మనస్వి. ధర్మపూరమునకు, దయాపూర మునకు ఆలవాలమైన విశ్వనాధుని హృదయానికి పాండ్యరాజ్యం తన వత్నము వలెతోచింది తుదకాతడు తన ప్రభువును సంతృప్తుని జేయు టకై పాండ్యదేశాన్ని స్వీకరించాడు. విశ్వనాధనాయడు "ధర్మహైమశిఖ ఖాగ్రస్థాయి".

## నాగమనాయడు

నాగమనాయుడు శ్రీకృష్ణదేవరాయల యశోగీతి సంచాలకుడు. రాయలవారికి కుడిభుజమై రిపు నృపులను నొప్పించి, కృష్ణరాయల అభి మానాన్ని చూరగొన్న మహాసేనాని. రత్నస్థగితములైన హర్మ్యశ్రేణులు కట్టించి గాదెలలో బంగారు టంకాలను నింపిన సంపన్నుడు. తన సంపదను అనుభవించి తనను సంతోషపెట్టే వంశాకురానికై అతడు పడిన ఆరాటం వర్ణనాతీతం.

" సంపదలకు పొంగుదునా
సంతుకొరకు కృంగుదునా
స్వామీః నాగతి యయ్యెను
చక్రవాళ పర్వతముటు "

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, విశ్వనాధనాయకుడు, పుట. 84
2. అందే పుట. 83

అని పరిపరి విధాల పరితపించాడు. కదన రంగాన యాతని యెదకత్తి కంటె కరాళమైనది. వంతానార్తితో కసుగంది, పసచెడి పేదపడిన యితని హృదయం పుత్రోదయంతో సేద తీరింది. వేడుకలతో నాయని మేడ పూవై తేలిపోయింది. నాగమనాయడే స్వయంగా కుమారునికి యుద్ధ ప్రక్రియలన్ని విశదం చేశాడు. తన కుమారుడు తండ్రిని మించిన తనయుడని పేరొందినపుడు పరమానంద భరితుడైనాడు. తన విశ్వనాథుడు రాయల సేనాపతియై అరివీరుల శిరస్సులను బంతులవలె చెండాడినపుడు నాగమనాయనికొక సహస్రగజముల సత్తువ పెరిగింది. అవధులు మీరినపుత్రప్రేమ నాగమనాయనిలో దురాలోచలను ప్రేరేపించింది. అప్పటి నుండి నాయని మది తామసరేఖా మలీమసమై పోయింది. కృష్ణరాయల ఆదేశాన్ని తనకు అనుకూలంగా మార్చుకొని పాండ్యదేశాన్ని ఆక్రమించిన చోళుని పారద్రోలి, చోళపాండ్య దేశాల్ని తన అధీనంలోకి తెచ్చుకొన్నాడు ఖండన క్షేత్రాలలో తలవండిపోయిన నాగమనాయని రెండు రెక్కలు గట్టి తీసుకురాగల వీరుడెవరో చెప్పవలసిందిగా కృష్ణరాయలు కోరినపుడు ఎవ్వరును సాహసించి పెదవి విప్పలేదు. పైగా—

"పెద్దపులి మీసముల నెవ్వడు
పెరికి వేయగ సాహసించును
అగ్ని పర్వత శృంగమున నడ
యాడగా నెవ్వడు తెగించును" [1]

అని భయ కంపితులైనారు. తన కుమారుడు తనపై దండెత్తి వచ్చినాడనీ తెలిసి అమాంతం పిడుగుపడ్డట్లుగా చలించిపోయాడు. "కన్న కుమారుడే పగవాడైపోయిన యీ బ్రతుకు చట్టు బండలకా" అని పరితపించాడు. గుండె దిటవు పరచుకొని, తనువులోన చైతన్యం రేకులు విప్పగా—

"నా పంజా దెబ్బల కెదు
రై పోరం గలడా?
నా కత్తుల తళత్తళల
కాక కోర్వగలడా?" [2]

---

1. డా॥ సి. నారాయణరెడ్డి విశ్వనాథనాయుడు పుట. 39
2. అందే పుట. 53

అని తోక త్రొక్కిన త్రాచువలె ఫూత్కారం చేశాడు. మమత పొంగినప్పు డాతని మనసు వెన్నతో సమానం. పుత్ర వ్యామోహం కారణంగా రాజ ద్రోహానికి పాల్పడ్డాడు. ఫలితం మానసిక వ్యథ. కుమారుని చేతిలో పరా జయం పొందాడు. అయితే అత్యుదాత్త గుణప్రపణిత హృదంతరంగుడగు విశ్వనాథుని కన్న తండ్రి గనుక రాయలవారిచే మన్నింపబడినాడు. ఈ కావ్యంలో మహాసేనాని నాగమనాయడు ధీరోద్ధతుడుగా కనిపిస్తాడు.

## మల్లికాంబ

మల్లికాంబ కావ్యనాయకుడైన విశ్వనాథనాయని మాతృమూర్తి. సేనాని నాగమనాయని అర్ధాంగి. పుత్రకాంక్షాకలితమతియై ఆ సతీమణి కోటి దేవతలకు మ్రొక్కులు తీర్చినది.

"నా తండ్రీ విశ్వనాథ
నగతనయా ప్రాణనాథ
ఈ నాగొడ్రాలి బ్రతుకు
కేనాడయ్యా విముక్తి" అని విశ్వనాథుని వేడుకొన్నది.

"అమ్మా' యని పిల్చెడు క
న్నయ్యము గుండెలు చేవగ
కౌగిలించుకొను భాగ్యము
కలదా నాకీ జన్మకు"[1] అని సంతానార్తితో పరితపించింది.

ఎన్నో నోములు నోచి, మరెన్నో తీర్థాలను సేవించి తుదకు విశ్వనాథుని కృపాకటాక్షంతో పుత్రుని పొందిన ధన్యజీవి. ప్రభుభక్తి పరాయణుడైన తమ కుమారుడు సైన్య సమేతుడై తండ్రిని బంధించుటకు వచ్చినాడని తెలిసినప్పుడు వెక్కి వెక్కి యేడ్చుచు—

"మనకంటి పాపవంటి
తనయుని తెగటార్చ మీరు
గడియించెడి దేమున్నది ?
కటిక చీకటులె తప్ప.

1. డా॥ సి. నారాయణరెడ్డి విశ్వనాథనాయడు పుట. 5

ఎవని కోసమై మీరి
సవనము తల పెట్టితిరో
వాడే వలదన్నపుడీ
పాడు రాజ్యమెందుకయ్యా"[1] అని ప్రాధేయపడినది.

తన మాటలను భర్త త్రోసిపుచ్చగా మల్లికాంబ కుమారుని అంతఃపురానికి రావలసిందిగా కబురు చేసింది. విశ్వనాథుడు వచ్చినపుడామె మూర్తీభవించిన శోకదేవతలా కనుపిస్తుంది. తనపై కత్తిదూసిన తండ్రిని ఎదుర్కొనుటకు విశ్వనాథుడు సంసిద్ధుడుకాగా, ఆమె తన కండ్లను తిమిరము కొరికినట్లు విలవిలలాడింది. తన కాళ్ళకు మ్రొక్కి తిరిగి సైనిక శిబిరానికి వెళ్ళిపోయే విశ్వనాథుని కౌగిలించుకొని విలపిస్తుంది. మల్లికాంబ పేరుకు తగినట్లునే మల్లికా సదృశ హృదయ.

## కృష్ణదేవరాయలు

ఈ వీరగాథలో ఆంధ్రభోజుడు ఆశ్రితజన మందారుడు. మేరు శిఖరమువంటి వ్యక్తిత్వము గలవాడు. తాను సువిశాల విజయనగర సామ్రాజ్యమునకు సార్వభౌముడైనప్పటికీ సంతానార్తితో కుమిలిపోయే సేనాని నాగమనాయని వద్దకు వచ్చి ఓదార్చిన దయామయుడు. బాలచంద్రుని వంటి కుమారుని పొందగలవని ఊరడించి నాగమనాయని నిరాశా నిస్పృహలను పారద్రోలుటకై ప్రయత్నించిన ఆర్ద్రహృదయుడు. "ఎగుడు దిగుడులు ఇరులు వెల్తురు మానవులకే" అని గ్రహించిన ఇంగితజ్ఞుడు. అతని కంటి చల్వలో సామంతులు తమ బ్రతుకును పండించుకొన్నారు. విశ్వనాథుని సుగుణములను, పరాక్రమాన్ని గమనించి తన కొలువులో సేనానిగ నియమించిన గుణగ్రహణ పారీణుడు. శరణుజొచ్చిన పాండ్యునకు అభయమిచ్చిన దీనావనుడు. భువనవిజయ భవనాగ్రమున కవితా గోష్ఠిని చేయు సాహితీవేత్త.

నాగమనాయడు తన ఆజ్ఞకు విరుద్ధంగా చోళపాండ్యరాజ్యాలను వశంచేసుకోవడాన్ని విని విస్మయం చెందాడు. సామంతుల పాలి సురక్షా

1. డా॥ సి.నా.రె., విశ్వనాథనాయడు, పుట. 54-55.

రుహమైన రాయలు యీ అక్రమాన్ని సహించలేకపోయాడు. తన కుడి భుజము వంటి నాగమనాయని రెండుచెక్కలు కట్టి తెచ్చి తనయెదుట నిలుపవలసిందిగా ఆజ్ఞాపించాడు. కన్న తండ్రిని పట్టి తెస్తానని ముందుకు వచ్చిన విశ్వనాథుని విశ్వసించి దీవించి పంపడంలో కృష్ణరాయుల గుణ గ్రహణ శక్తి తేట తెల్లమౌతుంది. ఆయన నమ్మకం వమ్ముకాలేదు. విశ్వ నాథుడు విజయుడై నాగమనాయని బంధించి రాయల యెదుట నిలి పాడు. కృష్ణరాయలు విశ్వనాథుని కౌగిలించి, సింహాసనముపై తనతో గూడ కూర్చుండబెట్టి,

" నీవు బంటువు మేము ప్రభువు
నీమ మింతటి తోడ తీరెను.
మా సమాన స్కంధుడవు సు
మ్మా! కుమారా! నేటినుండియె " [1]

అని గౌరవించాడు. కృష్ణరాయలు దేవేంద్రుడయితే విశ్వనాథుడు పార్థుడు. రాజద్రోహానికి పాల్పడిన నాగమనాయని మన్నించి విశ్వనాథుని ఆనం దింపజేసిన దయాసంపన్నుడు. తుదకు పాండ్యుని కోరిక మేరకు విశ్వనా థునకు పాండ్యరాజ్యమిచ్చి వీరులను గౌరవించు సంప్రదాయాన్ని ఏర్ప చిన రాజచంద్రుడు.

## చంద్రశేఖర పాండ్యుడు

మధురరాజ్యాన్ని పాలించే చంద్రశేఖర పాండ్యుడు శ్రీకృష్ణదేవ రాయల సామంతుడు. పాండ్యవంశంవారు పాలించారు గనుక మధుర ప్రాంతాన్ని పాండ్యదేశంగా పిలవడం పరిపాటి. చోళుడు కూడా రాయల వారికి సామంతుడే. కండకావరంతో చోళుడు పాండ్యరాజ్యాన్ని కబళిం చగా, పరాక్రమహీనుడైన పాండ్యుడు రాయలవారిని ఆశ్రయించాడు. ధర్మపక్షపాతియైన కృష్ణరాయలు చోళుని ఉక్కణచెదనని పాండ్యునకు అభయమిచ్చాడు. నాగమనాయనితో దండయాత్రకు వెళ్లిన పాండ్యుడు

1 డా॥ సి. నారాయణరెడ్డి, విశ్వనాథనాయుడు పుట. 80

"ఝంఝానిల సముద్ధూత శరన్మేఘ శకలమువలె" మరలివచ్చాడు. నాయని దురాక్రమణను మనవిచేశాడు. తండ్రినిపట్టి తెచుటకై ప్రతిజ్ఞపూనిన విశ్వనాథునిపట్ల చంద్రశేఖర పాండ్యునకు పుత్రవాత్సల్యం కలిగింది. సంకెళ్లతో నాగమనాయని బంధించి తెచ్చిన విశ్వనాథుని రాజభక్తిని చూచి విస్తుపోయాడు విశ్వనాథుని స్వార్థత్యాగం పాండ్యునిలోని విసరంత రాజ్యాశను త్రుటిలో త్రెంచివేసింది. కారణజన్ముడైన విశ్వనాథునకు తనరాజ్యాన్ని అప్పగించడం సముచితంగా భావించి కృష్ణరాయలతో మనవిచేశాడు. పాండ్యభూపతి సుహృద్భావాన్ని సభాసదులు ప్రశంసించారు. తన కుమారుడు రాజుకావాలనే నాగమనాయనికోరిక పాండ్యుని ప్రకటనతో నెరవేరింది. విశ్వనాథుని పాండ్యదేశానికి మహారాజునుచేసి, మధురలో ఆంధ్రనాయక రాజ్యము స్థాపించబడటానికి చంద్రశేఖర పాండ్యుడు కారణభూతుడైనాడు.



# జాతిరత్నం

డా॥ సి. నారాయణరెడ్డిగారి మరొక చారిత్రకగేయ కావ్యం "జాతి రత్నం". ఈ గేయకావ్యం 1967 జూలైలో ప్రచురింపబడింది. భారతీయుల ప్రియతమ నాయకుడైన జవహర్‌లాల్ నెహ్రూ ఈ కావ్యంలో "జాతిరత్నం". భారతరత్న జవహర్‌లాల్ జీవిత విశేషాలు ఉత్తేజకరంగా వర్ణించబడినాయి. ఈ కావ్యం ఇందిరా ప్రియదర్శినికి అంకితం చేయబడింది.

" ఈ కావ్యం వీరగాథ. భారత స్వాతంత్ర్య సమరంలో నాయకత్వం వహించిన జవహర్‌లాలు ఈ కావ్యంలో నాయకుడు. తెలంగాణా విప్లవంలో పాల్గొని, తన కవితావహ్నితో ప్రజ్వలింపజేసిన యువకుడు కృతికర్త. ఇక ఈ కావ్యం ప్రశంసనీయమని వేరేచెప్పవలెనా?[1] అని శ్రీ పి. వి. రాజమన్నారు గారు వ్రాసిన "తొలిపలుకు" మిక్కిలివాస్తవం.

ఈ కావ్యాన్ని నెహ్రూగారి జీవిత చరిత్ర అనడంతోబాటు, జాతీయ స్వాతంత్ర సమరేతిహాసం అనడం సమంజసం. జాతీయోద్యమకాలం నాటి మహోజ్జ్వల ఘట్టాలు యిందులో సాక్షాత్కరిస్తాయి. "ఆంధ్ర భారతికి ఈ కావ్యం జాతిరత్నహారం" నారాయణరెడ్డిగారు యీ కావ్యాన్ని 14 భాగాలుగా వ్రాశారు. నెహ్రూగారి పుట్టినతేది నవంబర్ 14 ను స్ఫురింప జేయడం ముఖ్యోద్దేశం. కావ్యాన్ని ప్రారంభించిన పద్ధతికూడా వారి యితరకావ్యాలకు భిన్నంగా వుంది. నెహ్రూ జీవితగాథను తన నోటితో చెప్పకుండా, ఎల్లప్పుడూ నెహ్రూగారి కోటును అలంకరించి వుండే గులాబీచేత చెప్పించారు. ఇది ఎంతో ప్రశంసనీయంగా వుంది. "మీకు పూవులంటే - ముఖ్యంగా ఎర్రగులాబీ అంటే - అంతప్రేమ ఎందుచేత? ఇందుకు సంబంధించిన వ్యక్తిగత ఘటన ఏదైన ఉన్నదా?" అని గాంధేయవాది శ్రీరామనారాయణ చౌధరి నెహ్రూజీని ప్రశ్నిస్తే, నెహ్రూ-

---

1. డా॥ సి. నా. రె, జాతిరత్నం, పుట. 5.

"ఏమీలేదు, చాలకాలంనుంచి, షుమారు 15-20 సంవత్సరాలనుంచి నేనది ధరిస్తున్నాను. ఎప్పుడు ప్రారంభించానో చెప్పలేను. ఏ రంగూలేని మన తెల్లటి ఖద్దరు బట్టల మీద. ఆ ఎర్రనిపూవు అందంగా ఉంటుందనిపించింది. ఎప్పుడో అది ధరించి చూచాను. నచ్చింది. అంతే, అదొక అలవాటుగా అయిపోయింది." అని సమాధానమిచ్చారు.[1]

మరొక సమావేశంలో శ్రీ రామనారాయణ చౌధరిగారు తిరిగి యిదే ప్రశ్న వేశారు.

చౌధరి :- "మీరు ఎప్పుడూ గులాబి పువ్వు - ఎర్రగులాబీ ధరిస్తారు. ఎందుచేత ?"

నెహ్రూజీ :- అందుకు ఒక ప్రత్యేక కారణం ఏమీలేదు.

చౌధరి :- ఏమీ లేదా ?

నెహ్రూజీ :- లేదు. పది పదిహేను సంవత్సరాల క్రితం ఎప్పుడో ఎర్ర గులాబీ ధరించడం ఆరంభించాను. ఇక ఎరుపు రంగును గురించి చెప్పాలంటే : నాకు లేతరంగు అంత నచ్చదు. లేతరంగు దాని పరిసరాలలో కలిసి పోతుంది. సాధారణంగా మన దుస్తులు అతి నిరాడంబరంగా ఉంటాయి. అటువంటి దుస్తులమీద ఎర్రగులాబీ స్ఫుటంగా మనస్సుకు ఆహ్లాదం కలిగించేదిగా కనిపించింది నాకు.[2]

ఇటువంటి ప్రశ్నలు గమనిస్తే, నెహ్రూజీ గులాబీ ధరించడం ఎంత మందికి కుతూహలం కలిగించిందో తెలుసుకోవచ్చు. "జవహర్ ప్రేమించిన వస్తువులలో మరొకటి రోజా పుష్పము. ఆనంద భవన్ తోటలోని రోజా పుష్పములను నౌకర్లు ప్రథమంగా జవహర్ కిచ్చేవారు. పుష్పములను

---

1. తననుగురించి నెహ్రూజీ, ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, పుట - 137.
1. అందే పుట-270.
(అను : ఛాయేశ్వర్)

ప్రేమించుటవలన కాబోలు జవహర్‌కు అంతటి కోమల హృదయం. మాట లాడితే పుష్పసౌరభము వలె ఆ భావములు ఉంటాయి. పుష్పమువలె జవహర్ పదిమందిని ఆకర్షించేవాడు." [1] అని శ్రీ ఎ. రమేష్ "వేంకట్రామ అండ్ కో.," వారు ప్రచురించిన జవహర్‌లాల్ నెహ్రూ జీవిత చరిత్రలో వ్రాశారు. ఎర్రగులాబీ నెహ్రూజీ శరీర భాగమై వికసించింది.

అందువల్లనే నారాయణరెడ్డిగారు గులాబీ చేతనే నెహ్రూ జీవిత విశేషాలను వివరింపజేశారు. ఈ చాతుర్యం కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారి పుష్పలావికల్లో కనుపిస్తుంది.

## కథాంశము

కవి ఢిల్లీ వెళ్ళి శాంతివనంలో ప్రవేశించి నెహ్రూ సమాధికి నమస్కరిస్తాడు. కన్నీటితో దోసెడన్ని గులాబీలు సమాధిపై పోశాడు. జవహరుని సమాధిపై బడిన ఒక గులాబీ పువ్వును కళ్ళకు హత్తుకొన్నాడు. అపుడా గులాబీ కవితో సంభాషిస్తుంది. తనను నెహ్రూ సమాధిపై వేసి, తానొక పూజాపుష్పమయ్యే పుణ్యాన్ని ప్రసాదించిన కవికి కృతజ్ఞతలు తెలుపుకుంటుంది. కవికి ఆ గులాబి దళాలనుండి రసోత్తగస్వం వినుపించింది. ప్రతి గులాబీ రేకులో, "జాతికి ప్రాణము పోసిన జవహరుని" జీవిత ఉదంతాలు కనుపించాయి.

> "చల్లనైన ఆగులాబి
> ఉల్లముతో పరిమళించు
> జాతిరత్నము చరిత్రము
> గీతి కావ్యమై విరిసెను" [2]

అని మొదటి భాగాన్ని ముగించారు.

---

1. ఎ. రమేష్, జవహర్లాల్ నెహ్రూ, పుట. 59.
2. డా॥ సి.నా.రె., జాతిరత్నం, పుట-8.

## రెండవ భాగము

రెండో భాగంలో నెహ్రూ జననం, బాల్యదశ వర్ణించబడ్డాయి. స్వరూపరాణి, మోతీలాలు నెహ్రూల నోముల పంటగా జవహర్ జన్మించాడు

"అవతరించెను జవహరులాలు అతనితో
అవతరించెను భువికి ఆకాశ దీపాలు,
అతడు పుట్టిన నాడు అమృత భాండము పుట్టె
అతడు పుట్టిన నాడు అవని మిన్నులు ముట్టె"

అని గులాబీ పులకిస్తూ జవహర్ జననాన్ని వివరిస్తుంది.

జవహరుని బాల్యం జాజితీవలా ప్రాకిపోయింది. ప్రతి ఋతువు వసంతంలా సాగిపోయింది. తివాచీలపై తిరగడమే తప్ప మట్టిపై కాలు పెట్టి యెరుగని సంపన్న జీవితం. తల్లి చెప్పే పురాణ గాధలు, ముబారక్ ఆలీ వర్ణించే అరేబియా రాత్రుల కథల్ని కళ్ళింతలు చేసుకొని వినేవాడు. చిన్నతనంలోనే తెల్లజాతి దొరల దుశ్చర్యలు విన్నప్పుడు పళ్ళుబిగబట్టి, కళ్ళెర్ర జేసేవాడట! తోడేళ్ళలా ప్రవర్తించే ఆంగ్లేయుల్ని భారతీయుడు ఎదిరిస్తే ఎంతో ఆనందించేవాడు. పదిహేనేళ్ళ వయస్సు వచ్చేసరికి పై చదువులకు ఇంగ్లాండు వెళ్ళాడు.

ఈ భాగాన్ని నారాయణరెడ్డిగారు క్లుప్తీకరించిన తీరు ప్రశంస నీయంగా వుంది. నెహ్రూగారి "ఆత్మకథ"ను ను రెడ్డిగారు ఎంతోశ్రద్ధగా పరిశీలించారనే విషయాన్ని యీ అధ్యాయం వెల్లడిస్తుంది.

" నేను అలహాబాదులో 1889 నవంబరు పదునాల్గవ తేదీన జన్మించితిని " అని నెహ్రూజీ ఆత్మకథలో జనన సమయాన్ని స్పష్టం చేశారు. తన చిన్ననాటి భావాలను యిలా వివరించారు. " నేను మా పెత్తండ్రి బిడ్డల సంభాషణలను వినుచుండెడి వాడను. ....ఈ సంభాషణ భారతీయుల పట్ల ఆంగ్లేయులును, యురేపియనులును చేయు అవమానములను, ధూర్త ప్రవర్తనకును సంబంధించి యుండెడిది. దీనిని సహించక ధిక్కరించుటే ప్రతిభారతీయుని ధర్మమని వారు చెప్పుకొనెడి వారు.

పాలక పాలితుల మధ్య కలిగెడి ముష్టా ముష్టి సోదాహరణముగా చర్చింపబడుచుండెడిది. ఆంగ్లేయుడొక భారతీయుని చంపినచో, వానిని తెల్లదొరలే విచారించి విడిచివేసెడి వారు రైలుబండ్లలలో తెల్లవారికి ప్రత్యేకముగా పెట్టెలుండెడివి. బండి యెంత క్రిక్కిరిసి యున్నను, ఈ పెట్టెలలోనే భారతీయుని యెక్కనిచ్చేవారు. ప్రత్యేకింపబడని పెట్టెలలో కూడ నే యింగ్లీషువాడో సాచుకొని కూర్చొని యే భారతీయుని లోపలకు రానీయడు. బహిరంగమైన పార్కులలో బల్లలుకుర్చీలు తెల్లవారికి ప్రత్యేకింపబడి యుండును. నా దేశమును పాలించు పరిపాలకుల యీ దుశ్చేష్టితములకు నాకెంతయో కోపము కలిగెడిది. భారతీయు డెవడేని యీ దురంతముల నెదుర్కొనినవాడు, నేను సంతోషముతో గంతులిడెడి వాడను"[1] నారాయణరెడ్డి యీ విషయాలనన్నిటిని సంక్షేపించినతీరు ముదావహం.

"పసరు మొగ్గలాంటి ప్రాయంలోనే
పాలక వర్గం దుశ్చర్యలు విన్నప్పుడు
పళ్లు బిగబట్టి దూకేవాడు.
తెల్లజాతి దొరలు జరుపుతున్న
నల్లమొగం పనులు తెలుసుకున్నప్పుడు
కళ్ళెర్రజేసి చూసేవాడు"[2]

ముబారక్ ఆలీ విషయాన్ని జవహర్‌లాల్‌జీ యిలా వివరించారు.

"మా తండ్రిగారి మున్షీ (గుమాస్తా) ముబారక్ ఆలీ నా విశ్వాసమును చూరగొనెను. అతడు బదానులోని యొక గొప్ప కుటుంబమునకు చెందినవాడు. 1857నాటి పితూరీలో అతని వంశము యింగ్లీషు సిపాయిలచే నాశనము గావింపబడెను. ఈ కష్టమువలన నతడందరి యెడలను, ముఖ్యముగా పిల్లలయెడల మృదుమధుర భావములనుకలిగి యుండుటచే, నాకేదేని కష్టము వాటిల్లిన నేనతని యొద్దకు వెళ్లెడివాడను. అతడు పురాణగాధలను, అరేబియను రాత్రులలోని కథలను, 1857-58 లలో

1. నెహ్రూ ఆత్మకథ (అనువాదకులు: ముదిగంటి జగ్గన్న శాస్త్రి)పుట 19.

2. డా॥ సి. నా. రె. జాతిరత్నం పుట 12-13

జరిగిన వింతచర్యలను అసంఖ్యాకముగా చెప్పుచుండ, నేను నిశ్చేష్టుడనై గంటలకొలది వినుచుండెడివాడను. నేను పెద్దవాడనైన చాలకాలమునకు ముస్లీజీ చనిపోయెను. అతడు నాకెప్పటికిని జ్ఞప్తియందుండును;

నాతల్లియు, పెత్తల్లియు హిందూ పురాణముల నుండి చెప్పుచుండెడి రామాయణ భారతగాధలను గూడ నేను వినుచుండెడి వాడను" [1]

" తల్లి చెబుతున్న పాతగాధల్ని
తమాషాగా ఆలకించడంతప్ప
చితికిపోయే మూగబ్రతుకుల్లోని
ఇతిహాసాలేమిటో యెరుగడు.
అలవోకగా ముబారకలీ వినిపించే
అరేబియా రాత్రుల కధల్ని
కళ్ళింతలు చేసుకొని వినడంతప్ప
కారుచీకట్లేమిటో యెరుగడు. " [2]

అని నారాయణరెడ్డిగారు జవహర్ బాల్యాన్ని అభివర్ణించారు.

"ఎక్కడో ఉన్న జపాన్ దిగ్విజయం సాధిస్తే
ఇక్కడున్న తాను చుక్కలందుకున్నట్టు
ఏమేమో ఊహించుకునేవాడు.
తానూ ఒక కరవాలం ధరించి
తన దేశాన్ని కబళించే రాబందుల్ని త్రుంచి
విజయధ్వజ మెగరేయాలని
వీరస్వప్నాలు కనేవాడు" [3]

అని కవిగారు చేసిన యీ వర్ణన జవహర్ స్వయంగా వ్రాసుకున్నదేగాని కల్పన కాదు.

---

1. జవహర్‌లాల్ ఆత్మకధ (అనువాదకుడు: ముదిగంటి జగన్నశాస్త్రి) పుట 21-22.
2. డా॥ సి. నా. రె, జాతిరత్నం, పుట - 12.
3. అందే పుట-13

"జపాను యొక్క విజయవార్తలు నాకత్యుత్సాహము కలిగింప ప్రతిదినము వార్తా పత్రికల కొఱకెదురు చూచెడివాడను ...........చేత కత్తిఁబూని భారతదేశము కొఱకును, దాని స్వేచ్ఛను సంపాదించుటకును వీరపురుషోచిత కార్యముల నొనర్చునట్లు నేను కలలను గనుచుండెడి వాడను." [1] అని జవహర్ చెప్పుకున్నారు.

"నా పదిహేనవయేట, 1905 మే నెలలో మేము సకుటుంబముగా యింగ్లండు ప్రయాణమైతిమి." అనే జవహర్‌జీ మాటలను రెడ్డిగారు—

"పదిహేనేళ్ళ ఆ పల్లవమూర్తి ప్రతిభ
పై చదువులకు ఎల్లలు దాటింది" అని వ్రాశారు.

"అవతరించెను జవహరులాలు, ఆతనితో
అవతరించెను భువికి ఆకాశదీపాలు" అని నారాయణ రెడ్డిగారు

చేసిన వర్ణన కూడా అతిశయోక్తి కాదు. శ్రీ ఎ. రమేష్‌గారు తమ నెహ్రూ జీవిత చరిత్ర గ్రంథంలో—

"జవహర్ జననమొందిననాడు అలహాబాదు నందు
బ్రహ్మాండమైన తేజస్సు గోచరించెను!" అని వివరించారు.

నారాయణరెడ్డిగారు చారిత్రక కావ్యం వ్రాసే విషయంలో వాస్తవాలను విస్మరించి, అతిశయోక్తులకు యే మాత్రం చోటివ్వరు.

## మూడవ భాగము

రెడ్డిగారు జవహరుని రాజకీయ జీవితం ప్రారంభమైన తీరు వివరించారు. న్యాయవాద వృత్తిపట్ల జవహరుకు ఆసక్తిలేదు. వంగయువక వీరగాథలు విని, ఎంతో ఉత్తేజితుడైనాడు. బంకిపూరు కాంగ్రెసు సదస్సులో పాల్గొనినాడు. గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధర తిలక్, అనీబిసెంట్ జవహర్ హృదయంపై జాతీయోద్యమ భావాలను ముద్రించారు. అలహాబాదులో జవహరు మృదువాణిని విని సభ పులకించింది. గాంధీజీని

---

1. నెహ్రూ ఆత్మకథ (అనువాదకుడు : ముదిగంటి జగ్గన్న శాస్త్రి) పుట-30,31.

మొదటిసారిగా లక్నో కాంగ్రెస్ సభలో కలిశారు. నాటి నుండి గాంధీ జవ హరుల ఆత్మీయతానుబంధం దినదిన ప్రవర్ధమానమై విలసిల్లింది.

తన మొదటి ఉపన్యాస విశేషాలను జవహరు ఇలా వివరించారు. "అలహాబాదులో నేను మొట్టమొదట 1915లో నుపన్యసించితిని. నేనింగ్లీషు లోనే మాట్లాడితిని. సప్రూగారు సభముగియుట తోడనే నన్ను కౌగలించు కొని బహిరంగముగా ముద్దు పెట్టుకొనిరి"[1] ఈ సన్నివేశమును రెడ్డి గారు అత్యంత మనోజ్ఞంగ వర్ణించారు. "గాంధీజీ చాంపరానులో రైతుల తరఫున తేయాకుతోటల యజమానుల మీద ధ్వజమెత్తి విజయమును బడయుట తోడనే మేము సంతోషముతో పొంగితిమి." అని జవహరు వ్రాసుకొనిన విషయాన్ని దృష్టిలో పెట్టుకొని, నారాయణ రెడ్డిగారు గాంధీజీ ఉదంతాన్ని వర్ణించారు.

జవహరు లక్నో కాంగ్రెసు సదస్సులో మొట్టమొదటిసారిగా గాంధీ జీని సందర్శించాడు. అప్పటి నుండి జవహరు గాంధీజీ కుడిభుజమై ప్రవ ర్తించాడు.

## నాలుగవ భాగము

సత్యాగ్రహ సమర ఘట్టాలు చిత్రింపబడినాయి. స్వరాజ్య కాంక్షను తుడిచిపెట్టాలని తెల్లదొరతనం రౌలటు చట్టం తయారు చేసింది. చట్ట ప్రకారం జరుపవలసిన విచారణ అవసరం లేకుండానే తమకు వ్యతిరేక మైన వారిని అరెస్టుచేసి, శిక్షించు అధికారం యీ చట్టం ప్రభుత్వానికి ప్రసాదించింది. ప్రభుత్వం తమ నిరంకుశ ధోరణికి ప్రబల సాక్ష్యంగా ఈ చట్టాన్ని రూపొందించుకున్నది.

గాంధీజీ రౌలటు చట్టానికి వ్యతిరేకంగా సత్యాగ్రహ సమరాన్ని ప్రారంభించాడు.

"వేదబుక్కుల్లోని నిగ్గుతీసి
వేదాంత సారాన్ని వడబోసి
తరతరాల భారతాత్మను
సరిక్రొత్తగా శ్రుతిచేసి

"సత్యాగ్రహ మంత్రం సృష్టించాడు గాంధీ
శస్త్ర భారతాన్ని మంత్రించాడు గాంధీ"

అని కవిగారు సత్యాగ్రహ స్వరూప స్వభావాలను ప్రశంసించారు.

జవహరుని ఉత్సాహం, మోతీలాల్‌ను కలవరపరిచింది. కన్న కొడుకు కడగండ్లు ఊహించుకొని కలత చెందాడు. తన కుమారుడు జైలులో నేలమీద నిద్రిస్తే ఎంత కష్టంగా వుంటుందో తెలుసుకోవాలని, పట్టుపరుపులు మానుకొని వట్టినేలమీద నిద్రించడం ప్రారంభించాడు.

"తండ్రిగారు నేను జయిలుకు పోవుచో నాగతి యెట్లుండునో చూచుటకని స్వయముగా కటిక నేలమీద స్వయముగా పడుకొని చూచెను." [1] అని జవహర్ ఆత్మకథలో తెలిపిన విషయాన్ని నారాయణరెడ్డిగారు విస్మరించలేదు.

మోతీలాల్ ఆహ్వానంపై గాంధీజీ అలహాబాదు చేరుకున్నాడు. మోతీలాల్‌తో మాట్లాడిన తరువాత, "తండ్రిగారికి మనోవ్యాకులత కలిగించవద్దు" అని గాంధీజీ జవహర్‌కు నచ్చచెప్పాడు.

సమస్త భారతదేశం సత్యాగ్రహ సమర శంఖాన్ని పూరించింది. ప్రజాచైతన్యం ప్రజ్వలించింది. ఆసేతు హిమాచలం సమ్మెలతో అట్టుడికి పోయింది. ధూర్త రాజ్యాంగం తుపాకులను ఆశ్రయించింది. పంజాబ్‌లో పరిస్థితులు విషమించాయి. జలియన్ వాలాబాగ్ ఉదంతం యావద్భారత దేశాన్ని కుదిపి వేసింది.

జనరల్ డయ్యర్ అనే పోలీసు అధికారి విచక్షణారహితంగా జరిపించిన కాల్పుల వల్ల దారుణ మారణకాండ సంభవించింది.

ఈ దురంతాన్ని పరిశీలించడానికి చిత్తరంజనదాసుగారు నియమింపబడ్డారు. జవహరు ఆయనను అనుసరించాడు. జలియన్ వాలాబాగ్ దురంతాన్ని నారాయణ రెడ్డిగారు చరిత్రపుటల్ని అనుసరించి అభివర్ణించారు.

---

1. నెహూ్రు ఆత్మకథ, (అనువాదకుడు: ముదిగంటి జగ్గన్న శాస్త్రి)పుట-59

"పాటికో చేరిన గుమ్మలను
గురిపెట్టి కాల్చినట్లుగా,
బోనులోదూరిన బెబ్బులులను
పొంచి పొంచి కాల్చినట్లుగా
బాగ్‌లో మూగిన శతాధిక ప్రజల
ప్రాణాలు కబళించాడు డయ్యర్.

డయ్యర్ విషయాన్ని జవహర్ యిలా వివరించారు.

"1919 అంతమున నొకరాత్రి బండిలో నే నమృతసరమునుండి ఢిల్లీకి పోవుచుంటిని. నేనెక్కిన పెట్టెలో పైన నొకస్థానము తప్ప తక్కిన వన్నియు నిద్రించుచున్న బాటసారులతో నిండియుండుటచే నేనాస్థానము నాక్రమించితిని. నాతోడి బాటసారులందరు సైనికోద్యోగులని నేను ప్రాతఃకాలమున తెలిసికొంటిని. వారు పెద్దగొంతుకలతో సంభాషించుకొనుచుండ నవి నాచెవుల బడుచుండెను. వారిలో నొకడు విజయ స్వనముతో గంభీరముగా మాట్లాడుచుండెను. అతడే డయ్యరు. జలియన్ వాలాబాగు వీరుడు. అతడు తన యమృతసరపు టనుభవమును వర్ణించుచుండెను. పట్టణమంతయు నితనిదయకు పాత్రమై యుండెననియు, తిరుగబడిన యా పట్టణమును బూడిదపాలు చేయసమకట్టితినిగాని, దాని మీద దయతలచి విడిచి వేసితిననియు నతడు చెప్పుచుండెను. హంటరు కమిటీ యెదుట సాక్ష్యమిచ్చి యతడు తిరిగి వచ్చుచుండెను. అతని సంభాషణ. నిర్లక్ష్యము నాకాశ్చర్యము కలిగించెను. గోధుమవన్నె చారలు గలిగిన పయిజమాతోను, వదులుగానుండిన గౌనుతోను నతడు ఠీవిగా ఢిల్లీ స్టేషనులో దిగెను."

నెత్తురు తాగిన నరహంతకుల చరిత్రలో కొత్త పుటలను అతికించాడు డయ్యర్.

వీరభారతంలో యీ ఘట్టం
అరని రక్తాక్షరాలు లిఖించింది
జవహర్ జీవితంలో యీ ఘట్టం
జ్వాలాముఖియై ప్రజ్వలించింది

ఐదవ భాగము

ఇక్కడ రైతుల సమస్యలను పరిశీలించిన తీరు వివరించబడింది. అతనికి "ఆనంద భవనం" స్వర్ణ పంజరంవలె కనుపించింది. జమిందారుల ఉక్కు పాదాలక్రింద నలిగిపోయే అమాయక రైతుల ఆర్తనాదాలు విని జవహరుడు చలించిపోయాడు. కారుదిగని జవహరు కాలినడక సాగించాడు. ఫైజాబాదు, ప్రతాపఘరు, రాయబెరిల్లి జిల్లాల రైతుల ఆందోళనలో ఉత్తేజితమైనాయి. ఈ సమయంలో జవహర్‌చేసిన కృషి ప్రశంసనీయమైనది.

"ఒల్లుమరచి ఇల్లాలిని మరచి
పల్లెరుల బడి పయనించె.
కల్లా కపటమెరుగని రైతుల
చల్లని గుండెల శయనించె"

ఈ సన్నివేశంలో రెడ్డిగారు రామచంద్రబాబా పేరును ఉదాహరించక పోవుట గమనార్హము. జవహర్ ఆత్మకథలో రైతు ఉద్యమాన్ని యిలా వివరించారు. "....రామచంద్రబాబా యనునొక మహారాష్ట్రుడు ప్రజలను మేల్కొల్పెను. ఇతడు ఫిజీదీవులకు నిర్బంధకూలీగా వెళ్ళి, తిరిగి వచ్చి యీ ప్రాంతములలో తిరుగుచు, తులసీదాసు రామాయణ కీర్తనలను పాడుచు రైతుల యిబ్బందులను వినుచుండెను. అతనికంత విద్య లేదు. కొంతవరకు తన స్వార్థముకొరకు వారినుపయోగించుకొనెను. కాని యతడు ప్రజలను కూడగట్టగల మంచి సమర్థుడు. తరచు సభలలో కూడి తమ కష్టనిష్ఠూరములను చర్చించుకొనవలయునని యితడు రైతులకు బోధించి, వారిలో సంఘీభావము కలిగించెను. తరచు పెద్దసభలు జరుగుచుండెడివి. ఇవివారికి కొంత శక్తినిచ్చెను. "సీతారామ్" పురాతనము నుండి వచ్చుచున్న మామూలు కేకయే కాని యతడు దానికొక యుద్ధ సంప్రదాయము కల్పించి, యవసర సమయముల నుపయోగించు చిహ్నముగను, వివిధ గ్రామసీమల వారినైక్యపరచు సంధానకరణిగను ఉపయోగించెను. ఫైజాబాదు, ప్రతాపఘరు, రాయబెరిల్లీ జిల్లాలు సీతారాముల పురాణగాథలతో నిండియుండెను. అతడి యుద్యమములో ప్రధాన

పాత్ర తీసుకుని రెండుమూడుసార్లు జైలుకు కూడ పోయెను. కాని తరు వాత నతడు బాధ్యతలేనివాడై యపనమ్మకస్థుడయ్యెను.

ప్రధాన రాజకీయవేత్తల దృష్టిని ఆకర్షించి తమ దుర్భర దారిద్ర్య పరిస్థితులను వివరించుటకై 1920 జూన్ మండువేసవిలో 50 మైళ్లు నడచి ప్రతాపఘర్ జిల్లానుండి దాదాపు 200 మంది రయితులు అలహాబాదు చేరు కున్నారు. వారికి రామచంద్రబాబా నాయకుడు. "సీతారామ్, సీతారామ్" అనే నినాదాలు దిక్కులను నింపివేశాయని నెహ్రూ ఆత్మకథలో వివరిం చారు. నారాయణరెడ్డిగారు అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని సాధించడం వాస్తవమైనప్పటికినీ రామచంద్రబాబా పేరును స్మరింపక పోవడం కొంత లోపంగానే కనుపిస్తుంది.

## ఆరవ భాగము

జాతీయోద్యమ సంఘటనలు వివరింపబడినాయి. గణనీయమైన నెహ్రూజీ కృషి స్మరింపబడింది. ఈ అధ్యాయాన్ని రెడ్డిగారు సహాయ నిరాకరణోద్యమంతో ప్రారంభించారు. రాట్నం సుదర్శన చక్రంవలె రాణించిన తీరును అభివర్ణించారు. ప్రభుత్వంవారు పన్నులను హెచ్చించ డానికి ప్రయత్నించడం వలన గుజరాత్‌లో రైతులు తిరుగుబాటుచేశారు. ఉత్తేజకరమైన యీ తిరుగుబాటే బార్డోలి సత్యాగ్రహం. ఉక్కుమనిషి సర్దార్ వల్లభాయ్ పటేల్ యీ ఉద్యమానికి నాయకుడు.

ఈ సమయంలో నెహ్రూజి యూరప్‌లో పర్యటిస్తున్నారు. జెనీవా లోని మాంటెనా పర్వత ప్రాంతంవద్ద దాదాపు రెండు సంవత్సరాలు గడి పాడు. జవహర్ జర్మనీ, ఫ్రెంచి, ఇటలీ మొదలైన దేశాలను సందర్శిం చారు. జెనీవాలో నివసిస్తున్న శ్యామ్‌జీ కృష్ణవర్మ అనే భారతీయ విప్లవ వాదితో సంభాషించాడు. పారిస్ పట్టణంలో మేడమ్ కామాను కలిశారు. స్టట్‌గార్టు పట్టణంలో ప్రప్రథమంగా భారతపతాకం ఎగురవేసి బ్రిటీషు పాలకుల గుండెల్లో గుబులు పుట్టించిన వీరనారి మేడం కామా. ఇటలీలో మౌల్వీ ఒబీదుల్లాను, బర్కతుల్లాను కలిసి భారతదేశ రాజకీయాలను చర్చించాడు. ప్రసిద్ధ విప్లవకారుడు హరదయాళ్‌ను, చంపక రామన్‌పిళ్ళై

వీరేంద్రనాధ్ ఛటోపాధ్యాయ, యం. యన్. రాయ్‌లను కలిసి వారి భావాలను గ్రహించాడు. మాతృదేశానికి స్వాతంత్ర్యం తీసుకురావడానికి విభిన్న వర్గాలకు చెందిన మేధావులు విప్లవకారుల అభిప్రాయాలను జీర్ణించుకొని జవహరు పరిణతి చెందాడు. డా॥ సి. నారాయణరెడ్డి యీ వుదంతాన్ని ఎంతో క్లుప్తంగా—

> "ఈ శతాబ్ది తొలిజామున
> నే జవహర్ పండితుండు
> విశ్వాంబరమున ప్రతిభ
> శశ్వత్ కరములు సాచెను" అని అభివర్ణించారు.

యూరప్ పర్యటన ముగించుకొని వచ్చిన జవహర్ తిరిగి రాజకీయాలలో చురుకుగా పాల్గొన్నారు. అప్పుడే సైమన్ కమీషన్ గురించి ఆందోళన బయలుదేరింది. సైమన్ కమీషన్ బహిష్కరించాలని తీర్మానించారు. పాతచట్టాలకు పూతలు పూసి, మత విద్వేషాలను రెచ్చగొట్టి పరిపూర్ణ స్వరాజ్య కాంక్షను దెబ్బతీయడం సైమన్ కమీషన్ ఉద్దేశ్యమని భారతీయులు భావించారు. 1928 ఫిబ్రవరి 3వ తేదీన సైమన్ కమీషన్ బొంబాయిలో కాలుమోపింది. "సైమన్ గోబాక్" అనే కేకలు దేశమంతా ప్రతిధ్వనించాయి. లాహోర్‌లో పంజాబ్ కేసరి లాలాలజపతిరాయ్, మద్రాసులో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, లక్నోలో జవహర్‌లాల్‌నెహ్రూ సైమన్ కమీషన్ ప్రతిఘటన దళాలకు నాయకత్వం వహించారు.

లక్నోలో లాఠీల వర్షం కురిసింది. జవహరుని వీపు చిట్లింది. జవహర్ చిందించిన ప్రతిరక్తకణం స్వరాజ్యయజ్ఞానికి ఆజ్యమయింది.

డా॥ సి. నారాయణరెడ్డిగారు జవహర్‌లాల్ జీవితచరిత్రను అభివర్ణిస్తున్నారు గనుక జవహర్‌లాల్‌పడిన బాధలనే ఉదాహరించారు. వాస్తవానికి సైమన్ కమీషన్‌ను నిర్భయంగా ప్రతిఘటించి రొమ్ముపై లాఠీ దెబ్బలతో తీవ్రంగా గాయపడిన నాయకుడు లాలాలజపతిరాయ్. స్కాట్, సాండర్స్‌ల నాయకత్వాన లాఠీల వర్షం కురిసింది. దెబ్బలు తీవ్రంగా తగల

దెబ్బలవల్ల వారంరోజులకే ప్రాణాలు కోల్పోయిన అమరజీవి పంజాబ్ కేసరి. లాలాలజపతిరాయ్ మరణం(1928 నవంబరు 17) సైమన్ కమీషన్ బహిష్కరణను తీవ్రతరం చేసింది. ఈ జాతీయ పరాభవాగ్ని యువకులను మరింత ఉద్రేకపరచింది. లాలాజీ మరణానికి ప్రతీకారం చేయాలని భగత్‌సింగ్, చంద్రశేఖర ఆజాద్, రాజగురు, జయగోపాల్ మొదలైన విప్లవకారులు నిర్ణయించుకున్నారు. భగత్‌సింగ్ లాహోర్ కేంద్ర పోలీస్ కార్యాలయం నుండి వెలుపలకి వస్తున్న సాండర్స్‌ను కాల్చి చంపాడు. సరిగ్గా పంజాబ్ కేసరి మరణించిన నెలరోజులకే (1928 డిసెంబరు 17) పగతీర్చుకున్నారు. ఈ సంఘటనను జవహర్‌లాల్ ఆత్మకథలో యిలా వివరించారు. "... భగత్సింగుకు ఔత్రరిష్టు కార్యముచే పేరుకలుగలేదు. అతడు తాత్కాలికముగ, లాలాలజపతిరాయి యొక్కయు, తద్వారా జాతి యొక్కయు గౌరవమును రక్షింపవచ్చినట్లుండెను ........కొద్దినెలల్లో పంజాబులోని ప్రతిగ్రామము, తక్కువస్థాయిలో నుత్తర హిందూస్థానమంతయు అతని నామముతో మారుమ్రోగెను. అతనిని గురించి యసంఖ్యాకమగు గీతములు బయలుదేరెను. అతడు సాధించిన పేరుప్రఖ్యాతులద్భుతములు "[1]

కావ్యనాయకుడు జవహర్‌లాల్‌జీ కనుక, నారాయణరెడ్డిగారు యితరవిషయాలను ప్రక్కకునెట్టి, జవహర్‌లాల్ పాత్రను ఆదర్శప్రాయంగా చిత్రించారు.

## ఏడవ భాగము

జవహర్‌లాల్ లాహోరు నగరంలో అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరించిన విషయం వివరింపబడింది. నలభై సంవత్సరాల జవహర్‌లాల్ కాంగ్రెస్ అధ్యక్షుడు కావడం అందరినీ ఆశ్చర్యపరచింది. లాహోరు కాంగ్రెసు వేదికపైనుండి జవహర్‌లాల్, "సంపూర్ణ స్వరాజ్యమే భారతీయుల అభిమతమని" ప్రకటించాడు. జవహరుని సందేశం భారతీయుల్ని సంపూర్ణ స్వాతంత్ర్య సమరానికి సమాయత్తం చేసింది.

---

1. జవహర్‌లాల్ ఆత్మకథ, (అనువాదకుడు : ముదగంటి జగ్గన్నశాస్త్రి) పుట - 224, 225.

తన కుమారుడు నిర్మించుకున్న కీర్తి సౌధాన్ని చూచి, మోతీలాల్ మిక్కిలి ఆనందించేవాడు. కుటుంబ సభ్యులు పరిహాసాలాడేవారు.

"నీళ్లందుకో నేతాజీ" అని
చెల్లెళ్ళు చల్లగా ఉడికిస్తుంటే,
"ఫలాహారం తీసుకో భారతరత్నా" అని
పసిబిడ్డ ఛలోక్తులు విసురుతుంటే,
"తాంబూలం గ్రహించు త్యాగమూర్తీ" అని
తరుణీమణి పరిహాసబాణం వేస్తుంటే
నంది వర్ధనంలా నవ్వులొలికే వాడతడు" [1]

అని నారాయణరెడ్డిగారు వ్రాసిన విషయానికి జవహర్‌లాల్ ఆత్మకథే ప్రమాణం. "జాతీయోద్యమములో ప్రధానులైన వారియెడల సాధారణముగ నుపయోగింపబడు బిరుదులు, పెద్ద పెద్ద సమాస పదములు, ఉత్ప్రేక్షలు మొదలగువానిని నా భార్య, నా చెల్లెండ్రు, తదితరులు యేరియు గౌరవముగా నాపై విసురుచుండెడివారు. నన్ను "భారత భూషణా" అనగా "భారతరత్నము", "త్యాగమూర్తి" అనగా, "మూర్తిభవించిన యోత్యాగదేవతా"యని సంబోధించెడివారు. వారి యీ వేళాకోళము నాకు కొంత శాంతి నిచ్చెడిది. నా చిన్నకూతురు కూడ యీ వినోదములో చేరెడిది" స్వరూపరాణి మాత్రం తన ప్రియతమ పుత్రునిపై ఈగవాలనిచ్చేదికాదు.

## ఎనిమిదో భాగము

దండి సత్యాగ్రహం అభివర్ణించబడింది. ఉప్పు అకస్మాత్తుగా మహామంత్రంగా మారింది. సబర్మతీ ఆశ్రమమునుండి సముద్రతీరమున వున్నదండి వరకు సత్యాగ్రహుల యాత్ర నిర్ణయించబడింది. వింతయిన యీ శాసనోల్లంఘన వుద్యమం సామాన్య ప్రజానీకాన్ని విశేషంగా ఆకర్షించింది. 1930 ఏప్రిల్ నెలలో గాంధిజీ సముద్రతీరం చేరాడు. ఉప్పు

1. డా॥ సి. నారాయణరెడ్డి, జాతిరత్నం, పుట – 45.

చట్టాన్ని వ్యతిరేకించి, ఉప్పును తయారుచేసి విక్రయించారు. ప్రభుత్వం అనేక వేలమందిని జైళ్ళలో క్రుక్కింది. కాంగ్రెసు దళాల యాత్రలు, లాఠీ చార్జీలు, కాల్పులు, అరెస్టులు సర్వసామాన్యమైనాయి. ఈ సమయం లోనే గాంధిజీ సలహాప్రకారం మోతీలాల్ అలహాబాదులోని తన ఆనంద భవనాన్ని భారతజాతికి సమర్పించాడు. జవహరుని వృద్ధమాత స్వరూప రాణి, సోదరీమణులు, అర్ధాంగి కమలా జవహర్‌లాల్ యీ వుద్యమంలో పాల్గొన్నారు. రోగగ్రస్తురాలయిన కమలాజవహర్‌లాల్ ఎంతో ధైర్యాన్ని, దేశభక్తిని ప్రదర్శించి, అలహాబాదు నగరాన్ని ఆశ్చర్యంముంచెత్తింది. గాంధిజీ ప్రియతమ శిష్యుడైన జవహర్‌లాల్‌ను 1930 ఏప్రిల్ 14 వ తేదీన అరెస్టు చేశారు. ఆ రోజే కేసు విచారించి ఉప్పుచట్టం క్రింద జవహ ర్‌లాల్‌కు 6నెలల జైలుశిక్షను విధించారు.

## తొమ్మిదవ భాగము

జవహరుని జైలు జీవితం వివరింపబడింది. స్వాతంత్ర్యం కోసం పోరాడే అగ్రనాయకులను అరెస్టుచేయాలని ప్రభుత్వం నిర్ణయించింది.

నైనీ జైలు ఇనుప కటకటాల మాటున జవహర్‌లాల్ ఒంటరిగా నిర్బంధించ బడినాడు. రాత్రి సమయంలో వింతధ్వనులు వినిపించేవి. జైలు వార్డర్ల అరుపులువిని ఖైదీలు ఉలిక్కిపడేవారు. జవహర్‌లాల్‌ను బంధించిన గదికి కుత్తాఘర్ (కుక్కయిల్లు) అని పేరు. నెత్తురుతాగే నేర స్థులను యీ గదిలో వుంచేవారు. చీకటి రాత్రులు చాలా భారంగా గడి చేవి. "రాత్రి యనేక సారులు యేజైలు యధికారియో గస్తీతిరుగుచు, మా యావరణకువచ్చి, డ్యూటీలోనున్న వార్డరును కేకలు వేయుచు పరిశోధించుచుండెడివాడు.... ఒక్కొక్కప్పుడు నేనొక యరణ్యసమీపమున నున్నట్లు, మృగములు తమపొలములలోనికి రాకుండ రైతులఱచుచు న్నట్లు భావించెడివాడను" అని జవహర్‌లాల్ తమ అనుభవాన్ని వివ రించారు. [1] ఈ విషయాన్ని నారాయణరెడ్డిగారు

---

1. జవహర్‌లాల్ ఆత్మకథ, (అనువాదకుడు: ముదిగంటి జగ్గన్నశాస్త్రి,) పుట - 283

" చెరసాలయే ఒక కీకారణ్యం
చేలలోకి క్రూరమృగాలు చొరబడకుండా
గొంతుచించుకొని అరిచే కావలి వాళ్ళలా
" అంతాభద్రం" అనే జైలు వార్డర్ల అరుపులు " 1

అని కవితానువాదం చేశారు. 1930 ఏప్రిల్ 14 న జవహర్‌లాల్ అరెస్టు కాగా, మోతీలాల్ నెహ్రూ 1930 జూన్ 30 న నిర్బంధింపబడి, నైనీ జైలుకే తీసుక రాబడినాడు. తండ్రినిచూచి జవహర్‌లాల్ మిక్కిలి ఆశ్చర్యపోయాడు. అనారోగ్యంతో బాధపడే తండ్రికి సపర్యలుచేసి పితౄణం కొంత చెల్లించుకున్నాడు.

1932 జనవరి 4 వ తేదీన జవహరు తిరిగి నిర్బంధించబడినాడు. నైనీ జైలులో ఆరువారాలు గడిచిన తరువాత, జవహరును బెరిల్లీ జిల్లా జైలుకు మార్చారు. బెరిల్లీలో నాలుగు నెలలు గడచిన తరువాత, హిమాలయ పర్వత ప్రాంతంలో వున్న డెహరాడూన్ కారాగారంలో వుంచారు. అక్కడ దాదాపు 14 నెలల 15 రోజులు జైలు జీవితం గడిపాడు.

1934 ఫిబ్రవరి 12 న రాజద్రోహనేరం ఆరోపించబడి అరెస్టు చేయబడినాడు. ఆ రాత్రి కలకత్తా తీసుకువెళ్ళి, లాల్‌బజారు పోలీస్ స్టేషన్‌లో వుంచారు. మొదట ప్రెసిడెన్సీ జైలులో నిర్బంధించారు. ఫిబ్రవరి 16 వ తేదీన రెండు సంవత్సరముల కారాగారవాస శిక్ష విధించారు. ప్రెసిడెన్సీ జైలునుండి అలీపూరు జైలుకు తరలించారు. 10 అడుగుల పొడవు, 9అడుగుల వెడల్పు వున్న చిన్నగదిలో బంధించారు. అలీపూరు జైలు జీవితం జవహరుకు దుర్భరంగా వుండేది. అలీపూరు జైలు వాతావరణం సరిపడక జవహరు ఆరోగ్యం క్షీణించింది. అందుచేత ఆయనను తిరిగి డెహరాడూన్ జైలుకు బదిలీ చేశారు. 1934 జూన్ నెలలో డెహరాడూన్ జైలులో వున్నపుడే జవహరు తన ఆత్మకథ వ్రాయడం ప్రారంభించారు. కమలానెహ్రూ ఆరోగ్యం క్షీణించడం వలన జవహరుకు తాత్కాలిక విడుదల లభించింది. విడుదలయిన 11 వ రోజున (1934, ఆగస్టు 23) తిరిగి నైనీ జెయిలు నిర్బంధం ప్రారంభమైంది. అప్పుడప్పుడు అనారోగ్యంతో బాధపడే

---

1. డా॥ సి. నారాయణరెడ్డి, జాతిరత్నం, పుట - 54.

భార్యను చూడటానికి ఒకటి రెండురోజులు అనుమతించి తిరిగి నిర్బంధించేవారు. ఆ తరువాత తిరిగి ఆల్మోరా జెయిలుకు మార్చారు. తన 45వ పుట్టిన రోజును జవహరు ఆల్మోరా జెయిలులోనే గడిపారు.

నారాయణరెడ్డిగారు జవహరు జెయిలు జీవితాన్ని వాస్తవ విషయాలతో వివరించారు. ఆత్మకథలో ఆయన వ్రాసుకున్న జెయిలు జీవితం యీ భాగానికి ఆధారం.

## పదవ భాగము

నెహ్రూ, కమలా నెహ్రూల అనురాగ దాంపత్య బంధాన్ని రెడ్డిగారు మనోహరంగా వివరించారు. 1916వ సంవత్సరంలో జవహరుడు కమలను పరిణయమాడాడు. అతని ఆదర్శాలకు తగిన విధంగా కమల సహకరించింది, విదేశ వస్తు నిరసనోద్యమాన్ని ముందుండి నిర్వహించింది.

"నా పతి అడుగు జాడల
నన్ను ప్రయాణించ నిండు
మన జెండా ఆకల్పము
వినువీధుల నెగుర నిండు"[1]

అనే ఆమె పసిడి పలుకులు రమణులకు వెలుగుబాటలు. దురదృష్టవశాత్తు ఆమె అనారోగ్యానికి గురైంది. క్షయ వ్యాధితో పోరాడి అలిసిపోయింది. చివరకు స్విట్జర్లాండులో కన్నుమూసింది. కమల మరణాన్ని నెహ్రూ **"Discovery of India"** లో వివరించారు. భారతదేశానికి రావాలని నెహ్రూ విమాన ప్రయాణపు యేర్పాట్లు చేసుకున్నాడు. డాక్టరు మరో పదిరోజులవరకు ప్రయాణం వాయిదా వేసుకోవలసిందిగా కోరాడట.

**"Early in the morning of February 28 th (1936), she breathed her last. Indira was there, and so was our faithful friend and constant campanion during these months, Dr. M. Atal.**

---

1. డా॥ సి.నా.రె., జాతిరత్నం, పుట - 68.

A few other friends came from neighbouring towns in Switzarland, and we took her to the crematorium in Lausanne. With in a few minutes that fair body and that lovely face, which used to smile so often so well, we reduced to ashes. A small urn contained the mortal remains of one who had been vital, so bright and so full of life.'' [1]

## పదకొండో భాగము

కమల మరణంతో క్రుంగిపోయే నెహ్రూజీకి ఇటలీ నియంత ముస్సోలినీ సానుభూతి వ్యక్తం చేస్తూ సందేశం పంపించాడు.

ముస్సోలినీ జవహరుని కలిసి మాట్లాడాలని కోరుతున్నట్లు రోమ్ నుండి ఒక స్నేహితుడు జాబు వ్రాశాడు. కాని జవహరుకు ముస్సోలినీతో సమావేశం సమ్మతం కాదు. ముస్సోలినీ ఉదంతాన్ని జవహర్ "డిస్కవరీ ఆఫ్ ఇండియా" లో వివరించాడు.[2] ముస్సోలినీ కోరిక త్రోసిపుచ్చి జవహర్ మాతృభూమిపై అడుగుపెట్టాడు. నారాయణరెడ్డిగారు యీ సందర్భాన్ని విస్మరించలేదు.

"అంతకొమ్ములు తిరిగినట్టి ని
యంత పిలుపును ధిక్కరించి,
ప్రజాస్వామిక శక్తులకు సా
వర్ణ గర్వోద్దీప్తి పెంచి,
ఎగిసి వచ్చెను జవహరుడు"

అని వివరించారు. విశ్వకవి రవీంద్రుడు నెహ్రూను జాతిరత్నమని ప్రశంసించాడు. సమస్త భారత జాతి జవహరు దేశభక్తిని చూచి సమ్ముగ్ధమై పోయింది. 1936లో జవహర్ తిరిగి కాంగ్రెసు అధ్యక్షుడైనాడు. లక్నో కాంగ్రెస్ సదస్సులో చైతన్యవంతమైన ప్రసంగం చేశాడు. 1937 సాధారణ ఎన్నికల సమయంలో భారతదేశం మొత్తం పర్యటించి విశేషంగా శ్రమించాడు.

1. Jawaharlal Nehru, The Discovery of India, Page-46.
2. Nehru, The discovery of India, Page 46, 47.

## పన్నెండవ భాగము

స్వాతంత్ర్య సమర తీవ్రరూపం పర్ణించబడింది. బొంబాయి సమావేశంలో కాంగ్రెస్ సంస్థ పూరించిన స్వాతంత్ర్య శంఖారావం నలుదిక్కులకు వ్యాపించింది. "క్విట్ ఇండియా" నినాదం దేశమంతా ప్రతిధ్వనించింది. అహమ్మద్‌నగర్ జయిలులో జవహర్ నిర్బంధించబడినాడు. ఈ జైలులో వున్నపుడే జవహరు Discovery of India రచించారు. ఈ గ్రంథాన్ని తనతోపాటు అహమ్మద్ నగర్ జయిలు జీవితం గడిపిన సహచరులకు అంకితం చేశాడు.

**'To my Colleagues and co-prisoners in the Ahamadnagar Fort prison camp from 9 August 1942 to 28 March 1945'[1]**

## పదమూడవ భాగము

భారతదేశం స్వాతంత్ర్యం పొందిన చరిత్రాత్మక సన్నివేశాన్ని అభివర్ణించారు. మూడురంగుల జాతీయ పతాకం ఎర్రకోటపై ఠీవిగా ఎగిరింది. స్వతంత్ర భారతదేశానికి జవహర్ తొలిప్రధాని యైనాడు. భారత రాజ్యాంగ సభలో 1947 ఆగష్టు 14వ తేదీరాత్రి జవహర్ చేసిన ప్రసంగం సువర్ణాక్షరాలతో లిఖింపదగింది. జిన్నా మత మౌఢ్యంవల్ల భారతదేశం చిన్నాభిన్నమైంది. లాహోర్, అమృతసర్, రావల్పిండి, కలకత్తాలలో మతకలహాలు సంభవించాయి. మనుషుల పచ్చినెత్తురు మడుగులు కట్టింది. ఈ దురంతాలను చూచి మహాత్ముడు కలతచెందారు. జవహర్ ప్రాణాలకు తెగించి అనేక ప్రాంతాలు పర్యటించాడు. ప్రార్థనార్థమై వెళుతున్న మహాత్మాగాంధీని గాడ్సే కాల్చి చంపాడు. జాతిపిత కళేబరాన్ని కౌగిట గ్రుచ్చి జవహరుడు ఘోరున విలపించాడు.

"నాపిమ్మట జవహరుండు

నా వాణిని వినిపించును" అనిన గాంధీ మాటలను జవహరుడు యథార్థం చేశాడు.

---

1. Nehru, The Discovery of India page. 5

## పదునాలుగవ భాగము

నెహ్రూ భారతదేశాన్ని అభివృద్ధి పథంలో నడిపిన తీరు వ్యక్తం చేయబడింది. అమెరికా, నవచైనా, రష్యా, ఇండోనేషియాలకు సామరస్య సేతువు నిర్మించాడు. అభివృద్ధి చెందుతున్న దేశాలకు పంచశీల సిద్ధాంతాలను బోధించాడు. పంచవర్ష ప్రణాళికలను పసిడి మెట్టుగా భావించాడు. ప్రాజెక్టులను దేవాలయ ప్రతీకలుగా పూజించాడు. ఆసియా ఖండానికి అగ్రనేతగా భాసించాడు.

జవహర్ కీర్తి ప్రఖ్యాతులను చూచిన చైనాకు కన్నుకుట్టింది. పాప జాతి చీనా చివరకు భారతాన్ని కాటు వేసింది. జవహర్ యీ పరిణామానికి కృంగిపోయాడు. ఐక్యరాజ్యసమితిలో నవచైనా అభ్యర్థిత్వం కోసం ఎంతగానో శ్రమించాడు. కత్తిని కత్తితోనే ఎదిరించాలని సంకల్పించాడు. చైనా-భారత్ సంగ్రామం కొనసాగింది. చివరకు శాంతిస్థాపన ఆవశ్యకత యిరు పక్షాలవారికీ గోచరించింది. జవహర్‌ను చైనా దండయాత్ర మానసికంగా కృంగదీసిందనే చెప్పాలి. చివరకు మన ప్రియతమ నాయకుడు తన జాతి అభ్యున్నతిని ఆశిస్తూనే పరమపదించాడు.

తన చితా భస్మాన్ని అలహాబాదునకు పంపి కొంత గంగానదిలోను, మిగిలినది సమస్త భారతదేశం మీదను చల్లవలసిందిగా నెహ్రూ కోరాడు.

"........మన సంస్కృతిపై
ఆధర చిహ్నముగ నేను
గంగానది తరగలలో
కలసిపోవ కాంక్షించితి"

అనే జాతిరత్నం కోరికను వ్యక్తం చేస్తూ కవి యీ కావ్యాన్ని ముగించారు.

ఈ కావ్యాన్ని నారాయణరెడ్డిగారు రచించిన తీరు గమనార్హం. గులాబీ చేత నెహ్రూ జీవితాన్ని వర్ణించడం విశేషమైన విషయం. స్వాతంత్ర్య సమర ఘట్టాల్ని మహోన్నతంగా చిత్రించడం మరో విశేషం.

ఈ కావ్యం ప్రామాణికమైన చారిత్రక గేయ కథాకావ్యం. చరిత్రాంశాలకు యేవిధమైన అతిశయోక్తులు చేర్చకుండా నారాయణరెడ్డిగారు యీ కావ్యాన్ని రచించారు.

# రంగాజమ్మ

## కవి పరిచయం

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావుగారు నేటి తెలుగు సాహితీ రంగంలో ప్రసిద్ధ అభ్యుదయ కవి. వీరు ప్రకాశం జిల్లా రావినూతల గ్రామంలో 1931 అగస్టు 15 వ తేదిన జన్మించారు. తండ్రి శ్రీ వెంకట సుబ్బారావు గారు ఉపాధ్యాయునిగా పనిచేశారు. తల్లి రాఘవమ్మ పరమ సౌజన్య మూర్తి. రంగాజమ్మ, ఒయాసిస్, కన్నీటిగాధ, మానవతా సంగీతం, వెలుతురు స్నానం, తూర్పు వాకిళ్ళు, దానవీర, మరో అమ్మాయి కథ, నా ఉదయం, గుళ్లకమ్మ చెప్పినకథ, కవనవిజయం అనేవి వీరి ప్రచురిత గ్రంథాలు.

గడుసు అమ్మాయి, దేవతలారా దీవించండి, సింహగర్జన, ముద్దూ ముచ్చట, వసంతం వచ్చింది, పూలపల్లకి మొదలైన చిత్రాలకు వీరు వ్రాసిన పాటలు బహుళ ప్రజాదరణ పొంది వీరికి సినీకవిగా కీర్తిని సంపాదించిపెట్టాయి. ప్రస్తుతం (1987 - జనవరి) ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావుగారు నిర్మించే "బ్రహ్మర్షి విశ్వామిత్ర"కు కథ, సంభాషణలు సమకూరుస్తున్నారు. వృత్తిరీత్యా వీరు ప్రభుత్వ కళాశాలలో (చీరాల) ఆంధ్రోపన్యాసకులు. వివిధ సాహితీ ప్రక్రియల్ని విభిన్న కోణాలనుండి పరిశీలించి, ప్రదర్శనానుకూలంగా వీరు వ్రాసిన "కవన విజయం" పలువురిచే ప్రశంసింపబడింది. పద్య కవిత్వం మొదలు మినీ కవిత్వం వరకు రచించారు.

నేటి సాహితీ రంగంలోని అన్ని కవితా ప్రక్రియలలో పరిపూర్ణమైన ప్రతిభను ప్రదర్శించిన శ్రీ నాగభైరవ 1980 లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం వారి "ఉత్తమ అధ్యాపక" బహుమతిని పొందారు. ఆంధ్ర ప్రదేశ్ అధికారభాషా సంఘం సభ్యులుగా నియమితులైనారు. కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యులుగా నామినేట్ చేయబడ్డారు. తన కలం బలం ప్రదర్శించి రాజ్యలక్ష్మి అవార్డును స్వీకరించారు. తెలుగు విశ్వ

విద్యాలయం సిండికేట్ సభ్యులుగా ఆంధ్రభకళాసరస్వతిని అలరిస్తున్నారు.

"రంగాజమ్మ", "కన్నీటిగాథ" మినహాయిస్తే వీరి మిగిలిన రచనలు అభ్యుదయ భావాలతో, సామాజిక చైతన్యంతో, మానవతా భావాలతో సాగిపోతాయి. 1969 తుఫాను భీభత్సాన్ని, దారుణ పరిణామాలను వాస్తవికంగా, దయనీయంగా. పాఠకుల కళ్లు చెమర్చేలా "కన్నీటి గాథ" గేయకావ్యం రచించారు. ఈ కావ్యాన్ని శ్రీ నాగభైరవ ఒక్క రాత్రిలో వ్రాశారని తెలిస్తే ఎవరైనా ఆశ్చర్యపోతారు. గడియారం వెంకట శేషశాస్త్రి అవార్డు గ్రహీతలైన (1989)-శ్రీ నాగభైరవ మంచి వక్త, సహస్రాధిక సభాసముల్లసిత మహోపన్యాసకులు.

" నాగభైరవ కవి. అచ్చమైన స్వచ్ఛమైన కవి. ఏదిఅసలైన కవిత్వమో బాగా ఎరిగిన కవి. మంచి కవిత్వం మాత్రమే వ్రాయడంలో చెయ్యి తిరిగిన కవి. నవచైతన్య క్రాంతి పథంలో పురోగమించిన అభ్యుదయ కవిత్వోద్యమం వెంట తన కవితా రథాన్ని - పరుగులు తీయించిన సారథి - నవకవితా_నీరధి" [1]

## ఇతివృత్త పరిశీలనం

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావుగారు వ్రాసిన మొదటి కావ్యం రంగాజమ్మ. ఆద్యంతం అందంగా, రస నిష్యందంగా సాగిపోయే చారిత్రక గేయకథా కావ్యం. ఈనాడు ఎక్కువ ప్రచారంలో వున్న మాత్రాఛందస్సునే కావ్య నిర్మాణానికి ఎన్నుకొన్నారు. చరిత్రాంశాలకు భిన్నంకాని పద్ధతుల్లో సన్నివేశాలను సర్వాంగ సుందరంగా రూపొందించారు. రంగాజమ్మ విజయ రాఘవుల ప్రణయాన్ని ఇతివృత్తంగా తీసుకొని కావ్యం వ్రాయలనే సంకల్పాన్ని వీరి మిత్రులు శ్రీ. జి. వి. రాయ్ చౌదరి గారు బలపరచి ప్రోత్సహించారు. సన్నివేశాలను రచించే విషయంలో శ్రీ నార్ల చిరంజీవి గారు, శ్రీ అమరేంద్రగారు అమూల్యమైన సలహాలిచ్చి

---

1. వెన్నెలగంటి రాజేశ్వర ప్రసాద్, కవనవిజయం, అభినందన సంచిక, పుట - 100.

సహకరించారు. సినీనటులు, కళావాచస్పతి శ్రీ కొంగర జగ్గయ్య గారికి యీ చారిత్రక గేయకావ్యం అంకితం చేయబడింది.

"ఈ కావ్యావిష్కరణ మహోత్సవము, అంకిత మహోత్సవము 8-5-1983 న రావిచూతలతో ఉన్నత స్థాయిలో జరిగాయి. కావ్యా విష్కరణ జరిపింది ప్రియమిత్రులు, సహృదయులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వర రావుగారు. శ్రీ అవుల గోపాలకృష్ణమూర్తిగారి ఆచార్యత్వం క్రింద నా కావ్య కన్యను శ్రీ కొంగర జగ్గయ్యగారు స్వీకరించారు. నాటి వేదికను శోభాయమానం చేసింది మిత్రులు బొల్లిముంత శివరామకృష్ణ, శ్రీమతి లలిత గార్లు. కార్యక్రమం జరిపింది శ్రీ గోరంట్ల రాఘవయ్య చౌదరి గారు, వారందరికి నా నమస్సుమాంజలి" అని శ్రీ నాగభైరవ వివరించారు. వీరు రంగాజమ్మ చరిత్రను గేయకావ్యంగానేకాక నాటకంగా కూడా వ్రాశారు. "నాచే రచింపబడిన రంగాజమ్మ నాటకాన్ని నాటి వేదికపై (8-5-83) శుభోదయ నాట్యమండలి వారు ప్రదర్శించారు నాటకానికి దర్శకత్వం వహించి, నిర్వహించిన నా అనుంగు మిత్రులు నల్లూరి వెంకటేశ్వరరావు, భీమని పూర్ణానందం గార్లకును, నటీనటులకు నా నమస్సులు" [1] అని పీఠికలో అంజలి ఘటించారు.

నాటకీయత ఉట్టిపడేలా శ్రీ నాగభైరవ కావ్యేతి వృత్తాన్ని పది భాగాలుగా విభజించార

## 1వ భాగము

(రంగాజమ్మ నర్తకిగా ప్రవేశించి విజయరాఘవుణ్ని విశేషంగా ఆకర్షించడం)

కళాధామంగా ప్రసిద్ధి చెందిన తంజావూరును విజయరాఘవ నాయకుడు పరిపాలిస్తున్నాడు. నగరంలోని నర్తనశాలలో రంగాజమ్మ నృత్య ప్రదర్శన యేర్పాటు చేయబడింది. విజయరాఘవుడు, పట్టపురాణి, గురువర్యులు తాతయాచార్య దేశికులు, పురప్రముఖులు, ప్రేక్షకులుగా విచ్చే

1. నాగభైరవ కోటేశ్వరరావు, రంగాజమ్మ (అంజలి), పుట - 16.

శారు. ఉషాకుమారిగ రంగాజమ్మ ప్రదర్శించిన అభినయ చాతుర్యం విజయరాఘవుని ముగ్ధుణ్ని చేసింది.

" ఈమె రంగాజమ్మయా? హృది
నేలు పుత్తడి బొమ్మయా?
ఈ మనోహరి వేశ్యయా? కా
దీమె అచ్చర లేమయే? "

అని విజయరాఘవుడు తన్మయత్వం చెందాడు.

## 2వ భాగము

(రంగాజమ్మ ఆస్థాన కవయిత్రిగా నియమించబడటం)

మరునాడు సభలో ప్రవేశించిన రంగాజమ్మ విజయరాఘవునితో

" పేరు రంగాజమ్మ!
శారదనుపాసించి
నృత్య విద్యలు నేర్చి
నానయ్య రారాజ!
ఆంధ్ర గీర్వాణాది
అష్టభాషల నేను
అల్లుకొంటిని కవిత
అవధరింపుమురాజ! " [1]

అని స్వవిషయాన్ని వివరించింది. దివ్యకంఠంతో ఆమె చేసిన కావ్యగానం తంజావూరి సభను తన్మయ పరిచింది. ఆ క్షణం నుండి రంగాజమ్మ విజయరాఘవుని ఆస్థాన కవయిత్రిగా ప్రకటింపబడింది.

1. నాగభైరవ కోటేశ్వరరావు, రంగాజమ్మ, పుట - 21.

## 3వ భాగము

(రంగాజమ్మ, విజయరాఘవుల విరహావస్థ – పట్టపురాణి కలవరపాటు)

రంగాజమ్మ నృత్యం, గానం, కవితాపటిమ, రూపలావణ్యాలు విజయరాఘవుణ్ని విరహావస్థకు గురిచేశాయి. విజయరాఘవుని ఔదార్యం, రాజసం, వెచ్చని చూపులు రంగాజి హృదిలో సందడి చేశాయి.

> " పుడమిశు కారేయి
> పడలేదు కనుమూత
> విడలేదు నర్తకి
> అడుగు గజ్జెల మ్రోత "

> "రంగ కారేయి ని
> ద్దుర జాడయే లేదు
> రేని వెచ్చన చూపు
> లను మరచి పోలేదు" [1]

విజయ రాఘవుడు రంగాజమ్మపై ప్రదర్శించిన అభిమానం పట్టపురాణి కలతకు కారణమైంది.

## 4వ భాగము

(రంగాజమ్మ, కృష్ణాజమ్మల సంభాషణ, రంగాజమ్మ విజయరాఘవుల ప్రణయ జీవితం)

కృష్ణాజమ్మ రంగాజమ్మకు సోదరీ సమాన. ఉషాపరిణయంలో చిత్రరేఖ పాత్రను అభినయించిన జాణ. రంగాజమ్మ, విజయరాఘవుల ప్రణయ వీక్షణాలను, విరహావస్థలను పసిగట్టిన ప్రౌఢ. కృష్ణాజమ్మ ఎకసెక్కపు

1. నాగభైరవ కోటేశ్వరరావు, రంగాజమ్మ పుట. 32,33,34

మాటలవల్ల, విజయ రాఘవ నాయకుడు రంగాజమ్మ మందిరాన్ని సంద ర్శించడానికి వస్తున్నాడనే విషయాన్ని పాఠకులు గ్రహిస్తారు. విజయ రాఘవుడు రంగాజమ్మను ప్రాణాధికంగా భావించి ప్రణయం కొనసాగిం చాడు. రంగాజమ్మ రాణివాసం అలంకరించింది.

"రంగాజ యుత్సంగ
రంగమన పాన్పుపై
మేము వాల్చెము విజయ
మేదినీ విభుడు"

## 5వ భాగము

(రాణి పరితాపం, ప్రజల గుసగుసలు, రాజు ప్రవర్తన)

జనపతి రహస్య ప్రణయం నగరమంతా వెలుతురువలె వ్యాపించింది. పుర వీధుల్లో ఎక్కడ విన్నా రంగాజమ్మ విజయ రాఘవుల ప్రణయాన్ని గురించిన ముచ్చటలే వినిపించాయి. క్రమంగా రాజుకు రంగాజమ్మే సర్వస్వమై పోయింది. రాచకార్యాలను విస్మరించాడు. కొలువుకూటానికి వెళ్ళడం సంకటమయంగా, కంటక సమంగా భావించాడు.

"అతని కన్నుల కామె
ఆనంద దీపమ్ము
అతని బ్రతుకునకామె
అమని ప్రవాహమ్ము

అంతఃపురంలో రాణి బాధకు మితిలేదు. ఆమె కళ్ళలో కావేరి ప్రవహిం చింది. "ధవుడు కట్టిన తాళి, తన పాలి యెగ తాళి"గా మారిందని విల పించింది. వేశ్యాంగనకు లభించిన ప్రేమ తాను పొందలేక పోయాననీ పరి తపించింది.

## 6వ భాగము

(రంగాజమ్మకు కనకాభిషేకం, మహారాణి ఆలోచనలు)

సంవత్సరం గడిచింది. ఈ సమయంలోనే రంగాజమ్మకు ఎంతో వైభవంగా కనకాభిషేకం జరిగింది. ఉత్సవ సమయాన రంగాజమ్మ తాను రచించిన ఉషాపరిణయం ప్రబంధాన్ని రాజుకు అంకితమిచ్చింది. మరో సంవత్సరం కదలిపోయింది. ఈ రెండు సంవత్సరాలలో మహారాణికి రాజదర్శనం లభించలేదు. ప్రభువు రంగాజీ దాసుడై రాచకార్యాలను విస్మరించాడనే వదంతులు వ్యాపించాయి. రాజును కలసి పరిస్థితులను వివరించాలని పట్టపురాణి భావిస్తుంది. రాజదర్శనం కోరుతూ విదూషకుణ్ని పంపినా ఫలితం శూన్యం. ఆమె ప్రార్థన విన్నవించడానికి మంత్రివెళ్లి వివర్ణమైన ముఖంతో మరలి వచ్చాడు. విసిగిపోయిన మహారాణి రామభద్ర అనే దాసితో విజయరాఘవుని చిత్రపటాన్ని రంగాజీ వద్దకుపంపిస్తూ "ఒక్క రాత్రి రాజును నా మందిరానికి పంపించి, వారు తిరిగి వచ్చే వరకు యీ చిత్రాన్ని నీవద్ద వుంచవలసింది" అని తన మాటగా చెబుతుంది. రాణి సందేశాన్ని రామభద్ర రంగాజమ్మకు తెలిపి చిత్రపటాన్ని అందించింది.

రంగాజమ్మ చిత్రం వెనుక—

> " ఏ వనితల్ మము దలంప నేమి పనో? తమ రాడువారు కా
> రో వలపించు నేర్పెరుగరో, తమ కౌగిలిలోన నుండగా
> రాపదియేమిరా విజయ రాఘవయంచిలు దూరి బల్మిమై
> తీపెర కత్తెసై పెనగి తీసుక వచ్చితినా తలోదరీ! " 1

అని వ్రాసి చిత్రపటాన్ని త్రిప్పి పంపించింది.

---

1. నా॥ కోటేశ్వరరావు, రంగాజమ్మ, పుట - 84.

## 7వ భాగము

దాసి తీసుకు వచ్చిన రంగాజమ్మ సమాధానంచూచి రాణి క్రుంగి పోయింది. బావిలో దూకి ఆత్మహత్య చేసుకోవాలని అనిపించినా మన సును సమాధాన పరచుకొని ఆత్మహత్యా ప్రయత్నాన్ని విరమించుకుం టుంది. తెల్లవారగనే గురువర్యులు, పురోహితులైన కుమార తాతాచార్యుల వారికి కబురు చేసింది. మహారాణి మనోభావాలను గ్రహించిన గురువ ర్యులు తన వంతు కర్తవ్యం నెరవేర్చాలని భావించాడు రంగాజమ్మ పైనుండి రాజుమనసు మరలించడం తక్షణ కార్యంగా ఊహించాడు.

## 8వ భాగము

(వృద్ధ వేశ్య ప్రవేశం, మంత్రుల కుట్రలు)

రంగాజమ్మ గర్భవతి అని తెలియగానే విజయరాఘవుడు ఎంతో సంతోషించాడు. పుట్టబోయే బిడ్డను తంజాపురాంధ్ర సామ్రాజ్యానికి మహా రాజును చేయాలని ఉవ్విళ్లూరాడు. తన ప్రాణసఖిని అభినందించాలని బయలు దేరబోయే సమయంలో ప్రతీహారి ప్రవేశించి "ఒక వృద్ధురాలు తమ దర్శనం కోసం వేచి వుందని" తెలియజేశాడు. విజయరాఘవుని అనుమతితో వృద్ధురాలు ప్రవేశించింది. "తాను రామాపురం నివాసిననీ; తానుచేసిన ఉపకారానికి ప్రతిగా తమ తండ్రి రఘునాథనాయకులవారు అగ్రహారం దానం చేశారనీ; ఆ అగ్రహారాన్ని తుండీర భూపాలుడు స్వాధీనం చేసుకున్నాడనీ" వివరించి, తనకు న్యాయం చేయవలసిందిగా విజయరాఘవుని ప్రార్థిస్తుంది. తుండీరదొరను దండించి మీ తండ్రిపెట్టిన దీపం నిలుప వలసిందని మొరపెట్టుకుంది. తన తండ్రికి యీ వృద్ధురాలు చేసిన మేలు యేమిటో తెలుప వలసిందిగా విజయరాఘవ నాయకుడు ప్రశ్నించాడు. గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటున్న దానిలా నటిస్తూ, ఆ వృద్ధ వేశ్య యిలాతెలిపింది. రఘునాథ నాయకుడు మధురను జయించి, పురవీధుల్లో వూరేగు సమయంలో ఒక సుందరి అతడి హృదయాన్ని

దౌంగిలించింది. ఆమెను తనకు దక్కేలా చేయమని రఘునాథుడు యీ వృద్ధ వేశ్యను నియమించాడు. తనకు జన్మించే కుమారుణ్ని మహారాజును చేయడానికి యిష్టపడితే, రఘునాథుని కోర్కె తీర్చటానికి అభ్యంతరం లేదని ఆసుందరి షరతు విధించింది. రఘునాథుడు అంగీకరించి, ఆమెతో సంతోషంగా కాలం గడిపాడు. ఆసుందరి పొందును లభింపజేశానని రఘునాథుడు తనకు అగ్రహారం దానం చేశాడని" వృద్ధ వేశ్య వివరించింది.

తనకు మాతృ సమానురాలైన ఆ సుందరి ఆమె పుత్రుడు ఎక్కడ వున్నారో తెలుప వలసిందిగా విజయరాఘవుడు కోరాడు. వృద్ధ వేశ్య విజయరాఘవునితో "ఆమె ఒక పుత్రికను కని కన్నుమూసింది. ఆబాలికా మణిని నేను పెంచి పెద్ద చేశాను. ఆమె ప్రస్తుతం మీ కొలువులోనే ఉందని తెలిపింది. "పేరు రంగాజమ్మ" అని తెలియజేసింది. రంగాజమ్మ తన సోదరి అని వినగానే విజయరాఘవుడు నోటమాట రాక నిశ్చేష్టుడయ్యాడు. "ఎంత పాపిని" అని పరితపించాడు.

" గగనమంతా కారు చీకటి
క్రమ్మి దెసలను మ్రింగివైచెను
విసపునవ్వుల నవ్వి ముసలిది
వెడలిపోయే నిశీథములో " 1

## 9వ భాగము

తాతయ్యాచార్యుల ఉపదేశం వల్ల రాజుకు చిత్తశాంతి లభించింది. ఆచార్యులవెంట అంతఃపురానికి వెళ్లాడు. విజయరాఘవుని రాక పట్టపురాణికి ప్రమోదం కలిగించింది. అమాయకురాలు, నిర్దోషియైన రంగాజమ్మ ప్రియునికై ఎదురు తెన్నులు చూచింది.

1. నా॥ కోటేశ్వరరావు, రంగాజమ్మ, పుట - 114,

" కనుల దీపము పెట్టు
కాని రంగప్రియునికై
ఎదురు తెన్నులు జూచె
కనులు కాయలు గాచె "

సోదరితో శారీరక సౌఖ్యం అనుభవించాననే బాధతో మహారాజు క్రుంగిపోయాడు.

## 10వ భాగము

కొన్ని నెలలు గడచిన తరువాత విజయరాఘవుడు మంత్రినీ, తాతాచార్యుల వారిని వెంటబెట్టుకొని సాయం సమయాన వాహ్యాళి వెళ్ళాడు. దారిలో వృద్ధ వేశ్య తిరిగి ప్రత్యక్షమైంది. తాను రామాపురం నివాసిని కానని, ఈ నగరానికి చెందిన భోగకాంతననీ తెలియజేసింది. రంగాజమ్మ మీకు చెల్లెలు కాదనీ, రంగాజమ్మపై విరక్తి కలగడానికి తాతాచార్యులు పన్నిన పన్నాగమనీ వివరించింది. నిర్భాగ్యురాలైన రంగాజి తమరాకకై రేయింబవళ్లు ఎదురుచూచి, కృశించి, పుత్రుని ప్రసవించి, చావుపడకపై మీకై ఎదురుచూస్తున్నదని వివరించింది. ఘోరమైన పాపం మూటగట్టుకొన్నానని విలపిస్తుంది. పెన్నిధిని కోల్పోయిన పేదవానిలా విజయరాఘవుడు వృద్ధురాలు దారిచూపగా రంగాజమ్మ వద్దకు పరుగు తీశాడు. మరణానికి చేరువగావున్న రంగాజమ్మ చూచి,

" రేనినా? నేనడవి
మ్రానునో? నీ చావు
కై కారణమైన
కత్తినో? మిత్తినో?
నన్ను క్షమింపవా?
కన్నెత్తి నన్నొక్క
సారి వీక్షింపవా?
నోరార పలుకవా?

క్షమ కర్హుడను గాను
దౌర్భాగ్యుడను నేను
నిజము నీ గుండియల
నిప్పులను చెఱగితిని " [1]

అని రోదించాడు. రంగాజమ్మ భారంగా కనురెప్పలు విప్పి,

" తమ వెనుక కొలువు, అం
తఃపురమ్మును గలవు,
తమనీడలో వికా
సము జెందవలె నవ్వి,
అదియె నా తుది కోర్కె
ఎదియు చెప్పగ లేను
ఈ బిడ్డ మీ బిడ్డ
ఈ తడే మీ ... ........ " [1]

అని పలవరిస్తూ కన్ను మూసింది.

మధుర కవయిత్రి రంగాజమ్మ జీవితం విషాదాంతమై పోయింది. నిండు నూరేళ్ల జీవితం అంతఃపురం వారి కుట్రలకు బలై పోయింది.

" కాలచక్రము తిరిగిపోనీ
కథలు గాథలు మాసిపోనీ
రంగ జీవిత మమర కావ్యము
వ్రాయగల్గుట నాదు భాగ్యము "

అని శ్రీ నా॥ రంగాజమ్మ జీవిత చరిత్రను ముగించారు.

---

1. నాగభైరవ కోటేశ్వరరావు, రంగాజమ్మ, పుట - 137, 138
2. అందే, పుట-138.

# చారిత్రకత

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు గారు యీ గేయ కావ్యాన్ని చరిత్రాంశాలకు విఘాతం కలగని రీతిలో రచించారు. ఈ కావ్యంలోని విజయరాఘవ నాయకుడు, రంగాజమ్మ, కృష్ణాజమ్మ, కాళకవి, తాతాచార్యులు చరిత్ర ప్రసిద్ధులైన వ్యక్తులే. విజయరాఘవ నాయకుడు తంజావూరు రాజ్యాన్ని 1633 నుండి 1673 వరకు నలభై సంవత్సరాలు మహావైభవంగా పరిపాలించాడు. తండ్రి రఘునాథ నాయకునివలె విజయరాఘవుడు పరాక్రమ సంపన్నుడు, కవి పండిత పోషకుడు. విజయనగరాధిపతి రామరాయలకు తోడునీడగా నిల్చి; మధుర చెంజిమండలాధిపతుల్ని ఓడించి "జీర్ణకర్ణాట సామ్రాజ్య సింహాసన సంస్థాపనాచార్య" అని కీర్తింపబడినాడు. విజయరాఘవుని కాలంలో నాట్య సంగీత సాహిత్య కళలకు విశేషమైన ఆదరణ లభించింది. "విజయరాఘవ నాయకుడెంత మహావీరుడో యంత రసికుడు. ఎంత రసికుడో యంత కళాకోవిదుడు, కళాపోషకుడు. రఘునాథ నాయకునివలె నాతడు కవి. సంగీత నాట్య విద్యలయందారి తేరినదిట్ట. ఆయన కాలమున తంజావూరొక సకల కళా మందిరమువలె నుండెనని ప్రతీతి" [1] అను శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారి అభిప్రాయం అతిశయోక్తి కాదు. విజయరాఘవుడు వ్రాసిన "రఘునాథ నాయక అభ్యుదయ" కావ్యం తంజావూరు నగరాన్ని, మహారాజుల ఆచార వ్యవహారాలను, తంజావూరాంధ్రుల సంస్కృతిని వెల్లడి చేస్తుంది. నాగభైరవ కోటేశ్వరరావుగారు తంజాపురాంధ్ర సాహిత్యాన్ని, చరిత్రను క్షుణ్ణంగా పరిశీలించి "రంగాజమ్మ" గేయ కావ్యం రచించారు.

శ్రీ నాగభైరవ యీ గేయ కావ్యాన్ని రంగాజమ్మ నృత్య ప్రదర్శనతో ప్రారంభించారు. నాయక రాజుల పాలనలో, ముఖ్యంగా రఘునాథ విజయరాఘవుల కాలంలో కావ్య పఠనం, సమస్యా పూరణం, నృత్య ప్రదర్శనలు, గాన వాద్య వినోదాలు జరుగుతుండేవి. కర్పూర వసంత రాయలుగా సుప్రసిద్ధుడైన కుమారగిరిరెడ్డి కొండవీడు పాలకుడుగా వున్న

1. శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి, తంజావూరు తెలుగు కవులు, పుట - 219.

రోజుల్లో అనేకమైన ప్రదర్శనలు నిర్వహింపబడేవి. నృత్య ప్రదర్శన సమయంలో భరతాగమరహస్య పారీణయైన లకుమ, కుమారగిరి మనసును ఏవిధంగా దొంగిలించిందో అదే విధంగా రంగాజమ్మ విజయరాఘవుని మనసును ఆకర్షించింది. మరునాడు సభలో ప్రవేశించి కావ్యగానం చేసి విజయ రాఘవుడిని ఆకట్టుకుంది. "విజయ రాఘవ నాయకుడు కవి, రసిక శేఖరుడు. రంగాజమ్మయు కవయిత్రి. శృంగార రసతరంగిత పదకవిత్వ మహనీయ మతిస్ఫూర్తి యగుటచేత గొప్ప రసికురాలనక తప్పదు. కావున విజయ రాఘవుని చిత్తవృత్తి యామెయందు నెలకొని యుండుటలో విపరీతమేమియులేదు. అసలు రాజులు శృంగార ప్రియులు. నెరజాణయగు సౌందర్యవతి చేతి కందుబాటులో నున్నపుడు విడిచి పుచ్చుట వారి స్వభావము కాదు."[1] రంగాజమ్మను విజయరాఘవుడు ప్రాణాధికంగా ప్రేమించాడు.

రంగాజమ్మ సౌందర్యవతి మాత్రమే కాదు; అష్ట భాషాకవితా పర్యంకష మనీషా విశేషశారద. ఈ విదుషీమణి పూర్తి పేరు పసుపులేటి రంగాజమ్మ. 'పసుపులేటి' అనే యింటి పేరును బట్టి యీామె వేశ్య కుటుంబానికి చెందినట్లు కొందరు ఊహిస్తున్నారు. "రంగాజమ్మ కులము చేత వేశ్య కావచ్చును. కాని విద్యా వివేక సంపన్నురాలు, రాజనీతి విశారద" అని శాస్త్రిగారి అభిప్రాయము. రంగాజమ్మను విజయ రాఘవుని వుంపుడు కత్తెగా ఊహిస్తూ కొందరు "ఏవనితల్ మముదలంపనేమి పస" అనే పద్యాన్ని ఉదాహరించారు.

రంగాజమ్మపై ప్రేమతో విజయరాఘవుడు తనను మరచిపోగా పట్టపురాణి అక్కనుతో "రాజను తమ మందిరానికి పంపించవలసిందిగా" దాసితో కబురు చేసెననియు; అందుకు సమాధానంగా రంగాజమ్మ పై పద్యాన్ని వ్రాసి పంపినదని వారివాదన. పై చాటు పద్యాన్నిబట్టి రంగా

1. శిష్టా లక్ష్మీ కాంత శాస్త్రి, తంజావూరు తెలుగు కవులు, పుట - 242,243.
2. అందే. పుట. 243

జమ్మను విజయరాఘవుని ఉంపుడుకత్తెగా నిర్ణయించటం సాధ్యంకాదు. రంగాజమ్మ విజయరాఘవుని ధర్మపత్నిగా, కులకాంతగా జీవించినదన డానికి యెన్నో ఆధారాలున్నాయి. ఉషాపరిణయ కావ్యంలో—

"నీ పతి మన్నరు దాసుడు
గోపాలుడు కమక వితడు కోర్కెలు హెచ్చన్
చేపట్టి మనప నెలకొమ
వా పలుకుల నెలతనీ ముఖాంబుజ సీమన్"[1]

అని శతక్రతు తాతాచార్యులు సెలవిచ్చారు. రంగాజమ్మ విజయరాఘవుని ఆదేశం మేరకు, విజయ రాఘవుని గురువర్యులైన తాతాచార్యుల వారి దీవనలు కోరినపుడు వారుచెప్పిన పద్యమిది.

వేరొక సందర్భంలో. తాతాచార్యుల వారితో "నీ విజయరాఘవ చంద్రుడు"[2] అని సంబోధింపజేసింది. విజయరాఘవుని వుద్దేశించి మన్నారుదాస విలాసములో "మద్భర్తవు"[3] అనిప్రయోగించింది. తాతాచార్యులు దీవించి చెప్పినట్లుగా యీ క్రింది పద్యం రచించింది.

"చతురాస్యుండవ దగునీ
పతియిటు నిను గారవించి బహుమతి మీరన్
గృతి రచియింపమనన్ భా
రతికిన్ బ్రతిపత్తువమ్మ రంగాజమ్మా !"[4]

ఫలశృతిలో "నా విభుడైన మన్నారు దాసునిచేత........"[5] అని ప్రకటించింది.

---

1. రంగాజమ్మ, ఉషాపరిణయము, పుట. 5 పద్యసంఖ్య 7
2. రంగాజమ్మ, ఉషాపరిణయము, ప్రథమాశ్వాసము 12వపద్యము పుట. 7
3. రంగాజమ్మ, మన్నారుదాస విలాసము, పుట. 6 వచనము 20
4. అందే. పుట. 6 22వ పద్యము
5. అందే. పంచమాశ్వాసము, పుట. 122 పద్యము 122

ఉషాపరిణయము, మన్నారు దాస విలాసములలోని యీ విష యాలను విజయరాఘవుడు. ఆస్థాన పురోహితులయిన తాతాచార్యులు గమనించి ఆమోదించి వుంటారు. దీనిని బట్టి రంగాజమ్మ విజయరాఘవు నితో గడపిన ప్రణయ జీవితం లోక విదితం. ఆమె ఏకచారిణీ వ్రతాన్ని అనుసరించి విజయరాఘవుని కులకాంతగా, ధర్మపత్నిగా కాలం గడిపిన కవయిత్రి అందుచేతనే నిర్భయంగా విజయరాఘవుని తన భర్తగా ఆయా కావ్యాల్లో అభివర్ణించింది. రంగాజమ్మ వ్రాసిన కావ్యాలను పరిశీ లించినాగభైరవ కోటేశ్వరరావుగారు విజయరాఘవ రంగాజమ్మల ప్రణయ జీవితాన్ని, తన కావ్యంలో మధురంగా చిత్రించారు. కనుకనే శ్రీ నా॥ సృష్టించిన సన్నివేశాలు కల్పనగా కాక, చారిత్రకాలవలె భాసించాయి. రంగాజమ్మ ఉషాపరిణయ కావ్యాన్ని విజయ రాఘవునికి అంకితం చేసిం దనే సత్యాన్ని దృష్టిలో పెట్టుకొని శ్రీ నాగభైరవ నృత్య ప్రదర్శన సమ యంలో రంగాజీ "ఉష" గా అభినయించినట్లు రచించారు. రంగాజమ్మకి జరిగిన కనకాభిషేకం గూడా చరిత్ర సమ్మతమైన సంఘటనయే. ఉషా పరిణయం కావ్యావతారికలో రంగాజీ స్వవిషయాన్ని యిలా వివరించింది.

"శ్రీ రాజ గోపాల కరుణా కటాక్ష వీక్షణానుక్షణ ప్రవర్ధమాన సార స్వత ధురీణయు, విచిత్ర తర పత్రికా శత లిఖిత వాచికార్థావగాహన ప్రవీణయు, తత్ప్రతి పత్రికా శత స్వహస్త లేఖన ప్రశస్త కీర్తియు, శృంగార రస తరంగిత పద కవిత్వ మహనీయ మతి స్ఫూర్తియు, అతు లితాష్ట భాషాకవిత సర్వంకష మనీషా విశేష శారదయు, రాజనీతి విద్యా విశారదయు, విజయరాఘవ మహీపాల విరచిత కనకాభిషేకయు, విద్వత్క విజన స్తవనీయ మన్నారుదాస విలాసనామ మహా ప్రబంధ నిబంధన కృత లక్షణయు, పసుపులేటి వెంకటాద్రి బహు జన్మ తపఃఫలంబును, మంగమాంబా గర్భశుక్తి ముక్తా ఫలంబును, రంగద్గుణ కదంబయునగు రంగాజమ్మ వచన రచనా చమత్కృతి జెన్నుమీరు ఉషాపరిణయంబను మహాప్రబంధంబు నందు ప్రథమాశ్వాసము."[1] రంగాజమ్మ తప్ప స్త్రీలలో

---

1. రంగాజమ్మ, ఉషాపరిణయము, ప్రథమాశ్వాసము, 7 వ వచనము పుట. 27

కనకాభిషేక సన్మానాన్ని పొందినవారు తెలుగు సాహిత్య చరిత్రలో కమ పించరు.

## "రంగాజమ్మ" అనుకరణ కావ్యమా ?

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు డా॥ సి. నారాయణరెడ్డిగారి "కర్పూర వసంతరాయలు" కావ్యాన్ని అనుకరిస్తూ "రంగాజమ్మ" వ్రాసినట్లు స్పష్ట మౌతుంది.

"రంగాజమ్మ" కావ్యము శ్రీ నారాయణరెడ్డిగారి "కర్పూర వసంత రాయలు" నకు పిల్ల వసుచరిత్రగా మన్నది. ఇది నారాయణరెడ్డిగారికి గౌరవమేకాని, కోటేశ్వరరావుగారి వి యు మాలోచింపవలసిన పరిస్థితిలో పడినది."[1] అని క్షేమేంద్రగారు అభిప్రాయపడ్డారు.

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావుగారు మల్లాది వసుంధరగారు వ్రాసిన "తంజావూరు పతనం" చారిత్రక నవలనూ, డా॥ సి. నారాయణరెడ్డిగారి "కర్పూర వసంతరాయలు" చారిత్రక గేయకావ్యాన్ని ఆదర్శంగా పెట్టు కొని "రంగాజమ్మ" ను రచించారని చెప్పడం అసంగతం కాదు. అందు లోనూ, "కర్పూర వసంతరాయలు" ప్రభావం అత్యధికం.

"కర్పూర వసంతరాయలు" లో కొండవీటి పాలకుడయిన కుమార గిరిరెడ్డి దేవదాసి లకుమను వలచి వరించాడు. ఆమెను రాజనర్తకిని చేశాడు. ఆమె ధ్యాసలో పడి రాజకార్యాలను విస్మరించాడు. తుదకు పట్టపు రాణి కోర్కె తీర్చడానికి, కుమారగిరిని కార్యోన్ముఖుణ్ణి చేయడానికి లకుమ ప్రాణత్యాగం చేయవలసి వచ్చింది.

రంగాజమ్మ కావ్యంలోనూ తంజావూరు పాలకుడయిన విజయరాఘ వనాయకుడు దేవదాసి రంగాజమ్మను ప్రేమించాడు. ఆమెను ఆస్థాన కవయిత్రిని చేశాడు. రాజకార్యాలను త్రోసిపుచ్చాడు. తుదకు పట్టపురాణి ప్రయత్నం వలన రంగాజమ్మ, విజయరాఘవుల నిరాఘాట ప్రణయానికి ఆటంకం ఏర్పడింది. రంగాజమ్మ ఆవేదనతో కృశించి ప్రాణత్యాగం

---

1. క్షేమేంద్ర, భారతి మాసపత్రిక, 1963, జులై, పుట - 98.

చేసింది. దీనినిబట్టి రెండు కావ్యాలలోని కథాంశంలోనూ పేర్ల మార్పేగాని మరే ప్రత్యేకతా కనుపించదు.

సన్నివేశాల కల్పనలో కూడా కర్పూరవసంతరాయల ప్రభావమే కనుపిస్తుంది. లకుమ నాట్య ప్రదర్శన వంటిదే రంగాజమ్మ నృత్య ప్రదర్శనకూడా. కుమారగిరి ప్రథమ దర్శనమందే లకుమ పట్ల ఆకర్షితుడైనట్లు, విజయరాఘవుడూ తొలిచూపులోనే రంగాజమ్మ అద్భుత సౌందర్యానికీ, కళాసంపదకూ లొంగి పోయాడు. కర్పూరవసంతరాయలులోనూ, రంగాజమ్మలోనూ స్వప్న వృత్తాంతాలున్నాయి. కుమారగిరి, విజయరాఘవులు రాణివాసాన్ని విస్మరించి, రాజ కార్యాలను ప్రక్కకునెట్టి, నృత్య గాన వినోదాలతో పొద్దుపుచ్చటంలో ఎవరికెవరూ తీసికట్టుకాదు. కుమారగిరిని లకుమ, విజయరాఘవుని రంగాజమ్మ త్రికరణ శుద్ధిగా ప్రేమించినవారే. ధనాన్ని, అధికారాన్ని ఆశించి ప్రేమను నటించిన లక్షణాలు రెండు కావ్యాలలోనూ లేవు. "కర్పూరవసంతరాయలు"లో కుమారగిరిని లకుమ నుండి వేరుచేయడానికి పట్టపురాణి ప్రయత్నించినట్లే, "రంగాజమ్మ" కావ్యంలోనూ విజయరాఘవుని రంగాజమ్మ నుండి విముఖుణ్ని చేయడానికి పట్టపురాణి ప్రయత్నించింది. రెండు కావ్యాలూ విషాదాంతాలే. రెండు కావ్యాలలోనూ లకుమ, రంగాజమ్మల అమర ప్రేమ, ప్రాణత్యాగం కనుపిస్తాయి. పై విషయాలనుబట్టి, కర్పూరవసంతరాయలు కావ్యంలోని కథాంశాన్ని, సన్నివేశాల కూర్పును శ్రీ నాగభైరవ కోటేశ్వరరావుగారు అనుసరించారని చెప్పవచ్చు.

భాషావిషయం పరిశీలిస్తే రెండు కావ్యాలపోలిక మరింత స్పష్టమౌతుంది. రెండూ చారిత్రకగేయ కథాకావ్యాలే. రెంటిలోనూ మాత్రాఛందస్సు సరళసుందరంగా ఉంది. పదాలపొందిక, పాదాల నడక ఒకే విధంగా ఉంది. కొన్ని ఉదాహరణలు పరిశీలిస్తే తెలిసిపోతుంది.

" సిగ్గుతో తలవాల్చి మొగ్గయయ్యెను లకుమ "

(కర్పూరవసంతరాయలు, పుట - 53)

" సిగ్గుతో చిగురించి మొగ్గాయె రంగ " (రంగాజమ్మ) పుట - 28

" నాటిరేయి కుమారగిరి రా
ణ్మౌళి కనుల రెప్పవాలదు" - (కర్పూర వసంతరాయలు -
పుట - 57)

" పుడమీశు కారేయి
పడలేదు కనుమూత " (రంగాజమ్మ, పుట - 32)

" వెండి గజ్జెల రవళియే క
వ్వించునా నన్నింతగా?
గుండె గజ్జెలలోన చొరబడి
యుండెనేమో వింతగా " (కర్పూరవసంతరాయలు, పుట - 38)

" కాలిమువ్వల సవ్వడే త
న్నింతగా కవ్వించునా?
గుండెలోతులలోన జొరబడి
కోర్కెలను త్రవ్వించునా? "-(రంగాజమ్మ, పుట-15)

" ఆటవెలదుల యింటిపడు చే
నాటికైనను కాదు లకుమ
శప్తయై దివినుండి భువిపై
జారివచ్చిన అచ్చరసుమ "(కర్పూర వసంతరాయలు,
పుట - 58)

" ఈమె రంగాజమ్మయా? హృది
నేలు పుత్తడిబొమ్మయా?
ఈ మనోహరి వేశ్యయా? కా
దీమె అచ్చరలేమయో! " - (రంగాజమ్మ, పుట-15)

" ఈ ప్రక్కకు పొరలె
ఆ ప్రక్కకు పొరలె
పాన్పుగాదు చంద్రనిప్పు
పై అతడు దొరలె"-కర్పూరవసంతరాయలు, (పుట59)

" ఆ వైపునకు పొరలె
యీ వైపునకు పొరలె
చటుల విరహాగ్నిలో
అటు నిటూ దొరలె " (రంగాజమ్మ, పుట - 38)

" మృడుని మూడవకంటి చిచ్చున
బడి శరీరము విడిన మరునికి
మిమ్ము బోటి రసజ్ఞులే రూ
పమ్ము సల్పిన వారు సుమ్మా " - (కర్పూర వసంత
రాయలు, - పుట - 37)

" శివుని మూడవకంటి
చిచ్చులో మరణించి
మన్మథుండిట బ్రతుకు
మరల గైకొనినాడు " - (రంగాజమ్మ, పుట-64)

" చంద్రుడొక్కడు, అతని చుట్టును
చంక్రమించును వేలచుక్కలు " - (కర్పూర వసంత
రాయలు, పుట - 57)

" ఆకాశ వనములో
శతకోటి తారకలు " - (రంగాజమ్మ, పుట - 33)

" ఎపుడువీచిన గాడుపేకద
ఎందుకో నేడంత వాడి
ఎపుడుకాచిన వెన్నెలేకద
ఎందుకో నేడంతవేడి? " (కర్పూర వసంతరాయలు,
పుట - 57)

" వెన్నెలాతనిలోన
విరహమును రేపినది
పవనమాతని కోర్కె
పగ్గములు వదలినది " (రంగాజమ్మ, పుట-33)

" ఆటకత్తెల నాదరించుట
అధిపులకు ధర్మమ్మె...." (కర్పూరవసంతరాయలు,
పుట. 139)

" కళాకారుల గౌరవించుట
ధరాపతులకు ధర్మమేయగు "-(రంగాజమ్మ, పుట 35)

" దేశమ్మమైనను సరియే " (కర్పూరవసంత
రాయలు, పుట - 145)

"రాజ్యమ్మమైన గాని " - (రంగాజమ్మ, పుట 70)

"కాటవేముడు మరలవచ్చెను
కనుల నిండుగ నీరుతెచ్చెను
కాటవేముడు తిరిగి పోయెను
కనులు జలజల కురిసిపోయెను"
(కర్పూర వసంతరాయలు పుట. 146)

మహారాజు కుమారగిరి మనసు మార్చుటకై, మంత్రి కాటయ వేమారెడ్డి చేసిన ప్రయత్నం ఫలించలేదని డా॥ సి. నారాయణరెడ్డిగారు చేసిన వర్ణనమిది.

"రంగాజమ్మ" లో అదేవిధమైన సన్నివేశాన్ని కల్పించారు, నాగభైరవ. మహారాజు విజయరాఘవుని మనసు మార్చడానికి, మంత్రిగారు చేసిన ప్రయత్నము నెరవేరలేదు.

"మంత్రి పోయెను మరల వచ్చెను
మౌన ముద్రను మోసి తెచ్చెను
అతడు యేమియు చెప్పకయె కను
లందు నిండుగ నీరు కార్చెను (రంగాజమ్మ పుట. 77,78)

సన్నివేశ కల్పనలోగానీ, భావంలోగానీ, తదావిష్కరణ రీతిలోగాని ఏ మాత్రం మార్పులేదు.

కర్పూర వసంతరాయలులో పట్టపురాణి లకుమను ప్రార్థించిన తీరుకూ, "రంగాజమ్మ"లో పట్టపురాణి రంగాజమ్మను అర్థించిన పద్ధతికీ ఏమాత్రం భేదంలేదు.

"నిన్నురాయలు కన్ను లందున
నిల్పినందుకు పరితపించను"
(కర్పూర వసంతరాయలు పుట. 149)

"పట్టమహిషిని నేనెయను ద
ర్పమ్ము నాలోలేదు తల్లి!
పతి భగత్ గృహవర్తయైనను
మదిని యీర్ష్యయు లేదుచెల్లీ!"
(రంగాజమ్మ, పుట-82)

"నా గుండె దోచుకొన్న దొరా"[1] అని లకుమ పలికినట్లే, రంగాజమ్మ కూడా "గుండె దోచినదొరా"[2] అని సంభాషించింది. "కర్పూర వసంతరాయలు" లో పట్టపురాణి ఆలోచనలే రంగాజమ్మలో పరకాయ ప్రవేశం చేశాయి. "చారిత్రక అంశాలకు భిన్నంకాని పద్ధతుల్లో కథను నా ఊహల్లో మలచుకొన్నాను. వేశ్య వృద్ధ వృత్తాంతమంతా కథను పటిష్టం చేసుకోవడానికి నేను చేసిన కల్పన"[3] అని శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు వెల్లడించారు. వాస్తవానికి, వృద్ధవేశ్య వృత్తాంతం అంతకు పూర్వమే, మల్లాది వసుంధరగారి "తంజావూరు పతనం" లో వుంది. వృద్ధవేశ్య విజయరాఘవునితో రంగాజమ్మ రఘునాధ నాయకునకును ఒక దేవదాసి వలన జన్మించిందని, తెలియ

1. డా॥ సి. నారాయణరెడ్డి, కర్పూరవసంతరాయలు, పుట, 143
2. నాగభైరవ కోటేశ్వరరావు, రంగాజమ్మ, పుట. 48
3. అందే. (పీఠికలో, అంజలి)

జేయడం, అది విన్న విజయరాఘవుడు తాను యింతకాలం తనసోదరితో సంభోగించినానని పరితపించడం, విజయరాఘవుని నిరాదరణకు కారణం తెలియని రంగాజమ్మ క్రుంగి, కృశించి ప్రాణాపాయ స్థితిని పొందడం మల్లాది వసుంధరగారి "తంజావూరి పతనం" లోని విషయాలే. కనుక, నా॥ కోటీశ్వరరావుగారు "రంగాజమ్మ" ను రచించడంలో "కర్పూర వసంతరాయలు" "తంజావూరు పతనం" ను అనుసరించారని చెప్పడం అసంబద్ధం కాదు.

అయితే, రంగాజమ్మ జీవితచరిత్రను మొట్టమొదటగా మనోహర మైన చారిత్రక గేయకథా కావ్యంగా రూపొందించిన గౌరవం శ్రీ నాగ భైరవ కోటీశ్వరరావు గారికే చెందుతుంది. చరిత్రలో మహోన్నత స్థానం సంపాదించుకొన్న మహారాజుల వృత్తాంతాలు ఒకే విధంగా ఉండటాన్ని విస్మరించడానికి వీలులేదు. కుమారగిరి విజయరాఘవుల జీవితవిశేషాలు ఒకే విధంగా ఉండటంవలన, శ్రీ నాగభైరవ "కర్పూర వసంతరాయలు" ను అనుసరించడం ఏమాత్రం దోషంకాదు. ప్రామాణికమైన చారిత్రక కావ్యం వ్రాస్తున్నప్పుడు, అంతకు పూర్వమే వెలువడిన కావ్యాలను అను సరించడం తప్పనిసరి కూడా. నారాయణరెడ్డి, నాగభైరవలు సరిజోడిగా చరిత్రకావ్యాల విశిష్టతను పాఠకులకు తెలియజెప్పారు.

తన కావ్యంపై కర్పూరవసంతరాయల ప్రభావం ఉందని శ్రీ నాగభైరవ స్వయంగా అంగీకరించారు. "డా॥ నారాయణరెడ్డి చారి త్రక గేయ కావ్యాల భావగంధం నాలాటి ప్రారంభకులను ఆకర్షించింది. కర్పూర వసంతరాయల ప్రభావం రంగాజమ్మపై కొంతైనా ఉంది. అకుమకు రంగాజమ్మ చెల్లెలు; నారాయణరెడ్డి నాగభైరవకు అన్న" అని వారు స్పష్టీకరించారు. [1]

---

1. నాగభైరవ కవితా కదంబం, పుట. i (సింహావలోకనం)



## [illegible]

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్‌శర్మగారు తూర్పుగోదావరి జిల్లాలోని రామచంద్రపురంలో 1944 మే 28 న జన్మించారు. శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీమతి వెంకట రత్నమ్మ వీరి తల్లిదండ్రులు. రామచంద్రపురం నేషనల్ బోర్డు హైస్కూలులో పాఠశాల విద్యను పూర్తిచేసి, కొవ్వూరు "ఆంధ్రగీర్వాణ పీఠం" నుండి భాషా ప్రవీణ, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి (తెలుగు భాష-సాహిత్యం ప్రధాన విషయంగా)ఎం.ఏ ఉత్తీర్ణులయ్యారు. శ్రీ కాంత్‌శర్మగారికి చిన్నతనం నుండి తెలుగు సాహిత్యంపై మక్కువ ఎక్కువ. పుట్టింది పండిత కుటుంబంలో. సుప్రసిద్ధ సాహితీ వేత్తలైన వీరి తండ్రిగారి వద్దకు శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, మునిమాణిక్యం నరసింహంగారు, కాటూరి వెంకటేశ్వరరావుగారు, కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు, వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు మొదలైన సాహితీ మూర్తులు, విమర్శకులు తరచుగా వచ్చేవారు. వారి రసవత్తరమైన సాహిత్యచర్చ శ్రీ కాంత్ శర్మగారి బాల్యంలో తీపి గుర్తుగా నిలిచి పోయింది. ఎక్కడ సాహిత్య సభ జరుగుతున్నా శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు తన కుమారుణ్ణి వెంటబెట్టుకు పోయే వారు. శ్రీ కాంత్ శర్మగారు యిప్పటికీ ఎంతో ఆనందంగా చిన్ననాటి అనుభవాలను వివరిస్తారు. తండ్రి గారు తనపై చూపిన వాత్సల్యాన్ని వివరించేటప్పుడు వారి మాటల్లో పారవశ్యం కనుపిస్తుంది.

శర్మగారికి హైస్కూలు విద్యార్థిగా వున్నపుడే చలం సాహిత్యంపట్ల విపరీతమైన ఆకర్షణ, ఆరాధానభావం వుండేవి. బుచ్చిబాబు కథలన్నా, నవలలన్నా వల్లమాలిన అభిమానం. ఆధునిక తెలుగు సాహిత్యంలో తమకంటూ ఒక ప్రత్యేకమైన స్థానాన్ని పదిలం చేసుకున్న చలం బుచ్చిబాబుల స్వేచ్ఛా ప్రియత్వం, నిసర్గ సౌందర్యారాధన శ్రీకాంత్ శర్మగారిని విశేషంగా లోబరచుకొని శాశ్వతముద్ర వేశాయి. చలంగారి పరిచయ ప్రభావంతో "ఆమె నవ్వింది" అనే కవిత వ్రాశారు. చలంగారు ఆ కవితను పరిశీలించి "నిర్బంధోబద్ధకవిత. నీవు అంగీకరిస్తే పత్రికకు పంపిస్తాను" అని శర్మగారిని ఉత్సాహ పరిచారు. అవిధంగా 1961 ఆగస్టు నెలలో చిత్తూరు

నుండి కె. సభాగారు ప్రచురించే "దేవదత్తం" పత్రికలో శ్రీకాంత్ పేరుతో "ఆమె నవ్వింది" అనే వీరితొలి కవిత ప్రచురింప బడింది. "నా అభిమాన రచయిత చలంగారి ప్రోద్బలంతో నా తొలి కవిత వెలుగు చూడటం ఎంతో సంతోషాన్ని కలిగించింది." అంటారు శర్మగారు

"పగిలిన గుండెలు" అనే వీరి మొట్టమొదటి కథ 1962 లో ఆంధ్ర పత్రికలో ప్రచురింపబడింది. శర్మగారి రెండవ అన్నగారు శ్రీ సుబ్బరాయ శాస్త్రి తణుకులో వుండేవారు. తరచుగా తణుకు వెళ్ళే శ్రీ శర్మగారికి 1963 నుండి శ్రీదేవర కొండ బాలగంగాధర తిలక్ గారితో ప్రగాఢ పరిచయం యేర్పడింది. తిలక్‌గారు ఆధునిక సాహిత్య స్వరూప స్వభావాలను, వివిధ దేశాలలోని సాహిత్య ఉద్యమాలను శర్మగారికి వివరిస్తూండేవారు. "ఆధు నిక సాహిత్యం పట్ల అభిమానాన్ని కలిగించి నాలో అంతర్లీనమైవున్న కవితా శక్తిని వెలికి తెచ్చినవారు శ్రీ తిలక్‌గారే" అంటారు శ్రీకాంత్ శర్మగారు.

ఆధునిక సాహిత్య ప్రక్రియలలో శర్మగారు స్పృశించని శాఖలేదు. ప్రాచీన సంప్రదాయ సాహిత్యంలోని లోతు పాతులను శ్రీముత్తేవి లక్ష్మ ణదాసుగారు వివరించేవారు. "ఆముక్తమాల్యదను బోధించి,ఆంధ్రభోజుని ప్రౌఢ ప్రబంధంలోని కవితా పటిమను కరతలామలకం చేసి, ప్రాచీన సాహిత్యం పట్ల ఉండే సంకోచాన్ని శ్రీ లక్ష్మణ దాసుగారు పూర్తిగా తుడిచి పెట్టారు" అని వివరించారు శ్రీకాంత్ శర్మగారు.

వీరు మొట్ట మొదట నిడదవోలులోని సెయింట్ ఆంథోస్ (1967 సెప్టెంబర్ నుండి 1969 ఫిబ్రవరి వరకు) ఉన్నత పాఠశాలలో ఉపాధ్యా యులుగా పనిచేశారు. ఆ తరువాత ఆంధ్రజ్యోతి వార పత్రికలో 1-3-69 నుండి 31-3-76 వరకు 7 సంవత్సరాలు సబ్ ఎడిటర్‌గా పనిచేశారు. 1-4-76 నుండి ఆకాశవాణిలో పనిచేస్తున్నారు.

వీరి "అనుభూతి గీతాలు" అనే కవితా సంకలనానికి 1978 లో "ఫ్రీవెర్స్ ఫ్రంట్ అవార్డు", 1979 లో నూతలపాటి గంగాధరం సాహితీ

---

1. ముఖాముఖి

సత్కారం లభించాయి. పై సంకలనంలో 19 గేయాలను శ్రీ యస్. కుమార స్వామిగారు ఆంగ్లంలోకి అనువదించారు. సమకాలీన ప్రకాశన్, న్యూఢిల్లీ వారు ఆంగ్లానువాదాన్ని ముద్రించారు.

హాలుని గాథా సప్తశతికి కథావ్యాఖ్యతో "గాథావాహిని" అనే గేయానువాద గ్రంథాన్ని రచించారు. ఇందులో హాలుని 104 గాథలకు గేయానువాదం, కథావ్యాఖ్యానం సమకూర్చబడింది. 1978 ఆగస్టు నుండి వరుసగా 20 వారాలు ఆంధ్రప్రభ దినపత్రికలో "తెరతీయగరాదా" అనే శీర్షికతో నిత్య జీవితంలో తటస్థించే సన్నివేశాలను, వ్యక్తుల విభిన్న మనస్తత్వాలను వివరించారు.

శ్రీ శర్మగారు నాటక రంగానికి చేసినసేవ గణనీయం. తూర్పుగోదావరి జిల్లా మాండలిక భాషలో "హరహరమహదేవ" అనే రేడియో నాటకాన్ని రంగస్థల ప్రయోగానికి అనువుగా రూపొందించారు. విజయవాడ "రాష్ట్రరోడ్డు రవాణాసంస్థ నటసమాఖ్య"వారు యీనాటకాన్ని ఇరవైసార్లు ప్రదర్శించారు. మద్రాసు టెలివిజన్ వారు ప్రదర్శించిన "తేనెల తేటల మాటలతో" అనే శర్మగారి సంగీత రూపకం బహుళ ప్రచారాన్ని పొందింది. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ శ్రీ యమ్. యస్. శ్రీరాం గారు యీ పాటలకు స్వరకల్పన చేశారు. "ఆకుపచ్చని కోరికలు" అనే వీరి రేడియో నాటకం జాతీయ స్థాయిలో అన్ని భారతీయ భాషల్లోను ప్రసారం చేయబడింది. అమరావతి ప్రాశస్త్యాన్ని వెల్లడించే వీరి "అమరారామం" అనే డాక్యుమెంట్ రూపకానికి ఆకాశవాణి వార్షిక పోటీలలో ప్రథమ బహుమతి లభించింది.

శ్రీకాంత్ శర్మగారి సినీసాహిత్యం, ఫిల్మ్సు డివిజను వారు సమర్పించిన "కొండపల్లి బొమ్మలు" అనే డాక్యుమెంట్ ఫిల్మ్‌కు మొదటిపాట వ్రాయడంతో ప్రారంభమైంది. ఆ పాటకు అంతర్జాతీయ ఖ్యాతి పొందిన సుప్రసిద్ధ వేణువాద్య నిపుణుడు శ్రీ ఏల్చూరి విజయరాఘవరావుగారు వేణునాదాన్ని సమకూర్చారు. "కృష్ణావతారం" చిత్రంలో వీరు వ్రాసిన "చిన్నారి నవ్వు చిటి తామర పువ్వు" అనే గీతం శ్రోతల్ని ఆకట్టుకుంది. శ్రీ జంధ్యాలగారు దర్శకత్వం వహిస్తున్న సినిమాలకే శర్మగారు ఎక్కు

వగా పాటలు వ్రాస్తున్నారు. నెలవంక చిత్రంలోని పాటలు మొత్తం శ్రీకాంత్ శర్మగారు వ్రాసినవే. రెండుజెళ్ల సీత, రావూగోపాలావూ, పుత్తడిబొమ్మ, మొదలైన చిత్రాలలో శ్రీకాంత్ శర్మగారి పాటలు ఎంతో చక్కగా ఉన్నాయి. వివిధ నృత్య సంస్థల కోసం వీరు రూపొందించిన "సంగీత వాల్మీకమ్" "మాళవిక", "నృత్యాలయ" మొదలైన నృత్య నాటికలు ఉన్నత కళాప్రమాణాలతో కూడుకొని వున్నాయి. శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మగారికి నటనానుభవం వుంది. "సాహిత్య పరిచయం" "ఆలోచన" అనే వీరి వ్యాస సంకలనాలు సాహితీ వేత్తల మన్నన పొందాయి. "తూర్పున వాలిన సూర్యుడు" అనే నవల పాఠకుల అభిమానాన్ని పొందింది. శ్రీకాంత్ శర్మగారు సౌజన్యం మూర్తీభవించిన సాహితీ కర్షకులు.

## ఇతివృత్త పరిశీలనము

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మగారి "శిలామురళి" గేయకావ్యం 1970లో ప్రచురింపబడింది. వీరు ఫోర్తు ఫారం చదివే రోజుల్లో (1956మే) భారతిలో శ్రీమతి మానుకొండ సరోజినీదేవిగారు వ్రాసిన "మేఘమల్హార్" అనే నాటకాన్ని చదివారు. ఎందుచేతనో ఆ కథ వారి హృదయంలో హత్తుకుపోయింది. నిడదవోలులోని సెయింట్ ఆంథోన్ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయునిగా పనిచేసే రోజుల్లో "శిలామురళి" గేయకావ్యం వ్రాశారు. "శిలామురళి" అనేపేరును వీరి తండ్రిగారు శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు సూచించారు. ఇదే ఇతివృత్తంతో "శిలామురళి" అనే పేరుతోనే రేడియో నాటిక (1982-83) వ్రాశారు. ఈ గేయ కథా కావ్యం శ్రీకాంత్ శర్మగారి భావసౌకుమార్యాన్ని, కవితాశక్తిని వెల్లడిస్తుంది.

"కథా కావ్యాలు ఈ రోజులలో అరుదు
వాటిలో ఇది బిరుదైనది, బిగువైనది" అని శ్రీ నండూరి రామమోహనరావుగారు యీ కావ్యాన్ని ప్రశంసించారు.

---

1. శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ వర్మ, శిలామురళి పీఠిక-4

ఈ కావ్య కథామూలాన్ని శ్రీ విభూతి భూషణ బంద్యోపాధ్యాయ శ్రీమతి మానికొండ సరోజనీదేవిగారల రచనలనుంచి రేఖామాత్రంగా తీసుకున్నాను. వారికి సవినయంగా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.[1] అని పేర్కొన్నారు శర్మగారు.

## ఇతివృత్త పరిశీలనము

శ్రీకాంత్‌శర్మగారు ఈ కడను 11 భాగాలుగా విభజించారు. బౌద్ధ నాగరికతకు దేశం భక్తితో మ్రొక్కే కాలం. ఉత్తర భారత దేశంలోని ఒక అరణ్యానికి అవలివైపునగల కొండ గుట్టపై ఎంతో ప్రసిద్ధి చెందిన ఆరామం ఉండేది. అరణ్యానికి యిటుప్రక్క సంపన్నవంతమైన గ్రామం వుంది. ప్రతి సంవత్సరం చైత్రోత్సవాలను ఊరి వెలుపల మైదానంలో నిర్వహించేవారు. అవంతి, తక్షశిల, కాంచి, మగధ, ఉత్తర కోసలల నుండి అసంఖ్యాకంగా యీ ఉత్సవాలకు హాజరయ్యేవారు.

ఆరామంలో బౌద్ధ మతాదిపతులు, ఊరి వెలుపల మైదానంలో ఉత్సవ ప్రియులు ఎవరి పద్ధతుల్ని వారు పాటించేవారు.

"నృత్య సంగీతాలు ఒకదెస
సత్యమై శివమైన సుందర
శాంతి సందేశాలు ఒకదెస
సాగిపోతాయి"[2]

ప్రద్యుమ్నుడనే యువకుడు విహారంలో చదువుకుంటూ, పాడుకుంటూ కాలం గడిపేవాడు. నిత్యం చేతిలో వేణువుతో సంచరిస్తుంటాడు. ప్రసిద్ధ సంగీత విద్వాంసుడైన ఇంద్రదమనుడు ప్రద్యుమ్నుడి తండ్రి. ప్రద్యుమ్నుణ్ని అమర గాయకుడనడం అతిశయోక్తికాదు.

1. శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ, శిలామురళి పీఠిక-4
2. అందే పుట-12

తంత్రిలో సంగీత సంస్కృతి
తరలిరాగా, పొరలిపోగా
రాగసాగర తీరరేఖను
రహిస్తుంటాడు" ప్రద్యుమ్నుడు[1]

బౌద్ధ మతాచార్యుడైన పూర్ణవర్ధనుల వారికి ప్రద్యుమ్నుడంటే ఎంతో ప్రేమ. అవంతీ గాయకులలో గొప్పవాడుగా పొగడబడే సూరదాసును సందర్శించాలని, ఆరామం విడిచి, గ్రామానికి బయలుదేరాడు ప్రద్యుమ్నుడు. సంగీతోత్సవానికి సూరదాసు వస్తాడని ముందే వినివున్నారు. సూరదాసు పోలికలున్న వ్యక్తిని చూచి, నమస్కరించి, తనను ఇంద్ర దమనుని కుమారునిగా పరిచయం చేసుకున్నారు. వాస్తవానికి ప్రద్యుమ్నుడు చూచింది సూరదాసును కాదు, గుణాఢ్యుడనే తాంత్రికుణ్ణి. గుణాఢ్యునకు మేఘమల్హార్ రాగం గానం చేయగల గాయకుడు కావాలి. అందుకే సంగీతోత్సవానికి వచ్చాడు. అమాయకుడయిన ప్రద్యుమ్నుడు ఆ తాంత్రికుణ్ణి సంగీత విద్వాంసుడైన సూరదాసుగా పొరబడ్డాడు. గుణాఢ్యుడు తానే సూరదాసని ప్రద్యుమ్నుణ్ణి నమ్మించాడు. భద్రావతి నది దక్షిణ తీరాన ఉన్న శిథిలాలయానికి రావలసిందిగా ఆహ్వానించాడు. తన శక్తినంతా ధారపోసి, సమస్త కళలలో నిన్ను గొప్పవాణ్ణి చేస్తానని ప్రద్యుమ్నుణ్ణి ప్రలోభ పెట్టాడు. మేఘమల్హార్ రాగాన్ని సాధన చేయవలసిందిగా ఆదేశించాడు.

ఆనాటినుండి ప్రద్యుమ్నుడు నిద్రాహారాలు మాని మేఘమల్హార్ రాగాన్ని సాధన చేస్తున్నాడు. ఒకనాడు ప్రద్యుమ్నుడు పొగడ నీడలో ఒరిగి, పాటతో వేణువును పలకరించేవేళ వెనుకనుండి కాలిగజ్జెల సవ్వడి వినిపించింది. తిరిగి చూసేసరికి ఒక యవ్వనవతి చిరునవ్వులు చిందిస్తూ సిగ్గు బరువుతో నెమ్మదిగా చాటుకు తప్పుకుంది. అప్పటినుండి ప్రతిరోజు ప్రద్యుమ్నుడు సంగీత సాధన చేస్తుంటే, పారవశ్యంతో అతని వెనుకనే సాక్షాత్కరించేది. నిద్రించే ప్రద్యుమ్నుడి మెడలో పొగడ పూదండవేసి మురిసిపోయేది.

3. ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ, శిలామురళి పుట. 15

" అనాదినుండి. ఆ అడవిదారులు తిరిగి
అతడు సాధనకోరి, ఆమె అతనిని కోరి
ఒకరి మనసున ఒకరు, ఒకరి తనువున ఒకరు
ఒరిగిపోతూ, కలల వాకిళుల తిరిగారు " [1]

అదీవారి పరిస్థితి.

ప్రద్యుమ్నుడిలో స్పష్టంగా కనుపించే యీ మార్పును చూచి, పూర్ణ వర్ధనాచార్యులు కలవరపడినారు. ప్రద్యుమ్నుడొక అందగత్తెతో తిరుగుతున్నాడనే గుసగుసలు విని బౌద్ధమతాచార్యుడు వ్యథ చెందాడు. ప్రద్యుమ్నుడు తనకు తానుగా వచ్చి, అసలు సంగతి వివరిస్తాడని పూర్ణ వర్ధనాచార్యులవారు ప్రతీక్షిస్తున్నారు.

ప్రద్యుమ్నుణ్ని ప్రేమించిన యువతి "సునంద". ఆమె ఒక ప్రధానుని తనయ. ప్రద్యుమ్నుడు ఆమె హృదయమంతా నిండిపోయాడు. సునంద ప్రద్యుమ్నుడి పాటకు శ్రుతి తీగగామారి, ప్రకృతి పులకరించేలా నర్తించేది.

ప్రద్యుమ్నుడికి సూరదాసు రూపంలో ఉన్న గుణాఢ్యుడి ఆహ్వానం జ్ఞప్తికి వచ్చింది. నదీతీరాన ఉన్న శిథిలాలయానికి వెళ్లాడు. ఆ జీర్ణాలయంలో, ఒక శిల్పం వ్యథాగీతివలె పవ్వళించి ఉంది. "నేనిక్కడ ప్రద్యుమ్నా" అని పలుకరించిన సూరదాసుకు (గుణాఢ్యునకు) నమస్కరించాడు ప్రద్యుమ్నుడు. సూరదాసు ఆదేశం మేరకు, గంధర్వుల గాన విద్యను సూచించే శిల్పమయ స్తంభానికి సమీపంగా నిలిచి, ప్రద్యు

---

1. ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ, శిలామురళి, పుట - 28.

మ్నుడు తన మురళిని రవళించాడు, మేఘమల్హారాన్ని గానం చేశాడు. ఆషాఢ పూర్ణిమనాటిరాత్రి, ఏకాగ్రతతో మేఘమల్హారాన్ని ఆలపిస్తే దేవి సాక్షాత్కరించి, అన్ని వరాలను యిస్తుందని సూరదాసు ప్రద్యుమ్నుణ్ని ప్రలోభపెట్టాడు. తిరిగి ప్రద్యుమ్నుడు, ఆషాఢపూర్ణిమనాటి రాత్రి, గుడి చేరాడు. గుడిలోని పూజాధావినం, సూరదాసు రూపం, ప్రద్యుమ్నుడికి వింతగా కనుపించాయి. నదిలో స్నానంచేసి, పూలమాలధరించి, పునీతుడవై రావలసిందని సూరదాసు (గుణాఢ్యుడు) ఆజ్ఞాపించాడు. ఆ తరువాత, పూజ పూర్తికాగానే మురళి ప్రయోగాలని ఆదేశించాడు. గానంచేస్తున్న ప్రద్యుమ్నుడికి ఏవేవో మహత్తర దృశ్యాలు గోచరించాయి. దివ్యమైన దేవతారూపం కనుపించింది. అతనికల చెదిరిపోయింది. తిరిగి ఆరామానికి వెళ్లేటప్పుడు, భద్రావతినది ఒడ్డున ఒకస్త్రీ దైన్యంగా కనుపించింది. ప్రద్యుమ్నుడి మనసు దిగులు పడింది. హృదయ భారంతో ఆరామం చేరుకున్నాడు ప్రద్యుమ్నుడు,

తెల్లవారేసరికి, ప్రకృతిలో మార్పుకనుపించింది. మిక్కిలి వింతగా, ప్రతివ్యక్తికీ ఏదోవెగటు మొదలైంది. పాలిపోయిన చేలను, చైతన్యంలేని కాంతిని చూచి, బౌద్ధమతాచార్యులైన పూర్ణవర్ధనులవారు ఆశ్చర్యపోయారు. విజ్ఞానులైన తన శిష్యులు ఒక్క శాస్త్రార్థాన్నికూడా చెప్పలేక పోవడం గమనించి ఆశ్చర్యచకితుడైనాడు. తనకే తెలియని అంతరంగ మథనం అనుభవిస్తున్న ప్రద్యుమ్నుడు గురుదేవుని పాదాలపై బడి విలపించాడు. పూర్ణవర్ధనాచార్యులు ప్రద్యుమ్నుడిని బోధిసత్త్వుని ప్రతిమ వద్ద కూర్చుండబెట్టి జరిగిన సంగతులు విన్నాడు. శూన్యదేవాలయం కథ విని కలత చెందాడు.

ఆచార్య పూర్ణవర్ధనులు ప్రద్యుమ్నుడికి కొన్ని వాస్తవాలు తెలియజెప్పారు. ప్రద్యుమ్నుడు కలిసింది సూరదాసును కాదనీ, గుణాఢ్యుడనే కాపాలికుడిననీ స్పష్టంచేశాడు. సూరదాసు అనే సంగీత విద్వాంసుడు

నదీతీరాన ఉన్న ఆలయానికి వెళ్ళి, దేవిని ప్రార్థించి ప్రసన్నురాలిని చేసుకోవడం గుణాఢ్యుడనే కాపాలికుడు గమనించాడు. అతడుకూడా ఆ దేవిని ప్రార్థించాడు. ఆ తల్లికి దయకలిగి ప్రత్యక్షంకాగా, తనవద్దనే శాశ్వతంగా నిలిచిపోవలసిందని కోరాడు గుణాఢ్యుడు. గాఢసాధనచేసి, కళలలో కరిగి, తనను చేరుకోమని దేవి ఆదేశించింది. గుణాఢ్యుడు ఒక గురువును ఆశ్రయించి, వశీకరణ విద్య నేర్చాడు. మేఘమల్హార రాగాన్ని ప్రద్యుమ్నుడు గానం చేయగానే, ఆ కళాధిదేవత సాక్షాత్కరించింది. కాపాలికుడైన గుణాఢ్యుడు ఆ భారతిపై వశీకరణ ప్రయోగంచేసి, కళా ప్రపంచాన్ని తనగుప్పిట బంధించాడు. లోకమంతా వెలవెల పోవటా నికి ఇదే కారణమని పూర్ణవర్ధనులవారు ప్రద్యుమ్నుడికి గుణాఢ్యుని వృత్తాంతాన్ని వివరించారు. దేశమంతా గాలించి, ఆ కాపాలికుణ్ని పట్టు కొని, దేవిని విడిపించే బాధ్యతను ప్రద్యుమ్నుడికి అప్పగించారు అంతరించి పోతున్న కళలవెలుగును తిరిగి ప్రకాశింపజేయవలసిందిగా ఆదేశించాడు.

ప్రద్యుమ్నుడు గుణాఢ్యుడి కోసం కోసల, మగధ, కాంచి, తక్షశిల గాలించాడు. కొండ, కోనలు కలయవెదికాడు. తుదకు "ఊరువిల్వ" అనే ప్రాంతం చేరాడు. అక్కడ ఉన్న చైత్యాలు చూస్తూ, ఊరిచివరకు వెళ్లాడు. ప్రకృతి మనోహరంగా ఉంది. బాటకవతల పర్వతం. పర్వతం పక్కనే జలధార. కొండలో జలధారకదిలి, పరుగులు తీసి, అలసిపోయి, విశాలమైన కొలనుగా మారింది. ప్రద్యుమ్నుడు ప్రకృతి సౌందర్యాన్ని పరికిస్తూ, కొలనుదిశగా నడిచాడు. తనకు శిథిలాలయం వద్ద, స్వాప్నికావ స్థలో కనుపించిన దివ్యాంగన, కొలను వద్ద కనుపించింది. ఆమె ఎంతో ఆదరంగా, ప్రద్యుమ్నుణ్ని అతిథిగా ఆహ్వానించింది. "ఒంటరిగా ఎందు కున్నావు?" అని ప్రద్యుమ్నుడు ప్రశ్నిస్తే;

" నన్ను ఒకసన్యాసి యిక్కడుంచాడు
నాకు యిక్కడ వెట్టి భయము వేస్తుంది –
ఎప్పుడైన అతను చూడవస్తాడు
ఇంతకంటే నాకు తెలియదింకేమే – "

అని చెబుతుంది. ఆమే సరస్వతి అని ప్రద్యుమ్నుడు సందేహించాడు.

ప్రద్యుమ్నుడు రెండురోజులుఆగి, మూడవనాడు కొండదరిచేరి, ఒకచెట్టు క్రింద విశ్రాంతిగా కూర్చున్నాడు. కొలములో గలగలమని చప్పుడువిని, పరిశీలించి, గట్టెక్కుతున్న గుణాఢ్యుణ్ని చూశాడు. గుణాఢ్యుని పలుకరించి, అతడుచేసిన మోసాన్ని నిందించాడు. దేవిని ఎక్కడ బంధించావని ప్రశ్నించాడు. గుణాఢ్యుడు కన్నీరు విడుస్తూ, తాను కళాహంతకుడనయ్యానని విలపించాడు. ఏవో ధ్వనులు తనను ఉన్మత్తుణ్ని చేస్తున్నాయని, ఏవేవో గొంతులు తనను నిందిస్తున్నాయని గుణాఢ్యుడు వివరించాడు. దేవిని తన వశీకరణ విద్యనుండి విముక్తురాలిని చేయడమే తన కర్తవ్యమని కూడా గుణాఢ్యుడు వివరించాడు. తన గురువు ప్రసాదించిన మంత్రజలంతో కళాధిదేవతను విడిపించవచ్చునని గుణాఢ్యుడు తెలియజేశాడు. వెంటనే ప్రద్యుమ్నుడు—

" నీ వేదన నంతనూ నిజమనే నమ్మనా!
నీగురువులు మంత్రజలమిచ్చారు అన్నావు,
దేవినిప్పటికినీ విడిపించవెందుకని?
దీనిలో ఏదైన మర్మముందా యేమి? "

అని ప్రశ్నించాడు.

---

1. ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ, శిలామురళి, పుట – ౨౯.

దేవిపాదాలపై మంత్రజలం చల్లినవారు శిలారూపం ధరించవలసి వస్తుందని గుణాఢ్యుడు వివరించాడు. ప్రద్యుమ్నుడు గుణాఢ్యుడి వద్ద ఉన్న మంత్రజలం తీసికొని, కొండపైఉన్న దివ్యాంగనను సమీపించి నమస్కరించాడు. ఆమె దివ్యశక్తిని స్ఫురణకు తెచ్చాడు. ఆమె పాదాలపై మంత్రజలం పోసి, ప్రద్యుమ్నుడు శిలారూపం ధరించాడు. ప్రపంచం తిరిగి చైతన్యం పుంజుకుంది. ప్రకృతి సమస్తం పులకించింది. గుణాఢ్యుడు బంధించి వుంచిన కళాప్రపంచం స్వేచ్ఛగా సంచరించింది.

## చారిత్రకత

"శిలామురళి" ప్రశంసనీయమైన కథాసంవిధానంగల గేయకావ్యం. దీనినొక చారిత్రకగేయ కథా కావ్యంగా డా॥ మిరియాల రామకృష్ణగారు ఉదాహరించారు.[1] అయితే, యీ కావ్యంలోని పాత్రలు చారిత్రక వ్యక్తులు కారు. భక్తకవిఐన సూరదాసు పేరు కనుపించినా, కథాంశం సూరదాసు జీవితానికి సంబంధించినది కాదు.

చరిత్ర అంగీకరించని, కొన్ని అద్భుతమైన కల్పనలున్నాయి. కాపాలికుడైన గుణాఢ్యుని పూజావిధానం, సరస్వతీ దేవి ప్రత్యక్షం కావడం, వశీకరణ విద్యకు లొంగి, సాధారణ యువతిగా మారి జీవించడం మొదలైన అవాస్తవిక సంఘటనలు కథనానికి బిగువుచేకూర్చినా, చారిత్రకమైన విలువలకు భంగం కలిగించేవిగా ఉన్నాయి.అయితే, కొన్ని చారిత్రక పరిస్థితులు చిత్రింపబడినాయని చెప్పక తప్పదు. ముఖ్యంగా, బౌద్ధమత,. హిందూమత ధర్మాలను వివరించే ప్రయత్నం జరిగింది. ఆనాటి సామాజికుల ఆచారాలు, ఆలోచనలు, ప్రతిబింబించాయి. మత,

---

1. డా॥ మిరియాల రామకృష్ణ, మహతి

సాంఘిక చరిత్రను వివరించే సాంస్కృతిక విశేషాలు వివరింపబడినాయి. అందుచేత, శిలామురళి చారిత్రక నేపథ్యముగల గేయకథా కావ్యం. ఇదే అభిప్రాయాన్ని రచయిత శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మగారు అంగీకరించారు.[1]



# నా తెలుగు మాంచాల

## కవయిత్రి పరిచయం

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు 1917 డిసెంబరు 17 న పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులో జన్మించారు. సంఘ సంస్కర్త, మధుర కవి, గౌతమీ గ్రంథాలయం (రాజమండ్రి) వ్యవస్థాపకులైన శ్రీ నాళంకృష్ణారావు యీమె తండ్రిగారు. జాతిపిత సిద్ధాంతాలను పాటించడమే జీవిత ధ్యేయంగా పెట్టుకొన్న నాళం సుశీలమ్మగారు వీరి మాతృమూర్తి. తల్లిదండ్రుల ప్రభావం లక్ష్మీకాన్తమ్మగారిపై అపరిమితం. నాళం కృష్ణారావు గారు కందుకూరి వీరేశలింగం పంతులుగారి కుడిభుజంలా వ్యవహరిస్తూ, గాంధీ సిద్ధాంతాలచే ప్రభావితులై, మానవసేవే

1. ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మగారితో నా ఇంటర్వ్యూ – ఆగష్టు 25,1985

మాదసి సేవగా భావిస్తూ జాతీయోద్యమ రంగంలో శక్తి వంచనలేకుండా శ్రమించిన మానవతావాది. నేటిబాలలే రేపటి పౌరులని విశ్వసించి, నిత్య వదేశ ప్రధానమైన బాలసాహిత్యాన్ని సృష్టించిన మధురకవి,మార్గదర్శక కవి నాళం సుశీలమ్మగారు ఎప్పుడూ చరఖా త్రిప్పుతూ తమకుటుంబా నికి చీరలకు, ధోవతులకు కావలసిన నూలు వడికి స్వయంగా సిద్ధం చేసే వారు. గాంధీగారికి సంవత్సరానికి 2 ధోవతులను పంపేవారు. మహాత్ముని సమక్షంలో విదేశీ వస్త్రాలను తగులబెట్టి సత్యాగ్రహంలో పాల్గొనిన ఆదర్శ మహిళ. ఆ రోజు గాంధీ వీరి యింటిలో నారింజ రసం స్వీకరించారు.

ఏడు సంవత్సరాల వయస్సు నుండి లక్ష్మీకాన్తమ్మగారు శ్రీమాన్ తిరువేంగళాచార్యులుగారివద్ద సంగీతాధ్యయనం ప్రారంభించి గాత్రసంగీ తంలోనేగాక, వీణవాయించడంలోను ప్రావీణ్యాన్ని సంపాదించారు. రాజ మండ్రిలోని ఆంధ్రయువతి సంస్కృత కళాశాలలో సంస్కృతాంధ్రాలను అభ్యసించి, 1934 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి, "ఉభయ భాషా ప్రవీణ"లో ప్రథమ స్థానం సంపాదించారు. హిందీ రాష్ట్ర భాషలో ఉత్తీర్ణు లయిన లక్ష్మీకాన్తమ్మగారు సాధారణ విద్యతోబాటు యోగాస నాలు, వీణ, ఈత, కత్తి త్రిప్పడము, కర్రసాము, గుర్రపుస్వారి మొద లైన విద్యలే కాకుండా, కబాడి, బాల్ బ్యాడ్మింటన్, క్యారమ్స్, టెన్నిస్, పరుగు పందాలు మొదలైన విద్యలలో, క్రీడలలో మంచి ప్రావీణ్యాన్ని సాధించారు. రాత్రి సమయాలలో చారిత్రక నవలలు చదవడం వీరికి చాలా ఇష్టం. విద్యార్థినిగా ఉన్నపుడు వీణ, వక్తృత్వములలో ఐదు బం గారు పతకాలను పొందారు.

1950 లో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, ఆచార్య దివా కర్ల వెంకటావధాని గార్లతో కలసి, ఆంధ్రేతర నగరాల్లో పర్యటించి భార తీయ సంస్కృతిపై ఎన్నో ఉపన్యాసాలు చేశారు. 1972 లో సమగ్ర భారత దేశ రజతోత్సవాలను పురస్కరించుకొని, ఎంపిక చేయబడిన సాం స్కృతిక ప్రతినిధి బృందంలో సభ్యురాలుగా తూర్పు జర్మనీ, జెకొస్లేవే

కియా, రష్యాలలో పర్యటించి భారతీయ సంస్కృతిని గూర్చి ముచ్చటించారు. కెనడా, అమెరికాలలో భారతీయ ధర్మాన్ని గూర్చి ప్రసంగించారు. ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా మలేషియా రాజధాని కౌలాలంపూర్‌కు వెళ్లి, తమ వాణిని వినిపించారు.

సాహిత్య సాంఘిక రంగాలలో లక్ష్మీకాన్తమ్మగారు చేసిన కృషికి చిహ్నంగా వివిధ సంస్థలు ఆమెను- "ఆంధ్ర సంస్కృతి", "ధర్మప్రచార భారతి", "సాహితీ రుద్రమ", "తెలుగు మొలక", "విద్వత్కవయిత్రి" మొదలైన బిరుదులతో సత్కరించాయి. 1953 లో వీరి "ఆంధ్ర కవయిత్రులు"అనే సాహిత్య విమర్శ గ్రంథానికి తెలుగు భాషా సమితివారి బహుమతి లభించింది. 1963 లోనే (మద్రాసు) గృహలక్ష్మి స్వర్ణ కంకణాన్ని పొందారు. 1963 లో వీరి "అఖిల భారత రచయిత్రులు" గ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి లభించింది.

లక్ష్మీకాన్తమ్మగారు సంస్కృతాంధ్ర భాషల్లో అనేక రచనలు చేసిన "ఆంధ్ర విదుషీకుమారి". ఆంధ్ర కవయిత్రులు; అఖిల భారత రచయిత్రులు; శ్రీ కన్యకా పరమేశ్వరీ సుప్రభాతమ్ (సంస్కృత గీతాలు), దేవీ నక్షత్రతారావళి (సంస్కృతము),జాతిపితా (సంస్కృతము); సదుక్తి మంజరి (హిందీనాటకములకు ఆంధ్రానువాదము); భారతదేశ చరిత్ర - కొన్ని గుణపాఠాలు (హుమయూన్, కబీరుల ఇంగ్లీషు వ్యాసాలకు ఆంధ్రానువాదము), కాంతి శిఖరాలు (భక్తిగీతాలు); మన సాహితి మధురభారతి (గేయ కావ్యం), కన్యకమ్మనివాళి, మహిళా విక్రమ సూక్తమ్, ఒక చిన్న దివ్వె (వచన కవిత), లజ్జాకిరీట ధారిణి (పద్యము), కథా మందారము (నేటి రచయిత్రుల కథా సంకలనము) కవితా సౌంగధమ్, (కవయిత్రుల కవితల సంకలనము) నా తెలుగు మాంచాల (చారిత్రక గేయ కావ్యం). వీరి ముద్రిత రచనలు, "సాహిత్య వ్యాస మంజరి", "చంద్రమతి" వీరిఅముద్రిత గ్రంథాలు. మొల్లరామాయణము. విష్ణుపారి

జాత యక్షగానాలను వీరు పరిష్కరించారు. బహుముఖ ప్రజ్ఞావంతురాలైన లక్ష్మీకాంతమ్మగారికి శ్రీ వత్సవాయి రామకృష్ణ కవి తమ మృత్యుంజయ విలాసము (పద్యకావ్యం), సి. ఆనందారామంగారు "దోశిక" అనే కథానికల సంపుటిని, శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు "గంగాదేవి"అనే చారిత్రక నవలను అంకితమిచ్చారు. 1977 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారికి "కళాప్రపూర్ణ" బిరుద ప్రదానం చేసి గౌరవ డాక్టరేట్‌తో సత్కరించారు. ఆంధ్ర సాహిత్యాన్ని, హైందవధర్మాన్ని వికసింప జేయడమే ధ్యేయంగా లక్ష్మీకాన్తమ్మగారు నేటికీ అవిశ్రాంతంగా శ్రమిస్తున్నారు.

## కథాంశం

ఈ చారిత్రక గేయ కావ్యాన్ని లక్ష్మీకాంతమ్మగారు "బాలచంద్రుని సంగ్రామ వాంఛ" తో ప్రారంభించారు. సంగ్రామానికి కారణమైన పూర్వరంగాన్ని —

"నలగామ విభునితో
మలిదేవ భూపతికి
వైరమధి కమ్మగుచు
పోరునకు కతమయ్యె"[1] అని అతి సంక్షిప్తంగా వివరించారు.

తనరాజు మలిదేవ భూపతికి యుద్ధ విజయం చేకూర్చాలని బ్రహ్మనాయడు సైన్యంతో కార్యమపూడికి తరలి వెళ్ళాడు. బ్రహ్మనాయుని తనయుడయిన బాలచంద్రుడు —

---

1. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, నా తెలుగు మాంచాల, పుట. 1

"కదనమ్ము సేసేదీ
కాంక్ష తీవ్రమగుచు
త్రిండింప, దీక్షగొని
తండ్రి పోయిన చాయ
తానేగ వలెనమచు"[2]

తల్లిదీవెన పొందడానికి ఐతాంబ మందిరానికి వెళ్ళాడు. తన తల్లి ఐతాంబకు నమస్కరించి తనను దీవించి యుద్ధరంగానికి పంపవలసిందిగా ప్రార్థిస్తాడు. ఐతాంబ తల్లడిల్లి "నీ స్నేహితులతో నగరు రక్షించుటే నీ తండ్రి అభిమత"మని వివరిస్తుంది. బాలచంద్రుడు తనతల్లి సుతవ్యామోహాన్ని గుర్తించి—

"వీర కాంతవు నీవు
వీర పత్నివి నీవు
వీర మాతృ పదముసు
కోరగా దలపవో"[2] అని ప్రశ్నిస్తాడు.

ఏమీ తోచని ఐతాంబ మదిలో మాంచాల మెదిలింది. ఆ అందాల చుక్కను చూచి బాలచంద్రుడు యుద్ధ విముఖుడౌతాడని అశించి—

"యుద్ధమ్మునకు వేగ
సిద్ధపడుటకు ముందు
నీవు, నీయర్థాంగి
నిర్మలాంతఃకరణ

1. ఊటుకూరి లక్ష్మీ కాన్తమ్మ, నా తెలుగు మాంచాల, పుట. 2
2. అందే. పుట. 11

ధర్మమున, నీకు శుభ
కర్మఫల సిద్ధ్యర్థ
మొసగు శుభాశిషముల
నొక వరింగ్గై కొనుట
త్యంత మావశ్యము
త్యంత శుభ దమ్మైను"[1]

అని ఆదేశించి, బాలచంద్రుడు మాంచాలపై మనసు వడేలా మాంచాల రూప గుణ సంపదను వివరిస్తుంది.

బాలచంద్రుడు తల్లి ఉపదేశాన్ని తలదాల్చి మాంచాల మందిరానికి వెళ్ళి మంద్ర గంభీరంగా మాంచాలను పేరు పెట్టి పిలిచాడు.

ఇన్నేళ్ళకు తన విభుడు ప్రియమార పిలిచాడని మాంచాల మహానందంతో చెలికత్తెలను వెంటబెట్టుకొని వచ్చి బాలచంద్రుని ఆహ్వానిస్తుంది. మాంచాల సౌందర్యాన్ని చూచి బాలచంద్రుడు మోహావేశం పొందాడు. మాంచాల తన మాటల్లో "యిది శ్యామాంగి యిల్లు కాద"ని బాలచంద్రుని వేశ్యాలోలత్వాన్ని వెక్కిరిస్తుంది. తనను తాను సంబాళించుకొని బాలచంద్రునకు కర్తవ్యాన్ని బోధిస్తుంది.

మాతృదేవి పిలుపు వినుము
పోయిరమ్ము వీర ధనుడ

అనుచు, మగని నుదుట రక్త తిలకం దిద్ది, హారతిచ్చి—

మంగళమ్ము
నీకు మాననీయ కీర్తి
కాంత తోడ మఱలిరమ్ము"[2] అని

---

1. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, నా తెలుగు మాంచాల, పుట. 20-21
2. అందే. పుట. 88-89

బాలచంద్రుని యుద్ధోన్ముఖుణ్ని చేసి కార్యమపూడి యుద్ధరంగానికి పంపిస్తుంది. తాను కూడా యుద్ధరంగానికి తరలివెళ్ళింది. తుదకు మరణించిన బాలచంద్రుని తలలు తొడపై పెట్టుకొని సహగమనం చేసింది.

## చారిత్రకత

పలనాటి వీరగాథ ఆంధ్రుల పౌరుష ప్రతాపాలకు ప్రతీకగా నిలిచిన మహత్తరగాథ. పల్నాటి యుద్ధం క్రీ. శ. 1178 - 1182 మధ్య జరిగిందని శ్రీ అక్కిరాజు ఉమాకాన్తం గారు నిర్ధారించారు. శ్రీనాథ కవి సార్వభౌముడు ఈ వీరగాథను ద్విపద కావ్యంగా రచించాడు. "శ్రీనాథునికి పిమ్మట వీర చరిత్రమును వీరభద్రుడు పద్యమయముగను, మల్లయ్య, బలరామిశెట్టి కొండయ్య యను నిరువురు ద్విపదగాను రచించిరి. కొండయ్యయు, మల్లయ్యయు తమ గ్రంథములలో శ్రీనాథునుదాహరించి యున్నారు. వీరు తమ గ్రంథముల చాలవరకు శ్రీనాథు ననుసరించియే చెప్పిరి. వీరొక్కచోట లేనివి కొన్ని కలిపి యున్నవి కొన్ని తీసివేసిరి.

## వీరచరిత్ర కథాసారం

కార్తవీర్యార్జున వంశీయుడైన అనుగు రాజు (పాప పరిహారార్థం తీర్థయాత్రలకు వెడలి ఆంధ్రదేశం వచ్చినప్పుడు) చందవోలు రాకుమార్తె మైలమను వివాహమాడి పల్నాటిసీమను అరణంగా పొందాడు. గురజాలను రాజధానిగా చేసికొని ప్రజలను కంటికి రెప్పలా కాపాడేవాడు. అనుగు రాజుకు వీర విద్యాదేవి వలన పెదమలి దేవుడు-పినమలి దేవుడు

1. అక్కిరాజు ఉమాకాన్తుడు, పల్నాటి వీరచరిత్రము, ప్రథమ భూమిక పుట. 76

బాలమలి దేవుడు అనే ముగ్గురు కుమారులు; భూరమాదేవి వలన కామ రాజు, నరసింగరాజు, పుట్టిరాజు, పెరుమాళ్ళు రాజు అనేవారు, మూడవ భార్య మైలమాదేవి వలన నలగాముడనే కుమారుడు జన్మించారు.

ఒకసారి అనుగురాజు వేటాడి అలసిపోయి పరివారంతో గురజాల వస్తుండగా, జిట్టిగామాలపాడు వాస్తవ్యురాలు నాగమ్మ చక్కని ఆతిథ్యాన్నిచ్చి, ఏడు గడియల కాలం పల్నాటి ప్రభువు వద్ద మంత్రిణిగా ఉండే అధికార పత్రాన్ని పొందింది. గురజాల వచ్చిపోయే నాగమ్మను రాజ బంధువులు, రాజోద్యోగులు మిక్కిలి గౌరవించేవారు. ఆమె జాణతనం నచ్చని బ్రహ్మనాయుడు మాత్రం ఉదాసీనంగా వ్యవహరించేవాడు. నాగమ్మ ద్వేషంతో బ్రహ్మన్నపై పగసాధించడానికి నిర్ణయించుకున్నది. అమగురాజు మరణానంతరం మహామంత్రి బ్రహ్మనాయుడు రాజుగారి అంతిమ నిర్ణయాన్ననుసరించి నలగాముని పలనాటి ప్రభువును చేశాడు. అవకాశం కోసం ఎదురుచూస్తున్న నాగమ్మ నలగామునకు తాను అనుగు రాజు వలన పొందిన అధికార పత్రాన్ని చూపించి మంత్రి పదవి స్వీకరించింది, బ్రహ్మనాయని బంధువుల యిళ్లలోని ధనమంతా భటులచే తెప్పించి, ఆ ధనరాశులను నలగామునకు చూపించి, బ్రహ్మన్నను స్వామి ద్రోహిగా చిత్రించింది. పట్ట మహిషి వీర విద్యాదేవి కుమారుడైన పెదమలి దేవునకు పట్టం కట్టాలని బ్రహ్మనాయుడు కుట్రపన్నాడని బోధించి రాజు మనసు విరిచింది. నాయకురాలి మాటలు నమ్మి నలగాముడు సవతి తల్లి కుమారులయిన పెదమలిదేవ, పినమలిదేవ, బాలమలి దేవాదులను చెరలో పెట్టించాడు. బ్రహ్మనాయుడు ఆగ్రహించి, తన కుడి భుజంలాంటి కన్నమదాసు తోడ్పాటుతో చెరసాలకు కన్నం వేయించి, మలిదేవాదులను విడిపించి వారి రక్షణ భారాన్ని వహించాడు. నలగాముడు బ్రహ్మన్నకు భయపడి మాచెర్ల ప్రాంతాన్ని మలిదేవాదులకు పంచియిచ్చాడు.

బ్రహ్మనాయుడు చంద్రవంక తీరాన మాచెర్లను రాజధానిగా రూపొందించి మాచెర్ల చెన్నకేశవ స్వామికి గొప్ప కోవెల కట్టించాడు. అన్ని

కులాలవారిని ఒకే వరుసలో కూర్చోబెట్టి "చావకూడు" తినిపించాడు. కల్యాణపురాన్ని పాలించే వీర సోముడికి శివపురి కోటను సాధించిపెట్టి, అతని కుమార్తె సిరాదేవితో మలిదేవునకు వివాహం జరిపించాడు. సిరాదేవి వెంట అరణంగా వచ్చిన గొల్లబంట్ల తోడ్పాటుతో బలమైన సైన్యాన్ని తయారు చేశాడు. ఇదంతా విన్న నాగమ్మకు రోషం, ద్వేషం రెట్టింపు అయినాయి.

మలిదేవుని పెండ్లికి నలగాముడు రానందుకు విచారించిన బ్రహ్మ నాయడు, దాయాదులకు పొత్తు కుదర్చాలని గురజాల వెళ్లాడు. కోడిపందె ములంటే ప్రాణం పెట్టే బ్రహ్మన్న ఓడిది ఎదురుగా నాగమ్మ రెండు కోడి పుంజులను పోరాడించి, వానిలో ఓడిపోయిన పుంజును బ్రహ్మన్న పుంజని గెలిచేస్తుంది. బ్రహ్మన్న చెన్నకేశవుని ప్రార్థించగా, ఓడిన పుంజు తిరిగి గరిడిలోకివచ్చి రెండవ కోడిని చంపుతుంది. నాయకురాలు నాగమ్మ పం దెములేని పోరు గొప్పకాదని ఆక్షేపించి, రాజ్యమే పందెంగా పెట్టి ఓడిన వారు ఏడు సంవత్సరాలు అరణ్యవాసం చేయాలనీ, గడువు పూర్తయిన తరువాత తిరిగి రాజ్యాన్ని స్వీకరింప వచ్చుననీ ప్రకటించి కయ్యానికి కాలు దువ్వింది. బ్రహ్మనాయడు పందెం అంగీకరించి. మాచర్లలో మలిదే వుని అనుమతి పొంది, పానుగల్లు నుండి చిట్టిమల్లడని ప్రసిద్ధి చెందిన కోడిపుంజును తెప్పించి, బంధుమిత్రులతో గురజాల తరలి వెళ్లాడు. బ్రహ్మ నాయని పక్షాన గోవన్న చిట్టి మల్లుని (కోడిపుంజు), నాయకురాలి తర పున చింతపల్లి రెడ్డి నల్లమల్లుణ్ని (కోడిపుంజు) బరిలోనికి విడిచారు. తొలి పందెంలో బ్రహ్మనాయని పుంజు గెలిచింది. నాయకురాలు తన ఓటమిని ఒప్పుకోకుండా, మరుసటిరోజు మలిపందెం పెట్టి, క్షుద్రమంత్రాలను ప్రయో గించే కట్టుబోతులతో (చేతబడిచేసేవారు) బ్రహ్మనాయని పుంజుపై మం త్రాక్షతల్ని చల్లించి, బ్రహ్మనాయని పుంజును చంపించింది. నిబంధన ప్రకారం బ్రహ్మన్న మలి దేవాదులతో మండాదికి వలసపోయాడు. అక్కడ వారు క్షేమంగా ఉండటంచూచి, ఓర్వలేని నాగమ్మ చెంచుమూ

కలతో మలిదేవాదుల ఆలమందల్ని పొడిపించింది. ఉగ్రుడయిన బ్రహ్మ న్న నలగాముని చంపాలని గురజాల వెళ్ళగా, నాగమ్మ యుక్తిగా బ్రాహ్మణులను పంపి బ్రహ్మన్నను శాంతింపజేసింది. బ్రహ్మనాయడు మరలివచ్చి తమ నివాసాన్ని మండాదినుండి మేడపికి మార్చాడు.

ఎన్నో కష్టాలు సహించి, గడువుకాలాన్ని పూర్తిచేసి, తిరిగి తమ రాజ్యాన్ని అప్పగించాలని కోరుతూ, నలగాముని అల్లుడయిన అలరాజుని రాయబారిగా గురజాల పంపారు. నాయకురాలి దుర్బోధ తలకెక్కిన నలగాముడు రాజ్యం యివ్వడానికి నిరాకరించగా, అలరాజు కలహకారణు రాలయిన నాయకురాలిని నిందిస్తాడు. ఆగ్రహించిన నాగమ్మ అలరాజుపై విషప్రయోగం జరిపించింది, మరణించిన అలరాజుతో అతని భార్య పేరిం దేవి (నలగాముని కుమార్తె) సహగమనం చేసింది. అలరాజు మరణం బ్రహ్మన్న మలిదేవాదులలో యుద్ధాన్ని ప్రేరేపించింది. బ్రహ్మనాయని కుమారుడు బాలచంద్రుడు రాజీ ప్రయత్నం భగ్నం చేయడం వలన యుద్ధం అనివార్యమైంది. కార్యమపూడి కదనరంగాన ఘోర సంగ్రా మం జరిగింది. బాలచంద్రుడు తన స్నేహితులతో వీరమరణాన్ని పొంది, ఆదర్శ వీరపురుషునిగా చరిత్ర ప్రసిద్ధి చెందాడు. ఎందరో వీరుల మరణానంతరం బ్రహ్మనాయనికే విజయం లభించింది. యుద్ధం ముగి సిన తరువాత మిగిలినవారు, బ్రహ్మనాయడు, ఆప్తుల మరణానికి క్రుంగి పోయి హఠయోగం పట్టి ప్రాణాలు విడిచారు. నలగాముడు కొదమగుండ్ల పారిపోగా, అచటి విప్రులు నలగాముని క్షమించవలసిందిగా బ్రహ్మనా యని ప్రార్థించారు. నిరుపమాన రాజభక్తుడయిన బ్రహ్మన్న రాజవంశం లో మిగిలిన నలగామరాజునే తిరిగి పల్నాటి ప్రభువును చేశాడు. స్త్రీలను చంపరాదనే నియమాన్ని పాటించి నాయకురాలిని చంపకుండా విడిచి పెట్టాడు.

ముదిగొండ వీరభద్రకవి వ్రాసిన వీరభాగవతం" లోయుద్ధానం తరం బ్రహ్మనాయడు మరణించిన వారనందరినీ బ్రతికించి గుత్తికొండ

బిలంలో ప్రవేశించాడనీ, బిలంలోపల పారే గంగాజలంలో వాళ్ళంతా స్నానంచేసి. దేవతా సంబంధమైన తమ నిజరూపాలను ధరించి, వారి వారి దివ్యస్థానాలను చేరుకున్నారనీ వర్ణించాడు. చనిపోగా మిగిలిన వీరులతో బ్రహ్మనాయుడు గుత్తికొండ బిలంలో బ్రవేశించాడనే పల్నాటి ప్రజల నమ్మకానికి వీర భద్రకవి కావ్య సౌందర్యాన్ని జోడించాడు.

## శ్రీనాథుని "పలనాటి వీర చరిత్రలో" మాంచాల

" సమరంబునకు నేగు శౌర్యవంతులకు
తల్లిదీవన బొంది తగ భార్య చేత
దీవన గాని పోవ తేజంబు సుమ్ము
నడచిరి పెద్దలీ నయ మార్గమునకు " [1] అని ఐతాంబహితవ

చెబుతుంది. "కులకాంతదీవన కొమట యేలాగు
నాగుర్తెరుంగదు నాటి మాంచాల"

యని బాలచంద్రుడు ప్రశ్నించగా, ఐతాంబ బాలునిరాక తెలియజేయ డానికి మాంచాల వద్దకు వెళుతుంది. మేడపైఉన్న మాంచాల దిగివచ్చి ఐతాంబకు నమస్కరించి మర్యాదచేసింది. "మీరు వచ్చిన పని మీకోడల మాంచాలకు తప్ప మరెవరికి తెలియదని" రేఖాంబ పలుకగా, మాంచా "తన వద్దకు రావడానికి మొగము చెల్లక భర్త తన అత్త ఐతాంబన పంపినాడని పలికి,

"బ్రహ్మగూర్చెను మమ్ము బాల్యంబునందు
సమరాన అతడు సమసిన వెనుక
వెంటనేగెదం అత్త విడువుమీ మాట
పంపుము పుత్రుని బవరంబు చేయ"

అని వివరిస్తుంది.

---

1. శ్రీనాథుడు, పలనాటి వీర చరిత్ర - పుట. 61

అని వివరిస్తుంది ఈ విధంగా సంభాషించడం తగదనిన ఐతాంబతో మాంచాల

> " ఇసుమంత నా సౌఖ్య మెరుగడు, నేడు
> తనయుడో అత్తరో దైవంబు కెరుక
> పాపపు మాటలు పలుకంగ వలదు
> వెలయ భుజించుట వేశ్య గేహమున
> విడియంబు చేయుట వెలయాలి యింట
> సౌఖ్యంబు పొందుట సానిధామమున
> నానోము ఫలమేమొ................ " [1]

అని వాపోతుంది. శకునశాస్త్ర కోవిదురాలయిన మాంచాల మాటలకు ఐతాంబ కలత చెందినా, మనస్సు దిటవు పరచుకొని, కోడలికి పుత్తడి కమ్మలు, చీరలు, రత్న కాంచనమయ ఆభరణాలు బహూకరించింది. మాంచాల ధీరవనిత. వీరరసాధి దేవత: క్షణ భంగురమయిన సుఖాన్ని ఆశించక, శాశ్వతమయిన కీర్తిని నీభర్త పొందేలా ప్రవర్తించ వలసిందని తల్లి రేఖాంబ బోధించినపుడు నమ్రతతో తల్లికి నమస్కరించి తన భర్త వీరశేఖరుడనే కీర్తి పొందాలని కోరుకుంటుంది.

బాలచంద్రుడు మాంచాల చీర చెంగును లాగినపుడు ముత్యాల దండతెగి, ముత్యాలు చెల్లాచెదురైనపుడు మాంచాల చిన్నబోతుంది. బాలచంద్రుడు ముత్యాలను ఏరి ఒక వైపునుండి దండగా కూర్చుటకు ప్రయత్నించినపుడు, వేరొక వైపునుండి ముత్యాలను దూసి వేస్తూ ఏడుజాముల కాలాన్ని వ్యయపరుస్తుంది.

> " కడువడి కలనికి గదలుడి మీరు
> కులవైరముందీర్చు గురుసాహసుండు
> పరికించి చూడ నెవ్వరు మీరు దక్క " [2]

అని ప్రోత్సహిస్తుంది.

---

1. శ్రీనాధుడు-పలనాటి వీరచరిత్ర పుట-61.
2. -- అందే -- పుట-77.

" రతిరాజు సుందరా రణరంగధీర
కమల బాంధవ తేజ కరుణాలవాల
వినతాత్మజుని లావు నెనసీకు గలుగు
సామీరి కుండిన సాహసం బుబ్బు
కృష్ణుని కీడుగా కీర్తి ఘటిల్లు
కవికాంతి యుతుడవై రంజిల్లు చుండు
అలరాజు పగ తీర్చు మనుజుల తోడ
పటుతర విక్రమ వైభవంబలర
శ్రీగిరి లింగంబు చెన్నకేశవుడు
వరము లొసంగగ వర్తిల్లగలరు
శాత్రవ విజయంబు సమకూరు మీకు
ఈ యాయుధంబు వడినిచ్చుచు జయము
కలియుగంబున మీకు ఘనపూజలమరు "[1]

అని ప్రాణనాథుని ఆశీర్వదిస్తుంది.

ధర్మశాస్త్రాలు తెలిసింది గనుక—

" జయమపజయము నీశ్వరునకు దెలియు
విప్రుడా అన పోతు వెంటరాదలచు
బ్రహ్మహత్యఘటిల్లు పాపము వచ్చు
బహుజన్మలకైన పాయదాకీడు "

అని హెచ్చరిస్తుంది.

శ్రీనాథుని పలనాటి వీర చరిత్రలో మాంచాల ధీరవనిత, సమయ స్ఫూర్తి గలది, తాత్కాలిక సుఖాన్ని అపేక్షించక శాశ్వతమగు కీర్తిని భర్త పొందవలెనని కోరుకొనిన వీరనారి. ధర్మశాస్త్ర, శకునశాస్త్రములను తెలిసిన పతివ్రత.

1. శ్రీనాథుడు-పలనాటి వీర చరిత్ర-పుట-78-79

శ్రీనాథుని తరువాత పలనాటి వీర గాథను "వీర భాగవతము" అనే పేరుతో, రసవత్తరంగా రచించినవారు శ్రీ ముదిగొండ వీర భద్ర కవి. వీర భాగవతం పంచమాశ్వాసంలో మాంచాల ప్రసక్తి వస్తుంది. బాలుని రాకను తెలియచేయడానికి ఐతాంబ మాంచాల వద్దకు వెళుతుంది. ఐతాంబ తన స్వప్నాన్ని రేఖాంబకు (మాంచాల తల్లి) చెప్పినపుడు, రేఖాంబ –

> " కలయర్థము ముంగల గా
> గల యర్థము మీకు దెలుపగలమది మీకో
> డలె గాక యితర కాంతల
> కల పడదది శకున శాస్త్రగాథ లెఱుంగున్ " [1]

అని మాంచాల శకున శాస్త్ర ప్రావీణ్యాన్ని ప్రశంసిస్తుంది. ఐతాంబ దుస్స్వప్నాన్ని వివరిస్తూ మాంచాల బాలుడు తన స్నేహితులతో యుద్ధ రంగంలో నిహతుడవుతాడని, తన మామ బ్రహ్మనాయుడు మాత్రమే మిగులుతాడనీ విశదీకరిస్తుంది. తన భర్త శ్యామాంగితో కాలం గడపడాన్ని విమర్శిస్తుంది. అయినా, ఐతాంబ "ఏవిధమైన వాని పొరలెంచక" యుద్ధ విముఖుణ్ని చేయవలసిందిగా ఆదేశించినపుడు అంగీకరిస్తుంది. ఎంతో కాలానికి భర్త తన వద్దకు వచ్చినప్పటి మాంచాల మనఃస్థితిని వీర భద్రకవి పరమరమ్యంగా చిత్రించారు.

> " బాలుడు వచ్చె వచ్చె మన పాలికి" నంచు ముదంబు తోడ మం
> చాలకు దెల్ప నాసరసిజానన సిగ్గు భయంబు భక్తి లో
> నాలము సేయగా బరవశాంచిత మానసయై సువర్ణ పాం
> చాలిక వోలె రత్నకలశంబున బావన తోయ మూనగన్ " [2]

---

1. ముదిగొండ వీర భద్రకవి – వీర భాగవతము – పంచమాశ్వాసము–ప. 327, పుట–186.
2. –– అందే –– 434, పుట–197.

భర్తను సమాదరంతో భవనాంతర్భాగానికి తీసుకు వెళుతుంది. తల్లి ఐతాంబ చేసిన హితబోధతో, మాంచాల చెలరేగే కోర్కెలకు ఆనకట్ట వేసింది. భర్తను దీవించి యుద్ధరంగానికి పంపి వీరపతిగా తన జన్మము చరితార్థం చేసుకుంది.

పల్నాటి సోదరకవులలో ప్రథముడై ప్రసిద్ధి చెందిన బ్రహ్మశ్రీ శతావధాని కప్పెగంటి ప్రభులింగాచార్యులు గారు "పలనాటి వీర చరిత్రము" అనే నాటకాన్ని చరిత్రాంశాలకు భంగం కలుగకుండా ఉత్తేజకరంగా రచించారు. పంచమాంకంలో స్వగతంగా అమకొలిన మాటలలో మాంచాల ధీరమన స్తత్వం తేటతెల్లమౌతుంది.

## మాంచాల

(తనలో) "రణజయోత్సాహిననీ పలుకుచు నీ రాత్రి నాతో రతి క్రీడలు సలుపుట కాసక్తితో మన్నటుల తెలియవచ్చుచున్నది. మాతల్లి యగు రేఖాంబ బాలుడు యుద్ధమునకు వెడలుచున్నాడు గమక, ఆయన బలమును భంగ మొనర్పగల రతిసౌఖ్యముల నోలలాడింపకు మనియు జెప్పె. తుచ్ఛ సౌఖ్యముల కన్న నాచంద్రార్క స్థాయిగా వెలుగు కీర్తి కారకమగు రణవిజయమే ప్రధానము గదా!"

రాక రాక వచ్చిన భర్తనుండి శరీర సౌఖ్యాన్ని ఆశించకుండా, నిద్రాణమై ఉన్న బాలచంద్రుని వీరత్వాన్ని మేల్కొలిపి యుద్ధ రంగానికి పంపిన మాంచాల విశిష్ట వ్యక్తిత్వానికి ముగ్ధుడై డా॥ కె. బసవలింగ దేవరగారు "మాంచాల" అనే నాటికను రచించారు. వైద్య వృత్తిలో ఉన్న వీరు గుంటూరు జిల్లా మాచర్ల తాలూకా లోని కంబాళమఠం గ్రామానికి చెందినవారు.

ఈ నాటికలో మాంచాల "ఇన్నేళ్ళకి రాక రాక వస్తున్న నా బావ రాక కలలాగ కరిగిపోయి అనుభూతులు మిగిలిపోతే ఎలా భరించ గల నమ్మా" అని వాపోయినపుడు, రేఖాంబ - "దైవ ప్రసాదితములయిన ధైర్య స్థైర్య శౌర్య పరాక్రమములు ఒక్కొ అడుదాని మూలంగా అడవి గాచిన వెన్నెలగా పరిణమించడం నీకు మాత్రం పరువా మాంచాల ?" [1] అని ప్రశ్నించడం పాఠకుల్ని కదిలిస్తుంది మాంచాల మనసులోని భావ సంఘర్షణను బసవలింగ దేవరగారు చక్కగా వివరించారు.

## మాంచాల (స్వగతం)

............బాలచంద్రుడు నీ వద్దకు వచ్చునని, అతనిని ప్రణయ కలాపములతో వశ్యుని గావించుకొని యుద్ధ విముఖుని గావింపుమని ఆదేశించింది అత్త ఐతాంబ.

జీవితము అశాశ్వతము, క్షణ భంగురము అని; కీర్తి ప్రతిష్టలే అజరామరములు గాన క్షణిక సుఖమున కాశింపక యుద్ధ సన్నద్ధుని గావించి, ఇహ పరముల యశస్సునార్జింపుమని హితోక్తి గరపినది నా తల్లి రేఖాంబ.

ఏది ప్రస్తుతం - ఏది అప్రస్తుతం తెలియలేని యీ ఆత్మసంఘర్షణ నన్ను దారి తెలియని వధికురాలిని చేస్తుంది,

భోగమా ? త్యాగమా ? ఏది ?

భోగము తాత్కాలికోపయోగము కలిగిస్తుంది. త్యాగము సర్వ మానవ కల్యాణ కారకమై భాసిల్లుతుంది. (నిశ్చయంతో) ఏది ఏమైనను

---

1. డా॥ కె. బసవలింగ దేవర - మాంచాల (నాటిక) పుట - 3.

సరియె! బాలచంద్రుని యుద్ధ విముఖునిగా చేయజాలను - చేయ లేను - చేయలేను." [1]

మగువ మాంచాల వీర వనితగ, మహోన్నతురాలయిన వీర సతిగా, దేశ భక్తురాలుగ చిత్రించబడిన యీ నాటికలోని సంభాషణలు ఎంతో ఉత్తేజకరంగా ఉన్నాయి.

ముదిగొండ వీరభద్ర కవి వీర భాగవతాన్ని అనుసరించి వెన్న పూసల రామకవి "పలనాటి బాలచంద్ర యుద్ధము" అనే ఐదు అంకాల నాటకం వ్రాశారు. తృతీయాంకంలో మాంచాల వృత్తాంతం వివరింప బడింది. యుద్ధరంగానికి వెళ్ళడానికి అనుజ్ఞ కోరిన బాలచంద్రునితో మాంచాల "తొలి యుద్ధం చేయగోరువారు వీర తాంబూలం స్వీకరించ వలసిందిగా బ్రహ్మనాయుడు ప్రకటించి, ఆ తాంబూలాన్ని తాను సృష్టించిన నాగేంద్రుని వద్ద ఉంచును గనుక తాను గరుడనోములు నోచితినని, గరుత్మంతుని స్మరించి తాంబూలమును గ్రహింపవచ్చు నని" [2] భర్తకు వివరిస్తుంది. తనవైపు కన్నెత్తి చూడని బాలచంద్రుని కోపమై మాంచాల గరుడనోములు నోచి యుండటం ఆమె పాతివ్రత్యా నికి ప్రబల నిదర్శనం.

మహావాది వెంకట రత్నము గారు "తెలుగు బాల బాలికల లేత మనసుల నుద్దీపింప జేయుటకయి "నాయకురాలు" అనే చారిత్రక నవలను రచించారు. మాంచాలను గురించి వీరు వ్రాసిన అభిప్రాయం హృదయానికి బలంగా హత్తుకు పోతుంది.

---

1. డా॥ కె. బసవలింగ దేవర, మాంఛాల (నాటిక) పుట. 5.
2. వెన్నపూసల రామకవి, పలనాటి బాలచంద్ర యుద్ధము, తృతీయాంకము, పుట. 37.

"మాంచాల వీరకుల ప్రసూత, వీర పత్ని. ఎంత కాలమునుండియో భర్తృ సమాగమును కాంక్షించుచున్నది అయిననేమి? స్వసుఖమును గణింపలేదు. వీర మాత కావలెనను కొనలేదు. మూర్తీభవించిన వీర రసాధి దేవతవలె మగని మొగమున వీరతిలకము దిద్దినది. మగని మేన వీరగంధమును పూసినది. కన్నుల కద్దుకొని మగనిచేతికి వీరఖడ్గము నం దిచ్చినది. నవ్వు మొగముతో మగని కనుజ్ఞ యొసంగినది"[1] ఎంతో సంక్షిప్తంగాను, సారవంతగానుఉన్న ఈ కొద్ది మాటలు మాంచాల చరి త్రను వెల్లడిస్తున్నాయి.

పల్నాటి కవులలో తన కంటూ ఒక ప్రత్యేకతను ఏర్పరచుకున్న శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు తమ "తరంగిణి" ఖండ కావ్యంలో "మాంచాల" అనే తరంగంలో, మాంచాల ఆత్మసంఘర్షణతో పెనుగులాడి తుదకు పవిత్రమైన భావంతో తీరం చేరిన తీరును అత్యున్నతంగా చిత్రించారు. బాలచంద్రుడు తన వద్దకు వస్తాడన్న వార్తవిన్న అనంత రం మాంచాల హృదయంలో జరిగిన భావసంఘర్షణాన్ని ఈ ఖండిక వివరిస్తుంది, మాంచాల తనలో

" ఎంత గట్టిదయిన నగ్గిచెంత వెన్న కరుగురీతి
ఎంత దిట్టయైన పురుషుడింత చెంత కరగి పోవు
సమయ మెఱిగి సతియె నిగ్రహము చూప వలయుగాన
కర్తవ్య మహాభారము కలదిప్పుడు నా మీదనె "

అని భావిస్తుంది.

" అంతరంగమున చిటిలెడి అగ్ని పర్వతమ్మునదిమి
ధైర్యమ్మును స్థైర్యమ్మును త్యాగమ్మును తేటపడగ
వీర కంకణమ్ము గట్టి విభుని యుద్ధ రంగమునకు
పంపించుటె నాకిప్పుడు పరమ ధర్మమగుగాదా? "

అని తనను తానే ప్రశ్నించుకుంటుంది.

---

1. మహావాది వేంకటరత్నం-నాయకురాలు-పుట-46
2. చిటిప్రోలు కృష్ణమూర్తి-తరంగిణి (మాంచాల), పుట-86.

వీర నారినై విక్రమించెదను
వీర సింహుడౌ బాలచంద్రునకు
వీర పత్నినై విభాసించెదను
వీర తిలకమును నొసట బెట్టెదను
వీర కంకణమును చేత గట్టెదను
వీర ఖడ్గమును అందియిచ్చెదను”
వీర మనోహరునితో మంటలోనబడి
మహిత కీర్తి గాంచెను మా పేరమ
మనోహరుని రణభూమి కంపి అస
మాన కీర్తి నిక నే గడించెదను ”[1]

అని భావిస్తుంది.

తన భర్త విజయుడై తిరిగి వస్తే ఈ లోకంలోను, వీర స్వర్గాన్ని అలంకరిస్తే పరలోకంలోను ప్రణయ విహారాలతో పారవశ్యంతో సోలిపో వాలని ఆశించింది” మాంచాల ధీరమన స్తత్వమే ప్రతి పద్యంలోను స్పష్టంగా ప్రతిబింబించింది,

పల్నాటి వీర గాథను సమగ్రంగా చిత్రిస్తూనే మాంచాల పాత్రను మహోదాత్తంగా చిత్రించినవారు శ్రీ ఏటుకూరి వెంకట నరసయ్య. ఆధు నికాంధ్ర కావ్యహారంలో వెంకట నరసయ్యగారు వ్రాసిన “మగువ మాం చాల” మణిపూసలా ప్రకాశించింది. వివాహం జరిగినప్పటికీ దాంపత్య సుఖాన్ని చవిచూడకుండగనే మాంచాల వీర రసాధి దేవతవలె తన భర్తను కదనరంగానికి పంపించిన వృత్తాంతాన్ని నరసయ్యగారు ఎంతో ఉత్తేజ కరంగా రచించారు. మాంచాల తాత్కాలిక సుఖాన్ని ఆశించినట్లయితే బాలచంద్రుడు పలనాటి అభిమన్యుడుగా ప్రసిద్ధి చెందేవాడే కాదు.

1. చిటిప్రోలు కృష్ణమూర్తి, తరంగిణి (మాంచాల) పుట-87-88.

ఏటుకూరి వారి "మగువ మాంచాల"లో మాంచాల శకున శాస్త్రజ్ఞులను విఫలీకరించగల విజ్ఞురాలు. అత్త ఐతాంబ చెప్పిన దుస్స్వప్నాన్ని విని కార్యమపూడి యుద్ధరంగంలో బాల చంద్రాదులు మరణిస్తారని వివరిస్తుంది. ఐతమ్మ తన కోడలిని దేవతగా భావిస్తుంది.

"అమ్మవుగా బంగారవు
బొమ్మవుగా కొడుకు ననికి బోనీకమ్మా!
సమ్మతిపడి నా కభయ
మిమ్మ"........ని ఐతాంబ మాంచాలను కోరుతుంది. [1]

మాంచాల బాలచంద్రుడు శ్యామాంగి అనే వేశ్యతో ఏడేండ్లనుండి పొత్తు కలిగి ఉన్న విషయాన్ని వివరించి, తుదకు

"భోగమనుభవించు పుణ్యాత్మురాలది
చావనోచుకొన్న చాన నేను
పంపుడమ్మ! బోధ వలచెద గాకున్న
బంతమాడి సహగమింతు" [2] నంటుంది.

శ్రీ ఏటుకూరి వెంకట నరసయ్యగారు పలు సందర్భాలలో "వీర భాగవతాన్ని అనుసరించారు. బాలచంద్రుడు మాంచాల మందిరానికి వచ్చినపుడు, మాంచాల చేసిన మర్యాదలు, అలంకరించుకున్న తీరు, భర్తను ఉద్యానవనానికి తీసుకువెళ్ళడం యివన్నీ వీర భాగవతం లోని విషయాలే.

రేఖాంబ తన కూతురు మాంచాలకు చేసిన హితబోధను ఏటుకూరి వారు ఎంతో గంభీరంగా రచించారు.

---

1. ఏటుకూరి వెంకట నరసయ్య, మగువ మాంచాల, (పుట-33) తృతీయ ఖండము, పద్యము 33.
2. అందే, పుట-35, తృతీయ ఖండము, పద్యము 41.

రేఖాంబ మాంచాలతో —

"నీ పతి మూపునం గలవునేటి జయా జయముల్, క్షణమ్ములో
రూప సౌఖ్యమే ? ప్రతిరోధి సముత్కర కంఠ లుంఠన
వ్యాపృత కీర్తి దక్క దనయా ? యిరువాగులు దీటుకాల మా
దాపుర మయ్యెనిప్పుడు వృథా వ్రతభంగ మొనర్పబోకుమీ ?

క్షణిక సుఖమ్ము రోసితివ సర్వజనుల్ భవదీయ సత్ప్రవ
ర్తన వినుతింతురయ్యెదె కథల్ కథలై దిశలన్ గ్రమించునీ
ప్రణయ కథల్ గ్రహించి కవిబ్రహ్మలు వీర రస స్వభావ మో
హనముగ దిద్ది తీరి చెదరమ్మ ! మనోహర కావ్య శయ్యలన్

బాలుని యుద్ధ యాత్రకిది ప్రాణ,మతండు విరోధి సైన్యముల్
గూలుచు నాంధ్ర తేజమునకున్ బ్రతిలేని ప్రతిష్ట గూర్చునీ
నేల నికింత వీరుడు జనింప డటన్న ప్రశస్తి కెక్కునీ
శీలము చిన్నవాడు పితచే బడయున్ సుగతుల్ రణస్థలిన్" 1

అని వివరించి, బాలచంద్రుని సమీపించరాదని హెచ్చరిస్తుంది. బాలుని నివారించడానికి వ్రత సమాప్తి అయేటంత వరకు ముట్టరాదని ఒట్టు పెట్ట వలసిందిగా ఉపాయం చెబుతోంది. ఈ ఘట్టంలో రేఖాంబ వీర ధర్మాను చారిణియైన భారతీయ మహిళగా సాక్షాత్కరిస్తుంది. కావ్యంలో అత్య ద్భుతమైన సన్నివేశ మిది.

కౌగిలించబోవు భర్తను దూరం చేస్తూ తెగిపడిన ముత్యాలదండను చూపించి, ప్రాణతుల్య మయిన హారమును గూర్చునంత వరకు తాక వద్దని ఒట్టు పెట్టింది. ముత్యాలను ఏరడం, అందించడం, కూర్చడం, వేరొకవైపు నుండి దూసి పోయడంతోనే కాలం గడిచింది. తెల్లవారడానికి సూచనగా కోడి కూసింది. మాంచాల ప్రణయ పరుషోక్తులు ప్రారంభిం చింది. ఏటుకూరి వారి కలం కదను త్రొక్కింది. మాంచాల బాలచంద్రుణ్ణి

1. ఏటుకూరి వెంకట నరసయ్య, మగువ మాంచాల, సప్తమ ఖండము, ప. 8,9,10. పుట. 74.

ఎగతాళి చేస్తూ, పౌరుషాగ్ని జ్వలింపజేస్తూ—

"............

... .........

అయితమ్మ కొడుకన కాంధ్రవీరునకు

భండనమ్మన గుండె బెండైన దేమి ?"[1]

"నాగమ్మ పేరన్న నాళ్ళూ డెనేమి?

నరసింగ రాజన్న వెఱపుట్టె నేమి ?

తగర గుఱ్ఱము కాలదవిలి రాదేమి?

సామంత రాగోల సరి చెడ్డదేమి?

చెన్ని ని దయతప్పి చన్నదా? యేమి?

పలనాటి దుర్గతి తొలగదా? యేమి?

మూరు బోస్యమ్మంత మన్నా యెనేమి?

పరగండ భైరవుల్ పద్మనాయకుడు

దెబ్బకి వేగురు సిబ్బంది బొరలు

గుడికట్టి మొనగాని గూడిరారేమి ?"

అని ప్రశ్నిస్తుంది.

"చచ్చిన పలనాడు పుచ్చులబీడు

బ్రదికిన పలనాడు రతనాల వీడు

మారొక్కన దుముదారు మన్నీల సెల్ల

పచ్చల పిడిబాకు బలిదీయవలయు

ఊక్కదట్టి ప్రక్క లుడు కెక్కవలయు

బంగారు బావుటా పడగెత్తవలయు"

నని ప్రోత్సహిస్తుంది.

1. ఏటుకూరి వేంకటనరసయ్య—మగువ మాంచాలి సప్తమ ఖండము.

జరిగేది జరుగక మానదని వివరిస్తూ—

"ఉన్నది పోదు లేకున్నది రాదు
వీరాధివీరులు నీలుగా లేదే?
మధుర జీవను లెంతమంది పోలేదు?
మనమెల్లరము నిల్తుమనుమాట నిజమె?
క్షణములో ముగించు మా వేరి కెఱుక
కర్మభూమి దాన కాన మియ్యదియె
కర్మ భాజను డొండె గడిదేఱగలడు"

కర్మ సిద్ధాంతాన్ని వల్లిస్తుంది బాలచంద్రుణ్ణి విమర్శిస్తూ—

వింటిని నేటికి వీరదేవులకు
వాలుకపై బొంకు నాళ్ళలో జంకు
చాటు చాటువ రంకు సమరావగొంకు"

అని ఎకసెక్కమాడుతుంది. చివరగా—

"శీలమ వారి వంశమున 'ఛీ' యిటువంటి నికృష్టుడైన జా
చూలి జనించెనే వెనుక చూపున వెన్నుచూపు జన్మజ
న్మాల కెఱుంగ రట్టి పలనాటి మహాత్ముల రక్త ధారలో
గాలిక ముప్పతిల్లినది గట్టిది నామెడతాళి యింతకున్"

అంతటి పరుషోక్తుల్ని ఏవీరుడైనా సహించగలడా?

"చివరి మాట విన్న శీలమ సింహంబు
దుమికె బయటి కొక్క దూకదే మొ
నప్పుకొన్నదపుడు నాజన్మ ఫలమే మొ
వీర పత్నినను చు ధీరురాలు" [2]

మాతృదేశ సముద్ధరణకై, స్వసుఖాన్ని త్యాగంచేసి, భర్తను ప్రోత్స హించి, పౌరుషాన్ని రగిలించి యుద్ధరంగానికి పంపిన మాంచాల వీర పత్ని, ధీరురాలు, విజ్ఞురాలు అనడంలో అతిశయోక్తి లేదు.

---

1. ఏటుకూరి వెంకట నరసయ్య-మగువ మాంచాల సప్తమ ఖండము, పుట. 81-83
2. "అందే" పద్యము 38-39 పుట. 83

కవయిత్రి చోడవరపు సత్యవతీ దేవిగారు "పల్నాటి మాంచాల" [1] అనే చక్కని పద్య కావ్యాన్ని రచించారు. "నామాట" అనే శీర్షిక క్రింద సత్యవతీదేవి గారు పల్నాటి మాంచాలను గూర్చి యిలా వివరించారు. "నేను శ్రీనాధుని పల్నాటి వీర చరిత్రను, శ్రీ ఏటుకూరి వెంకట నరసయ్యగారి "మగువ మాంచాల" ను చదివి, వీలయినంత వరకు వారి అడుగుజాడల్లో నడిచి నా పల్నాటి మాంచాలను దిద్ది తీర్చాను. శ్రీనాధుడూ, నరసయ్యగారూ; మాంచాలాను పతి పరిత్యక్తగా, వీరనారిగా చెప్పి మూరుకున్నారు. "స్త్రీగా ఆమె బాధా, భావనా" సూటిగా వివరించలేదేమో ననిపించింది. ఆ పాత్రకు పూర్తి న్యాయం చేకూర్చాలనేదే నా తపన" [1] ఆచార్య తూమాటి దొణప్ప గారు యీ కావ్యానికి వ్రాసిన "ప్రశస్తి వచనం"లో మాంచాలను గూర్చి యిలా వివరించారు. "కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్య ప్రభృత మహాకవులెందరో పలనాటి వీర భారత గాధలను సశ్లోకించి తెలుగు నాట కొత్త వెలుగులు నింపిన మహానుభావులు. మగువారి దృష్టిలో మలచబడ్డ "మాంచాల" మన కిది వరకే తెలిసిన మహనీయ వ్యక్తి. మగువల చూపుతో రూపెత్తిన మాంచాల మనకు సరిక్రొత్త. ఈమే గండువారి ఒక్కగా నొక్క ఆడపడుచు; శీలం వారి కోడలు.... తాళి గట్టి పెద్ద మనిషి ప్రేమకు నోచుకోని రసగుళిక. కాలిపోయి కాంతి నిచ్చెడు దీపకళిక. ఈ సుచరిత్ర పవిత్ర చరిత్రను, "పల్నాటి మాంచాలి" పేర చమత్కార చారువుగా తేర్చిన శ్రీమతి చోడవరపు సత్యవతీదేవి గారు, అపర భారతీ రూపంగా విలసిల్లిన కళానిపుణ........

1. శ్రీమతి చోడవరపు సత్యవతీదేవి, పల్నాటి మాంచాల, పుట-1 15.

పల్నాటి మాంచాల అభిమానవతి. అతిలోక సౌందర్యవతి. కర్తవ్యాన్ని ఎరుక పరచి, కరవాలం నితికందిచ్చి, కొదమసింగమైన పతిని కదన రంగానికి కదమ తొక్కించిన అభినవ పాంచాల ఈ మాంచాల. పతితో పాటు కత్తి పట్టి, కారెంపూడిపోరులో వీరనారిగా స్త్రీజాతి విలువలను నిలిపిన అపర సత్యభామ బాలుని భామ" [1]

కవయిత్రి మాంచాల పాత్రను సరికొత్త వెలుగులతో పోషించిన మాట వాస్తవం. బాలచంద్రునితో తనకు వివాహం నిర్ణయింప బడినదని తెలిసిన మాంచాల,

" సాగునటమ్మ నా బ్రతుకు చక్కగ? బాలుడు సావి దానిపై
రాగము నిండి యుండ ననురాగము నాపయి గల్గు టెట్లొకో?
సాగుచునుండె నీ కరణి, చక్కని వాడగుగాక, జీవితం
బాగడమయ్యె, వానికడ నాలినిగా సుఖమంద సాధ్యమే?" [2]

అని తల్లిని ప్రశ్నించడం నూతన విషయమేగాక; కవయిత్రి లౌకిక పరిజ్ఞానానికీ, గడుసరి తనానికీ తార్కాణం. తల్లిదండ్రులు నచ్చచెప్పిన తరువాత,

" కాదనలేను పెద్దలను, కాదనరానిది బాంధవంబు నా
మోదము తెల్పగా మధుర మోహనరూపుడు మేనబావ, ఈ
వాదము లేల? శాస్త్ర విధి వానికి నా పయినుండె హక్కు, నే
కాదను కున్న కాలమది కాగలకార్యము తీర్చి దిద్దెడిన్" [3]

అని సరిపెట్టుకొనుటలోనూ ఆచార వ్యవహారముల పట్ల మాంచాల ఆలోచనా సరళి వ్యక్తమౌతుంది. బాలచంద్రుడు సాని సబ్బాయితో కులుకుతున్నా

---

1. చోడవరపు సత్యవతీదేవి, పల్నాటి మాంచాల, (పీఠికలు) పుట-8-9
2. -అందే- పుట-5
3. -అందే- పుట-7

డనే విషయాన్ని తెలిసికూడా, బాంధవ్యాన్ని, బావపై గల ప్రేమనూ చంపుకోలేక మాంచాల వివాహానికి సిద్ధపడింది. భర్తను సన్మార్గంలో పెట్టగలనని విశ్వసించిన ధీరవనిత. ఆమె ఆశలు అడియాశలైనాయి. ఆమె కలలు కల్లలైనాయి. ఆమె యవ్వనం అడనిగాచిన వెన్నెలయింది. "వేడి వెన్నెల" అనే శీర్షికతో మాంచాల మనోభావాలను విశ్లేషించిన తీరు ప్రశంసనీయం. బాలచంద్రుడు యుద్ధానికి వెళ్లడానికి తన అనుమతికోసం వచ్చి వ్యామోహితుడై ప్రవర్తించినా; గుండె నిబ్బరంతో రక్తతిలకం దిద్ది వీర ఖడ్గమిచ్చి కదన రంగానికి కదిలించిన వీర వనిత మన పల్నాటి మాంచాల. ఈ కావ్యంలో మాంచాల తన స్నేహితురాం(డ్ర)తో కలిసి యుద్ధరంగంలో ప్రవేశించి, నాయకురాలిని ఎదిరించినట్లు తెలుప బడింది. ఇది మరొక నూతన విషయం. "స్త్రీజాతి విలువలను నిలుపవచ్చిన వీరనారి" అని నాగమ్మ మాంచాలను మెచ్చుకుంటుంది. తుదకు నరసింగుని బావమరది బాలచంద్రునిపై విసిరిన కత్తి ధీరమాంచాల వెన్నులో దిగబడింది. క్షతగాత్రుడై బాలచంద్రుడు నేలకూలడాన్ని గమనించిన మాంచాల నాథునిపైబడి ప్రాణాలు విడిచింది. సత్యవతీ దేవిగారు సరిక్రొత్త మెరుగులు దిద్ది మాంచాలను చైతన్య స్వరూపిణిగా చిత్రించారు.

కళాప్రపూర్ణ, దర్శనాచార్య డా॥ కొండూరు వీర రాఘవాచార్యులు గారు మాంచాల పాత్రను కవయిత్రి పోషించిన తీరును మిక్కిలి ప్రశంసించారు.

స్త్రీజాతికినివన్నె తెచ్చెడి సతిగ
మాంచాల నాదర్శ మహిళగ తీర్చి
" వీర నారిని గాక విజ్ఞురాలినిగ
కామాంధుడగు నిజకాంతుని కాత్మ
కర్తవ్యమును దెల్పు గరితను గాక
అరివీరులను చెండి ఆజిలోపలను
ప్రాణముల్ గోల్పోవు భర్త కౌగిటనె

కన్ను మూసిన దివ్య కాంతను గాగ
వెలయించి నీకృతివెలయించినావు
దివ్య సందేశ మందింపగ ప్రజకు
క్రొత్త పుంతల నెన్నొ త్రొక్కితివమ్మ" [1] అని అన్నారు.

విద్వాన్ పింజల సోమశేఖరరావుగారు, "మాంచాల" అనే పద్య కావ్యంలో మాంచాల వ్యక్తిత్వాన్ని మనోజ్ఞంగా వెల్లడించారు. తమ మందిరానికి వచ్చిన బాలునకు సకలమర్యాదలు చేసింది. పశ్చాత్తాపంతో బాలచంద్రుడు మాంచాలతో, "నా హృదయేశ్వరీ! సయిపు నాయపరాధము పిన్ననాట నుద్వాహము నాడియుంబడుపు భామల నెయ్యపు దియ్యమందుమర్మోహము నొంది నిన్ భువన మోహన రూపిణి ద్రోసిపుచ్చితిన్ ద్రోహము సేసితిం బ్రథమ దోషము నీవిది త్రోసిపుచ్చుమా" [2] అని ప్రాధేయ పడతాడు. కాముకుడై ప్రవర్తించు బాలచంద్రునకు వీర మాంచాల కనువిప్పు కలిగించి వీర రసోద్దీప్తుని చేస్తుంది.

" పోయి రమ్మోనాధ! పోయి రావోయి
పోయి తేవోయి నీభుజలక్ష్మి భాగ్యాలు
తెలుగు జాతికి క్రొత్త వెలుగు తేగదవోయి
వెలుగులో మన పెల్లు వెన్నెల వెలుగుగా
వీర పూజలనాడు వీరాంధ్రభూమిలో
నారి మణుల్ నీకు నీరాజనాలీయ
పలనాటి మాంచాల పలనాటి బాలుండు
పలనాటి చరితలో నిలిచి పోవలెనోయి

---

1. చోడవరపు సత్యవతీదేవి, పల్నాటి మాంచాల, (పీఠిక) పుట-10
2. పింజల సోమశేఖరరావు, మాంచాల, పుట-14.

"అనుచు బాలుని నుదుటిపై తనదు కేలి
రక్తకుంకుమ తిలకంబు రహిని దీర్చి
కత్తి యొకటిచ్చి పుత్తెంచె కదనమునకు
త్యాగశీల మాంచాల మా ఆంధ్రబాల"[1]

పింజల సోమశేఖరావుగారు కూడా మాంచాల సహగమనము చేసిన వృత్తాంతాన్ని వర్ణించారు.

"చందురుని తోడ చంద్రిక
చందంబున భర్త తోడ సహగమనంబున్
బొందెను మాంచాలయును న
మందగతిం బుణ్యలోక మార్గము లందెన్"[2]

అని కవిగారు మాంచాల పాత్రను ఆదర్శప్రాయంగా చిత్రించారు.

ఆంధ్ర సరస్వతిగా ప్రసిద్ధి చెందిన లక్ష్మీకాన్తమ్మగారు శ్రీనాథుని "పలనాటి వీర చరిత్ర"ను ప్రామాణికంగా భావించారు. అందుచేతనే "బాలచంద్రుని సంగ్రామ వాంఛ" తో కావ్యాన్ని (నా తెలుగు మాంచాల) ప్రారంభించారు. శ్రీనాథుని "పలనాటి వీర చరిత్ర" కూడా మలిదేవరాజు బ్రహ్మనాయుడు మొదలయిన వారు కార్యమపూడి యుద్ధ రంగానికి బయలుదేరడంతో ప్రారంభమౌతుంది. అయితే శ్రీనాథుడు తన కావ్యంలో బ్రహ్మనాయుని పక్షం, నలగామని పక్షం చేరినవారి వివరాలను వెల్లడించి చరిత్ర పరిశోధకులకు మేలు చేశాడు. లక్ష్మీకాన్తమ్మగారు తమ కావ్యంలో మాంచాల బాలచంద్రుల వ్యక్తిత్వాన్ని, మనోభావాలనే ప్రధానంగా వర్ణించ దలచిన వారు గనుక చరిత్రాంశాలను కొన్నింటిని ప్రక్కకు పెట్టారు.

బాలచంద్రుడు తన తండ్రి సైన్యంతో యుద్ధానికి వెళ్ళినట్లు కోమటి అన్నమ్మ వలన తెలిసికొనినట్లు శ్రీనాథుని పలనాటి వీర చరిత్ర వివరిస్తుంది. మేడపిలో బాలచంద్రుని బొంగరం ముల్లు అన్నమ్మ అనే వైశ్య

1. పింజల సోమశేఖరరావు, మాంచాల, పుట-57. అందే. పుట. 60

కాంతకు తగలి, పులికి అరికాలు దిగవచ్చి అవనితాకగా, ఆమె కోపంతో,

"మీయయ్య లెల్లను మించిన బలిమి
చేరి పైరుల తోడ శ్రీయుద్ధభూమి
ఉప్పొంగుచున్న వా రుక్కిపు నెదుట
వారిలో గలయు నీ వడి కానవచ్చు
పోతు సింహము రీతి పొదలు చున్నావు
మదము పట్టిన గిత్తమాడ్కి మేడపిని
ఉన్నావు..........."[1]
అని బాలుని నిందిస్తుంది.

బాలచంద్రుడు తన తల్లి ఐతాంబ మందిరానికి వెళ్ళి వివరాలను గ్రహించి తనను దీవించి యుద్ధరంగానికి పంపించవలసిందిగా ప్రార్థిస్తాడు. లక్ష్మీకాన్తమ్మగారి కావ్యంలో "యుద్ధ కాంక్షతో బాలుడు"

"జనని దీవన గొనుచు
జయము తాబడయంగ
తల్లి యైతాంబ కడ
కుల్ల సమ్ముగ పిగె"[2]

అని సంక్షేపించబడింది.

బాలచంద్రునకు యుద్ధ వివరాలు తెలియడానికి కారణమయిన బొంగరాల ఆటను, కోమటి అన్నమ్మ వృత్తాంతాన్ని లక్ష్మీకాన్తమ్మగారు విడిచి పెట్టారు. "ప్రస్తావన" అనే శీర్షికలో పలగామ మలి దేవుల సైన్యాన్ని, బ్రహ్మనాయుడు సైన్యంతో తరలి వెళ్ళడాన్నీ, బాలచంద్రుడు యుద్ధం చేయాలనే దీక్ష స్వీకరించడాన్ని సూచించారే గాని వివరించ లేదు. నాటకీయ శైలిలో ఈ చారిత్రక గేయ కావ్యాన్ని వ్రాయడం వలన "ప్రస్తావన" లో పూర్వరంగంగా సూచించారు. లక్ష్మీకాన్తమ్మగారు తమ కావ్యాన్ని గేయ నాటకంగా భావించారు గనుక తదుపరి భాగాలను "రంగం" గా ప్రకటించారు.

---

1. శ్రీనాథుడు, పలనాటి వీర చరిత్ర, పుట-48.
2. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, నా తెలుగు మాంచాల, పుట-2.

శ్రీనాథుని కావ్యంలో బాలుడు యుద్ధరంగానికి వెళ్ళడానికి అనుమతి కోరినపుడు ఐతాంబ మూర్ఛపోవడము, దుఃఖించడము, యుద్ధవిముఖములైన మాటలు చెప్పడము మాత్రమే గాక—

"తమకంబు కూడదు తాళుము తనయ
తెలిసి విచారించి తెలిపెద నీకు
ఉండుమీవని చెప్పి"

మందిరాంతర్భాగంలో వున్న శీలమ్మ (బ్రహ్మనాయని తల్లి) వద్దకు వెళ్ళి బాలుణ్ణి నిలిపే ఉపాయం చెప్పమని ప్రార్థిస్తుంది. సర్వజ్ఞురాలైన శీలమ్మ బాలచంద్రుని మాంచాల వద్దకు పంపవలసిందిగా సలహానిస్తుంది. మాంచాల రూప సంపద బాలచంద్రుని బంధించగలదని శీలమ్మ భావన.

లక్ష్మీకాన్తమ్మగారు ఐతాంబ శీలమ్మను ఉపాయం చెప్పమని కోరిన సంఘటన విడిచిపెట్టారు. బాలచంద్రుడు మాంచాల గృహాన్ని సందర్శించేలా ప్రత్యక్షంగా ప్రోత్సహించింది ఐతాంబ అయినప్పటికీ ఆలోచన మాత్రం శీలమ్మదే. ఈ సన్నివేశాన్ని విస్మరించినా చరిత్రాంశాలకు భంగం కలగక పోవడము గమనార్హము.

శ్రీనాథుని కావ్యంలో ఐతాంబ బాలచంద్రునితో తాను సంతానముకై పడిన కష్టాలను, నోచిన వ్రతాలను సుదీర్ఘంగా వివరిస్తుంది.[1] లక్ష్మీకాన్తమ్మ గారు ఐతాంబతో బాలచంద్రుని "మా నోము సత్ఫలమ" అనిపించి క్లుప్తీకరించారు. బాలచంద్రుడు వీర ధర్మాన్ని వివరించడం ఐతాంబ మాంచాల అనుమతి స్వీకరించవలసిందిగా బాలచంద్రుణ్ని ఆదేశించడం రెండుకావ్యాల్లోనూ వర్ణించబడింది. అయితే ఐతాంబ ముందుగా వెళ్ళి బాలునిరాకను మాంచాలకు తెలియజేయడం లక్ష్మీకాన్తమ్మగారి కావ్యంలో కానరాదు. మాంచాల వద్దకు వెళ్ళ వలసిన బాలచంద్రుడు తన ఉంపుడుకత్తె శ్యామాంగి (సబ్బాయి) యింటికి వెళ్ళి ఆ వేశ్యమాటలకు లోబడి దానధర్మాలకై తాను తెచ్చిన ధనమంతా వేశ్యమాతకు సమర్పించడం, అనపోతు (బాలచంద్రుని స్నేహితుడు) బాలుని ప్రవర్తనను నిందించడం కూడా లక్ష్మీకాన్తమ్మగారి కావ్యంలో కనుపించదు. బాలచం

1. శ్రీనాథుడు, పలనాటి వీర చరిత్ర, పుట-52-58

ద్రుని గుణశీలములకు, వ్యక్తిత్వానికి భంగం కలుగుతుందని లక్ష్మీకాన్త మ్మగారు పై విషయాలను విడిచి పెట్టినట్లు భావించవచ్చు.

బాలచంద్రుడు మాంచాల సౌందర్యానికి దిగ్భ్రమ చెందడం మోహావేశుడై స్వధర్మాన్ని తాత్కాలికంగా విస్మరించడం వీరపత్నియైన మాంచాల బాలచంద్రుణ్ని ప్రోత్సహించి వీరఖడ్గమిచ్చి వీరతిలకం దిద్ది భర్తను యుద్ధరంగానికి పంపడము రెండు కావ్యాల్లోనూ వర్ణించబడింది.

మాంచాల త్యాగాన్ని లోక విదితం చేయడమే లక్ష్మీకాన్తమ్మగారి ధ్యేయం. వీర పురుషుడైన బాలచంద్రుని, వీరనారి మాంచాలను మహోన్నతంగా అపురూపంగా చిత్రించడంలో లక్ష్మీకాన్తమ్మగారు కృతకృత్యులయ్యారనడం అతిశయోక్తి కాదు. కావ్యాన్ని పరిశీలించిన తరువాత స్వర్ణహారంలో రత్నాలను అమర్చినట్లు ఏ చరిత్రాంశాన్నీ విడిచి పెట్టకుండా కథాంశలో యిమిడ్చినట్లయితే సముచితంగా ఉండడనే భావం కలుగుతుంది.

పల్నాటి వీరగాథ స్పష్టమైన చరిత్రాంశాలతో ముడిపడియున్న వాస్తవగాథ. ఈ కావ్యంలోని బ్రహ్మనాయుడు, బాలచంద్రుడు, నలగాముడు, మలిదేవుడు, కన్నమదాసు, ఐతాంబ, మాంచాల చరిత్ర ప్రసిద్ధి చెందినవారు. లోకోత్తరమైన వారి నడవడిక శౌర్య పరాక్రమాలు పలనాటి ప్రజలను పులకరింప జేశాయి. నాగులేటి ఒడ్డున వీరి గుడి నిర్మించి యిప్పటికీ తిరునాళ్ళ జరుపుతూ భక్తిశ్రద్ధలతో ప్రవర్తించడానికి కారణం బ్రహ్మనాయుడు, బాలచంద్రాదులు మానవరూపంలో వచ్చిన దేవతలనీ, లక్ష్మీ కాంతమ్మగారి కావ్యంలో మాంచాల కదన రంగానికి వెళ్లినట్లును, బాలచంద్రుని మరణానంతరం సహగమనం చేసినట్లును వర్ణించబడింది. శ్రీనాథుని కావ్యంలోలేని యీ విషయాలను లక్ష్మీకాంతమ్మగారు సృష్టించారు. మాంచాల సహగమనం చేసి ఉండవచ్చునని ఊహించడంలో తప్పేమీ లేదు. అలరాజు చనిపోయినపుడు పేరిందేవి సహగమనం చేసింది. అలరాజు తండ్రి కొమ్మరాజు విచారిస్తున్నపుడు బ్రహ్మనాయుడు "మన పగను బాలచంద్రుడు తీర్చగలడని" ఓదార్చుతాడు. పేరిందేవి సహగమన వార్త సంచలనాన్ని కలిగిస్తుంది. వీర ధర్మానువ్రత అయిన మాంచాల పేరిందేవిని ఆదర్శంగా తీసుకొని సహగమనం చేసి ఉంటుందని లక్ష్మీకాన్తమ్మ గారు భావించడం సముచితంగా వుంది.

## లక్ష్మీకాన్తమ్మగారి మాంచాల పాత్ర చిత్రణము :-

**మాంచాల**

పలనాటి అభిమన్యుడని పేరు పొందిన బాలచంద్రుని ధర్మపత్ని. గండు కన్నమనీడు, రేఖాంబల ముద్దుల కూతురు. వివాహమయి ఏడేండ్లు గడచినా దరిచేరని భర్తను తలచుకొని మనసులో మధన పడింది గాని తన బాధను ఎవరికీ వెల్లడించని ధీరవనిత. ఈ కావ్యంలో ఐతాంబ మాంచాల సౌందర్యాన్ని ఇలా ఊహించింది.

" తన మేని యందమ్ము
నును కాంతి కిరణమై
దిశలెల్ల వెలిగించి
దివ్యాంగనల
కుద్దీవనమ్మొ నగు
వెన్నద్దియై వరలు
వల్లియల వరవమ్ము
ఉల్లమున నిక్షిప్త
మొనరించి, యుల్లముల
కుల్లాసముం గూర్చి
చల్లగా మాట్లాడు
ప్రమద........ " 1

అని తలచింది.

అందాల మాంచాలను చూచి సహజ కామాతురుడయిన తన కుమారుడు యుద్ధ విముఖుడు కాగలడని ఆశించింది. బొండు మల్లియ వంటి నిండయిన హృదయంగల మాంచాల మెఱపు తీవలగుంపు వంటి శరీర సౌందర్యంతో ప్రకాశించదన్న బాలచంద్రుని ప్రలోభ పెడుతుంది. మాంచాల గుణ సంపదను తన కుమారుడికి ఇలా వివరిస్తుంది.

---

1. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, నా తెలుగు మాంచాల-పుట-15-16

" యోగాగ్ని దరికొనని
యోగ సుస్థిర దేహ
సతియామె కొక్కింత
సాటి కాగలదేమొ!
సురుచిర ప్రభ మీరు
మరుని కేతన మామె
సొకు మార్యము తోడ
సౌజన్య ధనముతో
పడతులందర లోన
భాగ్యవతి తానాయె;
వైకుంఠ విభవమ్ము
వడతిబలు సౌధమ్ము
అయింతి, మా లక్ష్మి
అభిశాప నిహతయై
తపము సేయుచునున్న
ముగ్ధతాపసి యామె! " [1]

బాలచంద్రుడు వేశ్యాలోలుడై తనను నిరాదరించినప్పటికీ, సౌశీల్యవతియైన మాంచాల భర్తను దైవంగా భావించింది. బంగారు ప్రతిమ వంటి మాంచాల దేహపు కాంతి మిరుమిట్లు గొల్పగా-బాలచంద్రుడు

" ఊర్వశియొ, రంభయో
శర్వరాణియొ! కాక
అచ్చరల వంశంపు
మచ్చెకంటి యొ కాక
మానవాంగన యొచో "

అని సందేహిస్తాడు.

---

1. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, నా తెలుగు మాంచాల, పుట-22.

" దివ్యమౌ ఆకృతిని
దీధితులు వెదజల్లు
ఆయతివ, ఆ ప్రతిమ
మాంచాలయో; భర్తృ
పాంచాలికయొ........" [1]

అని తికమక పడతాడు.

భర్త మోహావేశాన్ని గమనించినా మాంచాల తన వివేకాన్ని కోల్పోలేదు, వీర ధర్మాన్ని నిర్వర్తించటానికి ఉద్యమించింది. స్వార్థ సుఖాన్ని ఆశించి దేశ సేవను ప్రక్కకు నెట్టడం పాపమని తలచింది.

" దేశ మాతను, రక్షసేసెడి
సమయమిప్పుడు సమీపింపగ
మాతృసేవకు మమత చూపక
అధిక మోహము నంది వీరుడ
ఆ ఆపద మఱచి యిపుడు వనితల
బాహు బంధము నాసచేయుట
ధర్మమగునే " [2]

అని భర్తను ప్రశ్నిస్తుంది.

తల్లి రేఖాంబ అంతఃపురం నుండి తనను పిలిచినపుడు మనసు నిగ్రహించుకొని భర్తను సమాధాన పరచి వెళ్లడం మాంచాల చతురతకు నిదర్శనం. తెల్లవారబోయే సమయాన బాలచంద్రుని సమీపించి,

" నడము చుట్టు మెఱయుచుండు
కత్తి నంత నూడ బెకి
చేత ద్రిప్పుచు ఝళిపించి
ధవుని చుట్టు తాను తిరిగి

---

1. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, నా తెలుగు మాంచాల, పుట-34-35.
2. - అందే - పుట-56-57,

మగని చేత మగువ ఖడ్గ
మిడుచు, మిగుల తేజమలర
మాతృదేవి పిలుపు వినుము
పోయిరమ్ము, వీర ధనుడ" [1]

అనుచు భర్త నుదుట రక్తతిలకం దిద్ది, హారతిపట్టి, నమస్కరించింది. కీర్తి కాంతతో మరలి రమ్మని ప్రోత్సహించింది.

విధి వక్రించింది. యుద్ధరంగంలో మరణించిన బాలచంద్రుని "శిరము తొడపై జేర్చి" మగువ మాంచాల సహగమించి బూడిదగా మారింది.

మాంచాల ఉత్తమాశ్వాన్ని అధిరోహించి యుద్ధానికి వెళ్లడము, సహగమనం చేయడము మూలంలోలేని విషయాలు. అయితే పై అంశాలను లక్ష్మీకాంతమ్మ గారికి పూర్వమే శ్రీమతి బోడవరపు సత్య సత్యవతీ దేవిగారు "పల్నాటి మాంచాల" కావ్యంలో వర్ణించారు. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు మాంచాల లోకోత్తర త్యాగాన్ని వీర ధర్మాన్ని నిర్వర్తించడంలో గల అభిరుచినీ వ్యక్తీకరించడానికి పై విషయాలను స్వీకరించారు.

" ఆ పుణ్యసతి బూది - ఈ భువిని వెలదులకు వెలుగుల ప్రోదియయ్యె " అని ఊహించారు.

" నా తెలుగు మాంచాల
నాజెంపు పతి శీల
నవరాగ మణి మాల
స్తవనీయ గుణలోల
సతిమయ్యె మాంచాల
వీర సతియయ్యెనే " [2]

అంటూ లక్ష్మీకాన్తమ్మగారు మాంచాల గుణ గణాలను ఉత్తేజకరంగా గానం చేశారు.

---

1. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, నా తెలుగు మాంచాల, పుట-88
2. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, నా తెలుగు మాంచాల, పుట-94.

# గండికోట యుద్ధం

శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరిగారు గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని అప్పికట్ల గ్రామంలో 1904లో జన్మించారు. రాఘవయ్య గారి తల్లి దండ్రులు లక్ష్మమ్మ సుబ్బయ్యలు. రైతుకుటుంబంలో జన్మించిన రాఘవయ్యగారు పచ్చని పంట పొలాలనడుమ, నిసర్గ మధురమైన జానపదవాతావరణంలో ఆడుతూ పాడుతూ పెరిగారు. జానపద గేయాల మాధుర్యాన్ని బాల్యం నుండి అస్వాదించినవీరు, జానపద గేయరచనలో సిద్ధహస్తులైనారు. సినీ కవిగ రాణించారు.

గౌరవించిరి నన్ను కవిరత్నమని మహో
          ద్దండులన్ పేర్గన్న పండితాళి
ప్రస్తుతించిరి జానపద కవిత్వమ్మున
          సార్వభౌముండని జ్ఞాన నాధులు
స్వాగతం బిడిరి ప్రజాకవి వీవని
          రైతు కూలీ సభారంగములను
అభిమతించిరి కనకాభిషేకమ్ముల
          ఉజ్జ్వలమ్మైన విరోలగముల

ఆంధ్రరాష్ట్ర సంసిద్ధికై అహరహమ్ము
ఘోలుపడితిని పద్య సంపద నొసంగి,
దేశ సేవాపదమ్మె నా ఆశయమ్ము
పేరు "కొసరాజు" తెలుగంటె పెద్ద మోజు[1]

అని వీరు తమ వివరాలను వెల్లడించారు.

---

1. కొసరాజు రాఘవయ్య చౌదరి, గండికోటయుద్ధం (కవర్ పేజీ వెనుక)

"కొసరాజు నిజమైనఆంధ్రుడు, నిరాడంబరుడు, దేనినీ కోరని నిరీహుడు" అని ముఖ్యమంత్రి, పద్మశ్రీ నందమూరి తారక రామారావుగారు ప్రశంసించారు.[1]

"పాటలో కొసరాజు పండిపోయారు. అదివేరు. కాని ఆయన పద్యం ఎలా రాస్తాడు. అది తురంగ ధాటీహృద్యం. ఎన్నెన్నో జాతీయాల పాతరలు ఆయన పద్యాలు.. ఆయనకేమి మారాజు. జానపదగేయతరువు కొనకొమ్మల సికరాజు"[2] అని డా॥ సి. నా రా య ణ రెడ్డి గా రు అభినందించారు.

"కొసరాజుగారి చెయ్యి తగిలితేచాలు మామూలు మాటలే మధురగీతికలై కూర్చుంటాయి. విజయవంతమైన అనేకచిత్రాలకు వారు పాటలువ్రాశారు. కాదు– వారిపాటలు అనేకచిత్రాలకు ఆర్థికవిజయం సంతరించిపెట్టాయి."[3] అని జాతీయ చలనచిత్ర అభివృద్ధి మండలి అధ్యక్షులు శ్రీ డి. వి. యస్. రాజు గారు అభిప్రాయ పడ్డారు.

పల్లెపదాలకు పెద్దపీట వేసిన ప్రజాకవి కొసరాజు. "జానపద కవి సార్వభౌముడు", "కవిరత్న" బిరుదులతో ఆంధ్రదేశం కొసరాజును సన్మానించింది. కొసరాజు గారు వ్రాసిన "గండికోట యుద్ధం" చారిత్రక విలువలతో నిండిన ప్రామాణిక కావ్యం. చారిత్రక సత్యాలను వెల్లడించే కథాకావ్యం.

తెలుగు బిడ్డల మేను పులకించు గాథగా యీ కావ్యాన్ని రచించడం కొసరాజుగారి ఆశయం. వ్రాసిన మాటలే వ్రాయుటకంటె, పాడిన పాటలే పాడుట కంటె, సరిక్రొత్త రచనలు చేసినపుడే కవి సామర్థ్యం లోకానికి తెలుస్తుందని వీరి అభిప్రాయం. అష్టావధానాలు, శతావధానాలు మాత్రమే గాక నేత్రావధానం గూడ చేసిన నేర్పరులు కొసరాజు గారు.

1. కొసరాజు రాఘవయ్య చౌదరి, గండికోట యుద్ధం (ప్రశంసాహారం)
2. అందే పుట – 1
3. అందే పుట – 1

"అసహాయ శూరులైన (గండికోట వీరుల) వారి చరిత్ర ఆంధ్రుల నెంతో ఉత్తేజ పరచగలదను సుసంకల్పంతో ఈ రచన చేపట్టా" లని కొసరాజుగారు ఈ కావ్యేతివృత్తం స్వీకరించడానికి గల కారణం వ్రాశారు.

కమ్మవారి చరిత్రను పరిశోధన చేయించమని ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు సలహాయిస్తే, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు అ పనికి కొసరాజు రాఘవయ్య చౌదరిగారిని నియోగించారు. ఆర్థిక సహాయం అందించారు. కొసరాజుగారు ఎంతో దీక్షగా చరిత్ర గ్రంథాలను సాకల్యంగా సమీక్షించి గండికోటను పాలించిన పెమ్మసాని కమ్మదొరల చరిత్రను "గండికోట యుద్ధం" కావ్యంగా రూపొందించారు. అలా శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారి ప్రోత్సాహంతో యీ కావ్యం అవతరించింది. కనుక కొసరాజుగారు యీ కావ్యాన్ని కుప్పుస్వామిచౌదరి గారికి అంకితంచేశారు. 1930 సంవత్సర ప్రాంతాన గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షులుగా వున్న జాజర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు కవిపోషకులు, దాత. గుంటూరులోని కమ్మజన సేవాసమితి సాహితీ ప్రచురణ విభాగము వారు ఈ కావ్యాన్ని ప్రచురించారు.

"గండికోటయుద్ధం సుప్రశస్తమైన ద్విపదకావ్యం. ఆంధ్రులచరిత్రయందు మరుగున పడిన ఒక సువర్ణాధ్యాయాన్ని వెలికి తెచ్చి సులభ సుందరంగా చిత్రించారు కొసరాజువారు. 15, 16, 17 శతాబ్దాలలో పెమ్మసానివారి నాయకత్వంలో విజయనగర చక్రవర్తు లందరికి అండదండలుగా నిలిచి, గండికోట కేంద్రంగా వెలుగొందిన కమ్మవారి ప్రాభవం ఈ రచన ద్వారా వెలుగులోనికి రాగలదు"[1] అని కమ్మజన సేవా సమితి వారు ఆశించారు.

"వీరరసం వర్షించాలంటే, ఉద్రేకం కలిగించాలంటే ద్విపదలోనేపుంది ఆ పట్టు. అది నిర్వివాదాంశం"[2] కనుకనే ద్విపదలో కావ్యం వ్రాసినట్లు కొసరాజుగారు తెలిపారు. ఇదే అభిప్రాయం డాక్టరు జి. వి. సుబ్రిమణ్యం గారు కూడా వెలిబుచ్చారు. "ద్విపద పాడుకోవటానికి

---

1. కొసరాజు రాఘవయ్య చౌదరి, గండికోటయుద్ధం, (మామాట)
2. అందే . (పీఠికలో) పుట – 34

ఉపయోగపడే దేశిచ్ఛందం. వీరగాథలు ఇందులో వేడిగా ఉంటాయి. భక్తి గాథలు వెలుగుగా ఉంటాయి. దేశభక్తి గాథలు ద్విపదలో వేడినీ, వెలుగునూ సార్థకంగా సమన్వయించుకొంటాయి. శ్రీ కొసరాజు గారు ఈ రహస్యాన్ని గుర్తించి ద్విపదలో "గండికోట యుద్ధ కావ్యాన్ని రచించారు. జానపదానికీ, జ్ఞాన పథానికీ వారధిని నిర్మించారు"[1] అనీ శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యంగారు కొసరాజు గారి సమయస్ఫూర్తిని ప్రశంసించారు.

"ద్విపదచ్ఛందో రీతులలో మెరవడి తిరిగిన పొల్కరికి పలుకుబడి రాఘవయ్యగారి వరవడికి ఒజ్జబంతి. విశేషించి వేమన – వీరబ్రహ్మేంద్రుల రచనా ఫక్కి వీరి సాహితీ విభూతికి మొదలు పంచి"[1] అని ఆచార్య తూమాటి దొణప్పగారు కొసరాజుగారి శైలిని కొనియాడారు.

కవిగారు "గండికోట యుద్ధం" కథ ప్రారంభించే ముందు "కృతిపతి" శ్రీ కుప్పస్వామి చౌదరిగారి గుణగణాలను ప్రస్తుతించారు. ఆ తరువాత "ఇష్టదైవస్తుతి", "పూర్వకవి ప్రశంస" చేశారు. "గురుస్తుతి" లో శ్రీ కొండముది నరసింహారావుగారిని, శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి గారిని ప్రార్థించారు. "కుకవి – సుకవి" తారతమ్యాన్ని స్పష్టం చేశారు. "కావ్య ప్రశంస" చేసి, తన వివరాలను కవి ప్రశంస" అనే శీర్షికలో విపుల పరిచారు. కొసరాజు గారిపై సంప్రదాయ ప్రభావం ఎంత బలీయంగా వుందో పై శీర్షికలను బట్టి గ్రహించ వచ్చును.[2]

## ఇతివృత్త పరిశీలనం :

కొసరాజుగారు ఈచారిత్రక కావ్యాన్ని తొలిఘట్టము (పుట 1-68), మలి ఘట్టము (పుట 69-144), రణ ఘట్టము (పుట 145-286), తుది ఘట్టము (287-388) అని నాలుగు భాగాలుగా విభజించారు.

---

1. కొసరాజు రాఘవయ్యచౌదరి, గండికోటయుద్ధం, (పీఠికలో) పుట—30
2. అందే (పీఠికలో) పుట – 4

"కొనరాజు పినరులు కుప్పగా బోసి
కూర్చితి నిట గండికోట యుద్ధమ్ము"
అని తనదైన ప్రత్యేక శైలిని వివరించారు.

"ప్రాత పురాణాల పడి దొర్లు కంటె
మాతృ దేశ చరిత్ర మలచిన చాలు
కులము వారల కదే కొంగు బంగారు
జాతి బిడ్డల కదే చరితాత్మకమ్ము"[1]
అని చరిత్రాంశాన్ని కథాంశంగా స్వీకరించిన కారణం వివరించారు.

"గండికోట యుద్ధగాథ కట్టుకథాకాదు, పుక్కిటి పురాణమూకాదు. మొన్న మొన్నటి తెలుగుజనుల కళ్ళ ఎదుట కదలాడిన వాస్తవ చరిత్ర. చరిత్రకారులు బలమైన ప్రమాణాలతో నిష్కర్షించిన యధార్థ కథనం. వడమటి పాళయాలకు చెందిన కమ్మవారిలో వివాహాది శుభకార్య సందర్భాలలో, పెమ్మసాని తిమ్మానాయని తాంబూలమని ప్రథమ తాంబూలం తీసి దేవరింటి పూజావేదికపై ఉంచడం నేటికీ ప్రసిద్ధం" అని ఆచార్య తూమాటి దొణప్పగారు కావ్యంలోని చారిత్రక పరిమాణాలను బలపరిచారు. పౌరాణిక కథా ప్రపంచంలో స్వేచ్ఛగా రమణీయమయిన కల్పనలు చేయవచ్చు. చరిత్రాంశములలో నిండియున్న గండికోట యుద్ధం వ్రాయడం –

"దొమ్మరిగడ ఖేలనమ్ము తుల్యమ్ము
కాలమ్ము పెడనీక గఱి బిఱి పడన్
కల్లదూర్చక భూత కల్పన నిడక"[2]
రూపొందింపవలసి యున్నదని కొనరాజు గారు వివరించారు.

"చరిత్రను వర్ణనాత్మకంగా చిత్రించడం ఒక పద్ధతి. ఇందులో కథాంశ విస్తరణకు ఉన్న ప్రాధాన్యం కథా ప్రవృత్తి చిత్రీకరణంలో ఉండదు. చరిత్రను సమకాలీన సమాజ మనః ప్రవృత్తినిగాని, జీవన విధానాన్నిగాని ఉత్తేజ పరిచే ఉద్దేశంతో దిద్ది తీర్చడం మరొక మార్గం.

1. కొనరాజు రాఘవయ్య చౌదరి, గండికోటయుద్ధం, పుట – 7
2. అందే పుట – 14

ఇది మొదటిపద్ధతికంటె ఉత్తమమయినది. చరిత్రను, గతిని నిర్దేశించేదిగా చూడటం గొప్పకాదు. గుణపాఠాన్ని చెప్పేదిగా చదవటం సార్థకం. ఆ గుణపాఠాన్ని సహృదయామోదంగా సంవదించటం ఉత్తమ చారిత్రక కావ్యకర్త చేసే ప్రయోగం. ఈ ప్రమాణంతో చూస్తే గండికోట యుద్ధం కావ్యం ఉత్తమ ప్రమాణాలతో, ఉన్నత ప్రయోజనాన్ని ఆశించి రచించిన కాళాఖండం అవటంలో అనుమానంలేద" అని డాక్టరు జి. వి. సుబ్రహ్మణ్యం గారు గండికోట యుద్ధ కథా నిర్మాణరీతిపై వ్యాఖ్యానించారు.

తెలుగు బిడ్డల మేను పులకించే కథగా గండికోట యుద్ధ కావ్యాన్ని కొసరాజుగారు ఉత్తేజకరంగా రచించారు. "కడప మండలంలోని నేటి బద్వేలు, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, కమలాపురం తాలూకాలు, అనంతపురం జిల్లాలోని తాడిపత్రి తాలూకా, కర్నూలు జిల్లాలోని కోయిల కుంట్ల తాలూకా చేరిన ప్రాంతం గండికోట సీమ అని ఉజ్జాయింపు లెక్క. "గండి" అను పేరు గల గ్రామానికి చేరువలో నిర్మితమైన కోట కాబట్టి దీనికి గండికోట అన్న పేరు అన్వర్థం. కాకతీయుల కాలం నాటికే ఈ దుర్గం గడిదుర్గంగా పేరుగాంచింది. చెన్నూరు, వజ్రకరూరు, పనిపెంట మొదలైనవి ఈ సీమకు చెందిన ముఖ్యతాణాలుగా పేర్కొవడం కద్దు" అని ఆచార్య తూమాటి దొణప్ప గారు గండికోట సీమ భౌగోళిక స్వరూపాన్ని స్పష్టంచేశారు.[1] పెమ్మసాని వంశం వారిచే పరిపాలించ బడిన గండికోట దుర్గం కడప జిల్లా జమ్మల మడుగు తాలూకాలో ఉంది. జమ్మల మడుగు పట్టణానికి పడమరగా పది కిలో మీటర్ల దూరంలో ఉన్న కొండలపై నిర్మించబడింది. ప్రొద్దుటూరు పట్టణానికి, గండికోట దుర్గానికి మధ్య దాదాపు 30 కిలోమీటర్ల దూరం ఉంది. దుర్భేద్యమైన గండికోట గిరి దుర్గం విజయనగర పరిపాలకుల కాలం నుండి మిక్కిలి ప్రసిద్ధి చెందింది. పెమ్మసాని వారి పాలనలో గండికోట దర్గం మహా వైభవాన్ని అనుభవించింది. పెమ్మసానివారు విజయనగరం వారికి సామంతులుగా వుండి రాజభక్తినీ, దేశభక్తినీ ప్రదర్శించారు. పెమ్మసాని వారి వంశంలో గండికోట దుర్గం పాలించిన వారిలో మొదటగా తిమ్మా నాయుడి పేరు వినిపిస్తుంది.

---

1. కొసరాజు రాఘవయ్య చౌదరి, గండికోటయుద్ధం, (పీఠికలో) పుట—5.

"నేను కవితా వస్తువుగా స్వీకరించిన గండికోట యుద్ధ గాథ విచిత్రమైనది. కడపజిల్లా, జమ్మలమడుగు సమీపాన గల ఆ దుర్గాన్ని పాలించిన మొట్టమొదటి వీరులు మిక్కిలినేనివారు. వారికి పుత్ర సంతానం లేకపోవడం వల్ల వారి అల్లుడు బెల్లంకొండ దుర్గాధిపతి పెమ్మసాని తిమ్మానాయని కుమారుడు కుమార తిమ్మానాయుడు ఇల్లుటపు అల్లుడై రాజ్యాధికారం చేపట్టాడు."[1] అని కవిగారే స్వయంగా పెమ్మసాని వారి ఉదంతాన్ని విశదం చేశారు.

మహోన్నతమైన ఈ గండికోట గిరి దుర్గం పతనం కావటం యీ కావ్యంలోని సారాంశం. రాజకీయ కుతంత్రాలూ, శత్రువులను జయించే ఎత్తుగడలూ, తాడోపేడో తేల్చుకునే తెగింపూ, ఆదర్శ ప్రాయమైన దేశభక్తి, ఉద్వేగభరితమయిన యుద్ధ సన్నివేశాలూ, రాణివాసం సలహాలు కదనరంగంలో వీరవిహారాలూ, జయాపజయాల ఊగిసలాటలు ఈ కావ్యంలో పుష్కలంగా కనుపిస్తాయి.

కావ్యప్రారంభమే (తొలిఘట్టమే) రాజకీయ కుతంత్రంతో ప్రారంభమై ఉత్కంఠను కలిగిస్తుంది. గోల్కొండ నవాబు 'హస్సన్ కుతుబ్‌శాహి'. ఆ నవాబు ఆంధ్ర భూదాహి. అతని మంత్రి మీర్జుమ్లా కార్యమునకు, ఖడ్గమునకు చాలినవాడు. కుటిలమతి పొదిలె లింగన్న నవాబుకు గండికోట సీమ సిరిసంపదలను ఆశ కలిగేలా వర్ణించి, గండికోట దుర్గాన్ని జయించవలసిందిగా ప్రేరేపిస్తాడు. ఇదంతా వింటున్న మీర్జుమ్లా ఆంధ్రుల ప్రతాపాన్ని తక్కువగా అంచనా వేయ వద్దని నవాబుకు విజ్ఞప్తి చేస్తాడు.

> "పెమసాని తిమ్మన భీమబలుండు
> సాహసోపేతుండు శౌర్యాత్మకుండు
> గాండ్రించు కోల్పులి కమ్మ సింహమ్ము
> అంతంత లేని వారదలింపలేరు
> ప్రాణమ్ము కడు తృణప్రాయమాతనికి"[2] అని

గండికోట దుర్గాధిపతి పెమ్మసాని చినతిమ్మానాయుని పరాక్రమం వివరిస్తాడు. పోర్చుగీసువారి సహాయంతో, పరికొత్త ఆయుధాలతో,

1. కొవరాజు రాఘవయ్య చౌదరి, గండికోట యుద్ధం, పుట – 34, 35
2. అందె పుట – 20

అపారమైన సేనావాహినితో గండకోటను అవలీలగా సాధించవచ్చునని లింగన్న నవాబుకు నూరి పోశాడు. దురాశాపరుడైన గోల్కొండ నవాబు గండికోటను ముట్టడించవలసిందిగా "మీర్జుమ్లా"ను ఆజ్ఞాపించాడు. కుటిల నీతిజ్ఞుడైన లింగన్న, దళాధిపతి అబ్దుల్ నబీఖాన్, పోర్చుగీసు సేనాని మైమేదార అనుసరించగా మీర్జుమ్లా సైన్య సమేతుడై గుత్తి దుర్గం, కడప జయించి మైలవరంవద్ద దండును నిలిపాడు. బనగానపల్లె, మునిమడుగులలో ఉన్న వజ్రాల గనులను మా స్వాధీనం చేసి, మేము చెప్పిన షరతులను అంగీకరించనిచో యుద్ధము తప్పదని బెదరింపు లేఖ వ్రాసి, వార్తాహరుని గండికోటకు పంపించాడు. విషయం వినగానే దుర్గాధిపతి తిమ్మానాయుడు అగ్రహోదగ్రుడయ్యాడు. తన మంత్రి చెన్నమరాజును, సేనాని నరసింహనాయని సముచితమైన అభిప్రాయం తెలుపవలసిందిగా ఆజ్ఞాపించాడు.

మంత్రి చెన్నమరాజు —

> "రాయ సంస్థానమ్ము రక్షించుకొరకు
> పోరాడి పోరాడి నీరసించితిమి"

కనుక యిట్టి స్థితిలో శత్రువుతో తలపడుట ప్రమాదకరమని వివరించాడు. సేనాని నరసింహనాయుడు కయ్యమునకు కాలుదువ్వాడు. తిమ్మానాయుడు సందేహంతో తటపటాయించాడు. నరసింహనాయుడు సేనాని మాత్రమే కాదు, తిమ్మానాయని సోదరి గోవిందమాంబ భర్తకూడా. సభలో పరదామాటున కూర్చున్న గోవిందమాంబ యుద్ధమే కర్తవ్యమని హితవు పలికింది. చెల్లెలిమాట విన్న తరువాత, తిమ్మానాయుడు యుద్ధసన్నాహము ప్రారంభించాడు. తిమ్మానాయుడు రాజనీతిని అనుసరించి, యుద్ధమున తనకు సహకరించవలసిందిగా కోరుతూ సాటి రాజులవద్దకు దూతలను పంపించాడు. గండికోటనుండి తిరిగివచ్చిన వార్తాహరుడు మస్తఖానుడు, తిమ్మానాయుడు యుద్ధసన్నద్ధుడై వున్నాడని వివరించగానే, మీర్జుమ్లా తన సైన్యాన్ని జాగృతం చేశాడు. ఇంతటితో ఈ కావ్యంలో తొలిఘట్టం ముగిసింది.

**మలి ఘట్టం**

మలిఘట్టం గ్రీష్మ ఋతువర్ణనతో ప్రారంభం. కావడం విశేషం జరుగబోవు భయంకరమయిన యుద్ధాన్ని సముచితమయిన ప్రతీకలతో సూచించడం కొసరాజు గారి ప్రజ్ఞాపాటవాలకు నిదర్శనం.

పరాక్రమవంతుడయిన తిమ్మానాయుడు స్వయంగా సేనలను నడపదలచి, దీవించవలసిందిగా తన తల్లి వెంగమాంబను ప్రార్థిస్తాడు రాజమాత వెంగమాంబ పూర్వుల పరాక్రమం వివరించి, తనకుమారుణ్ణి ఉత్తేజితుణ్ణి ఆమె వర్ణించిన పూర్వారాజన్యుల వృత్తాంతం స్మృత్యాభాస పద్ధతిలో (Flash Back) వుంది ఒక్కమాటలో చెప్పాలంటే. గండికోట చరిత్ర వివరణ వెంగమాంబ ద్వారా జరిగింది.

## పూర్వవృత్తాంతం :

మిక్కిలినేని రామానాయుడు గండికోటను పాలించేవాడు విజయనగర ప్రభువు బుక్కరాయలను సేవించేవాడు. రామానాయునికి మంగమ్మ అనే కుమార్తె వుంది. బెల్లంకొండ దుర్గ పాలకుడైన పెమ్మసాని తిమ్మయ్య కుమారుడు కుమారతిమ్మనాయునికి తమ కుమార్తెనిచ్చి పెండ్లి చేయాలని సంకల్పించాడు. బుక్కరాయల అనుమతిని పొంది, పెండ్లి జరిపించాడు. అప్పటినుండి, గండికోట పెమ్మసాని వారి అధీనంలో వుంది. పెమ్మసాని కుమార తిమ్మనాయుడు భూ సార్వభౌముడయిన బుక్కరాయల వారికి అభిమాన పాత్రుడైనాడు. వనిపెంట, చెన్నూరు వజ్రకరూరు, కడప, జమ్మలమడుగు, కమలాపురం, మల్లేల, సింగనమల, తాటిపర్తి, వేంపల్లి, పైపాడు, వేములాపురం, కుప్పపాడు, వెల్లటూరు, కూకటిగుంట్ల, పొమిడి, యాదికి, పొరలపల్లె, మొదుగు, చాగలమర్రి మొదలైన ఊర్లలో కుమార తిమ్మానాయుడు గడిదుర్గాలను నిర్మించాడు. చెరువులు త్రవ్వించాడు. ప్రజలకు శాంతిభద్రతలను చేకూర్చాడు. కుమార తిమ్మనాయుని తరువాత పెమ్మసాని ధర్మానాయుడు గండికోట పాలకుడైనాడు. తురుష్కుల దండయాత్రలను అరికట్టుటలో విజయనగర ప్రభువైన ప్రౌఢదేవరాయలకు అండగా నిలిచాడు. పరాక్రమం ప్రదర్శించి ముస్లింలను పారద్రోలాడు. ప్రౌఢదేవరాయలు ఎంతో సంతోషించి పెమ్మసాని ధర్మనాయుడికి గండపెండేరం బహూకరించాడు. మూరురాయరగండడైన శ్రీకృష్ణదేవరాయలకు గండికోటను పాలించే పెమ్మసాని రెండవ తిమ్మానాయుడు ఎంతగానో తోడ్పడ్డాడు. శివ సముద్రము ఉమ్మత్తూరులను పరిపాలించే గంగరాజు అనే సామంతుడు

తిరుగుబాటు చేసినపుడు, రెండవతిమ్మనాయుడు తన సైన్యంతో కృష్ణరాయలను అనుసరించాడు. గంగరాజుకు గర్వభంగం జరిగింది. కృష్ణరాయల ఆజ్ఞను పురస్కరించుకొని, రెండవతిమ్మనాయుడు గజపతి రాజ్యభాగాలను జయించాడు. కలబుర్గి (గుల్బర్గా) నృపతుల కండకావరం తొలగించాడు. రెండవతిమ్మనాయుని తరువాత పెమ్మసాని రామలింగ నాయుడు కృష్ణరాయలకు చేదోడు వాదోడుగా నిలిచాడు. తురుష్క దళములు రాయచూరు దుర్గమును ముట్టడించినపుడు, రామలింగనాయుడు గొప్ప పరాక్రమమును ప్రదర్శించి శత్రుసేనను కకావికలు చేశాడు. పెమ్మసాని రామలింగనాయుని శ్రీకృష్ణదేవరాయలు ఎంతో అభిమానించే వాడు. శ్రీకృష్ణదేవరాయల మరణానంతరం విజయనగరం పరిస్థితులు అస్తవ్యస్తమయ్యాయి. అచ్యుతదేవరాయల బంధువు సలకము తిమ్మన్న కృష్ణరాయల అల్లుడయిన రామరాయలకు ప్రాణహాని తలపెట్టాడు. అట్టి విపత్కర పరిస్థితిలో రామరాయలకు గండికోటవారు ఆశ్రయమిచ్చారు. సలకము తిమ్మన్న రామరాయలను అప్పగించవలసిందిగా కోరుతూ గండికోట పాలకుడైన తిమ్మానాయని వద్దకు రాయబారిని పంపించాడు. తిమ్మానాయుడు రామరాయలను అప్పగించనని కబురు చేశాడు. సంకుల సమరం జరిగింది. గండికోటవారి సాయంతో రామరాయలు జయించాడు. గండికోట తిమ్మానాయుడు తనకు చేసిన సహాయానికి బదులుగా అళియరామరాయలు రత్నకాంతులు చిమ్ము రవల బాసికమును బహూకరించాడు. శ్రీరంగరాయలు పెనుగొండ రాజధానిగా విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించేటప్పుడు గండికోట దుర్గాధిపతి బొజ్జ తిమ్మనాయుడు తమ సహాయాన్ని అందించేడు. తిరుపతి సమీపంలో చంద్రగిరి దుర్గాన్ని నిర్మింపజేశాడు. రాయవేలూరులో కోట కట్టించాడు. తిరుగుబాటు లేవదీయుచున్న తంజావూరు పాలకుణ్ణి దండించటానికి శ్రీరంగరాయలు బొజ్జ తిమ్మానాయని నియోగించాడు. తంజావూరు పాలకుడయిన విజయరాఘవుడు గజిబిజి చెందాడు. తుదకు బొజ్జ తిమ్మానాయనితో సంధిచేసుకున్నాడు. ఈ విషయం తెలిసిన శ్రీరంగరాయలు అపరిమితమైన ఆనందం పొందాడు.

గోల్కొండ నవాబుల కుట్రలో భాగంగా, దీన్ దిలావరుఖాన్ గండికోట పరగణా పైబడి పల్లెలను దోచుకున్నాడు. ఆనాటి గండికోట పాలకుడు వెంకటగిరియప్ప వీరనాయకుడు. ఇతడు మహా పరాక్రమ

వంతుడు. గ్రామాలను దోచుకునే తురక పౌజును సైన్యంతో చుట్టుముట్టి, దిలావరు ఖానును బంధించి, తమ ప్రభువయిన వేంకట రంగరాయ రాజేంద్రుల వారికి అప్పగించి మెప్పు పొందాడు. వెంకటగిరియప్ప సాహస స్ఫూర్తికి వేంకటరాయలు మిక్కిలి సంతసించాడు.

రాజమాత వెంగమాంబ అభివర్ణించిన గండికోట చరిత్రను, కావ్య నాయకు డయిన చిన తిమ్మానాయుడు ఎంతో శ్రద్ధగా ఆకర్ణించాడు. దీన్ దిలావరుఖానుని కుమారుడయిన అబ్దుల్ నబీఖానుడు గండికోటపై పగ సాధింప నిశ్చయించాడు. బీజాపూరు సుల్తానును మెప్పించి, ఆ నవాబు ప్రాపకం సంపాదించాడు. కొంతకాలం గడిచిన తరువాత, పెదతిమ్మా నాయుడు గండికోట పాలకుడుగా ఉన్నప్పుడు దండెత్తి వచ్చాడు. దాదాపు పన్నెండు సంవత్సరాలు ఎడతెగని యుద్ధం జరిగింది. తెచ్చిన బలం క్షీణించిపోగా అబ్దుల్‌నబీఖానుడు పిక్కబలం చూపాడు. గత చరిత్రను రాజమాత వెంగమాంబ తన కుమారుడయిన చినతిమ్మానాయునికి వివరించింది.

> "మీతాత తండ్రులు మేటి మన్నీలు
> కత్తి సేవించి నెత్తురుగార్చి
> ఆయుధజీవులై యవమతిలేక
> గండికోట యశస్సు కాపాడినారు
> మాన ధూర్వాహులయి ప్రాణాలనొడ్డి
> తెలుగు దేశపు కీర్తి నిలబెట్టినారు" అని

ఉద్బోధించింది. తన కుమారునకు కర్తవ్యమును బోధించిన రాజమాత వ్యక్తిత్వం ప్రశంసనీయం.

> "నీతరమ్మున నేడు నిష్కారణముగ
> అపజయమ్ము ధరించి అవమానపడక
> పిరికిపందను పాడు మురికి పేర్గాంచి
> దేశమ్ము పరుల కధీనమొనర్చి
> ఎంగిలివాడు సహింపకోతనయ"[1] అని

తన కుమారుణ్ణి హెచ్చరించింది. రాజమాత ధీరమనస్తత్వాన్ని కొసరాజు గారు ఉద్వేగభరితంగా చిత్రీకరించారు.

---

1. కొసరాజు రాఘవయ్య చౌదరి. గండికోటయుద్ధం, పుట – 143

"ఇల్లు వీడని యాంక్ష లెవరు చుక్కొట
గడపదాటని ప్రాతకట్టడి కతన
మగువలు ముసుగుచాటున నక్కవలసె
కాకున్న, చివ్వున కరవాలు పెరికి
రమణులమే యుద్ధరంగాన కురికి
రిపురాజి నెత్తురి పారింపమే కత్తి
నెత్తురుతేట ముంచెత్తమే సుతుడ"[1] అని
తనకుమారుణ్ణి ఉత్సాహపరచి, ఉత్తేజితుణ్ణి చేసింది. రాజమాత సందేశంతో మలిఘట్టం ముగిసింది.

## రణ ఘట్టము :-

తాత తండ్రులనాటి పౌరుష ప్రతాపాలను ఆదర్శంగా పెట్టుకొన్న చిన తిమ్మానాయుడు శత్రుసైన్యంపై విరుచుకుపడ్డాడు. నెతురు కాలువగా ప్రవహించింది. వరిచేనును ముసుములుగా కోసి, నేలపై బొదెలు పరిచినట్లుగా, శత్రువుల శిరః కర చరణములను ఖండించి నేల కూల్చాడు. మొదటిరోజు జరిగిన యుద్ధంలో చినతిమ్మానాయని ధాటికి తురకలు ఆర్తనాదాలు చేశారు అదిరిపాటుతో పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు.

రెండవనాడు పోరాటంలో గండికోట సేనాని, తిమ్మానాయని బావమరది అయిన నరసింహనాయుడు వీరవిహారం చేశాడు.

జగడముఖాలో జొచ్చి షగతుర గ్రుచ్చి
మెడలు రెండుగ జేసి మిడి గ్రుడ్లు దోడి
జబ్బల నెత్తురు జుబ్బాల చిల్చి
పెవగొన్న ప్రేవుల పెకలించి దులిపి
వికటాట్టహాసియై విపవిసలాడి
కొంకులు తెగనేసి గుంపులు చేసి
చలపట్టి పడగొట్టి జాతరజరిపి
పారిపోనీయక పైపైకి జొచ్చి
గద్దించి వైరుల కెర కెర గొసె

1. కొసరాజు రాఘవయ్య చౌదరి, గండికోట యుద్ధం, పుట - 144
2. అందె పుట 151

మీర్జుమ్లాను పట్టించుట నరసింహుని లక్ష్యము. నరసింహుని రౌద్ర రసాగ్నికి భయపడి యవనసేనలు పరుగులెత్తినవి. గండికోట వీరుల కదన కౌశలాన్ని కథలుగా చెప్పుకున్నారు. తిమ్మానాయడు స్వయంగా యుద్ధరంగంలో ఉండి సైన్యాన్ని ప్రోత్సహిస్తున్నాడు. మంత్రి చెన్నమరాజు ద్వారరక్షణ కార్యభారం వహించాడు. యుద్ధరంగంలో శత్రువులకు కుటిల వన్నాగాలను చెప్పే పొధిలి లింగన్నను చెన్నమ రాజు చంపటానికి ప్రయత్నిస్తాడు. బ్రాహ్మణవధ తగదని తిమ్మానాయడు అభ్యంతరం తెలిపాడు. చెన్నమరాజు లింగన్న సిగపట్టి, అచ్చటచ్చట శిఖలను ఉంచి, తిరుక్షౌరం జరిపించాడు. రెండవరోజు యుద్ధంలోనూ గండికోట వారిదే పైచేయిగా మిగిలింది.

మూడవనాటి యుద్ధం మహోద్రేకంతో ప్రారంభమైంది. మీర్జుమ్లా మరఫిరంగుల సాయంతో కోటగోడలను కూల్చి వేయటానికి ప్రయత్నించాడు. చినతిమ్మానాయడు ఎనిమిది మణుగుల మందుగుండు నింపి, 'పెదరామబాణం' అనే ఫిరంగిని శత్రువులపై ప్రేల్పించాడు. మీర్జుమ్లా మెలకువతో తనసైన్యాన్ని క్రోసెడు దూరానికి తీసుకువెళ్ళాడు. దురదృష్టవశత్తు ఫిరంగిప్రేలుడు చినతిమ్మానాయుని సైన్యాన్ని నష్టపరచింది. కలతచెందిన మహారాజును మంత్రి చెన్నమరాజు ఓదార్చాడు. చినతిమ్మానాయడు ధైర్యం వహించి, సైనికులను ప్రోత్సహిస్తూ పోరు కొనసాగించాడు.

మీర్జుమ్లా బుడుత కీచుల నాయకుడైన 'మైయేధార' తో మంతనాలాడాడు. ఆసమయంలోనే, గండికోటవారి రామబాణము ఫిరంగి ప్రేలి గండికోట వారి సైన్యాలు నష్టమయ్యాయి. విజయంతథ్యం అనుకునే సమయంలోనే ముప్పు ముంచుకువచ్చింది. కనురెప్పపాటులో కథఅడ్డంతిరిగింది. సేనాని నరసింహనాయడు పరిస్థితిని గమనించాడు. గండికోట వైపు పోరాడే యోధులను లింగన్న ధనాశ చూపి నవాబు వైపు మరలించాడు. మూడునెల్లలు యుద్ధం జరుగుతూనే వుంది. లింగన్న వాళ్ళని శిబిరానికివచ్చి కౌటిల్యాన్ని ప్రయోగించాడు. నరసింహనాయడు లింగన్నతో కలసి, రహస్యంగా మీర్జుమ్లా వద్దకు వెళ్ళాడు. కార్యసాధకు డయిన మీర్జుమ్లా నరసింహనాయునికి స్వాగతం చెప్పి, గౌరవించాడు.

దండికోటను జయించి నిన్నే మహారాజును చేస్తానని మీర్జుమ్లా నరసింహనాయని ప్రలోభపెట్టాడు. కోట గుట్టు పట్లు చెప్పవలసిందిగా కోరాడు. నరసింహనాయుడు పదవీవ్యామోహంతో మీర్జుమ్లాకు సహకరించాడు. దొండేటి రంగనాథుడనే యోధుడు మహారాజుకు – జరిగిన మోసాన్ని వివరించాడు. చినతిమ్మానాయుడు తన సేనాని చేసిన ద్రోహం గ్రహించి ఆందోళన చెందాడు.

> "నరసింహా ! ఎంత నటన చేసితివి
> కుత్సితమ్మున కొంపగూల ద్రోసితివి
> కదనయోాయని కుప్పిగంతుల వేసి
> చప్పగా వైరికి పందు జూపితివి"

అని నరసింహ నాయని నిందించాడు.[1]

గోవిందమాంబ చినతిమ్మనాయని అనుమతిని అర్థించి, శక్తి స్వరూపిణి వలె శత్రువులపై విరుచుకుపడింది. శత్రుపక్షంలో చేరిన తనభర్త నరసింహనాయని ద్రోహాన్ని బాహాటంగా ఖండించింది. భార్య మాటలు విన్న నరసింహనాయుడు చేత ఉన్న ఖడ్గాన్ని ఒరలో పెట్టాడు. శత్రువులకు తన మద్దతును ఉపసంహరించుకొన్నాడు. మారిన పరిస్థితి చూచి మీర్జుమ్లా అనుచరుడయిన నబీఖానుడు నరసింహనాయని బాకుతో వెన్నుపోటు పొడిచాడు. నరసింహనాయుడు మరణించాడు. భర్తమరణం చూచి. గోవిందమాంబ ఆవేశంతో విజృంభించింది. యుద్ధరంగంలో తన భర్త మరణానికి కారణమయిన అబ్దుల్ నబీని వధించింది. నబీ విసిరిన కరవాలం గోవిందమాంబ ప్రాణాలను బలితీసుకుంది. అంతఃపురస్త్రీలు శత్రువులచే పరాభవం పొందడం యిష్టం లేక అగ్ని ప్రవేశం చేశారు. తిమ్మానాయుడు మితిమీరిన కోపంతో యుద్ధరంగంలో ప్రవేశించాడు. మీర్జుమ్లా దురాలోచనతో మరొక ఉపాయం ఆలోచించాడు. గుత్తిదుర్గం స్వీకరించి, గండికోటను మాకు కానుకగా యిచ్చినచో రెండువైపుల వారు స్నేహముతో ఉండవచ్చునని రాయబారిని పంపించాడు. చినతిమ్మనాయుడు మంత్రి చెన్నమరాజుతో సంప్ర

---

1. కొనరాజు రాఘవయ్య చౌదరి, గండికోట యుద్ధం, పుట – 192

ధించాడు. ఈ తతంగమంతా యిష్టంలేని తేరప్పనాయడు (చిన తిమ్మానాయని బంధువు) తిమ్మానాయని ధిక్కరించి సంభాషించాడు. కాని చినతిమ్మనాయడు జరిగిన రక్తపాతానికి పరితపించి, మీర్జుమ్లా మాయలో పడి, గండికోటనుండి బయటకు వచ్చాడు. గుత్తిదుర్గానికి బదులు హనుమనగుత్తి అనే కుగ్రామాన్ని చినతిమ్మానాయనికి యివ్వ వలసిందిగా మీర్జుమ్లాకు లింగన్న బోధించాడు. వచ్చిన చినతిమ్మనాయని మిక్కిలి గౌరవించి, విషముతో పొదిగిన వింతవస్త్రాలను బహుకరించ వలసిందిగా మీర్జుమ్లాకు లింగన్న బోధించాడు. ఆ వస్త్రాలు ధరిస్తే వింత బాధ కలిగి, ఉసిరి కాయలంత బొబ్బలు యేర్పడి, కొద్ది క్షణాలకే మరణించగలడని లింగన్న మీర్జుమ్లాకు బోధించాడు.

చినతిమ్మనాయడు మీర్జుమ్ల వద్దకు వచ్చినపుడు మీర్జుమ్ల స్నేహం నటించి, పునుగుగంధములను తిమ్మానాయని శరీరానికి పూసి, నూతన వస్త్రాలను బహూకరించాడు. గుత్తి దుర్గానికి మారుగా హనుమనగుత్తి గ్రామాన్ని ఫర్మానాగా వ్రాయించాడు. ఆ ఫర్మానా చదివిన చినతిమ్మా నాయడు మీర్జుమ్లా చేసిన మోసం గ్రహించాడు. మీర్జుమ్లను దూషించాడు. అంతకు పూర్వమే మీర్జుమ్ల యిచ్చిన విషపూరిత నూతన వస్త్రాలు ధరించిన చినతిమ్మానాయని శరీరం మీద వ్రణములు పుట్టాయి. చినతిమ్మానాయుడు తనకుమారుడయిన పిన్నయ్యను పిలిపించుకొని, విలపించాడు. తిమ్మానాయడు పిన్నయ్యను తనమంత్రి చెన్నమరాజుకు అప్పగించాడు. ఆ తరువాత దాహంతో నాలుక పిడుచకట్టి, నరములలో వేదన తీవ్రం కాగా, నాడులు బిగిసి, కడుపులో పేగులు కళ విళ క్రాగు చుండగా చినతిమ్మానాయడు ప్రాణాలు కోల్పోయాడు.

## తుది ఘట్టము :-

చినతిమ్మానాయని మరణంతో గండికోటలో పెమ్మసాని వారి పాలన అంతరించింది. గోల్కొండ నవాబు కుతుబ్‌శాహి పరమానంద భరితు డయ్యాడు. రాజబంధువులు, రాజభక్తులు గండికోటను విడిచి పెట్టారు. గుంటూరు సీమకు, తమిళ దేశానికి, మైసూరు ప్రాంతానికి వలస వెళ్ళారు. చినతిమ్మానాయని ఏకైక పుత్రుడైన పిన్నయ్య మీర్జుమ్లా వశ్య మిగిలిపోయాడు. బాలుడైన పిన్నయ్యను మీర్జుమ్లా రమణక్క అనే

చేసి అప్పగించి, తనకమనన్నలలో మెలగ వలసిందిగా ఆజ్ఞాపించాడు. తనతిమ్మానాయని వంశాంకురాన్ని కోటనుండి బయట వడలని విధంగా కట్టుదిట్టం చేశాడు.

స్వామిభక్తి పరాయణుడయిన ఘట్టమనేని తిప్పానాయుడు కార్య సాధకుడయిన చాకలి వెంకు తోడ్పాటుతో పిన్నయ్యను కోటనుండి తప్పించడానికి పూనుకున్నాడు. రమణక్క వీరికి సహకరించింది. చాకలి వెంకు పిన్నయ్యను దుప్పటిలో కప్పి పట్టణందాటించి, అడవిలో కాపు కాచిన తిప్పానాయుని చేరాడు. ఈ వివరాలు లోకానికి తెలియకుండా ఉండటంకోసం రమణక్క నీలాటిరేవులో పడి ప్రాణత్యాగం చేసింది. రమణక్క త్యాగం, దేశభక్తి మీర్జుమ్‌లాకు తెలిశాయి. పిన్నయ్యను వెదికి, ద్రోహులను తుదముట్టించ వలసిందిగా తన సైనికులను ఆజ్ఞా పించాడు. జాడవెసిగట్టి వెంటబడిన మీర్జుమ్‌లా సైనికులను తిప్పా నాయుడు, పెరకన్నలు వధించారు. పిన్నయ్య జాడ తెలియక మీర్జుమ్‌ల కలత చెందాడు. మీర్జుమ్‌ల దౌష్ట్యాలు మితిమీరిపోయాయి. అనుమాన మున్న రాజభక్తులను బంధించి, చిత్రహింసలకు గురిచేసి చంపాడు. ఆంధ్రశిల్పకళా నైపుణ్యంతో కళకళలాడే దేవాలయాలను పడగొట్టిం చాడు. విగ్రహాలకు అలంకరించిన నగలను దోచుకున్నాడు.

ఆ తరువాత మీర్జుమ్‌ల పెదతిమ్మనాయని కుమారుడైన వెంకటప్ప నాయని తమ సామంతునిగా ఉండునట్లు అంగీకరింప చేశాడు. గోల్కొండ ఖజానాకు గండికోట వారు కప్పం చెల్లించే పద్ధతిని ఏర్పరి చాడు. గండికోట రాజవంశీయులు పిన్నయ్య రక్షణకోసం ద్రావిడ ప్రాంతానికి తరలి వెళ్ళారు. వేలూరి తేరప్ప మైసూరు చేరాడు. వీరు డైన తేరప్ప దారిదోపిడీలు చేసే సుగాలీల దౌష్ట్యాలను అరికట్టాడు. ఒక పిండారి వనిత బాదషానుండి ఈటె విసరడం వల్లన తేరప్ప తనువు చాలించాడు. గండికోటలో ఉన్న వెంకటప్పానాయనిపై కొందరు స్వార్థపరులు అనేకమైన దోషాలను ఆరోపిస్తూ గోల్కొండ నవాబుకు ఫిర్యాదు చేశారు. కలతలు సృష్టించారు. రాజ్యంలో అశాంతి హెచ్చింది. వెంకటప్పానాయుడు మనోవేదనతో మరణించాడు. వెంకటప్పానాయని తరువాత, అతని కుమారుడు చినవెంకటప్ప గండికోట పాలకుడై

నామమాత్రపు పరిపాలన చేశాడు. రాజకీయ కుతంత్రాలకు విసిగిపోయి, గండికోటను విడిచి పెట్టి, కర్ణాటకలోని రాయదుర్గం చేరుకున్నాడు. మీర్జుమ్లా పాలనలో ప్రజలు ఎన్నోకష్టాలు అనుభవించారు. మీర్జుమ్లా కుమారుడు అమీన్ జుమ్లా అహంకారం పరాకాష్ట చేరింది. మీర్జుమ్లా సంపాదించిన అపారధనంతో తాను గోల్కొండ సుల్తాను అవుతానని అమీన్ జుమ్లా తప్పత్రాగి వదరసాగాడు. గోల్కొండ నవాబు కుతుబ్‌శాహి నియమించిన గండికోట అధికారి అక్బరు యీ విషయాలన్ని సుల్తానుకు తెలియపరచాడు. మీర్జుమ్లా ఆగడాలను విని విని విసిగి పోయిన నవాబు ఆగ్రహించి మీర్జుమ్‌లాను వెంటనే గోల్కొండ రావలసిందిగా కబురు చేశాడు. గోల్కొండలో కాలు పెట్టిన వెంటనే తనకు ప్రాణాపాయం సంభవిస్తుందని పసిగట్టిన మీర్జుమ్‌లా రత్నరాసులతో రహస్యంగా ఢిల్లీ చేరుకున్నాడు.

షాజహాను పాదుషాను దర్శించి వినయ విధేయతలను ప్రకటించి, అపూర్వమైన కోహినూరు వజ్రం బహూకరించాడు. క్రమంగా ఢిల్లీ కొలువులో పాదుషా దయవలన బలపడ సాగాడు. మీర్జుమ్‌లా పెత్తనం మితిమీరి పోయింది. షాజహాను కుమారుడయిన 'దారా' కు మీర్జుమ్లా ప్రవర్తన నచ్చలేదు. మీర్జుమ్లా 'దారా' ను అడ్డుతొలగించు కోవడానికి పథకం పన్నాడు. దారాకు యీ సంగతి తెలిసి మీర్జుమాను అంతం చేయ సంకల్పించాడు. మీర్జుమ్లా కట్టుబట్టలతో ఫకీరై మక్కా వెళ్ళాడని కొందరి అభిప్రాయం. నాటినుండి మీర్జుమ్లా మరెవరికి కనిపించలేదు.

"కాలిబాటలబడి గ్రామాల జుట్టి
కైఫీయతులెన్నియో గాలించిచూచి
స్థలపురాణాలను చక్క వీక్షించి
చాటుపద్యమ్ముల సారమ్ము దెలిసి
తాటాకు గ్రంథాల తగ పరీక్షించి
వెనుకటిగాథల వివరము నెరిగి
తాతముత్తాతల గాథలు చదివి
ఆచారకాండల యానవాళ్ళరసి

ఆయుధసంచయమ్మంత శోధించి
శాసన సంతతి రాసులు పోసి
యాదాస్త్రులన్నియు నాకళించుకొని
తద్వంశజుల పాత్రితదస్త్రాల్ విప్పి
విరుదావళుల భూరి విభవమ్ము నరసి
సత్యమ్మగు చరిత్రి సాధింపదలచి "

ఎంతో శ్రమపడి 'గండికోట యుద్ధం' కావ్యాన్ని రచించినానని శ్రీ కొసరాజు వివరించారు.

సత్యమ్మగు చరిత్రనే వారు రచించారు. కేవలం గండికోట పెమ్మసాని వారిని పొగడటమే ఉద్దేశ్యమైతే, చినతిమ్మానాయుడు యుద్ధ విరమణచేసి మీర్జుమ్లాతో సంధికి అంగీకరించిన విషయం విస్మరించే వారు. పరాక్రమ వంతుడయిన చినతిమ్మానాయుడు మీర్జుమ్లా బహూకరించిన విషపు కోకలు కట్టుకొని విగతజీవుడయిన తరువాతనే గండికోట వైభవం అంతరించింది. దీనిని విషాదాంత కావ్యంగా భావించడం సమంజసం.

'గండికోట యుద్ధం' అనడం కంటె 'గండికోట పతనం' అని పిలవటమే సముచితంగా ఉంటుంది. కళావికలైన కమ్మదొరల సాహస గాథను చారిత్రక ప్రమాణాలతో శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరి గారు రచించిన తీరు ప్రశంసనీయం.

జమ్మలమడుగు వాస్తవ్యులైన శ్రీ కలవటాల జయరామారావుగారు 'గండికోట చరిత్ర' కావ్యాన్ని తేటగీతులలో వ్రాశారు. రామారావుగారి కావ్యం 1925లో ముద్రించబడింది. శాలివాహన శకవర్షంబులు 1213వ సంవత్సర ప్రాంతములో గండికోటదుర్గాన్ని కాకభూపతి నిర్మించాడని రచయిత అభిప్రాయపడ్డారు. జయరామారావుగారి కథనం యిలా వుంది :

13వ శతాబ్దంలో ఓరుగల్లును పాలించేరాజు (పేరు తెలుపలేదు) తన ప్రతాపం వెల్లడి అయేలాగున, కడప సీమను జయించి, వల్లూరు నందుండి పరిపాలించాడు. చిన్నరాజులను తన ప్రతినిధులుగా అచ్చట నియమించాడు. వారిలో కాకభూపతి ఒకడు. బొమ్మెపల్లి

ప్రాంతాన్ని కాకభూపతి పాలించేవాడు. ప్రక్కనున్న కొండదరిని వేపకై వెళ్ళి గొప్ప ప్రాంతమును చూచాడు. పండితులను రప్పించి ఆ ప్రదేశాన్ని గురించి వివరించాడు. వారు ఆ అరణ్యములో కోటను కట్టించిన కీర్తిలభించునని తెలియజేశారు. రాజుసంతసముతో కో౦ కట్టించి "గండి కోట" అని పేరు పెట్టెను.

గండికోటను గూర్చిన యీ కథ స్పష్టమైన ఆధారాలతో నిరూపించ బడలేదు. వారు మరికొన్ని విశేషాలను వివరించారు. శా॥ శ॥ 1297లో హరిహర బుక్కరాయలు విజయనగరాన్ని పాలించేవారు. వారు కాశీ నుండి తిరిగివస్తూ గోదావరి యిసుకతిన్నెలపై నిద్రిస్తున్నారు. వారికి కలలో దేవుడు కలలో కనుపించి "భూమిలో వెదకినచో విగ్రహములు లభించును. వానికి దేవాలయములను నిర్మించండి" అని ఆజ్ఞాపించాడు. వారు మేల్కొని వెదకగా, నాలుగు విగ్రహాలు కనుపించాయి. వారు గుత్తి, పామిడిపురము, గండికోట, ఒంటిమెట్టలలో దేవాలయాలు నిర్మింప జేసి, విగ్రహాలను ప్రతిష్ఠించారు. గండికోటలోని మాధవుని ఆలయం మిక్కిలి ప్రసిద్ధమైంది. హరిహర, బుక్కరాయలు గండికోటమండలం, కడప, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, కందనోలు, మండలంలోని కొన్నిగ్రామాలు, కమలాపురం మొదలైన ప్రాంతాలను పరిపాలించారు.

శ్రీకృష్ణదేవరాయలు 1517 ప్రాంతంలో తిరుమలునితో కలిసి గండికోటను పరిశీలించాడు. తళ్ళికోట యుద్ధంలో విజయనగరం పతనమైన తరువాత అళియరామరాజు తమ్ముడు తిరుమలవిభుడు పెనుగొండ చేరాడు (ఇతడే రాయలవారితో కలసి గండికోట వెళ్ళినాడని రచయిత ఉద్దేశం.) తిరుమల రాయలు తిమ్మానాయని గండికోట ప్రభువుగా నియమించినాడని కలవటాల రామారావుగారు ఊహించి నారు. తిమ్మానాయుడు తనపేరుతో తిమ్మానాయుని పేట అనే గ్రామం నిర్మించాడు. కొంతకాలం తరువాత గోల్కొండ నవాబు గండికోటను జయించి "మీర్జుమ్‌లా" అనే తురక నవాబును తన ప్రతినిధిగా నియ మించాడు. మీర్జుమ్లా హిందూమత ద్వేషి. మాధవుని దేవాలయంలో నూరుగోవులను వధించాడు. కూలిపోయిన దేవాలయం రాళ్ళతో "జుమ్మామసీదు" అనే గొప్ప మసీదు నిర్మించాడు. మీర్జుమ్‌లా దుండ

గాలు మితిమీరాయి. గోల్కొండ నవాబుకు కూడా ఆగ్రహం కలిగి, మీర్జుమ్లాను దండించ దలచినాడు. మీర్జుమ్లా రహస్యంగా పారిపోయి ఔరంగజేబును ఆశ్రయించాడు.

1800 సంవత్సరంలో కడప అబ్దుల్ నబీఖాను గండికోటను ఆక్రమించి ప్రఖ్యాతినాడు. 1740 సంవత్సర ప్రాంతాన మహారాష్ట్రులు గండికోటను ఆక్రమించారు. తదుపరి టిప్పుసుల్తాను గండికోటను స్వాధీనం పరచుకొన్నాడు.

ఇదంతయు శ్రీ కలవటాల జయరామారావుగారి గండికోట చరిత్ర లోని సారాంశం. కథనంలో వాస్తవికత కనుపిస్తున్నా, కాలనిర్ణయంలో స్పష్టతలేదు. హరిహర బుక్కరాయలు, కృష్ణదేవరాయలు, తిరుమల రాయలు, అళియరామరాయలు గండికోటను సందర్శించారనడం సబబుగానే వుంది. గోల్కొండ నవాబు గండికోటను ఆక్రమించినాడనే విషయం సత్య సమ్మతం. మీర్జుమ్లా దుర్మార్గాలు చరిత్ర ప్రసిద్ధం. "చరిత్రలో పరమ దుర్మార్గులిద్దరు. మొదటివాడు మల్లి కాఫరు. రెండవ వాడు మీర్జుమ్లా. వీడు చేసిన దుర్మార్గాలు చాల ఘోరమైనవి. కొన్ని చరిత్ర కెక్కనవి. ఎన్నో దుర్మార్గాలు జనుల నోళ్ళలో నిలిచి ఉన్నాయి. గండికోట మాధవస్వామి శ్రీనాధుని కాలమునాటికే మహా ప్రసిద్ధుడు. మీర్జుమ్లా దుర్మార్గాలతో ఆయన మైదుకూరు చేరినాడని జనులంటారు."[1] అని సరస్వతీ పుత్ర పద్మశ్రీ పుట్టపర్తి నారాయణా చార్యులుగారు వివరించారు. జనుల నోళ్ళలో నిలిచిన యిటువంటి కథలను స్వీకరించి కలవటాల జయరామారావుగారు "గండికోట చరిత్ర" రచించారు.

శ్రీ కొసరాజు రాఘవయ్య చౌదరిగారు వ్రాసిన "గండికోట యుద్ధం" చారిత్రక ప్రమాణాలతో నిండివుంది, ఈ కావ్యంలో రామారావుగారి "గండికోట చరిత్ర" లో వలె కల్పనాయుతమైన కథలు కనుపించవు. ప్రతిసంఘటనకూ స్పష్టమైన ఆధారం వుంది.

పెమ్మసాని తిమ్మానాయుడు మాధవస్వామి భక్తుడని, వైష్ణవ మతాభిమాని అని చెప్పవచ్చును. శా॥ శ॥ 1566 లో (క్రీ.శ.1644)

1. కొసరాజు రాఘవయ్యచౌదరి, గండికోటయుద్ధం, పుట – 2 (పీఠికలో.)

పెమ్మసాని తిమ్మానాయుడు బుక్కపట్నం తాతాచార్యుల వారికి గండి కోటను దానశాసనం వ్రాసి యిచ్చాడని తెలుస్తుంది.[1]

"క్రీ. శ. 165?లో గోల్కొండ మంత్రి మీర్జుమ్లా గండికోటను పోర్చుగీసువారి సహాయంతో ఆక్రమించి, కోటలోనివారిని నిర్బంధించి కోటలోని రాగి, కంచు విగ్రహాలను కొనిపోయి, 20 ఫిరంగులు చేయించాడు" [2] అని చారిత్రక కాలసూచి తెలియజేస్తుంది.

పై విషయాలను బట్టి కొసరాజువారి "గండికోట యుద్ధం" జరిగిన సమయం క్రీ శ. 1652 ప్రాంతమని స్పష్టమౌతున్నది. చారిత్రక వాస్తవాలతో, వ్యక్తులతో, స్పష్టమైన కాలనిర్ణయంతో, ఉత్తేజకరంగా వ్రాయబడిన గండికోటయుద్ధం ప్రామాణికమైన చారిత్రక గేయ కావ్యం. ఇంతటి విశిష్టమైన ఈ కావ్యకర్త 27–10–1986 సోమవారం రాత్రి గం. 10–15 ని॥లకు పరమపదించారు.

---

1. జె. ఆర్. రెడ్డి, చారిత్రకకాలసూచి, పుట – 118.
2. అందే పుట – 118.

— —

# బ్రహ్మంగారి చరిత్ర

శ్రీ పెద్దోజు నమశ్శివయ్యగారు వ్రాసిన ప్రథమ గేయకావ్యం "బ్రహ్మంగారి చరిత్ర." ఈ గేయకావ్యం 1986 జనవరిలో ప్రచురింపబడింది. గుంటూరుజిల్లా, నరసరావుపేటలోని "అభ్యుదయ భారతి" సాహితీ సంస్థవారు గ్రంథ ముద్రణకు ఆర్థికసహాయం అందించారు. 10-2-1986 వ తేదీన అభ్యుదయ భారతి వారు ఏర్పాటుచేసిన గ్రంథావిష్కరణ సభ సాహిత్యాభిమానులకు సంతోషం కలిగించింది.

శ్రీ నమశ్శియ్యగారు పల్నాడు తాలూకాలోని గామాలపాడు గ్రామంలో 1929లో జన్మించారు. ప్రస్తుతం దుర్గివాస్తవ్యులు. 1980-81 సంవత్సరాలలో వీరు హైదరాబాదు శిల్పశాస్త్రప్రచురణ శాఖలో లేఖకునిగా పనిచేశారు. జొన్నగింజ, అర్జున గర్వభంగం, వేంకటేశ్వర చరిత్ర మొదలగు వీరి అముద్రితరచనలు త్వరలో వెలుగు చూడనున్నాయి. శ్రీ నమశ్శివయ్యగారు హరికథకులు, నటులు కూడా. దాదాపు ముప్పది సంవత్సరాలనుండి హరికథాగానం చేస్తూ, స్వర్ణపతాకాలనూ, కంకణాలను సాధించారు. శిల్పకళలో, స్వర్ణకార వృత్తిలో, సాహిత్య శిల్పంలో ఎన్నో మెలకువలను వీరు ప్రదర్శించారు. ఈ కావ్యం చదివి పెద్దలు తమ అమూల్యమైన అభిప్రాయాలను, ఆశీస్సులను, అభినందనలను అందించారు.

"లోకకల్యాణం కోసం అవతరించిన పుణ్యపురుషుల జీవిత చరిత్రను తీసుకొని కావ్యంగా వ్రాసినప్పుడు, అది ప్రజాదరమును పొందుటయేగాక కవికికూడా ఆత్మతృప్తిని కలిగిస్తుంది. బ్రహ్మంగారి చరిత్రను గేయ కావ్యంగా శ్రీ పెద్దోజు నమశ్శివయ్యగారు రచించి ధన్యులైనారు. వీరబ్రహ్మంగారు తెలుగువారు కావడం మన అదృష్టం. అటువంటి మహా వ్యక్తిని కన్న తెలుగు తల్లిదే భాగ్యము . . . . అజ్ఞానమును తొలగించి సుజ్ఞానమును కలిగించే బ్రహ్మంగారి చరిత్రను రచించిన నమశ్శియ్యగారికి నా అభినందనలు"[1] అని కళాప్రపూర్ణ డాక్టర్ దాశరథిగారు తమ అభిప్రాయం తెలియజేశారు.

---

1. పెద్దోజు నమశ్శివయ్య భాగవతార్, బ్రహ్మంగారిచరిత్ర, (పీఠికలో) పుట-1

"బ్రహ్మంగారి చరిత్రను శ్రీ నమశ్శివయ్యగారు మాత్రా చ్ఛందస్సులో సరళశైలిలో రచించారు. ఖండగతిలో సాగిపోయే ఈ సుదీర్ఘకావ్యం బ్రహ్మంగారి చరిత్రను అందించడంలో కృతకృత్య మయింది."[1] అని డాక్టర్ సి. నారాయణ రెడ్డిగారు అభిప్రాయపడ్డారు.

"…. ఈ కవిత కాలజ్ఞాన గీతలవలె వేమనయోగి వ్రాతలవలె తెలుగు వారి నాలుకల మీద నిత్యము నాట్యమాడగలదని"[2] కొండవీటి వేంకట కవిగారు విశ్వసించారు.

"శ్రీ నమశ్శివయ్యగారు కథను రమణీయముగా వివరించుట యందును, తత్త్వవిషయములను తెల్పుటయందును చూపిన నేర్పు ప్రశంసాపాత్రముగా నున్నది. వారి గేయములు పదేసి మాత్రలతో గూడిన పాదములతో నొప్పుచు, ధారాశుద్ధి శోభితములై యలరారు చున్నవి. అచ్చటచ్చట నవ మాత్రికములైన పాదములు కూడ కలవు. కవిగారు హరికథా కథన నిపుణులగుటచే, గేయములను లయతాళబద్ధము లుగా నొనరించి పాడుటకనువుగా రచించియుండిరి. వారి భాష సుబోధకమై సామాన్యులు కూడ చదువుకొనుటకు వీలుగా నున్నది. మహామహిమ సంపన్నులైన శ్రీ బ్రహ్మం గారి చరిత్రనింత మనోహరముగా రచించి ప్రజలయందు జ్ఞానమును, సంస్కారమును కలిగించుటకై యత్నించిన కవిగారిని అభినందించుచున్నాను"అని డా॥ దివాకర్ల వేంకటావధానిగారు ప్రశంసించారు.

నమశ్శివయ్యగారి రచన సరళసుందరమయినదనుట అతిశయోక్తి కాదు. శ్రావ్యమైన మధురస్వరంతో హరికథా గానం చేసే కవిగారి గళంనుండి, కలంనుండి ప్రశంసనీయమయిన కావ్యం వెలువడింది. ఆకాశవాణి వారు ప్రసారం చేసిన వీరి హరికథాగాన కార్యక్రమాలు ఆబాల గోపాలాన్ని అలరించాయి. నమశ్శివయ్యగారి ఆధ్యాత్మిక ప్రసంగాలు వినసొంపుగా ఉంటాయి. పద్యగతమైన భావాన్ని స్పష్టంగా అర్థం

---

1. పెద్దొజు నమశ్శివయ్య భాగవతార్, బ్రహ్మంగారిచరిత్ర. (పీఠికలో) పుట–2
2. అందే పుట – 3
3. అందే పుట – 5

చేసుకొనే పాఠకుల సంఖ్య పరిమితంగా ఉంది, కనుక నమశ్శివయ్యగారు గేయంలో కావ్యం వ్రాశారు. "గోవింద వాక్యములు" వ్రాసిన బ్రహ్మంగారి జీవిత చరిత్రము గేయంలో వ్రాయుటమే సమంజసం. సాధారణ ప్రజల లోకి చొచ్చుకు పోయిన వీరబ్రహ్మేంద్ర స్వాములవారి తత్త్వాలను దృష్టిలో పెట్టుకొని, రచయిత గేయం ఎన్నుకొన్నారు. శ్రీ జవంగుల నాగభూషణదాసుగారు రచించిన "కాలజ్ఞాన సహిత శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వాములవారి సంపూర్ణ చరిత్ర", తన కావ్యానికి ఆధారం అని శ్రీ నమశ్శివయ్యగారు స్పష్టం చేశారు. శ్రీ చాటుకొండ సుబ్బయ్యగారిచే ప్రకటింపబడిన (1950లో) "వీరబ్రహ్మహరి గోవింద వాక్యములు", "వీరబ్రహ్మయ్యగారి సంతాన చరిత్రము", మరికొన్ని నాటకాలను పరిశీలించి, తన కావ్యానికి నిండుదనం చేకూర్చటానికి ప్రయత్నించానని కవిగారు వివరించారు.[1]

వీరబ్రహ్మంగారిని గూర్చి వచన కావ్యాలు, నాటకాలు ఉన్నాయి కాని, గేయకావ్యాలు లేకపోవడం నమశ్శివయ్యగారి దృష్టిని ఆకర్షించింది. అందుచేత వీరు బ్రహ్మంగారి చరిత్రను గేయకావ్యంగా రూపొందించారు. గ్రంథావిష్కరణ సభలో ఈ కావ్యంలో కొంతభాగం గానం చేసి, నమశ్శివయ్యగారు శ్రోతలకు ఆనందపారవశ్యం కలిగించారు. సభాధ్యక్షులైన శ్రీ చిట్టిప్రోలు సుబ్బారావుగారు (ఆంధ్రోపన్యాసకులు ఎస్. ఎస్. ఎన్. కళాశాల, నరసరావుపేట) ఆనందంతో, నమశ్శివయ్యగారి యితర రచనలను ముద్రించడానికి ఎంతైనా ఆర్థిక సహాయం చేస్తామని ప్రకటించడం ముదావహం.

**కథాంశం :**

ఈ కావ్యమునకు కథావస్తువు బ్రహ్మంగారి జీవితం. నమశ్శివయ్యగారు ఈ గేయకావ్యాన్ని పది ప్రకరణాలుగా విభజించారు. ఆయా ప్రకరణాలకు పేరు పెట్టిన శీర్షికలు సముచితంగా ఉన్నాయి.

**అభయుదానము :**

కలికాలమున పాపభారంతో క్రుంగిపోవు భూదేవి మొరవిని, శ్రీ మహావిష్ణువు —

1. శ్రీ నమశ్శివయ్యగారితో ముఖాముఖి, 1986 మే 10 వ తేదీ.

" అవని విశ్వబ్రాహ్మణా
న్వయమ్మున సుకృతి
పరిపూర్ణయాఖ్యునకు
ప్రకృతాంబ గర్భమున
ప్రభవింతునేను వీ
రం బొట్లనంగ వీ
రప్పయ్య యనంగ వీ
రబ్రహ్మమనగ నిల
పిలువబడుదు నేను "

అని అభయమిచ్చాడు.

## జననము

దక్షిణ భారతదేశంలోవున్న బ్రహ్మండపుర వాస్తవ్యులు పరిపూర్ణయా చార్యులు, ధర్మపత్ని ప్రకృతాంబతో కలసి, పుత్రసంతానం కోరి కాశీపురి వెళ్లారు. విశ్వనాధుని కృపవల్ల, ప్రకృతాంబకు పుత్రసంతానం కలిగింది. శిశువు జన్మించిన తరువాత పూర్ణయా చార్యులవారు పరమప దించారు. బాలుని అత్రిమునికి అప్పగించి ప్రకృతాంబ భర్తను అనుస రించింది. నందికొండ గ్రామంలో నివసించే వీరభోజయా చార్యులు, పాపాంబలు సంతానార్థులై పుణ్యక్షేత్ర పర్యటన ప్రారంభించారు. అత్రిమునీంద్రుడు వారికి తాను పెంచుచున్న వీరంభొట్లయ్యను యిచ్చి, సంతోషం కలిగించాడు. పదునాల్గు సంవత్సరాలకే వీరంభొట్లయ్య సర్వ విద్యలలోని సారం గ్రహించాడు. కొంతకాలానికి వీరభోజయా చార్యులు స్వర్గస్థులైనారు.

## యాత్ర

ఒకనాడు వీరంభొట్లయ్య తాను దేశాటనము చేయ నిశ్చయించానని తల్లికి చెబుతాడు. పుత్రవ్యామోహంతో విలపిస్తున్న తల్లిని ఊర

డించి, పిండోత్పత్తి క్రమాన్ని వివరించి విరక్తిమార్గం బోధించాడు. దక్షి
ణదేశం పర్యటించి, హరిహరపురం వద్ద ఆశ్రమం నిర్మించుకొని ధ్యాన
నిష్ఠతో కాలం గడపసాగాడు. గోహత్యాపాతకం చుట్టుకున్న ఆనందభైరవు
డనే కాశీరాజును "ముసల్మాను వంశంలో సిద్ధుడను పేరుతో జన్మించి నా
వద్దకు రావలసినది" అని ఉపదేశించాడు.

## కాలజ్ఞానము

వీరంభొట్లయ్య హరిహరపురం విడిచి, శ్రీశైలం మొదలైన పుణ్య
క్షేత్రాలను సేవించి, బనగాను పల్లె చేరాడు. చీకటి పడటంవల్ల గరిమిరెడ్డి
అచ్చమ్మ యింటి అరుగుపై నిద్రించాడు. అచ్చమ్మగారి యింటిలో
పాలేరుగా చేరి, ఆవుల కాయసాగాడు. అడవిలో ఆవులమంద చుట్టూ గీత
గీసి, నిశ్చింతగా సమీపమునందలి కొండగుహలో పద్మాసనస్థుడై కాల
జ్ఞానం వ్రాయసాగాడు. అచ్చమ్మ, ఆమె భర్త వెంకటరెడ్డి, రహ
స్యంగా స్వామివారిని వెంబడించి విషయం గ్రహించారు. ఆ పుణ్యదంపతు
లకు వీరబ్రహ్మంగారు కాలజ్ఞానాన్ని వినిపించారు. అంధుడైన అచ్చమ్మ
కుమారునకు చూపు ప్రసాదించాడు. బనగానుపల్లె నవాబు కాలజ్ఞానం విని
ధన్యత చెందాడు.

## కళ్యాణము

వీరబ్రహ్మంగారు బనగానుపల్లె విడిచిపెట్టి, కడపజిల్లాలోని కందిమ
ల్లయ పల్లె చేరాడు. సమీపంలోని పెదకామెర్ల గ్రామవాస్తవ్యులైన శివ
కోటయ్య, జ్ఞానాంబల కుమార్తె గోవిందమాంబ. బ్రహ్మంగారు ఆ గ్రామం
వెళ్లి, మరణించిన ఒకనిని బ్రతికించి తన మహిమ ప్రదర్శించాడు.
గోవిందమ్మగారు సన్యాసి రూపాన్ని ధరించిన వీరబ్రహ్మంగారి గొప్పద
నాన్ని తల్లి దండ్రులకు వివరిస్తుంది. బ్రహ్మంగారిని తప్ప మరొకరినీ
పరిణయమాడననీ స్పష్టం చేస్తుంది. బ్రహ్మంగారు, గోవిందమాంబలు
దంపతులైనారు.

## సిద్ధుడు

కందిమల్లయ పల్లె సమీపంలోని ముడుమాల గ్రామంలో, దూదేకుల కులానికి చెందిన పీరుసాహెబ్, ఆదంబీ దంపతుల కుమారుడు "సిద్ధయ్య". సిద్ధయ్య బ్రహ్మంగారిని ఆశ్రయించి బ్రహ్మవిద్యను బోధించ వలసిందిగా ప్రార్థించాడు. నాటినుండి సిద్ధుడు స్వామివారికి ప్రధాన శిష్యుడయ్యాడు.

బ్రహ్మంగారు సకలజనులకు "సద్బోధ" చేయవలసిన సమయం ఆసన్నమైనదని గుర్తించారు. శిష్యసమేతుడై అనేకప్రాంతాలు పర్యటించాడు. విజయవాడ, హైదరాబాదు, తిరుపతి, పుష్పగిరి, కడప మొదలైన ప్రాంతాలు పర్యటించాడు. ఎన్నో మహిమలు ప్రదర్శించాడు.

## కక్కనికి ఉపదేశము

సిద్ధునకు బ్రహ్మంగారు బ్రహ్మోపదేశం చేయాలని నిర్ణయించారు. గురుశిష్యులు ఏకాంతప్రదేశంలోవున్న మర్రి చెట్టు క్రింద కూర్చున్నారు. అదే సమయంలో "కక్కడు" అనే పంచముడు కట్టెల మోపు బరువు మోయలేక ఆ మర్రి చెట్టు క్రిందనే కూర్చున్నాడు. కక్కడు సిద్ధుడికి బోధించిన షట్చక్ర వివరాలు విని ఆనందించాడు. నిద్రించే భార్య గర్భాన్ని పదునైన కత్తితో చీల్చాడు. ఏమీ కనుపించక కక్కడు విలపిస్తూ వెళ్లి బ్రహ్మంగారి కాళ్లపై పడ్డాడు. బ్రహ్మంగారు కక్కనితో కలసి, సిద్ధయ్య వెంటరాగా కక్కని యింటికి వెళ్లారు. దయతో కక్కనికి, సిద్ధయ్యకు జ్ఞాన నేత్రాలు ప్రసాదించారు. కక్కడి భార్యను బ్రతికించాడు. "ధిగువమెట్ట" గ్రామం చేరి, కరిగించినలోహాన్ని మంచినీరుగా త్రాగి తన మహిమ చూపాడు. నంద్యాల పట్టణం వెళ్లి, సిద్ధునిచేత పుట్టెడు అన్నం భుజింప జేసి, విశ్వబ్రాహ్మణ సంఘం వారికి ఆశ్చర్యం కలిగించాడు.

## మహిమలు

శిష్యబృందంతో దేశసంచారంచేస్తూ బ్రహ్మంగారు ఎన్నో మహిమలు చూపారు. కడపనవాబు "తనవద్దగల చూడి గుఱ్ఱం ఏ శిశువును ప్రసవిస్తుందని" ప్రశ్నించగా, బ్రహ్మంగారు ఆ గుఱ్ఱం మగ శిశువును కలిగి ఉందని తెలిసి, వారిసందేహం తీర్చటానికి, ఆ గుఱ్ఱం కడుపు నుండి పురుషాశ్వాన్ని తీసి చూపారు. నవాబుకు కాలజ్ఞానం బోధించారు. అల్లాడు పల్లె మార్గంలో బ్రహ్మంగారిని దోచుకోవటానికి వచ్చిన దొంగలు కాళ్లు చేతులు కదలికలు లేకుండా కట్టుపడిపోగా, స్వామిని ప్రార్థించి విముక్తులయ్యారు. పుష్పగిరి బ్రాహ్మణులు స్వాముల వారిని అవమానించగా, గ్రామంలో మంటలు చెలరేగాయి. బ్రాహ్మణులు పదే పదే ప్రార్థించగా, స్వామి కరుణించి గ్రామాన్ని యథాతథంగా మార్చాడు. కందిమల్లయ పల్లె చేరి ఎందరినో సన్మార్గంలోకి మరలించాడు.

## జీవసమాధి

ధ్యానయోగమందే తనువుచాలించాలని బ్రహ్మంగారు సంకల్పించారు. జీవ సమాధి కావలయునని నిర్ణయించుకొన్నారు. తన కుమారుడైన గోవిందయ్యకు బ్రహ్మవిద్యారహస్యములను బోధించి, మఠాధిపత్యాన్ని అప్పగించాడు. బనగాను పల్లె వెళ్లి, పూలు తీసుకురావలసిందిగా సిద్ధయ్యను పురమాయించాడు. భక్తులందరూ సమావేశ మయ్యారు. బ్రహ్మంగారు దయతో, జరుగబోవు ఎన్నో విషయాలను వివరించి, తాను మరల వీరభోగవసంతరాయులను పేరుతో జన్మించగలనని తెలియ జేశారు. తాను నిత్యము ధరించు వస్తువులను తన ప్రియశిష్యుడైన సిద్ధయ్యకు అందించవలసిందిగాచెప్పి, ఆ మహాతేజస్వి జీవసమాధి యైనాడు.

## పాదుకా పట్టాభిషేకము

పూలతో తిరిగివచ్చిన సిద్ధయ్య బ్రహ్మంగారి జీవసమాధి వద్ద కూర్చొనీ, ఎంతగానో పరితపించాడు. ప్రాణత్యాగం చేయాలని భావిం

చాడు. బ్రహ్మంగారు సాక్షాత్కరించి సిద్ధుని విచారం పోగొట్టాడు. వీరబ్రహ్మంగారి ఆజ్ఞను శిరసావహించి, వృద్ధులైన తల్లి దండ్రులను సేవించుటకై సిద్ధయ్య తిరిగి ముడుమాలగ్రామం చేరుకున్నాడు. మఠం కట్టించి, గురు పాదుకలకు పూజ జరిపించాడు. బ్రహ్మంగారి కుమారుడయిన పోతులూరయ్య తన తండ్రి సమాధిలో బ్రతికి లేడని సందేహించాడు. తన తల్లి గోవిందమాంబ, సిద్ధయ్య అభ్యంతరంచెప్పినా పెడచెవిన బెట్టి, సమాధిపై ఉన్న రాతిపలకను తొలగించాడు. ధ్యాన భంగం చెందిన బ్రహ్మంగారు కోపించి పన్నెండు సంవత్సరాలు కొండపై వున్న చింత చెట్టు క్రింద కూర్చొని తపస్సు చేయవలసిందిగా ఆజ్ఞాపించారు. పోతులూరయ్య పన్నెండు సంవత్సరాలు తపస్సుచేసి ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు. శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారు దైవాంశ సంభూతులని ప్రజలు నిశ్చయించి, స్వామిని ధ్యానించి తరించారు.

## చారిత్రకత

శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవిత కథ ప్రసిద్ధమైనదే. వారు ప్రదర్శించిన మహిమలను, కాలజ్ఞాన విశేషాలను నేటికీ ఆంధ్ర ప్రజలు విశ్వసిస్తున్నారు. ఏదయినా విపరీతం సంభవిస్తే, బ్రహ్మంగారి కాలజ్ఞానాన్ని ఉదాహరిస్తారు. శ్రీమహావిష్ణువే వీరబ్రహ్మంగా అవతరించాడనే విషయాన్ని చరిత్రకారులు విశ్వసించరు. అయితే, బ్రహ్మంగారి ఉనికిని చరిత్రకారులు కాదనజాలరు.

దక్షిణ భారతదేశంలో బ్రహ్మాండపురంలో బ్రహ్మంగారు జన్మించారని కథనం. బ్రహ్మాండపురం ప్రస్తుతం ఎక్కడవుందో తేల్చి చెప్పడం అసాధ్యం. అయితే బ్రహ్మంగారు ఆంధ్రులే అనీ, ఆంధ్రదేశంలో నివసించారని చెప్పడానికి ఎవరికీ అభ్యంతరం ఉండదు. బ్రహ్మంగారు సంచరించిన, నివసించిన స్థలాల్లో అధికభాగం రాయలసీమకు సంబంధించినవి. బ్రహ్మంగారి మఠాలను నిర్మించడం, బ్రహ్మంగారి తత్త్వాలను

అభిమానించడం, గానం చేయడం ఆ ప్రాంతంలో ఎక్కువ. కనుక బ్రహ్మంగారు పుట్టి, పెరిగి, నివసించిన ప్రాంతం రాయలసీమగా భావించవచ్చు. కందిమల్లయ పల్లె స్థిరనివాసం. ఎన్ని ప్రాంతాలు పర్యటించినా తిరిగి కందిమల్లయ పల్లెకి వారు చేరారు. బ్రహ్మంగారు సర్వశాస్త్ర పారంగతులనే విషయం స్పష్టమౌతుంది. వైద్యశాస్త్రంలో నేర్పరులనే భావం బ్రహ్మంగారి చరిత్రను చదివిన వారికి కలుగక మానదు. బ్రహ్మంగారి సిద్ధాంతాలు అన్ని కులాల వారిని ఆకర్షించాయి. అన్ని మతాలవారు ఆయనను అభిమానించారు. హైందవేతరులైన కడప నవాబు, కర్నూలు నవాబు, హైదరాబాదు నవాబు బ్రహ్మంగారిని గొప్పగా సత్కరించారు. బ్రహ్మంగారి గీతాలు సాధారణ ప్రజానీకానికి అందుబాటులో వుండి, వారిని సంస్కారవంతులను చేయటానికి ఉపకరించాయి.

"బ్రహ్మంగారు ఒక అసాధారణాంధ్ర పురుషుడు. ఆంధ్రదేశమునకే గాక, యావద్భారత దేశమునకు గూడ వలయు సంస్కారములను, సందేశములను సూచించి ఒసంగిన మహాజ్ఞాని. అనేకులు మహాపురుషులు సాధకులుగా పుట్టి తమ జీవితమందే యోగమునో అనుష్ఠించి తాము తరించి లోకమునకు తరుణోపాయమును బోధించి పోవుచుందురు. ఈ మహాపురుషుడట్లు గాక, సిద్ధుడుగానే అవతరించి ఆయాసాధనములను ఆత్మముక్తికిగాక లోకసంగ్రహార్థమై తానాచరించి లోకోద్ధరణము చేసినట్లు గ్రహింప గలుగుచున్నాము. హిందూమహ్మదీయైకమత్యమున కాతడొనర్చిన కృషియేమి, అర్హులైన వారు శూద్రులైనను, చండాలులైనను, హైందవేతరులైనను వారికి ఉపనిషద్రసాయనము నందించి తరింపజేయుటలో నేమి, రజస్వలానంతర వివాహాది సంస్కారములు, చేతిపనులు, శిల్పము, యోగాభ్యాసము మొదలగు వానిని ప్రోత్సహించుటలో నేమి, కులభేద ప్రాధాన్య నిరాసముతో నేమీ ఈతడు చూపిన బాటలు జగదారాధ్యములు" [1] అని శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారు బ్రహ్మంగారి సంస్కరణలను విశదంచేశారు.

---

1. శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు, 1959 డిసెంబరు, భారతి మాసపత్రిక.

బ్రహ్మంగారు క్రీ. శ. 1604 ప్రాంతమున జన్మించి 1687 సం॥ లో జీవసమాధిని పొందినాడని శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులుగారి అభిప్రాయం. 17 వ శతాబ్దం మొత్తం బ్రహ్మంగారి మహిమలతో నిండివున్నట్లు వారు భావించారు.[1] బ్రహ్మంగారు గరిమిరెడ్డి అచ్చమ్మగారి యింటిలో అవులకాపరిగా ఉన్న నాటికి, ఆయనకు 12 లేక 15 సంవత్సరములకంటె ఎక్కువ వయస్సు ఉండదనుట తార్కికముగ అంగీకరింపదగిన విషయం. బ్రహ్మంగారు సంచరించిన ప్రాంతములు, వారి జీవిత వివరములు చరిత్ర సమ్మతములే. బ్రహ్మంగారి జీవసమాధి వద్ద నేటికి పూజలూ తిరునాళ్లూ జరగడం కనుపిస్తానే ఉన్నది. కనుక బ్రహ్మంగారి చరిత్ర వాస్తవఘటనలతో ముడిపడి వుంది. శ్రీ పెద్దోజు నమశ్శివయ్య గారి "బ్రహ్మంగారి చరిత్ర" గేయకావ్యంలో, కొన్ని అద్భుత సంఘటనలు మరికొన్ని అజ్ఞాత స్థలనామాలు తొలగిస్తే, మిగిలిన కావ్యమంతా చారిత్రక ప్రమాణాలతో నిండివుంది. వీరబ్రహ్మంగారిని గూర్చి రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి పరిశీలన గమనార్హం.

"పోతులూరి వీరబ్రహ్మము—జాతిచేనితడు కంసాలి. ఇతనికాలము సుమారు పదునేడవ శతాబ్దమధ్యము. వేమన్నను గూర్చి మనము నిర్ణయించిన కాలమే సరియైనచో నితడతనికి సమకాలికుడగును. స్థలము పోతులూరు. కర్నూలు మండలమందలి బనగాన పల్లెలో నుండిన గరిమిరెడ్డి వెంకటరెడ్డియను నాతని యింట ఇతడు చిన్నప్పుడు పసులగాచుచుండెను. ఆ వయసునందే యితడనేకాద్భుత కార్యములు చేసెను. చచ్చిన వారిని బ్రతికించెను. ఊరిదేవర జాతరలో యితని యాజ్ఞ ప్రకారము అందఱియెదుర చండికా విగ్రహము లేచివచ్చి యితనికి చుట్ట కాల్చుకొనుటకు నిప్పు దెచ్చియిచ్చెనట! ఈతడును విగ్రహారాధనలు, జాతిభేదములు, జాతరులు మొదలగు వానిని ఖండించి, ప్రజలకు హితోపదేశము

1. శ్రీ కొండూరు వీర రాఘవాచార్యులు 1959 డిసెంబరు భారతి మాస పత్రిక పుట-52

చేసెను. ఇతడు సన్యాసిగాడు. గొప్ప సంసారి. భార్య గోవిందమ్మ. ఐదుగురు కొడుకులు, ఒక్క కూతురును ఉండిరి. ఇతని శిష్యులందఱిలో దూదేకుల సిద్ధయ్య ప్రసిద్ధుడు. పండెండ్రేండ్ల చిన్నవయస్సునందే తన మహమ్మదీయ మతమును, తల్లి దండ్రులను వదలి వీరబ్రహ్మమునాశ్రయింపగా, అతడును నిరాక్షేపముగా నితనిని శిష్యునిగా నంగీకరించి బోధించెను. ఈ గురు శిష్యుల భక్తి వాత్సల్యములు మనసును కరిగించు నట్టివి........ఇతడును వేమన్నవలె సర్వసమత్వముగల యద్వైత విద్యను బోధించు పెక్కు పద్యములను, పాటలను వ్రాసినట్లున్నది" [1] వేమన వంటి సాధుపుంగవునిగా, ప్రజాకవిగా బ్రహ్మంగారిని భావించుట మిక్కిలి సమర్ధనీయమైన విషయం. శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులు గారు చేసిన కాలనిర్ణయం, శ్రీ అనంతకృష్ణశర్మగారి అభిప్రాయం సమానంగానే వున్నాయి. కులమత భేదాలను ప్రక్కకు నెట్టి, బహిరాడంబరాలను దుయ్యబట్టి, అవిశ్రాంతంగా సామాజికులకు సద్బోధ చేసిన బ్రహ్మంగారి వంటి మహనీయుల జీవిత చరిత్రలు బహుళ ప్రచారం పొందవలసిన అవసరం ఎంతైనా వుంది.

శ్రీ నమశ్శివయ్యగారు యీ గేయకావ్యాన్ని నాటకీయ శైలిలో అత్యంత రమణీయంగ రూపొందించారు. వీరబ్రహ్మేంద్ర స్వాములవారు కులమత భేదాలను ఖండించి సద్బోధ చేసిన గురుమూర్తులు. వారి ప్రబోధాలను ప్రతిబింబింప జేయడంలో రచయిత సఫలీకృతులయ్యారు. బనగానుపల్లె నవాబుతో బ్రహ్మంగారి సంభాషణ గమనార్హం.

"మతభేదముల ద్రెంచి
మంచి నెంచుచు ప్రజల
పాలించుచుండు టే
ప్రభువులకు ధర్మ మా
లన సేయుమయ్యా! కా
లజ్ఞాన మినుమంత"

---

1. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, వేమన, పుట-106.

పోలేరు కొలుపులకు పొట్టేళ్ళను బలియిచ్చే సంప్రదాయాన్ని నిరసించి, సామాన్య ప్రజానీకానికి ధర్మమర్మాలను తెలియజెప్పిన బ్రహ్మంగారి గొప్పదనాన్ని రచయిత మనోహరంగా వర్ణించారు.

గేయంలో సంభాషణ నడిపిన తీరు హృద్యంగా వుంది. సిద్ధుడి తండ్రి పీరుఖాన్ తన కుమారునితో–

" నాన నీవిటు జేయ
న్యాయంబు గాదురా
పసివాడ నీవేడ
బ్రహ్మవిద్య అదేడ
పరవిద్య గ్రహియించు
టరిది సదరాబాబు!
మన మత గ్రంథములు
మనము చదువుచునుండి
మన ధర్మముల నెల్ల
మనమాచరింపవలె
ఇతర మతము ప్రసక్తి
యిది మనకు తగదయ్య
చక్కనౌ కన్నియను
మక్కువగ పెండ్లాడి
సంసార సుఖమంది
సంతానమును గాంచి
ఘనుడవై మన వంశ
గౌరము నిల్పవలె "
అని చెప్పుచున్నట్టి
ఆ తండ్రి మాటలకు

"సర్వవిద్యలలోని
సారమ్ము నెరిగితిని
సారరహితము గదా
సంసారమది చూడ
సర్వేశుభజనమ్మె
సార్థకమ్మని తోచు
సాగిపోవగలేము
సంసార మార్గమున
సత్య పథమును జూపు
సద్గురుని వెదకవలె " [1]

అని సిద్ధుని సమాధానము.

కావ్యంలో ఆద్యంతం నాటకీయశైలి చోటుచేసుకున్నది బ్రహ్మంగారి జీవితంలోని ప్రధాన ఘట్టాలను కవిగారు హృదయానికి హత్తుకునేలా చిత్రించారు. బ్రహ్మంగారి జీవితచరిత్రను ప్రతి ఒక్కరు సులభంగా గ్రహించే విధంగా యీ గేయకావ్యం వ్రాసిన శ్రీ పెద్దోజు నమశ్శివయ్య భాగవతార్ గారు ప్రశంసనీయులు. నిరాడంబరమైన పదప్రయోగం, స్పష్టమైన భావప్రకటన, సందర్భోచితమైన నాటకీయశైలి, సంక్షిప్తత, సజీవ పాత్ర చిత్రణం నమశ్శివయ్యగారి కావ్యానికి రసపుష్టిని చేకూర్చాయి.

---

1. పెద్దోజు నమశ్శివాయ భాగవతార్, బ్రహ్మంగారి చరిత్ర, పు. ౬౭-౭౦.



# గేయం ఖండికలు

జాతీయోద్యమానికీ, గేయసాహిత్యానికీ అవినాభావ సంబంధం ఉందని స్పష్టంగా చెప్పవచ్చు. ప్రజాబాహుళ్యంలో చైతన్యం సాధించడానికి వివిధ ప్రచార గేయాలు వ్రాయబడినాయి. నిరంతరం "స్వరాజ్య సాధన" మంత్రం భారతజాతి హృదయ కుహరంలో మారుమ్రోగేలా, జాతీయ భావాలతో, చారిత్రక సత్యాలతో, సువర్ణాక్షరాలతో లిఖింపదగిన జాతీయగీతాలు వెలువడ్డాయి. భారతదేశంలో ఎక్కడ ఏ సంఘటన జరిగినా, దాని తాలూకు గేయం వెంటనే ప్రచారమై ప్రజల హృదయాల్లోకి దూసుకు పోయేది. స్వాతంత్ర్య సందేశం మారుమూల గ్రామాలకుకూడా చొచ్చుకు పోవడానికి జాతీయగీతాలు ఎంతో దోహదం చేశాయి. ఈ పాటలు ఒక ప్రాంతానికీ, మతానికీ, కులానికీ పరిమితం కాలేదు. ప్రజలు నడిపిన ఉద్యమాలు, స్వాతంత్ర్య సాధన కోసం చేసిన త్యాగాలు, మహోన్నతమైన ఆదర్శాలు, ఉత్తేజకరమైన పోరాటాలు పాటలుగా ప్రతిధ్వనించాయి. అందుచేత యీ పాటలకు "చారిత్రక విలువ" ఏర్పడింది. ఇతర భారతీయ భాషా కవులతో పాటు, అంతకు మించి కూడా తెలుగు కవులు స్పందించారు. విశిష్టమైన కొన్ని జాతీయగీతాలు ఆంధ్రదేశంలో జాతీయోద్యమానికి మరింత ఊపు ఇచ్చాయి.

"జాతీయ కవిత్వమునకు గేయము అలంబనము, సులభగ్రాహ్యము. ప్రచారమునకు వరమసాధన. ఈ గేయములు అంత్య నియమ ప్రాసలతో, యతులతో, మించుమించు మాత్రాఛందస్సులకు, లయతాళములకు సరిపడు గతులతో, పల్లవి అనుపల్లవి చరణములతో, కొన్ని కేవలమొక చరణము వరుసతో, అనేక బాణీల సాగినవి....కవుల ఛందోరీతులు జాతీయ గేయములలో సమగ్ర జాతీయత వెల్లి విరియవలె. జాతీయత యనగా, జాతియొక్క ఔన్నత్యము, ఆత్మ గౌరవములకు సంబంధించినది. అంతియేగాక, జాతియొక్క సహజ సంస్కృతి ఉదాత్త సంప్రదా

యములను, తరతరాలు అందించగల అవిచ్ఛిన్న జీవనది."[1] అని జాతీయగీతాల స్వరూప స్వభావాలను శ్రీ గురజాడ రాఘవశర్మగారు వివరించారు.

ఇంతటి విశిష్టమైన జాతీయ గీతాలను రచించిన వారిలో "జాతీయ గేయకవి సార్వభౌమ" శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు ముఖ్యులు. శ్రీకాకుళం జిల్లా, నరసన్నపేట తాలూకాలోని గోనెపాడు గ్రామం శివారు "ప్రియాగ్రహారం" వీరి జన్మభూమి. వీరి తల్లిదండ్రులు వేంకట నరసింహం, సూరమ్మలు. ఉన్నత విద్యను విజయనగరం, మచిలీపట్టణాలలో ముగించుకొనిన పట్టభద్రులు. గంజాం జిల్లా కలెక్టరు కార్యాలయంలో గుమస్తాగా చేరారు. జాతీయోద్యమ ప్రభావితులై ఉద్యోగానికి స్వస్తి పలికారు. గాంధీజీ పూరించిన స్వాతంత్ర్య శంఖారావం విని ఉత్తేజితులై మహావేశంతో "మాకొద్దీ తెల్ల దొరతనం" [2] అనే ప్రబోధ గీతం రచించారు. ఈగీతంలో బ్రిటీషువారు భారతదేశాన్ని ఆక్రమించుకున్న తీరు గ్రామీణులకు సైతం తెలిసేలా వివరింపబడింది. దేశభక్తులను తెల్లదొరలు ఎంత వేధిస్తున్నారో యీ గీతం వెల్లడిస్తుంది. స్వాతంత్ర్య సాధనకై గాంధీజీ చెప్పిన త్రోవను అనుసరించండని "మహాత్మాగాంధీ" గేయంలో గరిమెళ్ళ బోధించారు.

"వినురా ! నా ప్రియసహోదరుడా సోదరుడా భారతభావి భాగ్య శేఖరుడా గాంధీ చెప్పిన త్రోవనడురా" అని హితోక్తులు పలికారు. [3] మహాత్ముని సందేశమును పాటించుటయే కర్తవ్యమని స్పష్టం చేశారు. ఆంగ్లేయుల "సైతాను ప్రభుత" లో జీవించలేమని వెల్లడించారు.

---

1. శ్రీ గురజాడ రాఘవశర్మ, జాతీయగీతాలు, (పరిచయము) పుట-6.
2. జాతీయగీతాలు (గురజాడ రాఘవశర్మ సంపాదకుడు) పుట. 255 నుండి 263
3. జాతీయగీతాలు, (గురజాడ రాఘవశర్మ, సంపాదకుడు) పుట. 273 నుండి 275

"దండాలండోయ్ - మేముండ లేమండోయి బాబు
ఈసైతాను ప్రభుతనింక - సాగనీమండోయి బాబు ॥దండాలు॥

వర్తకానికంటూ యింట్లో - పాదమెట్టి నాడు బాబు
పాదం పెట్టి దొంగతనం - ప్రారంభించాడండి బాబు ॥దండాలు॥

పాలకడలివంటి రాజ్యం - బ్రద్దలయిందండి బాబు
కూలిజేసుకున్నా పొట్టకు - కూడు లేదండోయి బాబు ॥దండాలు॥

అని వివరించి, అదేగీతంలో ఉప్పెవన్ను విధించడం, హిందూ ముస్లిం జాతి విద్వేషాలు రెచ్చగొట్టడం, పంజాబు దురంతాలు, నిరంకుశమైన చట్టాలు రూపొందించటం వంటి విశేషాలు వివరించారు.[1] తెల్లదొరల పరిపాలనను తుదముట్టించి "రాజ్యమేలుదాము రారా" అని గానంచేశారు.

పంజాబులో జలియన్ వాలాబాగ్ దురంతం యావద్భారత జాతిని కుదిపివేసింది. ఆ సన్నివేశాన్ని శ్రీ కొండపల్లి జగన్నాధ దాసుగారు

"హిందుమాతనురా ! డయ్యరు, వినర
లోకమాతానురా ! హీనుడ ! వినుర ! దేశమాతానురా ॥

నా డబ్బుతిని నీవు - నా బిడ్డలను జంప
చేతులెట్లాడెర ! నీతిలేనివాడ ॥ హిందు ॥

పంజాబు బిడ్డలను - పలువధల గావించి
బ్రతుకదలచితివటర - బ్రహ్మ కల్పముదాక ॥ హిందు ॥

అని గానంచేశారు.[2] శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు ఈ విషాదఉదంతాన్ని "పాంచాలము" అనే గీతంగా రూపొందించారు.

---

1. జాతీయగీతాలు, (గురజాడ రాఘవశర్మ,సంపాదకుడు) పుట. 309,310
2. జాతీయగీతాలు, (సంపాదకుడు.గురజాడ రాఘవశర్మ) పుట. 111

జాతీయోద్యమ రథసారథి గాంధీజీ పై వ్రాయబడిన జాతీయ గీతాలు గాంధీజీ వ్యక్తిత్వానికీ, సమర్థమైన నాయకత్వానికీ ఉదాహరణగా నిలుస్తాయి.

" గాంధీలాలీ! మోహన గాంధీలాలీ!
కరుణాసాంద్రా! మోహనదాస॥ గాంధీలాలీ॥

అని కొండవల్లి జగన్నాథ దాసుగారు గాంధీపై లాలిపాట వ్రాస్తే,

" కట్టుకొన్నది యంగ వస్త్రము
పట్టుకున్నది రాట్నచక్రము
పట్టుమని పదిమెతుకులైనా
పట్టకుండు కృశోదరముగల
గాంధి కంటెను సామ్యవాదులు
కలరెలోకములో! [1]

అని శ్రీ చుక్కభొట్ల సత్యనారాయణ మూర్తిగారు ముత్యాల సరం సృష్టించారు.

ఉప్పుసత్యాగ్రహం సందర్భంగా, శ్రీ గరికపాటి మల్లావధానిగారు వ్రాసిన ఉప్పుపాట ప్రసిద్ధమైంది.

ఉప్పోయమ్మ! ఉప్పోయమ్మ! ఉప్పోయమ్మ
మా ఉప్పుకొనరమ్మా ఉప్పోయమ్మ!
ఉప్పు ఉప్పని మే-మూరూర అమ్మెదము
చప్పు చప్పన మీరి ఉప్పుకొనరారమ్మ
ఉప్పేగదాయని చప్పరింపకుడమ్మ
ఉప్పుగాదిది బంగారుకుప్ప మనపాలిటికి॥ ఉప్పోయమ్మ॥
ముప్పదికోట్ల ప్రజల ముప్పుదీర్చె ఉప్పు
ఉప్పుగాదిది రత్నపు తిప్పా మన పాలిటికి,
ఒప్పుగ స్వాతంత్ర్య మొసగేటిదీయుప్పు
ఉప్పుగాదిది వజ్రపు తెప్ప మన పాలిటికి॥ ఉప్పోయమ్మ॥

పై పాటను జాతీయోద్యమ కార్యకర్తలు గ్రామగ్రామాన పాడేవారట.

1. జాతీయగీతాలు (సంపాదకుడు: గురాజాడ రాఘవశర్మ), పుట-176.

"ఉప్పుకొనండయ్యా! స్వరాజ్యపు-ఉప్పుకొనండయ్యా
ఉప్పుచట్టమును ధిక్కరించితే తప్పకమనకు స్వరాజ్యమువచ్చు" [1]

అని శ్రీమంగిపూడి పురుషోత్తమ శర్మగారు గానంచేశారు. 3-5-30న ఉప్పు పండినందుకు అరెస్టుచేయబడిన గురజాడ రాఘవశర్మ గారు బందరు సబ్ మెజిస్ట్రేటు కోర్టులో, సబ్ మెజిస్ట్రేటు అడిగిన ప్రశ్నలకు గేయరూపములో సమాధానమిచ్చి, 6 నెలల కఠిన కారాగార దండనకు గురి అయ్యారట. [2]

1921 లో పింగళి వెంకయ్య పంతులుగారు జాతీయ పతాకమును రూపొందించిన తరువాత, మనకవులు త్రివర్ణ పతాక ప్రాశస్త్యాన్ని గానంచేశారు. సుంకర సత్యనారాయణగారు, వానమామలై వరదాచార్యులుగారు, గురజాడ రాఘవశర్మగారు, జాతీయపతాకంపై ఉత్తేజకరమైన గేయాలు వ్రాశారు. [3]

సీమబట్టలు కట్టరాదని నిర్ణయిస్తూ. కొండపల్లి జగన్నాథదాసుగారు "నూలువడికే విధము తెలియండి-జనులార మీరు", అని వ్రాస్తే "నాతల్లి రాట్నమా! నాపాలి భాగ్యమా!" అని నెల్లూరు వేంకటరామానాయుడు కీర్తించారు.

" సిగ్గులేదా నీకు - శరము లేదా
అన్నమైన లేక బీదలల్లాడుతుంటేను
సీతాకోక చిలుకలాగ - సీమగుడ్డ కట్టి తిరుగ "

అని బసవరాజు అప్పారావుగారు ఆగ్రహించారు.

---

1. జాతీయగీతములు (సంపాదకుడు:గురజాడ రాఘవశర్మ) పుట-316
2. అందే, (పీఠికలో) పుట-39,40.
3. జాతీయగీతాలు, (సంపాదకుడు: గురజాడ రాఘవశర్మ) పుట-77 నుండి 96

" రాటము వడుకుము - మాయమ్మా! మన
కాటకముడుగును వినుమమ్మా "

అని శ్రీ మునగపాటి విశ్వనాథ శాస్త్రిగారు ఖాదీ ప్రబోధం చేశారు.[1]

జాతీయోద్యమ కార్యకర్తలను ప్రోత్సహిస్తూ కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు వ్రాసిన—

"వీరగంధము తెచ్చినారము - వీరుడెవ్వడో తెల్పుడీ
పూసిపోదుము - మెడను వైతుము - పూలదండలు భక్తితో"[2]

అనే పాట మిక్కిలి ప్రసిద్ధమైంది.

ఈపాటను అనుసరించి, మరికొన్ని చారిత్రక సంఘటనలను సమీకరించి శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు,

"వీరగంధము తెచ్చినారము - వీరులెవ్వరొ తెల్పుడీ
వీరగంధములంది, పాడెడి - విమల కంఠము నెత్తుడీ"[3]

అని వ్రాశారు.

స్వాతంత్ర్య సాధన ధ్యేయంగా వ్రాయబడిన ఎన్నో జాతీయ గీతాలు జాతీయోద్యమ సంఘర్ష చరిత్రను వివరిస్తాయి. ఇట్టి చారిత్రక గేయాలు జాతికి నిరంతరం స్ఫూర్తినిచ్చే మహత్తర శక్తి గలవి. ఎన్నో త్యాగాలు చేసి సాధించుకున్న స్వాతంత్ర్యం ప్రాధాన్యమును యీ గేయాలు గుర్తు చేస్తాయి. జాతీయ సమైక్యత అవసరాన్ని వెల్లడిస్తాయి.

---

1. జాతీయ గీతాలు, (సంపాదకుడు : గురజాడ రాఘవశర్మ) పుట - 372 నుండి 384.
1. అందే పుట-276.
3. అందే, పుట - 307.

# జాతీయ భారతి

శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రిగారు దేశభక్తితో వ్రాసిన చారిత్రక గేయ ఖండికలు "జాతీయ భారతి" పేరుతో సంకలనం చేయబడి; 1957లో ప్రచురింపబడినాయి. ఈ కృతికి ఆనాటి ఉపరాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు పోషకులు. అప్పటికి కేరళ గవర్నరుగా వున్న శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు "తొలిపలుకులు" వ్రాసి సుబ్బరామశాస్త్రి గారిని అభినందించారు. ఈ గేయాలలోని చారిత్రక విషయాలను; జాతీయతను ఆచార్య రంగా గారు "మలిపలుకు" వ్రాసి ప్రశంసించారు. డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు, డా॥ దివాకర్ల వెంకటావధాని గారు "జాతీయ భారతి" ని ప్రస్తుతించారు. పద్మభూషణ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు గ్రంథావిష్కరణ సభలో సుబ్బరామశాస్త్రిగారిని "కవి సామ్రాట్" బిరుదుతో సత్కరించారు.

గౌతమ బుద్ధుడు; బాలగంగాధర తిలక్; మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ; పొట్టి శ్రీరాములు; నేతాజీ సుభాశ్చంద్రబోస్; వల్లభ్‌భాయి పటేల్; బాబూ రాజేంద్ర ప్రసాద్; జవహర్‌లాల్ నెహ్రూ; రవీంద్రుడు; ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యలను పేర్చి, జాతీయోద్యమ కాలం నాటి చారిత్రక సంఘటనలతో శాస్త్రిగారు సరళ సుందరమైన శైలిలో గేయరచన సాగించారు. ఆయా మహనీయుల జీవిత చరిత్రను అంతటినీ శాస్త్రిగారు క్లుప్తీకరించిన తీరు ప్రశంసనీయం.

"నరుని జరయు రుజ చూచిన
కరుణ పొంగి పొరలి పొరలి
పరమ మార్గ మెది యెది యని
తరచి తరచి కనుగొంటిని"

అని సిద్ధార్థుడు సత్యాన్వేషణ సాగించిన కారణాన్ని రమ్యంగా వివరించారు.

"అర్ధాంగిని కన్నసుతుని
అర్ధరాత్రి వదలికదలి
అంతఃపురము దాటిన
అంతస్సె త్యాగమయము"[1]

అని గౌతముని త్యాగాన్ని ప్రశంసించారు. బుద్ధుని సిద్ధాంతాలు విశ్వవ్యాప్తమై పరిమళించాయనీ, భరతఖండ కీర్తిప్రతిష్ఠలు ఇనుమడించాయని కవిగారు అభిప్రాయపడ్డారు.

"స్వరాజ్యమే నా జన్మహక్కు" అని ప్రకటించి, దాస్య భారంతో క్రుంగి పోతున్న భారత జాతిని చైతన్యవంతం చేసిన లోకమాన్య బాల గంగాధర్ తిలక్ జీవిత విశేషాలను, ఆశయాలను, స్వాతంత్ర్య దీక్షను శాస్త్రిగారు గేయంగా మలచిన తీరు మనోహరంగా వుంది.[2]

వివిధ దేశాలవారు ఆశ్చర్యపడే విధంగా, నూతనమైన పద్ధతులతో జాతిని జాగృతంచేసి స్వాతంత్ర్యం సాధించిన గాంధీమహాత్ముని శాస్త్రిగారు శ్లాఘించారు.

"నీ వలువే కొల్లాయీ
నీ వెలుగే బ్రహ్మాండం
కత్తిలేక సేనలేక
ఎత్తినావు జయపతాక[3]

అని గాంధీజీ రగిలించిన సత్యాగ్నిని,సాధించిన ఫలితాలను కీర్తించారు.

---

1. పైడిపాటి సుబ్బరామశాస్త్రి జాతీయ భారతి, పుట. 44
2. అందే పుట. 46 నుండి 48
3. అందే పుట. 49

ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని పొట్టి శ్రీరాములుగారు 1952 అక్టోబరు 19 నుండి డిసెంబరు 15 వరకు నిరాహార దీక్ష వహించి ప్రాణత్యాగం చేసిన సన్నివేశం ఆంధ్రదేశ చరిత్రలో మరపురాని పీడకల. ఆంధ్రుల ఆగ్రహం, ఆవేదన, అలజడి గమనించిన నెహ్రూ 1952 డిసెంబరు 19న ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గూర్చి పార్లమెంటులో ప్రకటన చేశారు. ఈ చిరస్మరణీయ విషాద చారిత్రక సన్నివేశం "జాతీయ భారతి" లో చోటు చేసుకుంది.

> "పెళ్లి విరిసె నీత్యాగం
> తల్లడిల్లె ఢిల్లీపురి
> గాంధి గురువు వెల్గించిన
> ఇంధనమా ! జోహారు [1]

అనిశాస్త్రిగారు అమరజీవి పొట్టి శ్రీరాములుగారికి శ్రద్ధాంజలి ఘటించారు.

బ్రిటీషు ప్రభుత్వం కళ్ళుగప్పి, జర్మనీ చేరుకొని, ఆజాద్ హిందూ ఫౌజును నిర్మించి, స్వాతంత్రోద్యమాన్ని తీవ్రతరం చేసిన "నేతాజీ" ని శాస్త్రిగారు స్మరించారు.

> "తొలి దొరవు నీవే సు
> భాసు బాబూ
> తొలి సైన్యంనీదె సె
> భాసు బాబూ
> మున్నీరౌ కన్నీరూ
> నిన్ను తలచినా
> నిన్ను మఱచి మనలేమో
> మానేతాజీ" [2]

---

1. పైడిపాటి సుబ్బరామ శాస్త్రి, జాతీయ భారతి, పుట. 52
2. అందే, పుట-54.

అని 1945 ఆగస్టు 18వ తేదీన తైపే వద్ద జరిగిన విమాన ప్రమాదంలో బోసుబాబు మరణించిన విషయాన్ని శాస్త్రిగారు స్వతంత్ర భారతజాతికి గుర్తు చేశారు.

నిజాం నిరంకుశపాలనకు భరతవాక్యం పలికి. చిల్లర సంస్థానాలను సమగ్ర స్వతంత్ర భారతదేశంలో విలీనం చేసిన ఉక్కుమనిషి వల్లభ్‌భాయి పటేలు సాహసోపేత సముచిత చర్యను శాస్త్రిగారు "వల్లభ్‌భాయి పటేలు" గేయంలో వెల్లడి చేశారు.

భారత రాజ్యాంగ నిర్మాణంలో అవిరళ శ్రమచేసి, భారతాధ్యక్షునిగా, బాధ్యతగల ప్రథమ భారతీయ పౌరునిగా ప్రశంసింపబడిన బాబూ రాజేంద్రప్రసాద్‌ను కవి కీర్తించారు.

శాంతిదూతగా, నవభారత నిర్మాతగా ప్రసిద్ధిచెందిన జవహరులాల్ నెహ్రూ జాతీయ సేవలను, అంతర్జాతీయ విధానాలను కవి గేయంగా రూపొందించారు.

విశ్వకవి రవీంద్రనాథ్ టాగూరును —

"భరత దేశం
పరిగణించిన
జాతిగీతం
జాతిరత్నం—"[2]

అని కీర్తించారు.

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి సేవలను కవిగానంచేశారు.[3]

సుబ్బరామశాస్త్రిగారు వ్రాసిన "ఆగష్టు 15" గీతం రష్యన్ టెలివిజన్‌లో ప్రసారమై రష్యన్ల మన్ననలు పొందింది. లెనిన్‌గ్రాడ్ యూనివర్శి

1. పైడిపాటి సుబ్బరామశాస్త్రి, జాతీయ భారతి, పుట-55,56.
2. పైడిపాటి సుబ్బరామశాస్త్రి, జాతీయ భారతి, పుట-60.
3. అందే, పుట-61

టీలో తెలుగు విభాగానికి అధ్యక్షురాలైన శ్రీమతి ముదిగొండ ఆదిలక్ష్మి గారు రూపొందించిన కార్యక్రమంలో (1959 ఆగష్టు 15 న) యీగీతం విశేష ప్రాధాన్యం సంపాదించింది.

" ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు
కన్నామీ స్వాతంత్ర్యం!
అన్నన్నా! యీనాడే
పున్నమలోక వేయి వెలుగు
భరతమాత పుత్రులార
పరమతపోధనులార!
అర్ధరాత్రి మేల్కొంటిమి
సార్థకమీ స్వాతంత్ర్యం
భరతజాతి ఎన్నాళ్ళు
కిక్కిరి బిక్కిరియై నలిగెను-
వలదలైన త్యాగంలో
దొఱకెను స్వాతంత్ర్య ఫలము " [1]

అని శాస్త్రిగారు మహోత్సాహంతో స్వాతంత్ర్య దినోత్సవాన్ని వర్ణించారు.

రాజ్యాంగం రూపొందించుకొని, సర్వతంత్ర స్వతంత్ర ప్రజాస్వామ్య దేశంగా మనదేశం పరిగణించబడిన 1950 జనవరి 26తేదీని సుబ్బరామశాస్త్రిగారు శ్లాఘించారు. [2]

మన జాతీయ జెండాను గురించి, సుప్రసిద్ధమైన పండుగలను గురించి, భారతీయుల ఆచారవ్యవహారాలను గూర్చి పైడిపాటివారు రసవత్తరమైన గేయాలు వ్రాశారు. ఇవన్నీ భారతదేశ సామాజిక చరిత్రను ప్రతిబింబిస్తాయి.

---

1. పైడిపాటి సుబ్బరామశాస్త్రి, జాతీయభారతి, పుట-65, 66
2. అందే, పుట-67, 68

1955 డిసెంబరు 10 వ తేదీన నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు కీ॥శే॥ నెహ్రూ శంకుస్థాపన చేశారు. ఆంధ్ర ప్రజకిది శుభోదయం. పైడిపాటివారు "నాగార్జున సాగరము" [1] గేయంవ్రాసి, ఆంధ్రుల ఆనందాన్ని సువ్యక్తం చేశారు.

భారతదేశంలో భాగమైన గోవాను, పోర్చుగీసు అధికారం నుండి విముక్తి కలిగించాలనే ఆలోచన ప్రభుత్వానికి కలిగింది, సుబ్బరామశాస్త్రి గారు "గోవా" గేయంవ్రాసి భారతీయుల ఆకాంక్షను ప్రతిబింబింప జేశారు.

> " బుడుత కీచులు లేచి
> పొండయ్యా! మీ
> ఉడుత గంతులు చాలు
> లెండయ్యా
> లండనూ, పారిస్సు
> కంజేను-మీరు
> గుంట్రంగ ఏమైన
> ఉన్నారా? "

అని-బ్రిటీషు, ఫ్రెంచివారి అధికారం అంతరించిపోగా, మీరేపాటి అని ప్రశ్నించారు. [2] సత్యాగ్రహులను కాల్చిచంపిన, మీ దురాగతాలను మరువలేదని వెల్లడించారు.

వినోభాభావే "భూదానయజ్ఞం", "రైతు", "పొదుపు", "ఖద్దరు", "చేనేత", "సహకారము", "పంచాయతీ", "గ్రంథాలయాలు", "వనమహోత్సవము", "భారతమహిళ", "ఆయుర్వేదము", "భావిపౌరులు", "అఖండ భారతము", "నవభారతం", "జాతీయ భారతి" మొదలైన గేయాలు సామాజిక చరిత్రను సుస్పష్టం చేస్తాయి.

---

1. పైడిపాటి సుబ్బరామశాస్త్రి, జాతీయ భారతి, పుట-86, 87
2. పైడిపాటి సుబ్బరామశాస్త్రి, జాతీయ భారతి, పుట - 90.

# తెలంగాణా పోరాటు గేయాలు

నైజాం నిరంకుశ పాలనలో తెలంగాణా ప్రజలు ఎంత క్రూరంగా దోపిడీ చేయుబడినారో యీ గేయాల ద్వారా తెలుస్తుంది. తెలుగు జాతి అంతా ఒక్కటిగా నిలచి నిజాంకు వ్యతిరేకంగా జరిపిన పోరాటం మొత్తం భారతదేశాన్నే కదిలించి వేసింది. చరిత్రాత్మకమైన తెలంగాణా సాయుధ పోరాటంలో రక్తతర్పణ చేసిన ఎందరో కమ్యూనిష్టు గెరిల్లా వీరకిశోరాలపై పాటలు వ్రాయబడ్డాయి. ఆ పాటల్లో తిరునగరి రామాంజనేయులు గారు, మరికొందరు కవులు వ్రాసిన పాటలు ప్రజల నోళ్ళలో మిగిలాయి.

వివిధ కవుల గేయ సంకలనంగా ప్రచురింపబడిన యీ పుస్తకంలో తిరునగరి రామాంజనేయులు గారి పాటలు అత్యధికం. రామాంజనేయులు గారు తెలంగాణా పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. అక్కడి ప్రజా జీవితాన్ని చూచి స్పందించారు. "ప్రజాలంతా గ్రామంలోని నలుగురైదుగురు పెత్తందార్లకు బానిసలై బ్రతుకుతున్నారు. దారుణమైన వెట్టి చాకిరి, తిట్లు, కచ్చేరి చావిళ్ళవద్ద వంగబెట్టి మూపున బండలు, బండలే కాదు-రైతుల మూపున గ్రామ వెట్టివానిని ఎక్కించి తొక్కించేవారు. పండిన పంటనంతా "లెవీ" లనీ, "లూవాను" లనీ, "నాగూ" లనీ, "నజరానా" లనీ దోచుకునేవారు..." [1] సామాన్య ప్రజానీకంతో సహా రైతాంగం యావత్తూ తిరగబడ్డారు. కమ్యూనిష్టుపార్టీ, ఆంధ్రమహాసభలు స్ఫూర్తి నిచ్చాయి. నవాబు దురాగత పాలనకు వ్యతిరేకంగా బలీయమైన ప్రజా ఉద్యమం బయలు దేరింది.

ప్రజా ఉద్యమాన్ని అణచాలనే ఉద్దేశంతో నిజాం సర్ మీర్జా ఇస్మాయిల్‌ను హైద్రాబాద్ సంస్థానానికి ప్రధానమంత్రిగా నియమించాడు.

---

1. తిరునగరి రామాంజనేయులు, తెలంగాణా పోరాట గేయాలు, పుట-5.

పోలీసులు ఆధునికమైన మారణాయుధాలతో, రెట్టింపు క్రౌర్యంతో గ్రామాలపై దాడులు జరపడం ప్రారంభించారు. ఈ దాడులలో 1946 వ సంవత్సరంలో నల్గొండ జిల్లాలోనే 390 మంది రైతులు మరణించారు. 4 వేల మంది అరెస్టయినారు. 64 మంది స్త్రీలు మానభంగాలకు గురయినారు.[1] మరోవైపున "మజ్లీస్-ఎ- ఇత్తెహాదుల్ ముసల్మీన్" అనే మతసంస్థ ముస్లింరాజ్యాన్ని నిలబెట్టుకొనే నినాదంతో ఖాసింరజ్వీ నాయకత్వంలో నైజాముకు మద్ధతును ప్రకటించింది. మతోన్మాదులైన వేలాది ముస్లింలు రజాకార్లుగా చేరి, ఆయుధాలు చేపట్టి తెలంగాణమును రక్తంలో ముంచెత్తారు. నిజాంపోలీసులు గ్రామాలమీద పడి నాయకుల్ని చూపించమని ప్రజలను హింసించసాగారు. ఈ అల్లకల్లోలాన్ని సమీక్షిస్తూ తిరునగరి రామాంజనేయులుగారు "నైజాం సర్కారురా" అనే గేయాన్ని వ్రాశారు.

నైజాము సర్కారురా, ఓరన్న
నాజీల మించిందిరా
ప్రజారాజ్యానికై పోరాడు ప్రజలపై
రాక్షసాచర్యలను రకరకాల్‌చేస్తుండె ॥ నైజాము॥

పోలీసులారీలు పల్లెలే నిండాయి
ఏయింట చూసినా ఏడుపూగోలలే
నాయకుల చూపుమంటూ - ప్రజలనూ
నలివలిగ కొడుతుండెరా ॥ నైజాము॥

చెంబులను పట్టుకొనీస్త్రీలు పోతుంటేను
చెంబులూ లాగుకొని చీరకొంగులు పట్టి
లారీలతో జాదెరా, నీచులూ
"లావ్" సొమ్ములను చుండెరా ॥ నైజాము॥

---

1. ఆంధ్రప్రదేశ్ దర్శిని, పుట - 572
2. తిరునగరి రామాంజనేయులు, తెలంగాణా పోరాటగేయాలు, పుట-29.

నాయకులను దాచారనే వంకతో ఇళ్ళలో జొరబడి, వస్తువులన్నింటినీ పెల్లాచెదరుచేసి పగలను, డబ్బును దోచేవారట. ప్రజలపై అక్రమంగా దొంగకేసులు పెట్టి బాధించేవారట.

చేతిలో చిక్కిన రైతులందరి పట్టి
చేతివేళ్ళల్లోన సూదులను దిగగొట్టి
కాళ్ళు చెట్లకు గట్టిరా - పూపుతూ
కటిక దెబ్బలు కొట్టిరా ॥

ఆడమొగయను భేదమావంతయును లేక
ముసలి పసిపాపలని యిసుమంతయును లేక
చిత్రవధ చేశారురా - రాక్షసులు
మూత్రమే తాపారురా ॥నైజాము॥

ఈ చిత్రవధలకే విసిగి రక్షణలేక, ఏకమై ప్రజలంత యెదిరి పోరా డారని యీ గేయంద్వారా తెలుస్తుంది.[1] ఈ పరిస్థితులు ఒక కాలానికి, ఒక ప్రాంతానికి, ఒక వ్యక్తి పరిపాలనకు సంబంధించినవై చరిత్రలో చోటు చేసుకున్నాయి. ఇది ఒక చరిత్ర పురుషుని కథ కాకపోయినప్ప టికీ, ఒకవ్యక్తి (నిజాం నవాబు) పాలనలో తెలుగుజాతి అనుభవించిన దౌర్భాగ్యస్థితి. నిజాం దుర్మార్గ పాలనకు దర్పణం. యథార్థంగా జరిగిన సంఘటనలకు ప్రతిబింబంగా రూపొందిన చారిత్రక గేయం. ఈ గేయం 12-1-1948 ప్రజాశక్తిలో ప్రచురింపబడింది.

అగస్టు 15, 1947లో దేశానికి స్వాతంత్రం వచ్చినా, తెలంగాణా నిజాం అధీనంలోనే ఉన్నది. నైజాం తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించడం కూడా జరిగింది. నాయకుల ఆశాసౌధం కుప్పకూలి నట్లయింది. వేరే

---

1. తిరునగరి రామాంజనేయులు, తెలంగాణా పోరాటగేయాలు, పుట. 29.

మార్గంలేక, సెప్టెంబరు 11, 1947 న కమ్యూనిస్టు నాయకులు నవాబు నిరంకుశపాలనను కూలద్రోయడానికి ప్రజలు ఆయుధాలు చేపట్టి పోరాడాలని పిలుపు యిచ్చారు. దొరల భూముల్ని వ్యవసాయ కూలీలకు, పేద ప్రజలకు పంచాలనీ, వర్గ శత్రువుతో చేతులు కలిపిన వాడిని కఠినంగా శిక్షించాలని ప్రకటించారు. వెట్టిచాకిరీ నుండి విముక్తి పొందవలసిందిగా కోరారు. "స్టేట్ కాంగ్రెస్" వారు నైజాం నవాబుపై తమ వ్యతిరేకతను వెలిబుచ్చారు. గ్రామాల్లోను, అడవుల్లోను ఉద్యమ కేంద్రాలు రూపొందించబడ్డాయి. గెరిల్లా దళాలు గ్రామాలను విముక్తం చేసేందుకు దొరలపై దాడి ప్రారంభించారు. దొరలగడీలు పోలీసు క్యాంపులుగా మారాయి. ప్రజావ్యతిరేకులుగా దొరలు ప్రసిద్ధి వహించారు.

(శ్రీ తిరునగరి రామాంజనేయులు కొన్ని గడీలపై జరిగిన దళ పోరాటాలను స్వయంగా గమనించారు.)

ప్రజా వ్యతిరేకులందరికీ పెద్ద అని పేరెన్నిక గన్న జన్నారెడ్డి ప్రతాపరెడ్డిది ఎర్రబాడుగడీ. ప్రతాపరెడ్డి ఆగడాలను దూషిస్తూ ఒక అజ్ఞాతకవి వ్రాసిన "ప్రతాపరెడ్డి దొర" పాటను పరిశీలిస్తే, అప్పటి భూస్వాముల మనస్తత్వం తెలుస్తుంది.

బండెనుక బండికట్టి
పదహారు బండ్లుకట్టి
ఏ బండ్లో పోతవు కొడకో
నాకొడక ప్రతాప రెడ్డి ॥

దొడ్లన్నీ కాలిపోయె
వడ్లన్నీ ఎల్లిపోయె
ఇకనైన లజ్జ లేద
నాకొడక ప్రతాపరెడ్డి ॥[1]

---

1. తెలంగాణా పోరాట గేయాలు. పుట - 120.

గొల్లోళ్ళ గోదుపాడిసె
రైతోళ్ళ బియ్యమెుడిసె
యిక ఏమి తింటవు కొడకో
నాకొడక ప్రతాపరెడ్డి ॥

పెదపంది "సూరిగాడు"
చినపంది మల్లిగాడు"
మీ యిద్దర్ని తింటరు కొడకొ
నా కొడక ప్రతాపరెడ్డి ॥[1]

సూరిగాడు, మల్లిగాడు ప్రతాపరెడ్డి అనుచరులై ఉండవచ్చు. ప్రజల్లో దొరలంటే ఎంత ద్వేషభావం వుండేదో పైగేయం ద్వారా గ్రహించవచ్చును.

ఎర్రబాడు గడీమీద జరిగిన దాడిని రామాంజనేయులు గారు స్వయంగా చూశారు. "ఎర్రబాడు గడీలో పెద్ద పోలీసు క్యాంపు పెట్టారు. అంతవరకు పోలీసు క్యాంపులు పెట్టిన అనేక దొరల బంగళాలు నేలమట్టం అయ్యాయి. ఎర్రబాడు గడీని నేలమట్టం చేసేవరకు ఆ చుట్టుప్రక్కల శాంతి వుండదు. పథకం సిద్ధమయింది. సందెవేళ నుంచే జనం చిల్వకుంట గ్రామం శివార్లకు చేరుకుంటున్నారు. ప్రతివారి భుజానా వలుగో, పారో, తట్టో ఉన్నాయి. అర్ధరాత్రికల్లా అయిదారు వందలమంది చేరారు. ఒక ఎద్దుబండి మీద "జజ్జాయి" వుంది. రెండు గజాల పొడవు, మూడంగుళాల కైవారంగల పైపులతో తయారుచేసిన నాటు ఫిరంగికి జజ్జాయి అని పేరు. జజ్జాయి బండి, బండివెంట దళం, దళం వెంట ప్రజలు బయలుదేరారు. కోడి కూసేవేళకు గడీని చుట్టుముట్టారు. జజ్జాయిలో మందు దట్టించి, బంగళా చివరి అంతస్తునున్న గదికి బారుపెట్టి ప్రేల్చారు. గది

---

1. తెలంగాణా పోరాట గేయాలు, పుట - 120.

కూలలేదు. రంధ్రం మాత్రం పడింది గోడకు. ఆ గదిలోనే మిలటరీ వాళ్ళున్నారు. కిటికీలలోంచి కాల్పులు మొదలు పెట్టారు....ఆనాటి పోరాటంలో గడీ స్వాధీనం కాలేదు....అమున్నాడు ప్రభుత్వ అశ్వికదళం చిల్పకుంట గ్రామంమీద దాడిచేసి ఎందరో యువకుల్ని కాల్చి చంపింది. ఎర్రబాడు క్యాంపును కూడా ఎత్తివేసుకొని పోయింది. కోపోద్రిక్తులయిన ప్రజలు ఆతర్వాత నాలుగు రోజులకు ఎర్రబాడు గడీని, గడీలోని బంగళాను కసి తీరా నేలమట్టం చేశారు. ఆ స్థలంలో వీర యువకులపేర తొమ్మిది సమాధులు నిర్మించారు. జన్నారెడ్డి ప్రతాపరెడ్డి నరకాసుర పాలన ముగిసింది. ఆయన వేయి ఎకరాల పండ్లతోటను ప్రజలు స్వాధీనం చేసుకున్నారు. అలాగ దొరల చెరనుండి విడివడిన భూమినిచూసి నేను రాసిన పాట."

కల్లకళలాడే కనకము కురిసే తెలంగాణభూమి
మురికి పాలనకూలె, దొరలంత పారిపోయె
చెరవదిలింది, మెరిసిపోతుంది, తెలంగాణభూమి.[1]

చరిత్రాత్మకమైన సంఘటనల ఆధారంగా యిటువంటి గేయాలు రచింపబడ్డాయి. తిరునగరివారి "వీర తెలంగాణా" పాట గొల్లసుద్దులుగా ప్రజల హృదయాల్లో నాటుక పోయింది. ఈ గేయం కూడా అప్పటి గ్రామాల పరిస్థితుల్ని, నిజాం పోలీసుల ఆగడాలను వివరిస్తుంది.

దొంగకేసులు పెట్టి - దెబ్బలుకొట్టి
ఖైదులోకి నెట్టి - కష్టాలు పెట్టి
గుండు సూదులు తెచ్చి - గోళ్ళల్లో గొట్టి
కారము "మూనాల" - కర్రతో కూరి
సంఘాన్ని వదలమని - చిత్ర చిత్రముగా
బాధలు పెట్టగా - పాలుపడిరన్నా

1. తెలంగాణా పోరాట గేయాలు, పుట - 13, 14.

రైఫిళ్ళు మరగన్లు - రయ్యినవచ్చి
మోటార్లు - గుర్రాలు - మస్తుగా తెచ్చి
పదివూళ్ళకొక క్యాంపు - పెద్దగా పెట్టి
పోలీసు, రజాకార్లు - పల్లెల దొరలు
కలసి కట్టుగ అంత - క్యాంపుల్లో చేరి
రాకాసి రాజ్యాన్ని - చేశారురన్నా
ఆడోళ్ళ పట్టుకొని - ఆగమేచేసి
పసిపిల్లలను నరికి - పోగులేవేసి
బక్కముసలోళ్ళను - బొక్కలిరగేసి
బతికినోళ్ళను గడ్డి - వాముల్లా బెట్టి
కోడిపిల్లలవతుగా - కాల్చారురన్నా
పడుచోళ్ళుచిక్కితే - పట్టిచెట్లకు గట్టి
ప్రజలముందర నరక - బాధలు పెట్టి
బైనెట్లతో పొడిచి - ప్రాణాలు తీసి
ఇకిలిస్తె ప్రజలనట - విరుగిరుగగొట్టి
ఇదిస్వరాజ్యంబంచు - సాగిరోరన్నా
నల్లులవలె ప్రజల - నలిపారురన్న
ఊళ్ళన్ని దోపిడితో - వూడ్చారురన్న
మంటలతో గ్రామాలు - మసిజేసిరన్న
రక్తానమునిగింది - రాజ్యమోరన్నా [1]

దొరలు గూండాలు, రజాకార్లు స్వైర విహారం చేశారు.

---

1. తెలంగాణా పోరాట గేయాలు, పుట. 66-67.

దుండగులకు వ్యతిరేకంగా పోరాడిన దళనాయకులెందరో మరణించారు. వీరోచితమైన వారి పోరాట పటిమను, ఆత్మార్పణను రామాంజనేయులుగారు పాటలుగా వ్రాశారు. "అవి ప్రజల నోళ్ళలో మిగిలాయి... గోపాలరెడ్డి, వసునూరు వెంకటరెడ్డి, రేణికుంట రామిరెడ్డి పడిశాల పిచ్చయ్య, వెంకటేశ్వరరావు, దొడ్డి కొమరయ్య, మాతంగి మట్టయ్య, చందిరి నర్సయ్యమీద రాసిన పాటలు. రేణికుంట రామిరెడ్డి వీరగాథను వివరించే తెలంగాణా యోధులనే బుర్రకథ, ఈ బుర్రకథను బూర్గులవారి ప్రభుత్వం నిషేధించింది....ఇలాగ ఆనాటి పోరాటాలు, అవసరాలు నాచేత కవిత చెప్పించాయి, పెన్ను పట్టించాయి, గన్ను పట్టించాయి.. వైజ్ఞానిక దళాల్లోను, గెరిల్లా దళాల్లోను పని చేయించాయి.[1]

....ఆ రోజులలో గొట్టిముక్కల గోపాలరెడ్డి దళం రామాంజనేయులు గారికి సన్నిహితంగా వుండేది. ఆత్మకూరునుండి పాతర్ల పాడువరకు రక్షణ యీ దళం బాధ్యత. రామాంజనేయులుగారి కథనం ప్రకారం నిద్రపోతున్న గోపాలరెడ్డి దళంపై శత్రువులు దాడిచేశారు. శత్రుపు బలం దళం కన్న పదిరెట్లుంది. "లొంగిపోతే కాపాడుతాం" అని శత్రువులు కేకలు వేశారు. "కమ్యూనిస్టు అన్నవాడు తుదివరకు పోరాడతాడు, మీకు లొంగడు" అని గోపాలరెడ్డి జవాబుచెప్పి తనవద్ద తూటాలు వున్నంతవరకు పోరాడాడు. అంతలో శత్రువుపేల్చిన తుపాకిగుండు గోపాలరెడ్డి పొట్టను చీల్చింది. బాలచంద్రునిలాంటి గోపాలరెడ్డి బయటకు వచ్చిన ప్రేగులను లోపలకు తోసి తువ్వాలుతో దట్టి బిగించాడు, పోరాడుతూనే అస్తమించాడు. రామాంజనేయులుగారు యీ వృత్తాంతాన్ని "తెలంగాణా యోధుడు" అనే గేయంగా రూపొందించారు [2]

---

1. తిరునగరి రామాంజనేయులు, తెలంగాణా పోరాటగేయాలు, పుట. 16-17

2. తెలంగాణా పోరాటగేయాలు, పుట. 55-57

"యువకిశోరమా జోహార్లు" అనే శీర్షికతో వసునూరు వెంకటరెడ్డి విషయాన్ని వివరించారు. యువకుడయిన వెంకటరెడ్డి విద్యార్థుల్లో చైతన్యాన్ని రగిలించి "తెలంగాణా విప్లవానికి తొలి సంఘటనంబగు సూర్యాపేట సమ్మె" నడిపిన వ్యక్తి. ఇరువదేండ్ల వయస్సులోనే దేశ్ముఖుల ఆట కట్టించిన ధీరుడు. దొరల గడీల్లో దాచినట్టి ధాన్యమును పేదలకు పంచిన ప్రజ్ఞావంతుడు. హడలెత్తిన దొరలు పోలీసుల సహకారంతో వెంకటరెడ్డిని పోరాటంలో తుదముట్టించారు.[1] పడిశాల పిచ్చయ్య అన్నారుగూడెం సూర్యాపేట తాలూకా హరిజన కామ్రేడ్. పోలీసులు పిచ్చయ్యను పెడరెక్కలు కట్టి, నేలపై బరబర యీడ్చి, ఊరంతా త్రిప్పి, బాయొనట్లతో గుండెల్లో పొడిచి కాల్చి చంపారు. ఈ సంఘటన 1947 లో అన్నారుగూడెంలోనే జరిగింది.[2] మునగాల దొరతో పోరాడిన వాడు సీమగురవయ్య "ప్రకాశము ప్రభుత ఫాసిస్టు ఆజ్ఞపై" కాల్చి చంపబడ్డాడు.[3] అమరవీరుడు కొమరయ్య ఒరిగిన నల్గొండను రామాంజనేయులుగారు "విప్లవ గుండె" గా అభివర్ణించారు.

భారతసైన్యాలు 14 సెప్టెంబరు 1948 నాడు హైదరాబాదుపై "పోలీసు చర్య" ను అమలు జరిపాయి. కొన్ని గంటలలోనే నిజాం సైన్యాలు రజాకారు మురాలు లొంగిపోయాయి. నైజాం రాజ్యం కూలిపోయింది. గ్రామాలు విడిచి వెళ్ళిన దొరలు ఖద్దరు ధరించి పోలీసు బలగాలతో తిరిగి వచ్చారు. గ్రామీణ ప్రాంతాలను విముక్తి చేయడం లక్ష్యంగా 1951 వరకు భూస్వామ్య వ్యతిరేక పోరాటాన్ని కమ్యూనిస్టు గెరిల్లా దళాలు కొనసాగించాయి. జాగిర్దారీ వ్యవస్థను రద్దుచేస్తూ 1949 సెప్టెంబర్లోనే ప్రభుత్వం చట్టాన్ని రూపొందించింది. ఎందరో వీరయోధుల ఆత్మార్పణ ఫలితంగా తెలంగాణా తెలుగు ప్రజలు వెట్టిచాకిరి నుండి విముక్తులైనారు.

---

1, తెలంగాణా పోరాటగేయాలు, పుట. 58 నుండి 60
2. అందే పుట. 61 నుండి 62
3. అందే పుట. 63 నుండి 64

# పలనాడు వెలలేని మాగాణిరా

శ్రీ పులుపుల వెంకట శివయ్యగారు (14-11-1910 నుండి 14-7-76) స్వాతంత్ర్య సమరయోధులు. సామ్యవాదాన్ని ప్రగాఢంగా విశ్వసించి, నవసమాజ నిర్మాణం జరగాలని ఆశించి, నిరంతరం శ్రమించిన కమ్యూనిష్టు యోధుడు. శుద్ధ వైదిక బ్రాహ్మణ వంశంలో పుట్టి, కాశీ విశ్వవిద్యాలయం నుండి ఎం.యస్.సి. పట్టం పొంది, నిసలైన కమ్యూనిస్టుగా రాటు దేలడం ఎంతో మందికి ఆశ్చర్యంగా వుండేది. కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా శ్రీ శివయ్య ఎన్నో కష్టాల్ని చవిచూశారు. కమ్యూనిస్టు పార్టీ జిల్లా కార్యదర్శిగా, రాష్ట్ర కమిటీ సభ్యునిగా, రాష్ట్ర ఆర్గనైజర్‌గా పని చేశారు. ప్రజాభిమానం సంపాదించి రెండుసార్లు (1952 - 1962) శాసన సభ్యుడయ్యారు. అభ్యుదయ రచయితల సంఘ కార్యకలాపాలకు కొంత కాలం అనధికారికంగా బాధ్యత వహించారు. కవి, వక్త, జర్నలిస్టు, ప్రజా నాట్యమండలి నటుడు అయిన శ్రీ పులుపుల వెంకట శివయ్య 14-7-76 న మాస్కోలో మరణించారు.

శివయ్యగారు "పలనాడు వెలలేని మాగాణిరా" అనే చారిత్రక గేయాన్ని 1945 డిసెంబరు నెలలో రచించారు.[1] "చారిత్రక విలువలతో నిండిన యీ గేయం శివయ్యగారి గొప్పదనాన్ని సాహితీ లోకంలో సుప్రతిష్ఠితం చేసింది. "పలనాడు వెలలేని మాగాణిరా" అని ఆయన రాసిన ఒక్క గేయం యావదాంధ్ర దేశంలో మారుమ్రోగి పోయింది. ఆయన మొదట్నించీ మా ముఠాలోనే వుంటే (అంటే రచయితగా జీవించినట్లయితే) అభ్యుదయ సాహిత్యోద్యమం యింకా పరిపుష్టం చెందేదేమో! ఒకటో అరో గేయం రాసి చిరస్థాయిగా నిలిచిన వారిలో వేములపల్లి శ్రీకృష్ణతోపాటు శివయ్యగారు కూడా ఒకరు."[1] అని శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారు

---

1. పులుపుల వెంకట శివయ్య స్మృతి సంచిక, పుట-86,87.

అభిప్రాయ పడ్డారు. "వెలలేని పలనాటి మాగాణిలో అసంపూర్ణ మహా కావ్యం" [1] అని శ్రీ సోమసుందర్ యీగేయాన్ని ప్రశంసించారు.

"ఆయన రాసింది రెండు మూడు గ్రంథాలు
అయినా మిలమిలలాడే నక్షత్రాలు
రాసిన గీతాలు లెక్కకు వేళ్లు చాలు
అయితేనేం జీవన సంగీతాలు
"పలనాడు వెలలేని మాగాణిరా"
తెలుగుతల్లి శృతి మీటిన మాణిక్య వీణ" [2]

అని శ్రీ గంగినేని వెంకటేశ్వరరావుగారు ప్రస్తుతించారు.

"తెలుగు ప్రజలను ఉత్ర్రూతలూగించిన ఆ గీతం తెలుగు కవితా చరిత్రలోనే మాసిపోని ఒక క్లాసిక్‌గా, కళాఖండంగా నిలిచిపోయింది. తెలుగుజాతి సాంప్రదాయాలు, ఉద్యమాలు అంత సంక్షిప్తంగా అంత కళాత్మకంగా యిమిడ్చి ఆ గీతాన్ని తెలుగు సాహిత్యానికి సమర్పించారు శివయ్య తాత" అని శ్రీ తమ్మారెడ్డి సత్యనారాయణ యీ గేయం ప్రాశస్త్యాన్ని కొనియాడారు. [3]

శ్రీ శివయ్య గారి చారిత్రక దృష్టి గేయం ప్రారంభంలోనే కనుపిస్తుంది.

"శాతవాహన తెలుగు చక్రవర్తుల శౌర్య
మిదె బ్రాహ్మ్య, మిదె క్షాత్రమన్న- గర్జా ఘోష
పులకలే యెత్తించెరా - పలనాట
పౌరుషమ్ము పొంగెరా"

---

1. పులుపుల వెంకట శివయ్య స్మృతి సంచిక, పుట. 163
2. అందే, పుట. 173, 174
3. అందే, పుట. 186

ఆంధ్రదేశాన్ని పాలించిన మొదటి రాజకుటుంబంగా శాతవాహను లను ఉదాహరిస్తారు. ఆ బ్రాహ్మణ చక్రవర్తుల శౌర్యగాథలతో పలనాటి పౌరుష ప్రవృత్తి పొంగిపోయింది. శాతవాహనుల చరిత్రను స్ఫురింప జేయడం ప్రధానం.

"బుద్ధ నాగార్జునుని బోధముద్రా జ్యోతి
వర మహాయానమై వసుమతిని ప్రవహించిన
హెచ్చుతగ్గులు సమసెరా - పలనాట
విజ్ఞాన ప్రభ వెల్గెరా"

అని శివయ్య గారు శాతవాహన, ఇక్ష్వాక రాజవంశాల కాలంనాటి బౌద్ధ మత ప్రాబల్యాన్ని తెలియజేశారు. ఆచార్య నాగార్జునుడు విజయపురి సమీపంలో విద్యా పీఠాన్ని స్థాపించి, పలనాటి సీమలో విజ్ఞాన జ్యోతులు వెలిగించాడు. మహాయాన మార్గంలో ప్రజలను నడిపించాడు. నాగార్జు నుని పవిత్ర ఆశయం అహింసాబోధన, హెచ్చు తగ్గులు లేని సమసమాజ స్థాపన.

"తొలిసంజ దీక్షలో తెలుగు శిల్పుల చేతి
పొగరలు మలచిన బుద్ధయుగ జీవితము
నవరత్న శిల్పమ్మురా పలనాట
నాగార్జునుడి కొండరా"

బౌద్ధమతానికి, దాని వ్యాప్తికి ఆంధ్రశిల్పులు ఊపిరిపోశారు. తథాగతుని జీవితాన్ని సజీవ శిల్పాలుగా రూపొందించారు. ఆ శిల్ప సంపదతో నాగా ర్జునుడికొండ దివ్యకాంతులతో తేజరిల్లింది.

"వర్ణ ధర్మాలన్న ఉక్కుచట్టము పగిలి
మాల కన్నమదాసు మనసైన సుతుడుగా
వీరవైష్ణవ మొచ్చెరా పలనాట
బ్రహ్మన్న "కవిగీతలో"

బ్రహ్మనాయుడు పలనాటి శ్రీకృష్ణుడని పేరు పొందాడు. పలనాడునే

హైహయరాజులు పాలించే సమయంలో మతకలహాలు తీవ్రంగా వున్నాయి. బ్రహ్మనాయుడు అన్నిజాతుల వారికి దేవాలయ ప్రవేశం కలిగించాడు. చాపకూటి సిద్ధాంతాన్ని అమలు జరిపాడు. మాలకులంలో పుట్టిన కన్నమదాసును దత్తపుత్రునిగా స్వీకరించి, సర్వమానవ సమానత్వాన్ని ప్రకటించాడు. వర్ణధర్మాలనే ఉక్కు చట్టాన్ని ఛేదించాడు. శైవ, వైష్ణవ మత భేదాలే పల్నాటి యుద్ధానికి మూలం అని అభిప్రాయపడటం అతిశయోక్తి కాదు. అందుకనే శివయ్య గారు—

"మగువ నాగమ్మతో మాయ యుద్ధము వచ్చె
మగువ మాంచాల తా మగని రణమున కంపె
వీరవనితలు పుట్టిరి పలనాట
శౌర్య ముగ్గులు పెట్టిరి" అని వ్రాశారు.

"బాలచంద్రుని కత్తి పదును మెరుపులు మెరసి
తెరలి కారంపూడి ధర్మరణ రంగాన
వీరరక్తము చిందెరా పలనాట
నాగులేరై పారెరా"

అని చరిత్ర ప్రసిద్ధి కెక్కిన పలనాటి యుద్ధాన్ని, బాలచంద్రుని పరాక్రమాన్ని తెలియజెప్పారు.

"బాలచంద్రుని కదన కౌశలము కథల్లల్లి
శ్రీనాథ కవిరాజు చంద్రవంకకు చెప్ప
ఎదకరిగి ప్రవహించెరా పలనాట
ఎత్తిపోతల దుమికెరా"

అని ప్రశంసించారు. రాజుల అధికారం తొలగిపోయింది. కుంపిణీ వాడి పాలన ప్రారంభమైంది. పలనాడులో దాస్యము, దోపిడీ, దారిద్ర్యమూ హెచ్చయినాయి. భారతదేశంలో బ్రిటీషు పెత్తనానికి స్వస్తి చెప్పాలని పల్నాటి ప్రజ నిర్ణయించింది. ఆంధ్రదేశంలో పల్నాడువారు జాతీయోద్యమాన్ని ముందుండి నడిపారు.

"కన్నెగంటి హనుమంతు కోరమీసము త్రిప్పి
పలనాటి ప్రజలచే పన్ను ఎగబెట్టించి
బలియిచ్చె హనుమంతునూ – పలనాడు
పర ప్రభుత్వపు గుండ్లకు"

అని శివయ్యగారు కన్నెగంటి హనుమంతు వీరమరణాన్ని గుర్తుచేశారు. హనుమంతు విషయాన్ని నాళం మట్టుపల్లిగారు తమ "పలనాటి స్వాతంత్ర్యసమర యోధుల సంగ్రహ చరిత్ర" లో యిలా వివరించారు.

"1921 వ సంవత్సరం ఫారెస్టు పన్నులు (పుల్లరి) రైతులు చెల్లించలేదు. తాలూకా నాయకులందరు రాజమండ్రి జైలులోనున్నారు. జిల్లా కలెక్టరు రూథరు ఫర్డు దొరగారు ప్రత్యేక అధికారములను పయోగించి, 100 మంది రిజర్వు పోలీసులను, 30 మంది ఆశ్విక దళమువారిని పల్నాడు తాలూకాకు పంపినారు. ప్రత్యేకముగా 100 మంది రిజర్వు పోలీసులను వెల్దుర్తి ప్రాంతమునకు పంపించిరి. ఇచట వారేమియు చేయలేక పోయిరి. తిరిగి వచ్చుచు కోలగుట్ల కరణంగారు శ్రీ సదాశివయ్యగారి సహాయముతో మంచాల పాడు వెళ్లి, ఊరివెలుపల మకాం వేసి, గ్రామపెద్దలను రమ్మనమని కబురుచేసినారు. ముందుగా శ్రీ హనుమంతుగారు వచ్చుచుండిరి. ఆ వచ్చువానిని కాల్చక పోయినచో మనలను బ్రతుకనివ్వడు కనుక వెంటనే కాల్చి వేయుడని సదాశివయ్యగారు పోలీసులకు సలహానివ్వగా, వారు వెంటనే కాల్చి వేసిరి.... 16 మంది గ్రామ పెద్దలను అరెస్టు చేసి, ప్రతియొక్కరికి 6 మాసములు కఠినకారాగార శిక్షవిధించి రాజమండ్రి సెంట్రలు జైలుకు పంపిరి"[1] అని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు నాళం మట్టుపల్లిగారు వివరించారు.

శాతవాహనుల పౌరుషం, నాగార్జునుని విజ్ఞానం, బ్రహ్మనాయని సమధర్మం, బాలచంద్రుని పరాక్రమం, హనుమంతు ప్రాణత్యాగం వల నాటి చరిత్రలో ప్రధానమైన విషయాలు, శ్రీ శివయ్యగారు చారిత్రక

---

1. నాళంమట్టుపల్లి, పల్నాటి స్వాతంత్ర్య సమరయోధుల సంగ్రహ చరిత్ర, పుట

దృష్టితో సుదీర్ఘమైన పల్నాటి చరిత్రను సంక్షేపించి వ్రాసిన గేయమిది. మహోజ్వలమైన చరిత్రను మరింత కాంతిమంతం చేయవలసిన బాధ్యతను శ్రీ శివయ్యగారు గుర్తు చేశారు.



" వెనుక తరముల వారి వీరచరితల సిరులు
నార్వోసి త్యాగమ్ము నీర్వెట్టి పెంచరా
విరి సుఖములు పండురా--పలనాడు
వెలలేని మాగాణిరా " --

అని శివయ్యగారు ఈ గేయాన్ని ముగించారు.

ఈ గేయంలోని ప్రతి చరణంపలనాటి చరిత్రను వెల్లడిస్తుంది. చరిత్ర పరిధిని అధిగమించి రచయిత మరే యితర విషయం వ్రాయలేదని స్పష్టమౌతుంది.

శ్రీ శివయ్యగారు వ్రాసిన "మేదినోత్సవం" అనే గేయం అంతర్జాతీయ చరిత్రను స్పృశించింది. హిట్లరు, ముస్సోలినీ, కొనాయి, ఫ్రాంకో మొదలైన ఫాసిష్టు నాజీ పాపపు మూకల మరణ ఉదంతాన్ని యీ గేయం గుర్తు చేస్తుంది.

" నాజీ పాపపు నీడలు సోకి
చీకటి గ్రమ్మిన బెర్లిన్ పురిపై
వెలుగులు జిమ్మే ఎర్రని జెండా
ఎగుర వేసినది మే దినోత్సవం "

అని శ్రీ శివయ్యగారు మహోత్సాహంతో గానం చేశారు. శివయ్యగారి "జాతీయపతాక"[2] గేయం భారతదేశ స్వాతంత్ర్య సమరాన్ని జ్ఞప్తికి తెస్తుంది. "ఓ దివ్య స్వాతంత్ర్య దేవి", "పాడవే గొంతెత్తి పాడవే కృష్ణ", "వరదకృష్ణ" అనే మూడు గేయాలు[3] తెలంగాణా విముక్తి పోరాటాన్ని

---

1. పులుపుల వెంకటశివయ్య స్మృతి సంచిక, పుట 64
2. అందే , పుట 71
3. అందే , పుట 81 మరియు 83

తలపింప చేసే గేయాలు. శివయ్యగారు మే 1948 లో వ్రాసిన "తెలంగాణా రణ నినాదం గేయం తెలంగాణా పోరాట గాధను సవివరంగా తెలియ జేస్తుంది. తెలంగాణా పోరాటాన్ని విముక్తి యుద్ధమని, ధర్మయుద్ధమనీ రచయిత ప్రకటించారు. కాకతీయ ఆంధ్రుల రాజ్యాన్ని బానిసకులం నైజాము పాలించిన క్రమం స్ఫురింప జేశారు. తెలంగాణాలో మతకల హాల చిచ్చు రగిల్చిన రజ్వీ దుష్టస్వభావాన్ని శివయ్యగారు తీవ్రంగా నిరసించారు.

" తెల్లదొరలకు చిట్టితమ్ముడు
నల్ల సర్దార్ నాటు హిట్లరు
నాజీ నైజాం ప్రణయఫలములు
తెలంగాణా నిలయ వహ్నిలో
భస్మమై ధూమమ్ము గ్రమ్మెను "[1]

అని నైజాంను శివయ్యగారు తీవ్ర పదజాలంతో విమర్శించారు.

శ్రీ శివయ్యగారి గేయాలు చారిత్రక విలువలతో నిండి వున్నా యనడం అత్యుక్తి కాబోదు. వీరి గేయాలను ప్రజానాట్యమండలి కళాకా రులు ఎంతో ఉత్తేజకరంగా గానం చేస్తారు. "పలనాడు వెలలేని మాగా ణిరా" గేయం మకుటాయమానమై విరాజిల్లింది.

" పలనాటి చరిత సొం
పలరారు కావ్యమన
వీరరసముట్టి పడ
నొకగేయమున మలచి
చేయిదిరిగిన కవులనే
ఆశ్చర్య
చకితుల్ని చేశావయా "[2]

---

1. పులుపుల వెంకటశివయ్య స్మృతి సంచిక, పుట - 221
2. అందే, పుట. 226

అని రచయిత, ప్రజానాట్యమండలి కళాకారుడు అయిన శ్రీ తిరునగరి రామాంజనేయులుగారు శివయ్యగారి కవితా శక్తిని ప్రశంసించారు.

" వలనాటి వెలలేని వీరుడా
శ్రీనాథ కవిరాజు వారసుడా " [1]

అని శివయ్య గారిని రచయిత, కమ్యూనిష్టు పార్టీ కార్యకర్త అయిన గుమ్మడి ఉటుంబరావుగారు కొనియాడారు.

" వల్నాటిని వెలలేని మాగాణి చేసి అమరత్వం పొందాడు "[2] అని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు శివయ్యగారిని ప్రస్తుతించారు. శ్రీ పులుపుల వెంకటశివయ్యగారి "వలనాడు వెలలేని మాగాణిరా" అనే చారిత్రక గేయం అధునికాంధ్ర సాహిత్య చరిత్రలో విశిష్టమైన స్థానాన్ని అలంకరించింది,

---

1. పులుపుల వెంకటశివయ్య స్మృతి సంచిక, పుట 224
2. పులుపుల వెంకటశివయ్య స్మృతి సంచిక, పుట - 192.



# దేవరకొండ దుర్గం

దేవరకొండ దుర్గం నల్లగొండ జిల్లాలో వుంది. తాలూకా కేంద్రంగా వున్న దేవరకొండను ఏ వైపునుండి పరిశీలించినా ప్రహరీ గోడలతో కొండలు శిఖరాలు అకర్షణీయంగా కనుపిస్తాయి. దుర్భేద్యమైన ఈ గిరి దుర్గం దాదాపు శతాబ్ది కాలం వెలమ వీరులకు స్థావరమై చరిత్ర ప్రసిద్ధి చెందింది. కాకతీయ సామ్రాజ్యం పతనమైన తరువాత, వెలమవీరులు దేవరకొండ, రాచకొండలను కట్టుదిట్టమైన కోటలుగా రూపొందించారు. కకావికలైన తెలుగు వీరులను సమీకరించారు. హైందవమత సంస్కృతి పరిరక్షణకు నడుం బిగించారు.

రాచకొండ రాజ్యాన్ని సింగమ నాయకుడు సుస్థిరం చేశాడు. ఇతని కుమారులయిన అనపోతా నాయకుడు (అనపోతానేడు), మాధవ నాయకుడు (మాదానేడు) ప్రజాను రంజకంగా పరిపాలించారు. మహమ్మదీయ దాడులను త్రిప్పికొట్టారు. శాంతిభద్రతలను నెలకొల్పారు. మాధవ నాయకుని కుమారుడు పెదవేదగిరి, పెదవేదగిరి పుత్రుడు కుమారమాధవ నాయకుడు. ఇతడు లలితకళా పోషకుడుగా ప్రసిద్ధుడు. ఇతని తరువాత లింగమనాయకుని పేరు వినివిస్తున్నది.

ఈ గిరిదుర్గాన్ని శ్రీకృష్ణదేవరాయలు జయించినట్లు నంది తిమ్మన రచించిన పారిజాతాపహరణంలో కనుపిస్తుంది. కాలక్రమేణ దేవరకొండ రాజ్యం గోల్కొండ రాజ్యంలో కలసి పోయింది.

డా॥ ముకురాల రామారెడ్డిగారు దేవరకొండ కోట ప్రాంతాన్ని చారిత్రక దృష్టితో పరిశీలించారు. "దీని చారిత్రక భోగట్టాలు సేకరించాలని అక్కడి తహసిల్ ఆఫీసులో వెదికి చూశాను. ఆశించినంత భోగట్టా దొరకలేదు. దేవరకొండ దుర్గాన్ని గురించి ఓ సమగ్రమైన చారిత్రక వ్యాసం ప్రకటించుదామన్న నాఆశ ఫలించలేదు. చివరకు ఈ గేయకృతి రచించ

గలిగాను." [1] అని రామారెడ్డిగారు తమ ప్రయత్నాలను విశదీకరించారు. ఈ గేయ కావ్యం దేవరకొండ పూర్వ వైభవాన్నీ, వెలమవీరుల ప్రతాపాన్నీ స్మృతికి తెప్పించే భావ వీచిక మాత్రమే. విస్మృతమైన దేవరకొండ వెలమ వీరుల చరిత్రను గేయ కావ్యంగా రచించిన శ్రీ రామారెడ్డి ప్రశంసనీయులు.

శ్రీ రామారెడ్డిగారు దేవరకొండ గిరిదుర్గాన్ని వీరలక్ష్మికి కంఠహారంగా భావించారు.

"ఎంత గట్టున కోట!
ఎంత నెట్టున కోట!
ఎన్నడే మొనగాడు గట్టెరా
మూడు గుట్టల మూట" [2]

అనడంలో వారి సునిశిత పరిశీలన వ్యక్తమౌతుంది.

కొండ చివర భాగం వరకు రాళ్లను మోసి, ప్రహరీగోడలను, బురుజులను నిర్మించి ఎందరో తమ కండల్ని కరిగించారు. తెలుగు వీరులు తమ కత్తికి పట్టిన చిలుమును పోగొట్టి పగవారిని వెంటాడి పారద్రోలిన విస్మృతోదంతాలను కవి సంస్మరించారు. ఈనాడు శిథిలాల నడుమ కనుపించే కోటను దృష్టిలో పెట్టుకొని

" వాసి మాసినది దేవరకొండ
చూడరా తమ్ముడా వేడి కన్నీట "

అని కవి ఆవేదన చెందిన తీరు కోడాలి వారి "హంపీక్షేత్రము"ను గుర్తు చేస్తుంది.

---

1. డా॥ ముకురాల రామారెడ్డి, దేవరకొండ దుర్గం, పుట-1
2. అందే పుట-1,2

ప్రతాపరుద్ర గజపతిపై కృష్ణరాయలు దండెత్తినపుడు, ఈ గిరి దుర్గాన్ని జయించాడు. చారిత్రమైన పై అంశాన్ని రామారెడ్డిగారు యిలా గ్రంథస్థం చేశారు.

" వీర కళింగపతి గద్దె గదలించి
ప్రోలికిం గదలుచో దారిలో గదిసి
ఈ గిరిదుర్గ గండమున మూరు రాయరగండ
నిశాతకర ఖడ్గమది ఖంగుమనినంత
గుహలలో మారు మ్రోగినదిరా
హోరెత్తి గాలిలో మోరెత్తి ఈ కొండ
ఎదురొడ్డి నిలిచెనా ఎవడొ గండరగండ
ఇదియె దేవరకొండ, ఇదియె దేవరకొండ " [1]

గోల్కొండ నవాబు మల్కి పాదుషా దాదాపు పన్నెండు సంవత్స రాలు పోరినా యీకోట సాధ్యపడలేదట. ఆమల్కి పాదుషా "అల్లారె" అని దండుతో పారిపోయిన సందర్భాన్ని రచయిత ఉదాహరించారు. ఈ ఘట్టాన్ని శ్రీ చిమ్మపూర్తి శేషగిరిరావుగారు తెలుగు సంస్కృతి ప్రథమ సంపుటంలో వివరించారు. [2]

దేవరకొండ వెలమవీరుల పౌరుషమే బొబ్బిలి వెలమ వారిలోను ప్రతిబింబించిందని రామారెడ్డిగారి అభిప్రాయం. తాండ్ర పాపయ్య కత్తి పదును రెడ్డిగారు గుర్తు చేశారు. సింగమనీడు దర్బారులో శ్రీనాథ కవి సార్వభౌముడు ప్రకాశింపజేసిన పాండితీ ప్రకర్షను రచయిత స్ఫురింపచేశారు.

---

1. డా॥ ముకురాల రామారెడ్డి, దేవరకొండ, పుట – 2.
2. తెలుగు సంస్కృతి, ప్రథమ సంపుటము, పుట. 379.

అంతరించిన అనాటి వైభవాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని రచయిత ఆవేదనతో-

"ఏలకూలెః ఏలరాలెః
ఖిల్ల గోడలు బరువై
కొండల గుండెలు క్రుంగెనాః
కాక మరేమీ, విప్లవకాలుని
కనుమండెనాః
ఏదిరా తమ్ముడా,
ఎచట ఏగడ్డిలో మొలకెత్తెరా
నాటి వెలుమపులి మీసంః
ఏ పెండ్లి కేగెరా ఈ రాణివాసంః " [1]

అని ప్రశ్నిస్తారు.

ఈ భావన మహాకవి శ్రీశ్రీ ఖడ్గ సృష్టిలోని "ఏవి తల్లీ నిరుడు కురిసిన హిమ సమూహములు" అనే గేయ పంక్తుల్ని గుర్తుకు తెస్తుంది.

"జోహుకుం సర్దారులేరి ?
జోడు గుర్రపు దౌడులేవి ?
మర ఫిరంగులు
తోపు బండ్లు
మందు గుండ్లు
మూరు దండ్లు
డప్పు కొమ్ములు - ఢాలు కత్తులు
ఏవి తమ్ముడు ? ఎచట తమ్ముడు ?
ఏదిరా అలనాడు మ్రోగిన వెలమ దొర ఢంకా"[2]

1. డాక్టర్ ముకురాల రామారెడ్డి, దేవరకొండ దుర్గం, పుట 5.

2. డా॥ ముకురాల రామారెడ్డి, దేవరకొండ దుర్గం పుట. 7

అనే యీ గేయం నడకకూడా

> "చక్రవర్తి అశోకుడెచ్చట ?
> జగద్గురు శంకరుండెచ్చట ?
> ఏవితల్లీ నిరుడు కురిసిన
> హిమసమూహములు"[1]

అను శ్రీశ్రీ బాణీని తలపింప జేస్తుంది.

రామారెడ్డిగారు ఈ గేయఖండికను 1957 లో వ్రాశారు. ఎనిమిది పుటలలో ముగించబడిన యీ గేయం దేవరకొండ చరిత్రను స్మృతికి తెస్తుంది. దేవరకొండను పాలించిన వారి పట్టిక తెలుగు సంస్కృతిలో యివ్వబడినది.[2]

మాదానేడు (1361 - 1384)
దేవరకొండ రాజ్యస్థాపకులు



పెదవేదగిరి



కుమార మాదానాయకుడు



కుమారవేదగిరి | లింగమనేడు(1420-1480)

లభ్యమౌతున్న దేవరకొండ చరిత్రను దృష్టిలో పెట్టుకొని శ్రీ ముకురాల రామారెడ్డిగారు పాలకుల పేర్లను, సంఘటనలను యీ గేయ ఖండికలో పొందుపరిచారు.

---

1. శ్రీశ్రీ, ఖడ్గసృష్టి పుట
2. తెలుగు సంస్కృతి (ప్రథమ సంపుటము) పుట. 500

# విజయం గీతావళి

చైనా దురాక్రమణపై ప్రముఖ కవులు వ్రాసిన గేయ పద్య సంపుటిని "విజయ గీతావళి" పేరుతో (కేంద్ర రేడియో, సమాచార మంత్రిత్వ శాఖకు చెందిన పబ్లికేషన్స్ డివిజన్ వారు) 1964 ఆగస్టు నెలలో ప్రచురించారు.

"విశాల భారత యశోగిరీంద్రం
నిశాచరులతో నిండెనురా
దిశాంతములలో అశాంతి రేపుచు
పిశాచబలములు నిలుచుండెనురా" [1]

అని "కరుణశ్రీ" గారు చైనా సైనికులు హిమాలయ పర్వతములలో సంచరించడాన్ని నిరసించారు.

"పంచశీల" ముసుగులో భారతీయుల్ని వంచించిన చైనావారిని శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు—

"బుద్ధదేవు పుణ్యపాదముద్ర పడిన దేశంలో
నెత్తురులభిషేకించిన నిష్కరుణా ముష్కరులా ?
ఫాహియాను హుయెన్ స్యాంగు భక్తి పూల పూజించిన
పావన భరతావనిపై పగబట్టిన కుత్సితులా ? [2]

అని ప్రశ్నించి గత చరిత్రను గుర్తు చేశారు.

భారతదేశంలో ప్రభవించిన బౌద్ధమతం చైనాలో వ్యాప్తిచెందిన తీరును స్ఫురింప జేశారు. చైనా యాత్రికులయిన ఫాహియాన్, హుయెన్ స్యాంగు భారతదేశాన్ని సందర్శించి, మైత్రీ భావంతో మెలిగిన పద్ధతిని వెల్లడించారు.

---

1. విజయ గీతావళి, పుట - 2 2. అందే, పుట - 2

భారత చైనాల స్నేహబంధం అతి ప్రాచీన కాలం నుండి అవిచ్ఛిన్నంగా కొనసాగుచున్నదనీ, నేటి యీ దురాక్రమణ తరతరాల మైత్రిని ఛిన్నాభిన్నం చేస్తున్నదనీ తెలియచేశారు.

" చీనారాక్షస చమూ సముహం
చిందరవందర చేయండోయ్
రారండోయ్ రారండోయ్
భారతవీరులు మీరండోయ్ "[1]

అని శ్రీ కె. రామగోపాలరావుగారు ప్రబోధించారు.

" బ్రహ్మపుత్ర నదిమీదను
రాబందుల సంగీతం
జగజ్జనని పుట్టినిల్లు
హిమాలయంపై బాంబులు
పచ్చిబంది పోటు దొంగ
పట్టపగలు విహారాలు
అమాయకులు మనవీరుల
ప్రాణ దీప మార్పడాలు "[2]

"ఇంకానా, ఇంకానా" అని జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి గారు ఆవేదనతో ప్రశ్నిస్తారు.

" ప్రాణాలు దానాలు చేసేయ వలెనోయ్
త్యాగాలతో మనము కదలి పోవలెనోయ్ "

అని దాశరదిగారు ఉద్బోధించారు. హిమాచల శృంగములపై" జరిగిన దానిని గమనించి," లేరా! కనువిచ్చిరారా" అని దాశరధి ఎంతో ఉత్తేజకరంగా గానంచేశారు.[3]

---

1. విజయగీతావళి, పుట - 3
2. అందే, పుట - 6
3. విజయ గీతావళి, పుట 8, 9.

"చీకటి తెరతొలగునులే" అని నార్ల వెంకటేశ్వరరావుగారు, "నవోదయమ్ము నీదిరా" అని పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు, "అదిగదిగో అదే అదే" అని మల్లవరపు విశ్వేశ్వరరావుగారు, చైనా దురాక్రమణను ఖండిస్తూ కావ్యగానం చేశారు.

భారతదేశ గత వైభవాన్ని కీర్తిస్తూ, "భారతహృదయము మధురముగా" అని వావిలాల సోమయాజులుగారు, "భారతమాత"ను స్తుతిస్తూ వేంకట పార్వతీశ్వరకవులు కవితా గీతికలను ఆలపించారు.

"విజయ గీతావళి" ద్వితీయ భాగంలో దేశభక్తి ప్రపూరితమైన అనువాద గేయాలున్నాయి. వివిధ భారతీయ భాషలలో వ్రాయబడిన గేయాలను శ్రీమతి నాయని కృష్ణకుమారి, బాలాంత్రపు రజనీకాంతరావు, ఆరుద్ర, శ్రీ శ్రీ, బొడ్డు బాపిరాజు, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, దాశరథి, విద్వాన్ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు, రాచకొండ నరసింహమూర్తి, ప్రస్తుత కేంద్ర మంత్రి పి. వి. నరసింహారావు, కరుణశ్రీ అనువదించారు. ఇవన్నీ చారిత్రక వాస్తవాలను వెల్లడించే గేయ ఖండికలు.

"భారత దేశం మీద చైనా దురాక్రమణకు దిగినప్పుడు....ఆసేతు హిమాచల పర్యంతమూ ప్రజలలో ఉద్రేకం పొంగులు పారింది..... కవులూ, మేధావులూ తమ ప్రతిభాసంపదను దేశరక్షణకు మీదుకట్టారు. ప్రబోధవాక్కులతో ఉత్తేజపరచి, లక్ష్యసిద్ధికై జాతిని సమాయత్తం చేశారు......... ప్రస్తుతం చైనా దండయాత్రను విరమించుకొన్నప్పటికీ, ఇదివరకు అక్రమంగా అది ఆక్రమించుకొన్న ప్రాంతాలు మనకు ఇంకా స్వాధీనం కాలేదు...."[1] అని పీఠికలో వివరించబడింది. ఈ గేయాలకు మూలం "చైనా దురాక్రమణ" అనే చారిత్రక సంఘటన. ఇటువంటి గేయాలను చారిత్రక గేయాలుగా భావించడం సముచితం.

1. విజయ గీతావళి, పీఠిక.



# చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా

ఆంధ్రదేశచరిత్రను వివరిస్తూ, ఆంధ్రుల పౌరుష ప్రతాపాలకూ, సంస్కృతికీ అద్దం పట్టేలా శ్రీ కృష్ణగారు "చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా"[1] గేయం రచించారు. ఉమ్మడి మద్రాసురాష్ట్రం నుండి "విశాలాంధ్ర" అవతరించాలని కోరుతూ, ఆంధ్రరాష్ట్రోద్యమ సమయంలో వీరిగేయం వ్రాశారు.

" వీరరక్తపు ధార
వారబోసిన సీమ
పలనాడు నీదెరా
వెలనాడు నీదెరా
బాలచంద్రుడుచూడ ఎవరోడోయ్
తాండ్రపాపయకూడ నీవోడూ
నాయకీ నాగమ్మ
మల్లమాంబ, మొల్ల
మగువమాంచాల నీ
తోడ బుట్టిన వోళ్ళె
వీరవనితల గన్న తల్లేరా
వీరమాతల జన్మభూమేరా "

అని ఆంధ్రజాతి పరాక్రమానికి, పవిత్రతకు, జ్ఞాన సంపదకు ప్రతీకగా నిలచిన పూర్వీకుల్ని స్మరించారు.

" అమరకవి గురజాడ నీవోడు
ప్రజల కవితను పాడి చూపాడోయ్ "

అని ప్రజాకవి గురజాడను ప్రశంసించారు.

---

1. ప్రతిధ్వని, (చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా: వేములపల్లి శ్రీకృష్ణ) పుటలు5,6 గేయసంకలనం; విశాలాంధ్ర ప్రచురణాలయం; 1983.

నాగార్జునకొండ, అమరావతి ప్రాంతాలలో విలసిల్లిన శిల్ప కళా వైభవాన్ని జ్ఞప్తికి తెచ్చారు.

" ముక్కోటి బలగమోయ్
ఒక్కటై మనముంటె
ఇరుగు పొరుగులోన
వూరు పేరుంటాది
తల్లి ఒక్కతె నీకు తెలుగోడా
సవతి బిడ్డలపోరు మనకేలా "

అని, ఐకమత్యంతో వ్యవహరించి మనసంస్కృతిని పరిరక్షించుకోవలసిన అవసరాన్ని వివరించారు.

" చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా
గతమెంతో ఘనకీర్తి గలవాడా " -

ఈ ఒక్క గేయం వ్రాసి శ్రీ వేములపల్లి శ్రీకృష్ణగారు ఆధునికాంధ్ర సాహిత్యంలో శాశ్వతమైన స్థానం సంపాదించారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు ఎన్నికైన భారత కమ్యూనిష్టుపార్టీ సభ్యులు వీరు. "అభ్యుదయ రచయితల సంఘం", "ప్రజానాట్యమండలి" సంస్థలకు గణనీయమైన సేవ చేశారు. నేటికీ వీరిజీవితం కమ్యూనిష్టుపార్టీ కార్యకలాపాలతో పెనవేసుకుపోయింది. "చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా" అనే ఈ చారిత్రక గేయం "ఆంధ్రజాతీయ గీతం"గా అభివర్ణించదగినట్టిది.

ఒక గేయంలో తేదీలు, అంకెలు లేకపోయినంత మాత్రంచేత "చారిత్రకత" లోపించదు. చారిత్రక భావనలను, సామాజిక చరిత్రను చారిత్రక వ్యక్తులను పాఠకుల మనోనేత్రాలకు సాక్షాత్కరింప జేయగలిగినదే చారిత్రక గేయం.

" తెలియ చెప్పా - చరిత - తేపీలు మాత్రమే
చెప్పలేదు గుండె విప్పిచూపి
పెద్ద పెద్ద నిలువుటద్దాల మేడమై
వాఙ్మయమ్ము ప్రకృతి పట్టిచూపు " [1]

శ్రీ సుందరాచారిగారు వ్రాసిన "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" అనే ప్రార్థనా గీతంలో కూడా,

"రుద్రమ్మ భుజశక్తి - మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి - కృష్ణరాయల కీర్తి"

మొదలయిన చారిత్రక విశేషాలు ప్రస్తావించబడ్డాయి.

"పాడరా! ఓ తెలుగువాడా" [2] అని శ్రీ కొండేపూడి లక్ష్మీనారాయణగారు వ్రాసిన గేయంలో, కాకతీయుల ఖడ్గ తేజం; రుద్రమ యుద్ధ పటిమ, బాలచంద్రుని బాహుదర్పం, తిక్కనార్యుని కవిత, త్యాగరాయని రాగసుధ, హంపీనగరపు శిల్పసంపద, కందుకూరి సంస్కరణలు, గిడుగు వారి భాషాసేవ, గురజాడ మధురకవితలు ప్రశంసించబడినాయి.

భగత్‌సింగ్ అమర త్యాగాన్ని ప్రశంసిస్తూ ఎందరో ప్రముఖులు చారిత్రక గేయాలు వ్రాశారు. డా॥ సి. నారాయణరెడ్డిగారు,

"భగత్‌సింగ్ చరితం
ప్రగతిశీల భరితం
తిరగబడిన క్రాంతిసేన
తీసుకున్న శపథం
.... .... .... ....

అని గానంచేశారు.

---

1. డా॥ నండూరి రామకృష్ణమాచార్య; ప్రగతిగీత, పుట - 44
2. ప్రతిధ్వని (గేయ సంకలనం), పుట-10

స్వాతంత్ర్యం ప్రతిజాతికి ప్రాణమనీ
సమసమాజ నిర్మాణం ధ్యేయమనీ
భగత్‌సింగ్ అందించిన సందేశం
రగిలే చైతన్యానికి సంకేతం"

"అమరవీరుడా! అనన్యశూరుడా" అని ప్రతాపరెడ్డిగారు; "భగత్‌సింగ్ మాట" అనే శీర్షికలో శ్రీ ఏటుకూరి ప్రసాద్‌గారు, "భారతమాతకు బంగరు తిలకం దిద్దినవీరుడు భగత్‌సింగ్" అని శ్రీ ఎం.కె. రాముగారు, "భగ భగ మండేమంటలు భగత్‌సింగ్‌రా" అని శ్రీ లలిత్‌గారు భగత్‌సింగ్ చరిత్రను చారిత్రక గేయాలుగా తీర్చిదిద్దారు. [1]

"అల్లూరి సీతారామరాజు" పై ఇదే విధంగా ఎన్నో ఉత్తేజకరమైన చారిత్రక గేయాలు వెలువడ్డాయి.

"అల్లూరి సింహగర్జనం
తెల్లవాడి మరణశాసనం" [2]

అని శ్రీ ఏటుకూరి ప్రసాద్,

"విల్లమ్ములు చేతబూని
మన్యం ప్రజలెదురు తిరుగ
బ్రిటీషోడి గుండెలదిరెరా
మన రామరాజు
భరతజాతి పరువునిలిపెరా"అని శ్రీ ఎస్వీ

"భరతజాతి స్వేచ్ఛకొరకు
మన్యంప్రజ బాగుకొరకు"

సీతారామరాజు పోరాటం సాగించాడని శ్రీ బిగుళ్ళ - సీతారామరాజు చరిత్రను గానం చేశారు.

---

1. ప్రతిధ్వని (గేయ సంకలనం), పుట-32 నుండి 38
2. అదే, పుట. 44, 45, 46, 47

శ్రీ ఎం.కె. రాము వ్రాసిన "మన్యం సీమలో మార్మోగిన విప్లవం" అనే గేయం, "ప్రతాప్" వ్రాసిన "ఆశాకిరణం" అనే గేయం రామరాజు చరిత్రను **వివరిస్తాయి**. ప్రజానాట్యమండలి కళాకారులు ఈ గేయాలను వివిధ సమావేశాల్లో ప్రజానురంజకంగా గానం చేస్తున్నారు.

దేశనాయకుల జయంతి, వర్ధంతి సంస్మరణ సమావేశాల్లో, సాహితీ సభలలో గానం చేయబడే ఎన్నో గేయాలు చారిత్రక విశేషాలను వివరిస్తున్నాయి. వివిధమైన చారిత్రక గేయాలు భారతదేశ చరిత్రను గుర్తు చేసుకునేందుకు తోడ్పడుతున్నాయి. హృద్యమైన సంగీతం కారణంగా, ఆయా చారిత్రక విశేషాలు సామాజికులపై చెరగని ముద్రవేస్తాయి.



## ఉపసంహారం

తెలుగు భాషలో వివిధ విషయాలకు సంబంధించిన రచనల కంటే, చారిత్రక రచనలు తక్కువగా వెలువడుతున్నాయనే విషయాన్ని అంగీకరించాలి. చారిత్రక కావ్యాలు ఎక్కువగా వెలువడక పోయినప్పటికీ వాటిని వ్రాయడానికి కావలసిన సామాగ్రి అధికంగానే లభ్యమౌతున్నది. శిధిలమైన కోటలు, దేవాలయాది నిర్మాణాలు, చరిత్రకారులు సేకరించిన సమాచారం, ప్రాచీన కావ్యావతారికల్లో (వివిధ భారతీయ భాషల్లో) వర్ణింపబడిన రాజవంశావళి చరిత్ర, ప్రజలు నేటికీ చెప్పుకునే నాటి విషయాలు, గ్రంధస్థం చేయబడిన జానపద గేయాలు, పురావస్తుశాఖవారి పరిశోధనలు, వివిధ శాసనాలు, రాగిరేకులు, మొదలైనవి చారిత్రక కావ్యాలు వ్రాయడానికి అమూల్యమైన వివరాలను అందిస్తాయి. చారిత్రక కావ్యాల్లో కేవలం పూర్వకాలంలో జరిగినవి మాత్రమే ఉండాలనే నియమమేదీ లేదు. వర్తమాన చరిత్రను కూడా స్వీకరించవచ్చు. ఆధునికాంధ్ర సాహిత్యంలో ప్రామాణికమైన చారిత్రక కావ్యాలు వెలువడుతుండటం శుభపరిణామం. చారిత్రక పరిజ్ఞానం లేకపోవడం జాతికి తీరని నష్టం.

గతాన్ని గమనించి, వర్తమాన పరిస్థితుల్ని సరిదిద్దుకొని, భవిష్యత్తుకు బంగారు బాటలు వేయడం విద్యావంతుల కర్తవ్యం. చరిత్ర పరిణామ శీలాన్ని కలిగి ఉంటుంది. మార్పును ఎవరూ అడ్డగించలేరు. మార్పు వలన సామాజిక పురోగమనం సాధ్యపడుతుంది. అందుచేత, జాతిని చైతన్యవంతం చేసిన ఎన్నెన్నో మార్పుల్ని చారిత్రక కావ్యాల్లో సమగ్రంగా చిత్రించాలి. అవసరమైతే ఇంతకు పూర్వం చరిత్రకారులు వ్రాసిన విషయాలను ఖండించడానికి కూడా, కావ్యకర్తలు వెనుదీయరాదు. ఉదాహరణకు బ్రిటీష్ చరిత్రకారుల దృష్టిలో ఎందరో దేశభక్తులు అరాజకవాదులు. మన భారతీయుల దృష్టిలో వారే నిజమైన దేశభక్తులు. అందుచేత, రచయితలు సత్యదృష్టితో చారిత్రక కావ్య రచనకు పూనుకోవాలి. కులం, మతం, జాతి, వర్ణం– ఇవేవీ రచయితను ప్రలోభపెట్టి, వాస్తవాలను వక్రీకరించేలా చేయకూడదు. ధర్మప్రబోధం కవుల కర్తవ్యం.

నేడు గేయరచనలు పాఠక లోకాన్ని అధికంగా ఆకర్షిస్తున్నాయని చెప్పడానికి కారణం -- వాటికి లభిస్తున్న ప్రజాదరణ. ఒక కావ్యం వ్రాయవలసి వస్తే, పద్యంకంటే గేయంలోనే అధిక సౌలభ్యం వుంది. ఛందోనియమాలేవీ లేకపోవడంవల్ల, కవికి మరింత స్వేచ్ఛ లభిస్తుంది. మాత్రాఛందస్సును పాటిస్తూ, గేయకావ్యాలు వ్రాసేవారు లయతాళాలను పాటిస్తే, మరింత సొగసుగా ఉంటుంది. రచయితలకు పద్యంలోకంటే గేయంలోనే తమ ప్రతిభనూ, భావావేశాన్ని స్ఫుటంగా ప్రదర్శించే అవకాశం అధికంగా ఉంది. చిన్నప్పటినుండి వింటున్న పాటల ప్రభావం వలన, గానకళతో పరిచయం ఏర్పరుచుకోవడం వలన కొందరు గేయకవులు వ్రాసిన కావ్యాలు శ్రవణ సుభగంగా ఉంటున్నాయి. పాడుకోవడానికి అనుకూలంగా వుండి, పదే పదే స్మరణకు వస్తాయి గనుక, "కర్పూర వసంతరాయలు" వంటి "చారిత్రక గేయకథా కావ్యాలకు" ప్రజాదరణ విశేషంగా లభించింది.

పాశ్చాత్య దేశాల్లో "రొమాంటిక్ పొయట్రీ" కారణంగా గేయసారస్వతానికి (లిరికల్ పొయట్రీ) విశేష ప్రచారం లభించింది. మన ఆంధ్ర సాహిత్యంలో మహాకవి గురజాడ వంటివారు జాతిని మేల్కొల్పడానికి గేయాన్ని ఎంపిక చేసుకున్నారు. గురజాడ అడుగుజాడలో రాయప్రోలు

సుబ్బారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, బొడ్డు బాపిరాజు, దువ్వూరి
రామిరెడ్డి, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, అడవి బాపిరాజు,
తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు,
కొడాలి వేంకటసుబ్బారావు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, పిలకా గణపతి
శాస్త్రి, బాలాంత్రపు రజనీకాంతారావు, విశ్వనాథ సత్యనారాయణ,
పుట్టపర్తి నారాయణాచార్యులు, విద్వాన్ విశ్వం, కొనకళ్ళ వెంకటరత్నం,
దాశరథి, శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు, సి. నారాయణరెడ్డి, ఆరుద్ర-
ఇంకా ఎందరో మహానుభావులు, గేయ రచనలు చేశారు. అయితే, వీరిలో
కొందరు వ్రాసిన చారిత్రక గేయకావ్యాలను మాత్రమే ఎంపిక చేసుకొని,
ఆయా కావ్యాలలోని చారిత్రక విశేషాలను, ప్రామాణికతను, గుణదోషా
లను వివరించడం మాత్రమే యీ సిద్ధాంత వ్యాసం ముఖ్యోద్దేశ్యం.

చరిత్రలో జరిగిన యథార్థ సంఘటనల్ని చక్కని సన్నివేశాలుగా
రూపొందించి, చారిత్రక వ్యక్తుల్ని మనోనేత్రాలకు సాక్షాత్కరింపజేసి,
కర్తవ్యం ప్రబోధంచేసే, చారిత్రక గేయకావ్యాలు ఆధునికాంధ్ర సాహి
త్యంలో వెలువడ్డాయి. అయితే, "బ్రహ్మంగారి చరిత్ర" వంటి కావ్యాలలో
చారిత్రక వ్యక్తుల్ని దైవాంశసంభూతులుగా చిత్రించడం జరుగుతు
న్నది. శూన్యం నుండి ఏదీ పుట్టదని చరిత్రకారుల నమ్మకం. ప్రతివిష
యానికీ వారు ఆధారాలను అన్వేషిస్తారు. ఒక చారిత్రక వ్యక్తి సాధించిన
మహత్తర విషయాలను వివరిస్తారేగాని, నిరాధారమైన అతని గతజన్మల
తోగాని, మానవాతీతశక్తులతోగాని వారికి పనిలేదు. మతచరిత్రకూడా
సంస్కృతి చరిత్రలో భాగమే. మానవుడు మానసికంగా పరిపక్వత
చెంది, పరిపూర్ణుడై, సిద్ధాంతాలను ప్రపచించిన విషయాన్ని కూడా, చరి
త్రకారుడు ఆ కాలపు సాంఘిక, ఆర్థిక, రాజకీయ, మతవిషయాలకు అన్వ
యించి విశ్లేషిస్తాడు. మతనియమాలకూ, మానవత్వానికీ మధ్య జరిగే
సంఘర్షణలో, మహోన్నతమైన మానవత్వం విజయం సాధించిన సన్నివే
శాలను సమీకరించి, రచయితలు చారిత్రక రచనలు చేయవలసిన అవ
సరం నేడు ఉంది. మత మౌఢ్యం సృష్టించే దారుణ మారణకాండ నుండి
ప్రజల్ని రక్షించడానికి ఇవి ఉపయోగపడతాయి. నాగార్జున సాగరం,
శిలా మురళి వంటి రచనలు యిందుకు ఉదాహరణగా నిలువదగినవి.
మరికొన్ని చారిత్రక గేయకావ్యాలు జాతి పౌరుషం, సౌశీల్యం, దేశభక్తి,

సేవాభావం, త్యాగం, మొదలైన ఉత్తమగుణాలను పెంపొందిస్తాయి. "విశ్వనాధ నాయడు", "గండికోట యుద్ధం", "నా తెలుగు మాంచాల", "అల్లూరి సీతారామరాజు", "భగత్ సింగ్" వంటి రచనలు పాఠకుల్ని ఉత్తేజపరచి, మార్గదర్శకంగా నిలుస్తాయి. దేశచరిత్రను గ్రహించడానికి కొన్ని ప్రసిద్ధమైన గేయాలు ఉపకరిస్తున్నాయి. అవి ఒక తరం నుండి మరో తరం వారికి అందించబడతాయి. గేయం జాతీయతా భావాలకు దర్పణం అంతే అతిశయోక్తి కాదు. విషయసమగ్రత కోసం చారిత్రక గేయ కథా కావ్యాలు, గేయ ఖండికలను గూర్చి మాత్రమే కాకుండా, బుర్రకథలు. మిశ్ర కావ్యాలు అనే శీర్షికలతో సిద్ధాంత గ్రంథాన్ని పూర్తి చేశాను. బుర్రకథలు, మిశ్రకావ్యాలను కలిపి మరొక పుస్తకంగా ముద్రించాలని సంకల్పించాను. ఇందులోని బాగోగులు నిర్ణయించడానికి పండిత లోకమే ప్రమాణం.



# సంక్షిప్త ఆధార గ్రంథసూచి

అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి : వేమన, ఆంధ్రా యూనివర్శిటీ ప్రెస్, వాల్తేరు, 1971.

అరుణకుమారి, బి. : ఆంధ్ర వాఙ్మయమున చారిత్రక కావ్యములు, ఆంధ్రా యూనివర్శిటీ ప్రెస్, వాల్తేరు, ప్రథమ ముద్రణ-1973.

ఈశ్వర దత్తు, కుందూరి : ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, ద్వితీయ ముద్రణ, అక్టోబరు 1979.

ఎఱ్ఱన : నృసింహపురాణము, వావిళ్ళవారి ప్రచురణ, మద్రాసు, తృతీయ ముద్రణ, 1953.

కార్, ఇ. హెచ్. : చరిత్ర అంటే ఏమిటి? హైదరాబాదు బుక్ట్రస్ట్, హైదరాబాదు, మొదటి ముద్రణ, ఫిబ్రవరి 1983.

కోటేశ్వరరావు, నాగభైరవ : రంగాజమ్మ, సారస్వత సదనం, రావినూతల, ప్రథమ ముద్రణ, మే 1963.

కృష్ణమూర్తి చిటిప్రోలు : తరంగిణి, సరస్వతీ గ్రంథమాల, గామాలపాడు, గుంటూరు జిల్లా, సెప్టెంబరు 1966.

గంగాధరరావు, కొర్రపాటి : లకుమాదేవి-కుమారగిరి, లతా ఎంటర్ ప్రైజెస్, రాజమండ్రి, ప్రథమ ముద్రణ, ఏప్రిల్ 1979.

గోపరాజు, కొటవి : సింహాసన ద్వాత్రింశిక, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ, ప్రథమ ముద్రణ, 1933.

జయరామారావు, కలవటాల : గండికోట చరిత్ర, వాణీ ప్రెస్, బెజవాడ, ప్రథమ ముద్రణ, 1925.

దాశరథి : నవమి, దాచేపల్లి కిష్టయ్య అండ్ సన్స్, ప్రథమ ముద్రణ, 1961.

దొణప్ప, తూమాటి : జానపద కళా సంపద, నిర్మలా పబ్లికేషన్స్, విశాఖపట్నం, ముద్రణ, 1975.

నమశ్శివయ్య, పెద్దోజు : బ్రహ్మంగారి చరిత్ర, విశ్వశ్రీ ఆర్ట్ ప్రెస్ నరసరావుపేట, ప్రథమ ముద్రణ, జనవరి 1986.

నరసింహం, కె.వి.ఆర్. : ఆధునికాంధ్ర కవితా సమీక్ష, గంగాధర పబ్లికేషన్స్, విజయవాడ, ప్రథమ ముద్రణ, జనవరి 1982.

నాగయ్య, పాలడుగు : తందానతాన, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి, హైదరాబాదు, ఫిబ్రవరి 1982.

నారాయణకవి, దిట్టకవి : రంగరాయ చరిత్రము, వావిళ్ళ వారి ప్రచురణ, మద్రాసు, తృతీయ ముద్రణ 1914.

నారాయణరెడ్డి, సి. : నాగార్జున సాగరం, తెలంగాణా రచయితల సంఘం - హైదరాబాదు, ప్రథమ ముద్రణ : డిసెంబరు 1955, విశ్వనాథ నాయుడు, సరోజా ప్రచురణలు, హైదరాబాదు, ప్రథమ ముద్రణ సెప్టెంబరు 1959. కర్పూర వసంతరాయలు, యం. శేషాచలం అండ్ కో; ముద్రణ : జూన్ 72, జాతిరత్నం, యం. శేషాచలం అండ్ కో, ప్రథమ ముద్రణ, జులై 1967, జలపాతం, సర్వోదయ ప్రెస్, సికింద్రాబాదు, ప్రథమ ముద్రణ, అక్టోబరు 1953, దివ్వెల మువ్వలు : కొండా శంకరయ్య అండ్ కో, సికింద్రాబాదు, ముద్రణ : సెప్టెంబరు 1962, నారాయణరెడ్డి గేయాలు, కొండా శంకరయ్య, సికింద్రాబాదు, మూడవ ముద్రణ 1970, మార్పు - నా తీర్పు : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ - సికింద్రాబాదు, డిసెంబరు 1974, తేజస్సు - నా తపస్సు, శివాజీ ప్రెస్ - సికింద్రాబాదు, డిసెంబరు 1975, విశ్వంభర, ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ -

ప్రతాపరెడ్డి, సురవరం : ఆంధ్రుల సాంఘిక చరిత్ర. సాహిత్య వైజయంతి ప్రచురణ - హైదరాబాదు, తృతీయ ముద్రణ : 1982

ప్రతాపరెడ్డి, కె. : భగత్ సింగ్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ - విజయవాడ, ప్రథమ ముద్రణ : మార్చి 1983

ప్రభాకరశాస్త్రి, వేటూరి : తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర, మణి మంజరి ప్రచురణ - హైదరాబాదు వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్, ముద్రణ : అక్టోబరు 1984

ప్రమీలాదేవి, మంగళగిరి : తెలుగులో పద్యగేయ నాటికలు, సాహితీ సమితి - రేపల్లె, ప్రథమ ముద్రణము : 1974

బలరామమూర్తి, ఏటుకూరి : ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, ఏడవ ముద్రణ, ఏప్రిల్ 1983

మృత్యుంజయరావు, రాయసం -: గాంధి జీవిత చరిత్ర, శార్వాణి ప్రెస్, - నరసరావుపేట, ముద్రణ : 1949

మాధవశర్మ, పాటిబండ : రాజశిల్పి, ఆంధ్రా యూనివర్శిటీ ప్రెస్ - వాల్తేరు, ప్రథమ ముద్రణ : 1958

రాఘవయ్య చౌదరి, కొసరాజు : గండికోట యుద్ధం, కమ్మజన సేవా సమితి, గుంటూరు, 1984.

రాఘవశర్మ, గురజాడ : జాతీయ గీతాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1974.

రాజగోపాలనాయుడు, సి. : లకుమ, విశ్వప్రభ పబ్లిషింగు హౌస్, వేంద్రగుంట, చిత్తూరు జిల్లా, ప్రథమ ముద్రణ, మే 1977.

రాధాకృష్ణమూర్తి, వేమూరి : ఆణి ముత్యాలు, యం. శేషాచలం అండ్ కో., 1963.

రామకృష్ణ (నటరాజ) : అకుమ, శారదా ప్రింటింగ్ ప్రెస్, అనంత పురం, ప్రథమ ముద్రణ, 1971.

రామకృష్ణదాస్, టి. : నాగార్జున కొండ, శ్రీరంగ ఎంటర్‌ప్రైజెస్, హైదరాబాద్, ప్రథమ ముద్రణ, 1970.

రామరాజు, బిరుదురాజు : తెలుగు జానపద గేయ సాహిత్యము, జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాదు, ద్వితీయ ముద్రణ, 1978.

రామారెడ్డి, ముకురాల : దేవరకొండ దుర్గం.

రామాంజనేయులు తిరునగరి : 1. కన్నెగంటి హనుమంతు (బుర్ర కథ), ప్రజానాట్య మండలి ప్రచురణ, స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్స్, విజ యవాడ, 1981, 2. జ్వలిత జ్వాల, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయి తల సంఘం - గుంటూరు, ముద్రణ : మే 1976, 3. తెలంగాణా పోరాట గేయాలు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, మార్చి 1983, 4. అల్లూరి సీతారా మరాజు (గొల్లసుద్దులు) అరుణారుణ ప్రచురణలు-నల్లగొండ, ముద్రణ : ఫిబ్రవరి 1982.

లక్ష్మీ రంజనం, ఖండవల్లి : ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి బాల సరస్వతి బుక్ డిపో - కర్నూలు ప్రథమ ముద్రణ : 1965.

లక్ష్మీ కాంతమ్మ, ఊటుకూరి : నా తెలుగు మాంచాల, బాపట్ల, ప్రథమ ముద్రణ : డిసెంబరు 1981.

లక్ష్మీకాంతశాస్త్రి, శిష్టా : తంజావూరు తెలుగు కవులు, శ్రీ అరుణా బుక్ హౌస్, మద్రాసు, మొదటి ముద్రణ - ఏప్రిల్ 1981

లక్ష్మీనారాయణ, ఉన్నవ : నాయకురాలు, త్రివేణి పబ్లిషర్సు - మచిలీపట్టణము, పునర్ముద్రణ : 1975.

లక్ష్మీపతిరావు, వక్కలంక : వీరభారతము, స్వతంత్ర ఆర్టు ప్రిం టర్సు - విజయవాడ, ప్రథమ ముద్రణ : జనవరి 1970.

అల్లాదేవి : లకుమాదేవి, నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, ప్రథమ ముద్రణ : జనవరి 1982.

లింగారెడ్డి, గోపు : తెలంగాణా శ్రామిక గేయాలు, సుషమా పబ్లికేషన్స్ - కరీంనగర్, ప్రథమ ముద్రణ : 1982.

విశ్వం, విద్వాన్ : ఒకనాడు, మమతా ప్రచురణలు - మద్రాసు, ప్రథమ ముద్రణ - సెప్టెంబరు 1965.

వీరభద్రరావు, చిలుకూరి : ఆంధ్రుల చరిత్రము (ఐదవ సంపుటము), సుజన రంజనీ ముద్రణాలయం, రాజమండ్రి, ప్రథమ ముద్రణ : 1936.

వేంకట నరసయ్య, ఏటుకూరి : మగువ మాంచాల. లక్ష్మీ పవర్ ప్రెస్ -తెనాలి, ప్రథమ ముద్రణ : 1942.

వేంకట రంగయ్య, మామిడిపూడి : చరిత్ర చేస్తున్న హెచ్చరికలు, తెలుగు విద్యార్థి ప్రచురణలు - మచిలీపట్నం, ప్రథమ ముద్రణ : 1965.

వేంకట రమణయ్య, నేలటూరు : చరిత్ర రచన, వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, చంద్రికా ముద్రణాలయము - మద్రాసు, ప్రథమ ముద్రణ : 1948.

వేంకట సత్యనారాయణ, రావూరు : వెన్నెల తెరచాప, నారాయణరెడ్డి వంశీ ఆర్ట్ థియేటర్స్ - హైదరాబాదు, ప్రథమ ముద్రణ : 1981.

శివ శంకరశాస్త్రి, తల్లావఝ్ఝల : శివశంకర కృతులు (ద్వితీయ సంపుటి) సాహితీ సమితి - రేపల్లె, ప్రథమ ముద్రణ : 1952. సెప్టెంబరు

శ్రీకాంత్ శర్మ, ఇంద్రగంటి : శిలామురళి, సురుచి ప్రచురణలు - ఏలూరు, ప్రథమ ముద్రణ : 1970.

శ్రీనాథుడు : పలనాటి వీర చరిత్ర, విశాలాంధ్ర ప్రచురణాలయం - విజయవాడ ప్రథమ ముద్రణ : మార్చి 1961. హరవిలాసము, యం.

శేషాచలం అండ్ కో, ప్రథమ ముద్రణ : మార్చి 1971. భీమేశ్వర పురాణము, వావిళ్ళ వారి ప్రచురణ, మద్రాసు, ముద్రణ : 1967. కాశి ఖండము, వావిళ్ళ వారి ప్రచురణ, 1962. శృంగార నైషధము, యం. శేషాచలం అండ్ కో, మద్రాసు, ముద్రణ : జులై 1970.

శ్రీనివాసాచార్య, తిరుమల : నారాయణరెడ్డి సాహితీమూర్తి, యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ, హైదరాబాదు, ప్రథమ ముద్రణ; డిసెంబరు 1981.

శ్రీరామమూర్తి, కొర్లపాటి : శ్రీనాథుడు, కళాభారతి - గుంటూరు, ప్రథమ ముద్రణ : 1971.

శ్రీశ్రీ : మహాప్రస్థానం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 17 వ కూర్పు, మార్చి 1984.

సత్యనారాయణ, ఖంభంపాటి : ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి, ప్రథమ భాగము, ద్వితీయ భాగము, హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ - హైదరాబాదు, మొదటి ముద్రణ : 1981 జులై.

సీతారామయ్య, కురుగంటి : తంజాపురాంధ్రనాయక రాజచరిత్ర ఆంధ్ర గ్రంథమాల - 17, ఆంధ్రపత్రికా ముద్రాలయము, చెన్నపురి, ప్రథమ ముద్రణ : 1932.

సుందరయ్య, పుచ్చలపల్లి : వీరతెలంగాణా విప్లవ పోరాటం - గుణపాఠాలు, భారత కమ్యూనిష్టుపార్టీ (మార్క్సిష్టు), ఆంధ్రప్రదేశ్ కమిటీ - విజయవాడ, ప్రథమ ముద్రణ : 1973 మే.

సుబ్రహ్మణ్యము, రాయప్రోలు : కొండవీడు, సాహితీ సమితి, ఏలూరు, మంజువాణీ ముద్రణశాల, ముద్రణ : 1959.

హరి, కూచిబొట్ల : వసంతరాజు, శ్రీ వెంకటేశ్వర ప్రెస్ - తెనాలి ప్రథమ ముద్రణ : మే 1958.

## ఇతరములు

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక : కాకినాడ

కవన విజయము, శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు అభినందనసంచిక

ప్రతిభ (త్రైమాసిక పత్రిక), నవ్యకళా పరిషత్తు - గుంటూరు

పులుపుల శివయ్య స్మృతి సంచిక : అభ్యుదయ రచయితల సంఘం

భారతి (సాహిత్య మాస పత్రిక) : ఆంధ్రపత్రిక ముద్రాలయము మద్రాసు, విజయవాడ

రెడ్డి సంచిక : ఆంధ్రేతిహాస పరిశోధక మండలి, రాజమండ్రి

విజ్ఞాన సర్వస్వము : మొదటి సంపుటము, రెండవ సంపుటము, నాలుగవ సంపుటము, ఆరవ సంపుటము, తెలుగు భాషాసమితి, హైదరాబాదు



# BIBLIOGRAPHY

**Arun Bhattachar Jee** : History of Ancient India, Sterling Publishers, New Delhi, 1979.

**Ashirbadilal Srizastava** : History of India, Shivalal Agarwala & Company, Agra, Editon-1977.

Balendu Sekharam, K. : The Andhras through the Ages, Sri Saraswathi Book Depot, Hyderabad, 1973.

Carr, E.H. : What is History, Penuin Book Ltd., Harmondsworth, England, (Reprinted) 1968.

Jawaharlal Nehru : Discovery of India, Jawaharlal Nehru Memorial Trust, Teen Murty House, New Delhi, 1981.

Majumdar, R.K. & Srivastva, A.N. : Historiography, Surjeet Book Depot, Delhi, 1975.

Nilakanta Sastri, K.A. : Sources of Indian History with special reference to South India, Asia Publishing House, Delhi. 1964.

Robert Sewell : A Forgotten Empire, Pudlications Division, Ministry of Information, Govt. of India, June-1962.

Sarkar, H, & Misra, B N. : Nagarjuna Konda, The Director General, Archaeological Survey of India, New Delhi, Third Editon, 1980.

Vidyasagar Mahajan : History of India, S. Chand & Co. Ltd., Ram Nagar, New Delhi, Fourth Edition, 1983.

